# పాండురంగ మాహాత్మ్యము

## [ సంజీవనీ వ్యాఖ్యాన సహితము ]



## చతుర్థాశ్వాసము



కృతికర్త :

**తెనాలి రామకృష్ణుడు**




వ్యాఖ్యాత :

**వంతరాం రామకృష్ణారావు,**

ఆంధ్రశాఖ

ప్రభుత్వ కళాశాల

రాజమండ్రి - 533 105

ధార్మికగ్రంథముద్రణ ప్రణాళికక్రిందఁ
తిరుమల తిరుపతి దేవస్థానమువారొసఁగిన
యార్థికసాహాయ్యముతో ముద్రితము

---

సువిదితులసాహితీ బాం
ధవుల బిరుదురామరాజ నారాయణ రె
డ్డ్యవధానుల నధికారుల
నవనతమస్తకుఁడనగుచు నభినుతియింతున్

---

**కృతజ్ఞత :**

ద్వితీయ తృతీయభాగ ముద్రణములతోపాటు
చతుర్థభాగముద్రణమును నిర్వహించినయాప్త
మిత్రులు శ్రీ డి. వి. రామకృష్ణారావుగారికి,
శిష్యుఁడు, మిత్రుఁడు శ్రీ ఆర్. వేంకటేశ్వరరావునకు,
స్వచ్ఛందముగ సాహాయ్యమునందించిన
మిత్రులు శ్రీ సత్యనారాయణగారికిఁగృతజ్ఞతలు.

# సమర్పణ

శా. శ్రీమద్వర్ణదమోఘమేఘపటలీ స్నిగ్ధచ్ఛటామ్రేడితో
ద్దామాంగద్యుతిజాల! జాలపదపద్యాకృద్ధురుస్తుత్యసం
గ్రామోద్భాసితదివ్యభవ్యమహిమభ్రాజిష్ణు! జిష్ణుప్రియా
ప్రేమస్థానసురద్రుమాపహరణా! శ్రీశేషశైలాధిపా!

తే. అంశుమద్దిలీపులు జీవితాంతమెంత
శ్రమపడిన రాక యలభగీరథునికొఱకె
కాచుకొనియున్ననాఁటిగంగమ్మ చరిత
ననుకరించిన సంజీవనమ్మ యిదిగో!

తే. పరులదోసఁగులు తెగనాడిపలుకఁబోదు
నుడువదనపేక్షితంబులు ముడులువిప్పు
నప్రమాణోక్తులాడదు సుప్రసన్న
చెట్టవట్టుముస్వామి! సంజీవనమ్మ.

శా. కవితాస్వాదితయున్ విమర్శకుఁడుపజ్ఞాశాలిఘంటాపథ
ప్రవరోద్బోధితదుర్గమార్థచయుఁడున్ భాషాబ్ధిమంథాద్రియున్
నవసూత్రగ్రథనాబ్జసంభవుఁడు వంత్రాం రామకృష్ణుండు భ
క్తివిశిష్టుండిదుకాన్కయంచెఱిఁగి రక్తింగొమ్ము సంజీవనిన్.

## హెచ్చరిక!

క॥ మునుపొక్కకృతినొసంగితి
ననుగ్రహించితివియాయురారోగ్యంబుల్
తనయులఁగూరిచిచేసిన
మనవిని నెఱవేర్చుమాట, మఱచితొ! స్వామీ!

మ॥ తెగుదాఁకన్ బిగియించుచుంటి, విసుగెత్తెన్, బూర్తిగానోర్పున
న్నగిలెన్, దావమువిర్గింగినట్టులనునాకొన్నేవేమొ! శక్యంబెమిగ్రిం
గ గరగ్రీవునకైనభక్తులకుధాకాకోలకీలచ్ఛటల్
నగుఁబాటొందక కోర్కి తీర్పుమిఁకనైనన్ శేషశైలాధిపా!



## కవికాలాదికము :

రామకృష్ణుని కాలము : శా. శ. 1417-1507 = హూణ 1495-1585
అష్టదిగ్గజకవిగానున్నకాలము: శా.శ. 1442-1452= „ 1520-1530
పాండురంగ రచనాకాలము : శా.శ. 1487-1502= „ 1565-1580

చూ. — తృతీయభాగము.



## పండితాభిప్రాయము :

"రామకృష్ణుని కృతిని రామకృష్ణుఁడే వివరింపసమర్థుఁడు.
సంజీవనిచే, తమరపరమల్లినాథులైనారు."

— కీ. శే. దివాకర్ల వేంకటావధానిగారు
27-2-1986

# వ్యాఖ్యాత

జననము : భవనామసంవత్సర చైత్రశుద్ధషష్ఠిబుధవారము.
(21-3-1934)

జననీజనకులు : లక్ష్మణాంబాచిరంజీవులు

జన్మస్థలము : వంతరాము (విజయనగరము-జిల్లా)

విద్యాభ్యాసము : ఆంధ్రవిశ్వకళాపరిషత్తు.

విద్వదనుమోదిత బిరుదములు : "అపరవజ్ఝల", "అపరమల్లినాథ", "అపరచిన్నయసూరి"

ముద్రితగ్రంథములు :—

| | |
|---|---|
| బాలవ్యాకరణ ఘంటాపథము | 1970 |
| ప్రౌఢవ్యాకరణ ఘంటాపథము | 1975 |
| ముక్తలక్షణకౌముది [బాలవ్యా. పూరణగ్రంథము] | 1974 |
| వ్యాసమంజరి [సాహిత్యవ్యాస సంపుటి] | 1964 |
| పాండురంగమాహాత్మ్యసంజీవని 1వ, 2వ భా | 1985-86 |
| — „ — 5వ భా | 1988 |

వ్యాసములు : పరశ్శతము 1956 మొదలు

ముద్రణములో :—

పాండురంగమాహాత్మ్యసంజీవని 5వ భా

అముద్రితములు :—

పారిభాషికపదవిజ్ఞానమంజూష

గ్రంథగ్రంథిపత్రికాశిక

కవిజనాశ్రయవ్యాఖ్య

ఇత్యాదులు—

# చతుర్థాశ్వాసము

## సంకేతాక్షర వివరణము

| | |
|---|---|
| అగ్ని | అగ్నిపురాణము |
| అచల | అచలాత్మజాపరిణయము |
| అప్పక | అప్పకవీయము |
| అభి. చిం. | అభిధానచింతామణి |
| అమ | అమరకోశము |
| అశ్వ | అశ్వమేధపర్వము |
| ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము |
| ఆం. భా. వి. | ఆంధ్రభాషావికాసము |
| ఆం. సం. | ఆంధ్రనామసంగ్రహము |
| ఆది | ఆదిపర్వము (సం / తె) |
| ఆముక్త (సంజీ) | ఆముక్తమాల్యద (సంజీవనీవ్యాఖ్య) |
| అరణ్య | అరణ్యపర్వము |
| ఆశ్రమ | ఆశ్రమవాసపర్వము |
| ఉ. నా. | ఉత్తరనారసింహపురాణము |
| ఉ. హ. | ఉత్తరహరివంశము |
| ఋగ్వే (సాయన) | ఋగ్వేదము (సాయనభాష్యము) |
| కవికల్ప | కవికల్పలత |
| కళా | కళాపూర్ణోదయము |
| కాదం | కాదంబరి |
| కామంద | కామందకము |
| కా (వ్య) మీ | కావ్యమీమాంస |
| కాళహ | శ్రీకాళహస్తి మాహాత్మ్యము |
| కాళికా | కాళికాపురాణము |

| | |
|---|---|
| కాశీ | కాశీఖండము |
| కా. సూ. | కావ్యాలంకారసూత్రవృత్తి |
| కిరాత | కిరాతార్జునీయము |
| కు. సం. (మల్లినా) | కుమారసంభవము (మల్లినాథవ్యాఖ్య) |
| కూర్మ | కూర్మపురాణము |
| కే ని. | కేశవ నిఘంటువు |
| కేయూర | కేయూరబాహుచరిత్ర |
| క్రీడా | క్రీడాభిరామము |
| గరుడ | గరుడపురాణము |
| గురుబాల | గురుబాలప్రబోధిక |
| చి. ని. | చిన్నయసూరి నిఘంటువు |
| ఛాందో | ఛాందోగ్యోపనిషత్తు |
| జై. భా. | జైమినిభారతము |
| తంత్ర | తంత్రశాస్త్రము |
| తంత్రివా | తంత్రవార్తికము |
| తర్క | తర్కసంగ్రహము |
| తిథ్యాది | తిథ్యాదితత్త్వము |
| తూ. దో. | డా॥ తూమాటి దోనప్పగారి వ్యాసము |
| తైత్తి. సం. | తైత్తరీయ సంహిత |
| త్రి. ని. | త్రికాండశేషము |
| దశా | దశావతారచరిత్ర |
| ది. సూ. చ. | దివ్యసూరిచరిత్ర |
| దీ. పి. | కీ. శే. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు |
| దేవీపు | దేవీపురాణము |
| ధ్రువ | అర్యులధ్రువవివాసఖండనము |
| ద్విరేఫ | ద్విరేఫవర్ణదర్పణము |
| ద్వి. హరిశ్చ | ద్విపదహరిశ్చంద్రోపాఖ్యానము |

| | |
|---|---|
| నరస | నరసభూపాలీయము |
| నన్న. విజ్ఞా | నన్నయ విజ్ఞాననిరతి |
| నానా | నానార్థరత్నమాల |
| నిర్వ | నిర్వచనోత్తరరామాయణము |
| ని. వేం. | కీ. శే. నిడదవోలు వేంకటరావుగారు |
| నీలా | నీలాసుందరీపరిణయము |
| నృసింహ | నృసింహపురాణము |
| పండితా | పండితారాధ్యచరిత్ర |
| పద్మ | పద్మపురాణము |
| పాణి | పాణినీయము |
| పాతం | పాతంజలయోగశాస్త్రము |
| పారిజా | పారిజాతాపహరణము |
| ప్రబంధ | ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము |
| ప్రభావ | ప్రభావతీప్రద్యుమ్నము |
| ప్రౌ | ప్రౌఢవ్యాకరణము |
| బా. | బాలవ్యాకరణము |
| బృ సం. | బృహత్సంహిత |
| బ్రహ్మవై | బ్రహ్మవైవర్తపురాణము |
| బహ్మాండ | బ్రహ్మాండపురాణము |
| బ్రౌ | బ్రౌఢ్యము |
| భాగ | భాగవతము (సం / తె) |
| భాగ. పరి. | భాగవతపరిశోధనము |
| భావప్ర | భావప్రకాశము |
| భీమ | భీమఖండము |
| మత్స్య | మత్స్యపురాణము |
| మధురా | మధురావిజయము |
| మ. భా. | మహాభాష్యము |
| మ. స్మృ. | మనుస్మృతి |

| | |
|---|---|
| ము. కౌ. | ముక్తలక్షణకౌముది |
| ముగ్ధ | ముగ్ధబోధవ్యాకరణము |
| మేఘ | మేఘసందేశము |
| మే ని. | మేదినీకోశము |
| యుక్తి | యుక్తికల్పతరువు |
| రఘు (సంజీ) | రఘువంశము (సంజీవనీవ్యాఖ్య) |
| రఘునా | రఘునాథరామాయణము |
| రా. అ. | కీ. శే. రాళ్లపల్లి యనంతకృష్ణశర్మగారు |
| రా. కల్ప | రామాయణ కల్పవృక్షము |
| రామా | రామాభ్యుదయము |
| లలితాసహ | లలితాసహస్రనామభాష్యము |
| వరాహ | వరాహపురాణము |
| వసంతరా | వసంతరాజ శకునశాస్త్రము |
| వసు | వసుచరిత్ర |
| వాక్యప | వాక్యపదీయము |
| వాగ్భ | వాగ్భటము |
| వాచస్ప | వాచస్పత్యము |
| వికృ | వికృతివివేకము |
| విక్రమా | విక్రమార్కచరిత్ర |
| విరాట | విరాటపర్వము |
| విశ్వ | విశ్వకోశము |
| విష్ణు | విష్ణుపురాణము |
| విష్ణుధ | విష్ణుధర్మోత్తరము |
| వృక్ష | వృక్షశాస్త్రము |
| వృత్తర | వృత్తరత్నాకరము |
| వృత్తివి | వృత్తివివేకము |
| వై. ని. | వైజయంతీకోశము |
| వ్యా. సం. స. | వ్యాకరణ సంహితాసర్వస్వము |

| | |
|---|---|
| శబ్దక | శబ్దకల్పద్రుమము |
| శబ్దస్తో | శబ్దస్తోమమహానిధి |
| శబ్దా. చిం. | శబ్దార్థచింతామణి |
| శ. ర. (అను) | శబ్దరత్నాకరము (అనుబంధము) |
| శల్య | శల్యపర్వము |
| శాంతి | శాంతిపర్వము |
| శివరా | శివరాత్రిమహాత్మ్యము |
| శృ. నై. | శృంగారనైషధము |
| శ్రవణా | శ్రవణానందము |
| శ్రీతత్వ | శ్రీతత్వచింతామణి |
| షడ్ద | షడ్దర్శనములు |
| సభా | సభాపర్వము |
| సర్వ. సం. | సర్వశబ్దసంబోధిని |
| సా. ద. | సాహిత్యదర్పణము |
| సాముద్రి | సాముద్రికము |
| సారంగ | సారంగధరచరిత్ర |
| సి. కౌ. | సిద్ధాంతకౌముది |
| సిద్ధా. శి. | సిద్ధాంతశిఖామణి |
| సీతా | సీతారామాంజనేయ సంవాదము |
| సుమతీ | సుమతీశతకము |
| సుశ్రు | సుశ్రుతము |
| సూ. ని. | సూర్యరాయాంధ్ర నిఘంటువు |
| స్కాంద | స్కాందపురాణము |
| హ. న. | హరిశ్చంద్రనలోపాఖ్యానము |
| హర | హరవిలాసము |
| హరి | హరివంశము (సం / తె) |

* ఇవిగాక పలుగ్రంథముల పేళ్లు, గ్రంథకర్తల పేళ్లు నిర్దిష్టములు.

# విషయసూచిక





# పాండురంగ మాహాత్మ్యము

# చతుర్థాశ్వాసము

## [సంజీవనీ వ్యాఖ్యాన సహితము]

క॥ శ్రీద్యుతిసువర్ణరేఖా
విద్యోతితసదననికష ! విద్వదనీక
ప్రద్యో 1 తనసుత ! గుణశత
వేద్యా ! రామాను 2 జేంద్ర వేదాద్రీశా ! 1

వ్యా :— శ్రీ = సంపదయొక్క, ద్యుతి = శోభయనెడు, సువర్ణరేఖా = బంగారుగీటుచేత, విద్యోతిత = తెన్నగాఁబ్రకాశింపఁ జేయఁబడిన, సదన = మందిరమనెడు, నికష = గీటురాయిగల వాఁడా ! (బంగారుగీటుచే, గీటురాయిప్రకాశితముగునట్లు, మందిరము సంపదలశోభచేతఁబ్రకాశితమనుట) విద్వత్ = విద్వాంసులయొక్క, అనీక = సమూహమునకు: ప్రద్యోతనసుత = సూర్యతనయుఁడైన, (=కర్ణుఁడైన) వాఁడా ! గుణశత = సద్గుణముల పెక్కింటిచేత,

1 ప :- 1 తను - ర. తన - అ, గౌ. 2 జేంద్రు - క. జేంద్ర-అ. గౌ.

(శతం = బహు - ఇతినిఘంటుః - శబ్దక) వేద్యా = తెలియఁదగిన వాఁడా! (ప్రసిద్ధుఁడా - అనుట) రామానుజేంద్ర = శ్రేష్ఠుఁడగు నైన రామానుజయ్యయొక్క (కుమారుఁడవగు) వేదాద్రిశా = వేదాద్రి నాథా! (మీఁదివచనముతో నన్వయము)

అలం :— రూపకము.

వ॥ ఆకర్ణింపుమానిలింప 1 నదీకిరీటుండు హాటక గర్భసంభవునితో నిట్లనియె; 2 నట్లు దినదిన ప్రవర్ధమానంబగు ననురాగంబు చిగురుం 3 గొమ్మచేగయై కొనసాగుచునికిం దనికిరాధ, మాధ వుందనకు 4 నధినాథుంగాఁగోరిగోవర్ధనాచల సమీపవర్తియగు బుణ 5 విమోచన తీర్థంబునందపంబు సేయంగడంగి. 2

వ్యా :— ఆకర్ణింపుము = వినుము, అనిలింపనదీ కిరీటుండు = ఆ వేల్పుటేఱు (ఆకాశగంగ) మకుటముగాఁగలవాఁడు - అశివుఁడు, హాటకగర్భసంభవునితోన్ = బ్రహ్మవలన జన్మించిన వానితో - అనారదునితో, ఇట్లు = ఈ ప్రకారముగా, అనియెన్ = పలికెను. అట్లు = అవిధముగా, దినదినప్రవర్ధమానంబు = ప్రతి దినము మిక్కిలివృద్ధిపొందుచున్నది, అగు = అయిన, అనురాగంబు= ప్రేమ, చిగురుంగొమ్మచేగయై = లేఁతకొమ్మయొక్కచేవయై, కొన సాఁగుచున్ ఉనికిన్ = వర్ధిల్లుచుండుటచేత, (లేఁతకొమ్మ క్రమక్రమ ముగాఁజేవయెక్కునట్లు, రాధ ప్రేమ, క్రమక్రమముగావర్ధిల్లినదనుట) తనికి = పరితపించి, రాధ = రాధాదేవి, మాధవున్ = కృష్ణుని, తనకున్ = తనకు, అధినాథుంగాన్ = భర్తనుగా, కోరి = వరించి,

---

2 ప : 1 నదికివిటుండు - త; నదీకిరీటుండు - ర, అ. 2 నట్లనుదిన - గ, గా: నట్లుదినదిన - ర, అ. 3 గొమ్మనుంజేగ - డ. ద, బ, గా: గొమ్మయునుం - ర; గొమ్మ - అ 4 నవీనాథునిం - గా: నధినాథుఁగా - ర, అ. 5 విమోచను - గా; విమోచన - ర, అ

గోవర్ధన = గోవర్ధనమనెడు, అచల = పర్వతముయొక్క, సమీప వర్తి = దగ్గఱనున్నది: అగు = అయిన, ఋణవిమోచన తీర్థంబునన్ = ఋణవిమోచనమనెడు క్షేత్రమునందు, తపంబు = తపస్సు, చేయన్ = ఆచరించుటకు, కడంగి = పూని. (మీఁదిపద్యముతో నన్వయము)

## రాధాదేవి తపస్సు - వివిధ ఋతు వర్ణనము

సీ॥ ననలకొ్రం 1 దొడిమయొత్తినఁగంటుగిలుమస్త
కంబెట్టులోర్చెనో! కఱకుజడలు
కస్తూరితిలకంబు 2 గాలివాఁటిననేర్పు
నొసలెట్లు 3 ననిచెనో! భసితమునకు
వజ్రాలనూలునోర్వనికటీతటియెట్లు
తాళెనో! 4 కటుదర్భదామకాంచి
జిలుఁగుదువ్వలువింత 5 బెళకినగరు 6 దాల్చు
తనువెట్టులోర్చెనో! ధాతువస్త్ర

3 ప:- 1 దొడమలొత్తి – త; దొడమయొత్తి – గౌ; దొడమె - గ; దొడిమ - ర, అ. 2 గాలుపా – ప, గౌ; గాలివా - ర,అ. 3 నోర్చె నో – గౌ; ననిచెనో – ర, అ. 4 పటు - ముద్రి (అ); ర; కటి – గౌ; కటి (కటు?) - అ. 5 బెళికిన - య; వెళకిన-ప; బెళకిన - ర, అ, గౌ. 6 దాల్చు - ప; దాల్చు – ర, అ, గౌ.

తే॥ భరణ 7 మునకంచుజనములచ్చెరువునొందఁ
గొమ్మగావించెఁదపవఁట్టిఘోరనిష్ఠ
8 కదలి కంపించుక్రియజగం 9 బగలి 10 పడఁకెఁ
దత్సమయజాతహేమంతతరుణవాత్య. 3

వ్యా :— ననల = పువ్వులయొక్క, క్రొందొడిమ = క్రొత్తదయిన (లేఁతదయిన) వృంతము, ఒత్తినన్ = గట్టిగా హత్తినచో, కంటుగిలు = బాధనొందు, మస్తకంబు = తల, కఱకు = ఓరుపైన, జడలు = అంటులుగట్టినకురులను. ఎట్టులు = ఏప్రకారముగా, ఓర్చెనో = సహించెనో!

"స్వకేశపుష్పైరపియాస్మదూయతే" (కు. సం. 5-12)
అనుదానికిది యనుస్మృతి.

వ్యాక :— క్రొత్త + తొడిమ = క్రొందొడిమ. జడ = జడను. ద్వితీయార్థక ప్రథమ - బా. కారక 24.

2) కస్తూరితిలకంబు = కస్తూరిబొట్టు, గాలి + పాటినన్ = గాలికిఁదడియాటినచో, ఏర్చు = బాధనొందు, నొసలు = నుదురు, భసితమునకున్ = విబూదికి, ఎట్లు = ఏప్రకారముగా, ననిచెనో = సహించెనో!

భసితము = శివత్వమును భాసింపఁజేయునది.
"విభూతిర్భూతిహేతుత్వా. ద్భసితంతత్త్వభాసనాత్" (సిద్ధాం. శి)

---

7 ముల - త. గొ; మున - ర, అ. 8 ఁగదలి - ర; కదలి అ, గొ.
9 బడలి - ముద్రి (అ); ర; బదరి - క; బగలి - అ. 10 పఱఁక ముద్రి (అ); ర; పఱఁకె - క, గొ; పడఁకె - అ.

3) వ్రజాల = మగజాల (వజ్రముల) యొక్క-మగజాలు (వ్రజ ములు) పొదిగిన,నూలున్=(కటి)సూత్రమును(మొలనూలును) ఓర్వని= సహింపని, కటీ = మొలయొక్క, తటి = ఒడ్డు - ప్రదేశము, (నడుము ప్రదేశము) ఎట్లు = ఏప్రకారముగా, కటు = కటువయిన, దర్భ దామ=దర్భత్రాటియొక్క - దర్భత్రాటితోఁజేసిన, కాంచిన్ = మొల నూలును, (స్త్రీకట్యాంమేఖలాకాంచీ సప్తకీరశనాతథా - అమ) తాళెనో = సహించెనో !

వ్యాక :— వ్రజాలనూలు = వ్రజాలయొక్క నూలు. ఇటు షష్ఠి, యాధారాధేయ సంబంధముననైనది. దర్భదామ కాంచి = దర్భ ధామముయొక్క కాంచి. ఇటుషష్ఠి. ప్రకృతి వికృతిభావముననైనది.

4) జిలుఁగు = మృదువయిన, దువ్వలువ = సన్నని వస్త్రము; ఇంత = కొలఁదిగా, బెళఁకినన్ = ఒరసినచో, గరు + తాల్చు = గగుర్పొడుచు, తనువు = శరీరము, ధాతువస్త్ర = కాషాయవస్త్రము యొక్క, భరణమునకున్ = తాల్చుటకు, ఎట్టులు = ఏప్రకారముగా ఓర్చెనో = సహించెనో !

ధాతువస్త్రము - గైరికము (జేగుఱుమన్ను) మున్నగునవి, ధాతువులు. (ధాతుర్వాతాదిశబ్దాదిగైరికాదిత్వగాదిషు - వై. ని.) ధాతు వర్ణముగల (=జేగుఱుమట్టిరంగుగల) వస్త్రము, ధాతువస్త్రము. అనఁగాఁ గాలిపుట్టము :- కాషాయము. "పాండవాగ్రజుండు .... ధాతుపట దండకమండలు కలితమూర్తియయ్యె" (విరాట 1-184) "తరుణపల్లవ కోటిధాతుకాటి" (వసు 2-79) "ధాతుకాటి = కాషాయ వస్త్రము గాను" (టీక)

అంచున్ = అని, జనములు = జనులు, అచ్చెరువునందున్ = ఆశ్చర్యపడఁగా, కొమ్మ = (అ) కాంత - రాధాదేవి, తపము =

తపస్సును, కావించెన్ = ఆచరించెను. అట్టి = అటువంటి, ఘోర = భయంకరమయిన, నిష్ఠకున్ = నియతస్థితికి - తపోనియమమునకు, అడలి = భయపడి, కంపించుకొ్రియున్ = వడఁకునో! యనునట్లు, తత్సమయ = ఆకాలమునందు, జాత = సంభవించిన, హేమంత = హేమంతఋతువుయొక్క, తరుణ = క్రొత్తదయిన, వాత్యన్ = వాయు సమూహముచేత, (వాత్యావాతమండలీ - త్రి. ని.) జగంబు= లోకము, అగలి = భేదిల్లి, వడఁకెన్ = కంపించెను.

మార్గశిరపుష్యమాసములు హేమంతఋతువు.

అలం :— విషమము, ఉత్ప్రేక్ష.

శా॥ తత్తాదృఙ్మదజృంభమాణతరుణీతారుణ్య సంపద్దశా
ప్రోత్తుంగస్తన 1 నిస్తులోష్మకవచంబుల్ పూనఁగా 2 నోఁచుటన్
జిత్తానందముగల్గుభోగులకు నిస్త్రింశోగ్రసంపాతమై
యుత్తాలంబగు సీతుకందువకరంబుద్వేగమొందింపఁగన్. 4

వ్యా :— తత్తాదృక్ = సాటిలేని, మద = పొగరుచేత, జృంభమాణ = విజృంభించుచున్న - ఉబ్బుచున్న, తరుణీ = యువతులయొక్క, తారుణ్యసంపద్ = యౌవనసంపత్తియొక్క, దశా = స్థితిచేత, ప్ర+ఉత్తుంగ = మిక్కిలియున్నతములయిన; స్తన = కుచములయొక్క, నిస్తుల = సాటిలేని, ఊష్మ = వేఁడికోఁగూడుకొన్న, కవచంబుల్ = అంగిలను, మీఁగాళ్లదాఁక వ్రేలాడు చొక్కాలను, (కంచు --- కూర్పాసో, వారబాణశ్చకంచుకః - అభి. చిం) పూనఁగా నోఁచుటన్ = ధరింపనోఁచుటచేత, భోగులకున్ = భోగవంతులకు, చిత్తఆనందము = మనోమోదము, కల్గున్ = ప్రాప్తించును.

---

4 ప :- 1 నిస్తులోష్ణ - డ, ద, ఙ; వస్తులోష్మ - క; నిస్తులోష్మ-ర,ఉ.

నోఁచు = వ్రతాదులనాచరించు - అనియర్థము. పూర్వజన్మలోఁ జేసిన వ్రతాదులపుణ్యము మూలమున నీజన్మలో యువతుల యుబ్బు గుబ్బలవేఁడికి వెచ్చగిల్లిన యంగీలను వహించుభాగ్యము భోగులకుఁ బ్రాప్తించెనన్నమాట.

ఉత్తాలంబగు = తీవ్రమయిన, సీతుకందువ = శీతర్తువు (హేమంతము) నిస్త్రింశ = ఖడ్గమువంటి, (ఖడ్గేతునిస్త్రింశ - అమ) ఉగ్ర = భయంకరమయిన, సంపాతమై = పడుటగలదై, (కత్తి వ్రేటువలెబాధాకరమై - అనుట) కరంబు = అత్యంతము, ఉద్వేగ మొందింపఁగన్ = భయపెట్టఁగా. (ఉద్వేగః = భయమ్ - ఇతి హేమ చంద్రః - శబ్దః) మీఁదిపద్యముతో నన్వయము.)

తత్తాదృక్ - చూ 1 - 78 వ్యాఖ్య.

తే॥ చంద్రబింబాస్యకుచశైలజన్మభూమి
గాన రారూపువోలెనక్కడిఁదిచలికి
నించుకంతయుఁగంపింపదివముకొనుచు
ముజ్జగంబులుఁబచరింపమూఁటిలెక్క. 5

వ్యా :— ముజ్జగంబులున్ = త్రిలోకములును - త్రిలోక వాసులును, మూఁటిలెక్కన్ = మూఁటిసంఖ్యను - మూఁడంకెయొక్క యాకృతి, పచరింపన్ = ప్రకటింపఁగా - (చలిబాధకు) తొడలు బొమ్మలయొద్దఁజేర్చి, ముడుచుకొనిపరుండఁగా, చంద్రబింబ ఆస్య = (అ) యిందు బింబమువంటి ముఖముగలది - అకాంత (రాధా దేవి) కుచ = స్తనములనెడు, శైల = పర్వతములకు, జన్మభూమి = పుట్టినిల్లు, కానన్ = కావున, రారూపు + పోలెన్ = రాతిబొమ్మ వలె, (శిలాప్రతిమవలె) అక్కడిది = అయుత్కృటమయిన, చలికిన్ = శీతమునకు, ఇవముకొనుచున్ = చలిపొందుచు, (శీతబాధపొందుచు) ఇంచుకంతయున్ = కొంచెమయినను, కంపింపదు = వణఁకదు.

మూఁటిలెక్క పచరించు - ఇది నిఘంటువులకెక్క లేదు. మూఁడంకెవేయు - అని నేఁటివ్యవహారము. "అర్థమిచ్చినయప్పుడతి గౌరవముసేయు. నర్థమీకున్న మూఁడంకెవేయు" (శ్రవణా) ప్రయోగాంతరము - "తొడలు వక్షంబులుదూరంగఁగొననేయ, మూఁటిలెక్కల మాడ్కిమ్రొగ్గువారు" (రామా 8-16) తొడలు వక్షములఁజేర్చిముడుచుకొని పండుకొన్నప్పటి యాకారము మూఁడంకెవలెనుండుటస్పష్టము.

అలం :— రూపకానుప్రాణితమగునుపమ.

తే॥ పారదంబునఁదోఁచిన పసిఁడితీఁగ
పగిదిరాజిల్లెరాధచంపక సవర్ణ
వర్ణమగుమేనుకుముదధావళతుపార
పటలకంచుకవేల్లనఘటనకలిమి. 6

వ్యా :— రాధ = రాధయొక్క, చంపక = సంపంగి పువ్వులో, సవర్ణ = సమానమయిన, (సవర్ణః సన్నిభః సదృక్ - అభి. చిం. వర్ణమగు = రంగుగలదియగు. మేను = శరీరము, కుముద = తెల్లకలువవలె, (సితేకుముదకైరవే - అమ) ధావళ = తెల్లనైన. తుపారపటల = మంచుసమూహమనెడు, కంచుక = వస్త్రముయొక్క (కంచుకః = వస్త్రమ్ - ఇత్యుణాదికోషః = శబ్దక) వేల్లన = చలనముయొక్క, ఘటనకలిమిన్ = కూర్పుకలిగియుండుట చేత, పారదంబునన్ = పాదరసమునందు, (అథచపలోరసస్సూతశ్చ పారదే - అమ) తోఁచిన = (నేత్ర) గోచరమయిన, పసిఁడితీఁగపగిదిన్ = బంగారుతీఁగవలె, రాజిల్లెన్ = ప్రకాశించెను.

పాఠ :— ధావళ - 'గా' పాఠము. ధావుగతిశుద్ధ్యయోః" (సి. కౌ. భ్వాది 601) ధావ్ + "కలస్తృపశ్చ" (సి కౌ. ఉణా 104) = ధవళ, ధావళ. "ధవళ = ధావ - కల, వా, హ్రస్వః"

అలం :— రూపకానుప్రాణితమగునుపమ.

తే॥ నవ్యకాలాగరూద్వర్తనములసతుల
చన్నుఁగొండల 1 నూష్మాగ్ని సంభవించె
మతిసమగ్రులు ధూమానుమానకలన
నగ్ని సాధింతురచలంబులందు నెపుడు. 7

వ్యా :— నవ్య = క్రొత్తదయిన, కాల + అగరు = కృష్ణాగరువనెడు సుగంధిద్రవ్యముయొక్క, (అగుర్వగరురాజార్హమ్-అభి చిం) ఉద్వర్తనములన్ = పూఁతలచేత, (ఉద్వర్తనముత్పతనేవి లేపనేఘర్షణే క్లీబమ్-మే. ని) సతుల = సాధ్వులయొక్క - కాంతలయొక్క, చన్నుఁగొండలన్ = స్తనములనెడు పర్వతములయందు, ఊష్మ = వేఁడిమియనెడు, అగ్ని = వహ్ని. సంభవించెన్ = పుట్టెను. మతిసమగ్రులు = బుద్ధిచేతఁబరి పూర్ణులగువారు, ధూమ = పొగయొక్క, అనుమానకలనన్ = అనుమితివశమున - ఎక్కడఁబొగయుండునో యక్కడ వహ్నియుండుననుతర్కశాస్త్ర ప్రసిద్ధమగు వ్యాప్తిజన్యజ్ఞానవశమున, అచలంబులందున్ = పర్వతములయందు, ఎపుడున్ = ఎప్పుడును, అగ్నిన్ = వహ్నిని, సాధింతురు = సంపాదింతురు - ఉన్నదని నిశ్చయింతురు.

కాలాగరువునకు ధూమమునకు నౌపమ్యమువ్యంజితము.

అనుమానము — "అనుమితికరణమనుమానమ్. పరామర్శజన్యజ్ఞానమనుమితిః. వ్యాప్తివిశిష్టపక్షధర్మతాజ్ఞానం పరామర్శః యథా-వహ్నివ్యాప్యధూమవానయంపర్వత ఇతిజ్ఞానంపరామర్శః. తజ్జన్యం పర్వతోవహ్నిమానితిజ్ఞానమనుమితిః యత్రధూమస్తత్రాగ్నిరితిసాహచర్యనియమోవ్యాప్తిః .... పర్వతోవహ్నిమానితిప్రతిజ్ఞా. ధూమత్వా

---

7 ప :- 1 నుష్ణాగ్ని - డ, ద, ఖ; నూష్మాగ్ని - ర, [illegible]

డితిహేతుః యోయోధూమవాన్సో౽గ్నిమాన్యథామహానస ఇత్యుదాహరణమ్, తథాచాయమిత్యుపనయః. తస్మాత్తథేతినిగమనమ్" (తర్క)

అలం :— రూపకము.

తే॥ సురలుకళలెల్లఁగ్రోలినసోముతనువు
కప్పురముగుమ్మరించిన 1 గనపక్రోవి
పువ్వుఁదేనియ చనిన యంభోరు 2 హంబు
ననఁగ మంచింకిబ్రహ్మాండమగలెఁ 3 జలికి. **8**

వ్యా :— సురలు = దేవతలు, కళలెల్లన్ = కళలన్నింటిని, క్రోలిన = పానముచేసిన, సోము = చంద్రునియొక్క, తనువు = శరీరమును, కప్పురము = కర్పూరము, గుమ్మరించిన = పూర్తిగా బైటనొలుకఁబోసిన, గనప = పెద్దదయిన, క్రోవి = బరణియును, పువ్వుఁదేనియ = మకరందము, చనిన = పోసిన. అంభోరుహంబున్ = పద్మమును, అనగన్ = అనునట్లు. మంచు = హిమము, ఇంకి = క్షీణించియుండఁగా - తొలఁగఁగా, బ్రహ్మాండము = భువనకోశము-భూగోళము, చలికిన్ = శీతముచేత, అగలెన్ = భేదిల్లెను.

దేవతలు కళలనెల్లఁబానముచేసిన చంద్రబింబమువలెను, గర్పూరము బయటనొలుకఁబోసిన పెద్దబరణివలెను. మకరందము పోసిన పద్మమువలెను. మంచుతొలఁగిన బ్రహ్మాండమొప్పెననుట.

దేవతలు చంద్రికళలను బానముచేయుదురు — "దేవాస్సోమంపిబంతి" (దేవీపు) - ఆముక్త 1-19 సంజీ. ఇటునిర్దేశింపఁబడిన

---

8 ప :- 1 కనకక్రోవి - ముద్రి (అ) ఠ; కనపక్రొవి - అ, గ; క్రొవ్విత 2 హంబొయనఁగ - డ, ద, బ; హంబు - ర, అ. 3 జలిని-గ; జలికి - ర, అ.

చంద్రుండాదిత్యలోకమునకుఁబైనున్న చంద్రుఁడు. "ఆదిత్యాచ్చంద్రమసమ్" (ఛాందో 5 అ - 2) "ఏషసోమోరాజాతం దేవా భక్షయంతి" (ఛాందో 5 అ - 4)

పాఠ :— గనపక్రోవి - ఇటు, కనప - ఉపలబ్ధపాఠము.

దీనిని బరిష్కర్తలు, 'కనక' గా, దిద్దినారు. వైరిపదప్రియులగు పరిశోధకలు దీనికివంతపాడినారు. (భాగ. పరి.) ఱెల్లుగొట్టమనునర్థము సరిపడదన్నారు. కనుము + క్రోవి = కనుపక్రోవియగును గాని, కనప క్రోవికాదని వీరు మూచుకొనలేదు. ప్రాఁతప్రతులలో సరళములకుఁ బరుషములు లిఖించుటపరిపాటి. కనుక, నిటు 'గనప' కవిప్రయుక్త పాఠము. గనపమేను - మొ॥ ప్రసిద్ధములు. (ఆశ్రమ 2-40, అశ్వ 3-105, స్త్రీ 1-5, శాంతి 4-40 మొ॥) లేఖన సంప్రదాయమును గ్రహింపని పరిష్కర్తలచే 'గనపతరి' (కాశీ 1-133 చి ని. పాఠము సూ. ని. పొగరుశబ్దమునొద్ద) "ఘనవితతి" గాను (1916 ముద్రణ) "కలపతతి" గాను (1953) దిద్దివేతలకుగురియయినది. అట్లెయుటు, 'కనప' శబ్దము 'కనక' గా మార్పబడినవి. గనప - సాధుపాఠమనుట స్పష్టము.

అలం :— మాలోపమ.

క॥ అగరుంగుంకుమపుష్పంపు
దొగరుంజేలలను 1సేతుఁ 2 ద్రోఁవంగలవే
పొగలేనిముర్ముఁరంబులు
మగువల 3 పాలింఁడ్లెభోగ 4 మహనీయులకున్. 9

9 ప :- 1 అగలుం - డ, ద, బ; అగళుం - గొ; అగరుం - అ. 2 ద్రోయన్ - త; ద్రోవం - ర. అ. 3 పాలిండ్లు - ముద్రి (అ). ర, పాలిండ్ల - గ, గొ; పాలిండ్లె - అ. 4 మహనీయంబుల్ - ముద్రి (అ), ర; మహనీయులకున్ - అ, గొ.

వ్యా :— అగరున్ = కృష్ణాగరువును, కుంకుమపువ్వును = అగ్నిశిఖమును, (ఇవి సుగంధిద్రవ్యములు) తొగరుంజేలును = ఎఱ్ఱవన్నెవస్త్రములను, సీతున్ = చలిని, త్రోవంగలవే = పోఁగొట్టఁజాలునా? (పోఁగొట్టలేవనుట) భోగ = సుఖానుభవముచేత, మహనీయులకున్ = గొప్పవారికి, మగువల = స్త్రీలయొక్క, పాలిండ్లె = స్తనములే, పొగలేని = ధూమములేని, ముర్మురంబులు = కుమ్ములు. (తుషానలం కుకూలఃస్యాన్ముర్మురః - త్రి. ని. = పొట్టునిప్పు)

తొగరువస్త్రములు శీతకాలమునవెచ్చఁదనమును, వేసవికాలమునఁ జల్లఁదనముఁనిచ్చును. (చూ. 4-16 వ్యాఖ్య) అట్లే, తరుణీకుచములు. "కూపోదకంవటుచ్ఛాయా, తాంబూలంతరుణీకుచమ్, శీతకాలేభవే దుష్ణ, ముష్ణకాలేచశీతలమ్."

పొగలేని ముర్మురంబులు - "ముదితపాలిండ్లు పొగలేనిముర్మురములు" (క్రీడా 262 ప.)

అలం :— న్యూనాభేదరూపకము.

క॥ [1] పైనిగుడుమంచుఁ [2] దువ్వర
వానలచేఁదడిసి కమలవనలక్ష్మి హరి
ధ్యాననిమీలితలోచన
యౌ నలరాధావధూటి [3] కనుగలమయ్యెన్. 10

వ్యా :— పైన్ = మీఁద, (ఉపరిభాగమునందు) నిగుడు = పేడు, మంచుఁదువ్వర = హిమశీకరములయొక్క (మంచుబొట్టుల

---

10 ప :- 1 పైఁగురియు-ర (ప్రాసభంగము) పైనిగురు - గొ; పైనిగుడు అ.
2 తుంపర - త; దుంపర - గొ; తుప్పర - క, వ; తువ్వర-అ.
3 కనుగవల-త (గణభంగము); కనుగల - ర, అ.

యొక్క) వానలచేన్ = వర్షములచేత, తడిసి = అర్ద్రమయి, కమల వనలక్ష్మి = పద్మవనలక్ష్మి, హరిధ్యాన = విష్ణువిషయకమగు నేకా గ్రతచేత, నిమీలిత = మూఁయబడిన, లోచన = కన్నులుగలది, ఔ = అగు, అలరాధావధూటికిన్ = ఆరాధాకాంతకు, అనుగల మయ్యెన్ = సాటియయ్యెను.

అలం :— ఉపమ.

తే॥ కాలుఁగాలును గేలునుగేలుమోవి
మోవియును 1 దార్చిభోగిసమూహమమరె
నూహసేయంగభోగి సమూహమునకుఁ
2 బొసఁగు మసకంపుఁబెనఁకువ లెనఁగుఁగాదె. 11

వ్యా :— కాలుఁగాలును = పాదమును బాదమును, కేలుఁ గేలున్ = చేయియుఁజేయియు, మోవిమోవియును = అధరమునధర మును, తార్చి = చేర్చి, భోగిసమూహము = భోగవంతుల నివహము అమరెన్ = ఒప్పెను. ఊహ+చేయంగన్=ఊహింపఁగా, భోగిసమూ హమునకున్ = సర్పనివహమునకు, (ఉరగఃపన్నగోభోగి - అమ) పొసఁగు = యుక్తమగు, మసకంపుఁబెనఁకువలు = రతిసంబంధ మయిన పెనవేసికొనుటలు (మసకము = సర్పరతి) ఎనఁగుఁగాదె= ఒప్పునుగదా !

అలం :— శ్లేష.

---

11 ప :- 1 దాల్చి – గొ; దార్చి - ర, అ, 2 బొసఁగ –ముద్రి (అ), ర; బొసఁగు – అ.

క॥ శ్యామలకాలా 1 గరునవ
ధూమమెదకు సుఖమొనర్పఁదోరపుఁగన్నుల్
వేమొగిచు కరణి సౌధ
2స్తోమమమరెఁగప్పఁబడిన 3 సోరణగండ్లన్. 12

వ్యా :— సౌధ = రాజగృహములయొక్క (సౌధోఽస్త్రీ రాజసదనమ్ - అమ) స్తోమము = సమూహము, శ్యామల = నల్లనయిన, కాలాగరు = కృష్ణాగరువను సుగంధిద్రవ్యముయొక్క; నవ = క్రొత్తదయిన, ధూమము = పొగ, ఎదకున్ = హృదయమునకు, సుఖమొనర్పన్ = సౌఖ్యముకలిగింపఁగా, తోరపుఁగన్నుల్ = అందమయిన నేత్రములు, వే = వెంటనే, మొగుచుకరణిన్ = మూయుచున్నట్లు, కప్పఁబడిన = మూయఁబడిన, (కప్పెనన మూసెననుచున్, జెప్పంబడు - ఆం. భా) సోరణగండ్లన్ = గవాక్షముల (=కిటికీల) చేత, అమరెన్ = ఒప్పెను.

కాలాగురుధూపమువలనఁగలిగిన సౌఖ్యముచేతఁగన్నులు మూసికొన్నవోయున్నట్లు కిటికీలుమూసియున్న సౌధములొప్పెననుట.

అలం :— ఉత్ప్రేక్ష.

---

12 ప :- 1 గురు – ర; గరు - అ, గా, 2 స్తోమమురేఁగ - క; (గణభంగము) స్తోమమమరె - ర, అ. 3 సోరనగండన్-త; సోరణగండ్లన్ - ర, అ.

క॥ అంతవసంతముజితహే
మంతముదీపించె, మత్తమధుకరకలభా
క్రాంత, మురుపుష్పరసవే
శంతము, సకల 1 ద్రుపులఁబిసాళము 2 చెలఁగన్. **13**

వ్యా :— అంతన్ = అనంతరము, జిత = జయింపఁబడిన, హేమంతము = హేమంతఋతువు గలదియు, మత్త = మదించిన, మధుకరకలభ = తుమ్మెదకొదమలచేత, ఆక్రాంతము = ఆక్రమింపఁబడినదియు, ఉరు = గొప్పదయిన, పుష్పరస = మకరందముయొక్క, వేశంతము = పడియ ( = చిన్నమడుఁగు ) గలదియు, (వేశంతః పల్వలంచాల్పసరః - అమ) అగు, వసంతము = వసంతఋతువు, సకలద్రుపులన్ = సమస్తవృక్షములయందు, (పలాశీద్రుద్రుమాగమః - అమ) పిసాళము = వికాసము, చెలఁగన్ = ఒప్పఁగా, దీపించెన్ = ప్రకాశించెను.

"కలభఃకరిశాబకః" ( అమ. ) కొదమ - లక్షణార్థము.
( 1 - 131 వ్యా )

13 ప :- 1 ద్రుపులపిసా - ప, గొ; ద్రుపులఁబిసా - ర, అ.
2 చెలఁగున్ - ప; చెలఁగన్ - ర, అ.

ఉ॥ కెంజిగురాకు 1 డాలు 2 దులకించినధాతుపటంబు 3 చాయఁజే
యం 4 జదురెక్కు పుప్పొడులనంటిన 5 తేఁటులు 6 భూతిభృజ్జటా
పుంజముఁబోలఁగావిపిన భూములలోమధులక్ష్మి 7 పొల్చెనీ
లాంజనవర్ణుఁగొరితపమట్లొనరించు మృగాక్షికై వడిన్. 14

వ్యా :— కెంజిగురాకు = ఎఱ్ఱని పల్లవముయొక్క, డాలు = కాంతి, తులకించిన = ప్రకాశించిన, ధాతుపటంబు = కాషాయ వస్త్రముయొక్క; చాయన్ = కాంతిని, చేయన్ = పోలఁగా, చదురెక్కు = రాలిన, పుప్పొడులన్ = పరాగములను, అంటిన = పొందిన, తేఁటులు = తుమ్మెదలు, భూతిభృత్ = విబూదిని వహించెడు, జటాపుంజమున్ = జడల సమూహమును, పోలఁగాన్ = సరిపోలఁగా, నీలఅంజన వర్ణున్ =

---

14 ప :- 1 డోలు - క; డాలు - ర, అ. 2 దొలకింత - త; దులకిం - ర, అ. 3 చేతజా - గ; ఛాయ - గొ; చాయఁ జే - ర, అ. 4 జదురెక్కు - ముద్రి (అ). ర, జదురెక్కు-అ; జిదురెక్కు - గొ; 5 తేటుల - గ; తేఁటులు - ర, అ, గొ. 6 భూరి - గ; భూతి - ర, అ. 7 వచ్చె-త; పొల్చె - ర, అ.

నల్లనికాటుకవంటి మేనిచాయగలవానిని - శ్రీకృష్ణుని, కోరి= వరించి, అట్లు = అవిధముగా, తపము = తపస్సు, ఒనరించు = ఆచరించు, మృగాక్షికై పడిన్ = (అ) హరిణనేత్రివలె - ఆరాధాదేవివలె, విపిన భూములలోన్ = అరణ్య ప్రదేశములలోపల, మధులక్ష్మి = వసంత శోభ, పొల్చెన్ = ఒప్పెను.

చైత్రవైశాఖములు, వసంతఋతువు.

చేయు = పోలు. "ఆదేశంబున నేకదేశమునజేయంజాలదే దేశమున్ - రఘునా. (సూ. ని.)

వ్యాక :— పుప్పొడి. పువ్వు + పొడి - భా. సంధి 39.

అలం :— ఉపమ.

క॥ ఆవిర్భవించెనీల
గ్రీవాలిక 1 దృష్టికీలికీలాసమమై
పూవులకారుడివోవం
గావేసవి హాసవిపులఖరకరమగుచున్. 15

వ్యా :— పూవులకారు = పుష్పర్తువు - వసంతము, ఉడివోవంగాన్ = గతింపంగా, వేసవి = గ్రీష్మర్తువు, హాస = నవ్వుచేత - ప్రకాశముచేత, విపుల = అతిశయించిన, ఖరకరము అగుచున్ = వేడివెలుంగు (సూర్యుడు) గలదియగుచు; నీలగ్రీవ = కఱకంఠుని (శివుని) యొక్క, అలికదృష్టి = ఫాలనేత్రముయొక్క; (లలాట మలికంగోధిః; దృష్టిర్జ్ఞానేక్షిదర్శనే - అమ) కీలికీలా = అగ్ని జ్వాలతో, సమమై = సమానమై, ఆవిర్భవించెన్ = అభివ్యక్తమయ్యెను.

వ్యాక :— ఉడిగి + పోవు = ఉడివోవు.

అలం :— లుప్తోపమ (అర్థి)

---

15 ప :- కీలికీలకేవలసఖిమై - ముద్రి (అ),ర; దృష్టికీలికీలాసమమై - అ.

వ॥ (i) అప్పుడప్పుడుగభస్తిహస్తియుంబోలెఁబన్నీర్ప్రవాహావ వహాకరప్రచారగండై; దవదహనంబు, కుసుమహిమవిభుండునుంబోలె స్వగోత్రనిర్భేదనసంపుణంబై; మల్లియలపెల్లు, కన్నడకవితావితానంబు నుంబోలె షట్పదవృత్తవిలాసభాసురంబై; సరసులు, సరసులుంబోలె వనితావిహారమహనీయంబులై రహివహించె. (ii) అంచలంచలం జంచలాచపలంబులును విపులంబులునగు 1 పదుమటిపవనంబులు 2 పొదు గులయుపవన బులంబెరుఁగుకరువలి 3 వారువంబులకుగమనాధ్యయన గురువులంబోలెవడిమెఱసి 4 సుడిసి. యసితయగువసుధఁగాడి ఱేటియులు వాటిఁగం, దదుదరవిస్ఫురితా త్రలతామతల్లికల 5 పెల్లునంబాతాళవ్యా ళంబులుగానవచ్చె. (iii) పెచ్చుపెరుఁగు 6 ఖరకరకరనిపాతంబుల 7 నాతప్తంబులగునెలవులం 8 దొరఁగి పరఁగు 9 వెలఁదివెన్నెలనీర్వట్టు వెన్నెలపిట్టలు 10 పొట్టలునిండనాస్వాదించె. (iv) 11 రక్కసజవ్వ నులు మవ్వంపుమచ్చికలనిచ్చలుఁ గ్రీడింపనాక్రీడావతుల యతులనాభీ వివరంబులనొప్పి యుబోలె, నద లయుదకంబులింకె. (v) విచికిల మాలికాలంకృతమౌళిభాగులును, నారంజిత 12 ధాతుపటుపరభాగులు

---

16 వ :- 1 పదమటి-ముద్రి (అ); ర. పదుమటి – అ. 2 పొదుగలి కరువలి - క, గ, త; పొదుగుకరువలి – గో; పొదుగులయుప వనంబులంబెరుఁగుకరువలి - ర, అ. 3 వారువంబులకు -ర, అ. 4 సుడిసె - త; సుడిసి–ర, అ. 5 పెల్లినం - ర, గో; పెల్లున-అ. 6 ఖరకరనిపాతంబుల - గో; ఖరకరకర - ర, అ. 7 నతప్తంబు లగు – గో; నాతప్తంబులగు - ర, అ. 8 దొరిగివరగగు – త; దొరిగినరంగుల - క; దొరఁగిపరగు-ర, పరఁగు-అ. వరుగగు-గో. 9 వెలందివెన్నెలనిరట్టు - క; వెలఁదివెన్నెలల - ముద్రి (అ); ర; గ; వెలఁదివెన్నెల - అ, గో; నీర్వట్టు - ర, అ. 10 పొట్టల-గో; పొట్టలు - ర, అ. 11 కక్కసన-గ, గో; కర్కశ–త; రక్కస-ర,అ. 12 ధాతుపటల – డ, ద, బ; ధాతుపటు - ర, అ, గో,

నగుభోగులబాగుగ్రగుడ్డు 13 మోచునెఱచీమలచాలు 14 చెమ్మాయి మ్నులంగ్రమ్మరం 15 దొడంగె (vi) వ్యావహారిక సత్యత్వంబుప్రక టించు పప్రపంచంబుచేతవంచితులగు నెఱుకలేని కఱటులకరణి హారిణం బులు మరీచికాపీచికాపాన వివశంబులై దిశలంబరిభ్రమించె (vii) ముంచుకొను 16 సంపెంగల సౌరభంబునకుం 17 జాలని రోలంబంబుల లీల, వియోగి 18 లోకంబులు విషము 19 విముఖంబులయ్యె. (viii) ఇసుక 20 మెదువునెలవులంబన్నిన పసపుటాకుంజప్పరంబుల లోనం 21 గుప్పళించిన కప్పురంబుతోడి 22 కురువేరు 23 పరిమళం బును 24 బాదిరిజాజివిరులవలపును వట్టివేళ్ల వాసనలుంగలప్రపాపాలి 25 కాపవర్జితంబులగు కలశోదకంబులుగోరిసేదదేటి తెరువరులు తాలవృం తానిలంబుల 26 బలుపు కొలిపిమున్ను పరిక్షీణంబులగు ప్రాణపవనం బులం 27 బోసరింపంజేసిరి. తత్కాలంబున. **16**

వ్యా :— (i) అప్పుడు = ఆసమయమునందు - అగ్రీష్మర్తువు

---

13 నోచు - గ; మ్రోచు - ప; మోచునెఱ - ర; అ. మోచు నెఱ్ఱ - గౌ. 14 చెమ్మల - ప; చెమ్మ - ర, అ 15 దొణంగె-గౌ; దొడంగె - ర, అ. 16 సంపంగల – గౌ; సంపెంగల - ర, అ. 17 దాళక - గ; దాళని - ర, (ముద్రి) – అ జాలక - అ, గౌ. 18 లోకంబువి - ఖంబయ్యె – త, ష, లోకంబులు - ర, అ. 19 విముఖంబులయ్యెనిసుక – గౌ; విముఖంబులయ్యె. ఇసుక- ర, అ. 20 మెదుపు – క, గౌ; మెదువు – ర, అ. 21 గుప్ప ళించిన - ర, గౌ; గుప్పళిం (రిం?) – అ. 22 కురివేరి - త; కురువేరు - ర, అ, గౌ. 23 పరిమళంబులును - ర; పరిమళం బును - అ, గౌ. 24 జాజి - ర; బాదిరిజాజి - అ, గౌ, బందిరి విరుల - త. 25 కాపఘనవర్జితంబులగు - ర; విసర్జితం (కావ వర్జితం?) - అ; కాపవర్జితంబులగు - గౌ; క. 26 బలువు - క; బలుపు - ర, అ. 27 బోసరించుం - గ, త; బోసరింపం–ర, అ.

నందు. అప్పటుగభస్తి = అయుష్ణరశ్మి - సూర్యుఁడు, (ఉష్ణేతిగ్మస్తీవ్ర స్తీక్ష్ణశ్చండఃఖరపటుః - అభి. చిం.) హస్తియున్ పోలెన్ = మగ యేనుఁగువలె, పద్మినీ = పద్మములకు, (పద్మినీతు నలిన్యాంహస్తిని శ్రియోః - వై. ని.) ప్రమోద = అధికసంతోషమును, అవహ = కలిగించెడు, కర = కిరణములయొక్క, ప్రచారుండై = సంచారము గలవాఁడై - సూర్యపక్షముననర్థము. పద్మినీ = ఆఁడేనుఁగులకు; ప్రమోద = అధికసంతోషమును, అవహ = కలిగించెడు, కర = తొండమయొక్క, ప్రచారుండై = అధికమయిన చలనముగలవాఁడై - హస్తిపక్షముననర్థము.

దవదహనంబు = కార్చిచ్చు; (దవదావౌవనారణ్యవహ్నీ-అమ) కురుమహీవిభుఁడున్ పోలెన్ = కురురాజువలె - దుర్యోధనునివలె, స్వ = స్వకీయమయిన, గోత్ర = అరణ్యమును, (గోత్రం కులాఖ్యయోః --- కాననచ్ఛత్రవర్త్మసు - మే ని) నిర్భేదన = భేదించుటయందు - కాల్చుటయందు, నిపుణంబై = నేర్పుగలదై - అని దవదహనపక్షమున, నర్థము. స్వ = స్వకీయమైన, గోత్ర = కులము యొక్క - కురువంశముయొక్క. నిర్భేదన = భేదించుటయందు, నిపుణంబై = నేర్పుగలిగి - అని కురుమహీవిభుని పక్షముననర్థము.

మల్లియల = మల్లెపువ్వులయొక్క, పెల్లు = సమూహము, కన్నడకవితావితానంబునున్ పోలెన్ = కర్ణాటకవిత్వము యొక్క వ్యాప్తి వలె, షట్పదవృత్త = తుమ్మెదలవర్తనముయొక్క, విలాస = సౌంద ర్యముచేత, భాసురంబై = ప్రకాశించునదై - మల్లియలపక్షమున నర్థము. షట్పదవృత్త = షట్పదములను పేరుగలపద్యభేదములయొక్క విలాస = సౌందర్యముచేత, భాసురంబై = ప్రకాశించునదై - కన్నడ కవితపక్షముననర్థము.

సరసులు = సరోవరములు, (సరసి+లు) సరసులున్‌పోలెన్ =

రసికులవలె, వనితా = స్త్రీలయొక్క, విహార = విహరించుటచేత- స్త్రీలజలక్రీడలచేత, మహనీయంబులై = గొప్పవై, రహివహించెన్ = అతిశయించెను - పరోపరపక్షమున, నర్థము. వనితా = స్త్రీలయొక్క, విహార = విహరించుటచేత - రతిక్రీడలచేత, మహనీయంబులై = గొప్పవై, రహివహించెన్ = అతిశయించెను - రసికులపక్షమున, నర్థము.

అలం :— శ్లేషోత్థాపితములగునుపమలు.

(ii) అంచెలంచెలన్ = వరుసలు వరుసలుగా, చంచలా = మెఱపులవలె, (విద్యుచ్చంచలా - అమ) చపలంబులును = చంచలములును, విపులంబులున్ = విరివియైనవియు, గు = అయిన, పడుమటిపవనంబుల = పశ్చిమవాయువులు, పొరుగులఉపవనంబులన్ = సమీపములందలియారామము లందు, పెనగు = వర్ధిల్లు, తరువలి = వాయువుయొక్క, వాహనంబులకున్ = వాహనములకు-జింకలకు, గమన = నడకయొక్క, అధ్యయన = గురుముఖముగాఁజేయువిద్యాభ్యాసమునందు, గురువులన్‌పోలెన్ = ఉపాధ్యాయులోయనసట్లు, వడిమెఱసి = వేగమును బ్రకటించి, (తమ వాహనములగు జింకలకు, గమన వేగమునునేర్పుటలో, నుపాధ్యాయులోయన్నట్లు పడమటిగాలులు వీచుచున్నవనుట) సుడిసి = వ్యాపించి, అసిత = నల్లనిది, అగు = అయిన, వసుధన్ = భూమియందు, కాఁడి = నాటి - నాటుటచేత, నెటియలువాఱినన్ = బీటలువాఱఁగా (పగులఁగా) తద్ = దానియొక్క - అభూమియొక్క ఉదర = గర్భమునందు, విస్ఫురిత = బాగుగాఁదోఁచిన, (అంత్రతలతామతల్లికల పెల్లునన్ = శ్రేష్ఠములయిన తీఁగలవంటి ప్రేగులో యనునట్లు, పాతాళవ్యాళంబులు = భూవివరములందుండు సర్పములు (పాతాళం నాగలోకేస్యాద్వివరే బడబానలే - మే. ని.) కానవచ్చెన్ = కనఁబడెను. (పడమటిగాలుల దెబ్బకు భూమిబీటలువాఱఁగా, భూవివరములందలి సర్పములు, భూదేవికడుపులోని ప్రేగులో యనునట్లు కనఁబడెననుట)

పడమర = సూర్యుఁడు, పడు (వాలు = అస్తమించు) దిక్కు - అని వ్యుత్పత్తి. పెల్లు - ఇవార్థకము. పిడుగులపిండ బిట్టులియుపెల్లన - విరాటు 4-171 సూ. ని. గాలికివాహనముజింక. కావుననే మృగ వాహనుఁడనఁబడును.

వ్యాక :— కాఁడి = కాఁడుటచేత - హేత్వర్థము.
(పౌ. క్రియా. 15)

అలం :— ఉత్ప్రేక్ష.

(iii) పెచ్చుపెరుఁగు = మిక్కిలి యతిశయించు, ఖరకర = వేఁడివెలుఁగు (సూర్యుని) యొక్క, కర = కిరణములయొక్క, నిపాతంబులన్ = పడుటలచేత - ప్రసారములచేత, అతితప్తంబులగు = మిక్కిలి తపింపఁజేయఁబడినవియగు, నెలవులన్ = ప్రదేశములయందు. తొరఁగి = పడి. (ప్రసరించి) పరఁగు = ఒప్పు, వెలఁది వెన్నెలన్ = స్వచ్ఛమయిన చంద్రికను, నీర్గట్టు = దప్పికగొను, వెన్నెలపిట్టలు = చకోరములు, పొట్టలు నిండన్ = కడుపులునిండునట్లుగా, ఆస్వాదించెన్ = క్రోలెను.

చకోరములు వెన్నెల పానముచేయుననుట కవిసమయము. "అసతోపిక్రియార్థస్య నిబంధనమ్, యథా - చకోరానాం చంద్రికా పానంచ" (కావ్యమీ)

(iv) రక్కెసజవ్వనులు = రాక్షసయువతులు, మవ్వంపు మచ్చికలన్ = అతిశయములయిన వేడుకలతో, నిచ్చలున్ = ఎల్లప్పుడు, క్రీడింపన్ = వినోదింపఁగా - జలక్రీడలాడఁగా, అప్రవీడావతుల = అసిగ్గటికత్తెల, అతుల = సాటిలేని, నాభీవివరంబులన్ = బొడ్డురంధ్రములయందు, (నాభీ - నాభి + వాజీష్ = నాభిః, ఇతి శబ్దరత్నావళీ - శబ్దక) ఇంకినవియున్ పోలెన్ = అడఁగినవోయనునట్లు నదుల = ఏఱులయొక్క, ఉదకంబులు = నీళ్ళు, ఇంకెన్ = ఇగిరెను.

అలం :— ఉత్ప్రేక్ష.

(V) విచికిల = విచికిచిమను నొకజాతిమల్లెపూలయొక్క, మాలికా = దండలచేత, అలంకృత = అలంకరింపఁబడిన, మౌళిభాగులును = శిరఃప్రదేశములుగలవారును, అరంజిత = బాగుగారంగు వేయఁబడిన, ధాతుపట = కావిపట్టములుగల, పరభాగులున్ = మిగిలిన శరీరభాగముగలవారును. (పరభాగః = శేషాంశశ్చ - శబ్దక) అగు = అయిన, భోగులబాగునన్ = భోగవంతులవలె, గ్రుడ్డుమోచు = అండములను వహించు, ఎఱచీమల వాలు = ఎఱ్ఱచీమలవరుస, చెమ్మయిమ్ములన్ = తడిప్రదేశముల యందు, కుప్పమ్మరన్ తొడంగెన్ = సంచరింపమొదలిడెను. (అండములను వహించునెఱ్ఱచీమలు, మల్లెపూలుదాల్చి కావిపట్టములు ధరించిన భోగులవలెనుండెననుట)

వేసవిలోఁగావిపుట్టములు చలువనిచ్చును.

"కెంగావుల మృణాళభంగంబులనంగంబులకుంజలువ పుట్టింప" (మను 3-52)

చీమలు గుడ్డుమోచుట వానరాకకుసూచన —

"వినోపఘాతేన పిపీలికానా

మండోపసంక్రాంతి రహిప్యవాయుః

ద్రుమాధిరోహాశ్చభుజంగమానాం

వృష్టేర్నిమిత్తాని గవాంప్లుతంచ"

(బృ. సం. - అముక్త 2-70 సంజీ)

ఇది గ్రీష్మర్తువు ముగియవచ్చుటకుసూచన.

ఇందలి భావము - మల్లెలు దుఱిమి, కావులమర .... ప్రజ వొల్చె ........ గుడ్డుతో మధురిమేచ్చడిగునెఱ్ఱచీమల చాలనంగ" (అముక్త 2-70) అనుదానిని వ్యత్యస్తముచేసిచెప్పినది.

పాఠ :— విచికిల - ఉపలబ్దపాఠము. విచకిల - సంస్కృత నిఘంటువులు. "విచకిలః = మల్లీప్రభేదః - శబ్దక. "విచికిలము"- శ. ర. "విచ (చ) కిలము" - సూ. ని.

"విచికిలామోదలతోడ వియ్యమంది" (భీమ 2-54)

అలం :— ఉపమ.

(vi) వ్యావహారికసత్యత్వంబు = మాయాసంబంధమయిన యథార్థత్వమును, ప్రకటించు = ప్రదర్శించు - పరమార్థమునకు లేకున్నను, మయావశమున నిజముగానున్నట్లుగోచరించు, ప్రపంచంబుచేతన్ = జగత్తుచేత, వంచితులగు = మోసగింపఁబడినవారగు ఎఱుకలేని = జ్ఞానములేని, కఱుటకరణిన్ = మూర్ఖులవలె, మరీచికావీచికా = ఎండమావులకెరటములయొక్క, (మృగతృష్ణామరీచికా - అమ) పాన = త్రాగుటయందు, వివశంబులై = పరవశములై హరిణంబులు = లేళ్లు, దిశలన్ = దిక్కులయందు, పరిభ్రమించెన్ = సంచరించెను.

వ్యావహారికసత్యము - యథార్థజ్ఞానము లేకపోవుటచే, రజ్జువునందు సర్పభ్రాంతివలె, బ్రహ్మమునందు జగద్భ్రాంతి. ఈ దశలో జగత్తువ్యావహారిక సత్యమనఁబడును. యథార్థజ్ఞానముచే, మాయ, నివర్తింపఁగా, జగత్తు, బ్రహ్మవివర్తమన్న పరమార్థముగోచరించును. కాఁగా, జగత్తు, బ్రహ్మవివర్తమన్నది పారమార్థికసత్యము. బ్రహ్మమునందు జగద్భ్రాంతి, వ్యవహారికసత్యము. ఇదియద్వైతసిద్ధాంతము.

అలం :— ఉపమ.

(vii) ముంచుకొను = వ్యాపించు, సంపెఁగల = చంపక పుష్పములయొక్క, సౌరభంబునకున్ = సువాసనకు, చాలని =

తాళలేని, రోలంబంబులలీలన్ = తుమ్మెదలవలె, (రోలంబో బంభరశ్చసః - అ.) వియోగిలోకంబులు = విరహిజనములు, విషయ = ఇంద్రియసుఖములయందు, విముఖంబులయ్యెన్ = (గ్రీష్మతాపము చేత) ప్రతికూలములయ్యెను.

తుమ్మెద, సంపెంగతావినిసహింపలేదనుట ప్రసిద్ధము. (వసు2-47 మొ॥)

అలం :— ఉపమ.

(viii) ఇసుకమెదువు నెలవులన్ = ఇసుకచేత మృదువయిన ప్రదేశములందు, పన్నిన = నిర్మించిన, పసపుటాకుంజప్పరంబుల లోనన్ = పసుపుంబచ్చనియాకుల (పండుటాకుల) పందిరి భేదముల (చప్పరము - ఒక రకము పందిరి పేరు) లోపలిభాగములందు, గుప్పళించిన = వ్యాపించిన, కప్పురంబుతోడికురువేరుపరిమళంబును = కర్పూరముతోఁగూడుకొనిన హ్రీబేరముయొక్క సుగంధమును, (హ్రీబేర వాచకముగఁబొసఁగుఁగురువేరనంగ - ఆం. భా) పాదిరి = కలిగొట్టుయొక్కయు, (పాటలిచెలంగుఁగలిగొట్టుపాదిరియన-ఆం భా.) జాజి = జాజియొక్కయు, విరుల = పుష్పములయొక్క, వలపును = సువాసనయు, వట్టివేళ్ల = ఉశీరములయొక్క, వాసనలున్‌కల = గంధములును గలిగిన, ప్రపాపాలికా = చలిపందిళ్లయందు, బాటసారులకు నీళ్ళు పోయుస్త్రీలచేత, అపవర్జితంబులగు = ఈయఁబడినవగు - పోయఁబడినవగు, కలశఉదకంబులు = కడవనీళ్ళు, క్రోలి = పానముచేసి, సేదదేటి = అలసటనుండితెప్పిటి, తెరువరులు = బాటసారులు, తాలవృంత = విసనకఱ్ఱలయొక్క; అనిలంబులన్ = వాయువులను; బలుపుకొలిపి = అతిశయింపఁజేసి, మున్ను = మునుపు, పరిక్షీణంబులగు = కృశించినవగు, ప్రాణపవనంబులన్ = ప్రాణవాయువులను, పోసరింపన్ = సమృద్ధములగునట్లు, చేసిరి = ఒనర్చిరి. (హాయిగాగాలిపీల్చుకొనిరనుట) తాత్కాలంబునన్ = ఆసమయమునందు. (మీఁదిపద్యముతోనన్వయము.

క॥ ఆపద్మినిదినకరకర
తాపమునకు నోర్చిఘోరతప 1 మొనరించెన్
శ్రీపతియడుగుల గొడుగుల
ప్రాపొద 2 వెనయేనిదాప భరమేలంటున్. 17

వ్యా :— ఆపద్మిని = ఆ పద్మినిజాతిస్త్రీ - ఆరాధాదేవి, (పద్మినీస్త్రీవిశేషేస్యాత్సరస్యాంమంబుజేఽపిచ - విశ్వ) దినకర = సూర్యునియొక్క, కర = కిరణములయొక్క, తాపమునకున్ = వేడిమికి, ఓర్చి = సహించి, ఘోర = భయంకరమయిన, తపము = తపస్సు, ఒనరించెన్ = ఆచరించెను. శ్రీపతి = శ్రీహరియొక్క, అడుగుల = పాదములయొక్క - పాదములతాదాత్మ్యముగల గొడుగుల = ఛత్రములయొక్క, ప్రాపు = అండ, ఒదవెనయేని = లభించుటయే జరిగినయెడల, తాపభరము = (సంసార) తాపాతిశయము, ఏల = ఎందులకు, అంటున్ = చెందును.

సంసారతాపమునుబోఁగొట్టఁగలుగునవి శ్రీపతియడుగులేగాని, గొడుగులుకావు. కావున నుపమానమగుగొడుగులకు, నుపమేయమగు శ్రీపతి యడుగులతోఁదాదాత్మ్యము గ్రాహ్యము.

పద్మిని - పద్మిని, చిత్రిణి, హస్తిని, శంఖినియనునవి కామశాస్త్రప్రసిద్ధములగు స్త్రీభేదములు.

వ్యాక :— అడుగులగొడుగుల - ఇటయొక్క షష్ఠియుపమానోపమేయభావములతాదాత్మ్యరూపసంబంధబోధకము. ప్రయోగాంతరము - "రాలెనొయ్యనవడగండ్లపాలపండ్లు" (ఆముక్త 4.82)

అలం :— పరిణామము.

---

17 ప :- 1 మొనరించున్ - గ, త, గొ; మొనరించెన్ - ర, అ 2 వినవారి - ముద్రి (అ); ర; వినయేని - అ; వినెయేని - గొ.

తే॥ ఇట్టులత్యుగ్రముగగ్రీష్మ 1 మేనరేఁగి
కాలవశమునఁదనుఁదాన 2 డీలుపడియెఁ
బెచ్చు 3 పెరుఁగెట్టిదియు 4 హెచ్చిపేర్చు టెల్ల
ప్రగ్గుటకెయనిలోకోక్తి చాటుఁగాదె.! 18

వ్యా :— ఇట్టులు = ఈ విధముగా, అతిఉగ్రమగు = మిక్కిలితీక్ష్ణమయినదగు, గ్రీష్మము = గ్రీష్మర్తువు, ఏసరేఁగి = అతిశయించి, కాలవశమునన్ = కాలాధీనతచేత, తనుఁదాన = తనకుఁదానే, డీలుపడియెన్ = క్షీణించెను. పెచ్చుపెరిఁగి = విజృంభించి, ఎట్టిదియు = ఎటువంటిదయినను, హెచ్చి = అతిశయించి, పెర్చుట ఎల్లన్ = వర్ధిల్లుటయంతయు, ప్రగ్గుటకెఅని = తగ్గుటకేయని, లోకోక్తి = సామెత, చాటుఁగాదె? = ప్రకటించునుగదా !

పాఠ :— తీలు - అను 'అ' ప్రతిపాఠమునరికాదు. నరళములకుఁబరుషములు వ్రాయుటవ్రాఁతప్రతులలేఖన సంప్రదాయము. డీలు - అను రూపాంతరమునుబట్టి యిది "దీలు" గాని, 'తీలు" కాదు.

క॥ దీప 1 ముడుగఁజీకటియును
గోపముడుఁగశాంతగుణముఁగోల్కొను క్రియనా
టోపోద్భటమగువేసవి
కైపు 2 సడిలఁదోఁచెఁగారుకాలము దళమై. 19

---

18 ప :- 1 మెసఁగరేఁగి - క, గ, త, గొ; మేసరేఁగి - అ, ర. 2 తీలు-అ; దీలు - ర; చీలు-గొ. 3 వెరుగె - ముద్రి (అ); పెరుగె — ర; పెట్టుపెరుగె — త, 4 హెచ్చు-ముద్రి (అ); హెచ్చి - ర, అ.

19 ప :- 1 మఱఁగ - త, ద, బ, గొ; ముడుఁగ - ర, అ. 2 సడలితో-గ; సడిల - ర, అ, గొ.

వ్యా :— దీపము = దివ్వె, ఉడుగన్ = అటిపోఁగా; చీకటియును = తమస్సును, కోపము = కినుక, ఉడుగన్ = తీఱఁగా. శాంతగుణమున్ = శాంతస్వభావమును, కోల్కొనక్రియన్ = వర్ధిల్లునట్లు, అటోప = ఉద్ధతిచేత, ఉగ్భటమగు = గొప్పదయిన, వేసవి = గ్రీష్మముయొక్క, కైపు = విజృంభణము, సడలన్ = తగ్గఁగా, కారుకాలము = వర్షర్తువు, దళమై = అతిశయించినదై, తోఁచెన్ = ప్రాపించెను.

కైపు — ఇది 'కైఫ్' అనునరబ్బీసంబంధిపదము కాదనియు, దేశ్యమనియు, మూలద్రావిడధాతువుకయ్ — అని యునందురు. (తూ. దో - సాహితి 1962)

సడిలు — అను ఇత్వమధ్యమునుగలదు. (కాళహ 4-12 - ము. కా. ప్రకీర్ణక)

అలం :— ఉపమ

క॥ ఆకాశతత్త్వ 1 తనుఁడగు
కాకోలగ్రీవుకంఠకాళిమయనఁగాఁ
గోకిలనీలముజలధర
పాకముపర్యాయవృద్ధిఁబ్రబలఁ 2 దొడంగెన్. 20

వ్యా :— ఆకాశతత్త్వతనుఁడగు = ఆకాశతత్త్వము శరీరముగాఁగలవాఁడగు; కాకోలగ్రీవు = కాలకూటవిషముకంఠమునందు గలవానియొక్క - భీముఁడను శివమూర్తిభేదముయొక్క, కంఠ = కుత్తుకయందలి, కాళిమ = నల్లఁదనము, అనఁగాన్ = అనునట్లు,

20 ప :- 1 రుండగు - గో; తనుఁడగు - ర, ట. 2 దొణంగెన్ - గో; దొడంగెజ - ర, ట.

కోకిలనీలము = పికమువలెనల్లనయిన. జలధరపాకము = మబ్బుపిల్ల, (పాకౌపచనశాబకౌ - త్రి. ని.) - స్వల్పపరిమాణముగలమబ్బు, పర్యాయవృద్ధిన్ = క్రమక్రమాభివృద్ధిచేత, ప్రబలందొడంగెన్ = వర్ధిల్లమొదలిడెను.

ఆకాశతత్త్వతనుఁడు - ఆకాశముసాంఖ్యదర్శన ప్రసిద్ధములగు తత్త్వములలో నొకటి. (చూ. 2-8 వ్యాఖ్య)

ఆకాశము శివునియష్టమూర్తులలో నొకటి.

"క్షితిర్జలంతథాతేజో, వాయురాకాశమేవచ
యష్టార్కశ్చతథాచంద్రః, మూర్తయోష్టౌపినాకినః" (శబ్దస్తో)

శివుఁడష్టమూర్తి. ఈయష్టమూర్తులు ప్రత్యేకమూర్తిభేదములనుట తంత్రశాస్త్రప్రసిద్ధము. "ఆకాశమూర్తిర్భీమః ఇతితంత్రశాస్త్రమ్" (శబ్దార్థ) ఈ భీమశబ్దవాచ్యుఁడగు శివుఁడు దాక్షారామభీమేశ్వరుఁడు కావచ్చును. "త్రైలోక్యభీమంబుఁగాఁలకూటముమ్రింగి, కైకొంటిభీమాఖ్యఁగాలకంఠ" (భీమ 4-72)

అలం :— ఉపమ.

సీ॥ 1 తళుకుతళుక్కనఁదాటించెఁబలుమాఱు
2 నీరాళ్ల గొందిఁగన్ని యమెఱుంగు
3 పౌరస్త్యపవనసంపాతజాత 4 ప్రీతి
5 నివిరిసన్రమాఁకులకెలమివచ్చెఁ
బ్రిథమోదబిందుసంభారంబుమందునూ
వియయ్యెఁబగిలిననేలమేని

---

21 ప :- 1 ఢళుఢళుక్కననింగి - ముద్రి (అ): ర: తళుకుతళుక్కన-అ, 2 నీరాడ - క; నీరాళ - త; నీరాళ్ల - ర; నీరాళ్ళ - అ. 3 పౌలస్త్య-ముద్రి (అ) క, ర, గ; పౌరస్త్య - అ. 4 స్ఫూర్తి-ప; ప్రీతి - ర, అ. 5 నివిరన్రమాఁకులకెల్ల - క, త; నివురు - చ; నివిరినన్రమాఁకుల - ర, అ.

కుఱుము 6 మంతరసానియునుబో లెఁగనుపించెఁ
దోరంపుమణులవిదూరభూమిఁ

తే॥ గెరలినకిలించెషణ్ముఖు 7 మఱువమూపు
పరిమళముచూచెఁగరిగుప్కపల్వలంబుఁ
గడిమిఁగిరించెఁ 8 గ్రాఁజవంగడమునవిచె
నఖిలహితమైనమేఘోదయంబునందు. 21

వ్యా :— అఖిలహితమైన = ఎల్లరకుమేలుచేయునదియగు
మేఘఉదయంబునందున్ = వర్షర్తువునందు —

(1) తళుకుతళుక్కనన్ = తళుతళుక్కుమని (ఇదిమెఱుపుట
యందగుననుకరణశబ్దము) కన్నియమెఱుంగు = క్రొత్తమెఱపు -
తొలకరిమెఱుపు, నీరాళ్ల గొందిన్ = ఈశాన్యపుమూలయందు, (సూ.ని.)
పలుమాఱు = పెక్కుసార్లు, లాటించెన్ = నాట్యమాడెను.

(2) పౌరస్త్యపవన = తూర్పునందుఁబుట్టినగాలియొక్క (పౌరస్త్య=
పురోభవః .... పూర్వదిగ్భవః - శబ్దక) సంపాత = పడుటవలన -
ప్రసారమువలన, జాత = కలిగిన, ప్రీతన్ = ప్రియముచేత, ఇవి
రిన = ఎండిన, మ్రాఁకులకున్ = చెట్లకు, ఎలమివచ్చెన్ = పెంపు
కలిగెను.

---

6 మఁతుర – ర, గొ; మం(తు)ర - అ. 7 మరుత - అ, గొ
మఱువ - ముద్రి (అ). ర. 8 కాజ - ప; చెఁగ్రాజ-ముద్రి(అ)
చెఁగ్రాజ - ర, అ, గొ; గ్రోఁజ – గ. "కరంజశబ్దభవముగ్రాజ.
కాఁబోలు - కానుగు - ఇదికాఁవ. కాఁజ - అనిగూఢమారినట్లు
న్నది. కాఁడపూవులు – అనినన్నె. కుమార 64-4" - అ.
(అధోజ్ఞాపిక)

వక్షస్థ్సవున(దూర్పు గాలివీచును -- "తత్రవర్షానుపూర్వోవాయుః పురోవాతాహతాత్ప్రావృట్, పశ్చాద్వాతాహతాశరత్ - ఇతి" (కావ్యమీ)

3) ప్రథను = మొదటిదయిన, ఉదబిందు = జలకణముల యొక్క, సంభారంబు = సమూహము (సంభారఃసంభృతౌసంఘే- మే. ని.) - తొలకరిజల్లు. పగిలిన = చీలిన, నేలకున్ సికిన్ = పుడమి యొడలికి - భూమియుపరిభాగమునకు, మందునూనియయయ్యెన్ = మందుకలిపిన తైలమయ్యెను. (తొలకరిజల్లులచేత, నేలపైభాగము నందలి పగుళ్లుపూడెననుట. ఒడలిపగుళ్లు పూడుటకు నూనె రాచుట యాచారము.)

"ప్రథమోదబిందుసంపర్కంబుపుడమిపై, బొక్కులం(ప(గ(ద్రైల పూరమయ్యె'' (ఉ. నా. 4-3) అనుదానికిదియనుస్మృతి.

వ్యాక :— ఉదబిందు - ఉదక + బిందు. ఉదాదేశముసమాశ్రయవిధి. (సి. కౌ. 998 సూ) దీనివలంకి, ఉదశబ్దము ప్రత్యేకపద ముగానేర్పడెను. "ఉదమ్ = జలమ్ - ఇతి శబ్దరత్నావళీ" - శబ్దక. (శాళహ 2-132)

అలం :— రూపకము.

(4) ఉఱుము = మేఘగర్జన, తోరంపుమణుల = అధికముల యినరత్నములయొక్క (రత్నములతో(గూడిన - అనుట) విదూర భూమిన్ = విదూరం పర్వతప్రదేశమునందు, మంతరసానియును పోలెన్ = మంత్రసానివలె, కనుపించెన్ = తో(చెను.

మేఘగర్జనకు విదూరపర్వతమునందు వైదూర్యమణులుపుట్టును. కాన, నుఱుమునుమంత్రసానితో(బోల్చుట. "విదూరభూమిర్నవమేఘ శబ్దా, దుద్భిన్నయారత్నశలాకయేవ'' (కు. సం. 1-24)

వ్యాక :— మంతరసాని = మంతరముచేయుసాని. మంత రము = ప్రసవోపాయము. సాని - స్వామినీశబ్దభవము, స్త్రీవాచకము. ముదుసలిసాని (ఆది 7-221) లక్కసాని = లక్కమ్మ (భాగ. పీఠిక)

అలం :— ఉపమ.

షణ్ముఖు = కుమారస్వామియొక్క, మఱువ = మఱుఁగయిన వాయిగల- (అప్పటివఱకు) మూఁగయయిన, మావు = వాహనము- నెమలి, కెరలి = విజృంభించి, సకిలించెన్ = హేషాధ్వనిచేసెను - క్రేంకారముచేసెను. (కూసెననుట)

మఱువమావు - నెమలివర్షర్తువుననేకూయును. తక్కిన ఋతువులలో మూఁగగానుండును. "వర్షాస్వేవమయూరాణాంరుతంనృత్తంచ వర్ణయేత్" (కవికల్ప) ఇది "పెక్కుకాలపుమూఁగ" (= కోయిల. ఇది వసంతముననేకూయును.) అనుప్రయోగమువంటిది. (వసు 3-134)

వ్యాక :— మఱుఁగు+వాయి = మఱువ - బా. సమాస 25.

కరి = ఏనుఁగు, శుష్క = ఎండిన, పల్వలంబున్ = పడియను, పరిమళముచూచెన్ = మూచూచెను. కడిమి = కదంబ వృక్షము, చిగిరించెన్ = చిగిర్చెను. క్రాఁజ = క్రాఁజమొక్కల యొక్క, వంగడము = వంశము, ననిచెన్ = పుష్పించెను.

క్రాఁజ = క్రాఁజ. పునుకల్చూచినకాజగడ్డలు ఫజల్పొర్వారు కాజాకులే, మనౌజాబిలికాజపూవు -- ఢిల్లీభోగముల్చేసినీ, వనెదన్ మాపితృపాదులమ్మనిపాలఁబొదిపువిశ్వేశ్వరా" (మాస్వామి) అను కీ. శే. విశ్వనాథవారి ప్రయోగమునుబట్టి కాఁజమొక్కవాలములలో మొలచునొకరకముమొక్కయని తెలియునగును. "వెవివమ్మికాశిపువ్వులు

"ముడుంగ (పా॥జా 2-50) అను పాఠము, శ. ర. లోఁగలదు. ఇటుఁగూడ, 'కాఁక' సాధుపాఠమనఁదగును. "పర్వపుంగ్రాఁక పూవుల్ దొరఁగింపంబుప్పాడుల్". (ఉ. నా. 4-8)

తే॥ కాఁకచిచ్చనుభృగురాముకారణమునఁ
1 బెటిలినిర్వంశమైన భూభృత్కులంబు
క్షేత్రములవంశవృద్ధిరాజిల్లెమఱియు
జలధరోదయవిప్రప్రసాదలబ్ధి. 22

వ్యా :— కాఁకచిచ్చు = దావాగ్ని, అను = అనెడు, భృగురాము = భృగువంశీయుఁడగు రామునియొక్క - పరశురాముని యొక్క, కారణమునన్ = హేతువుచేత, పెటిలి = భేదిల్లి, నిర్వంశమైన = వెదుళ్ళులేనివయిన - అని పర్వతపక్షమునర్థము. (వంశే -- వేణుమస్కరతేజనాః - అమ) నిర్వంశమైన = నిష్క్రాంతమయిన (గతించిన) పుత్త్రపౌత్త్రాదివర్గముగలదైన - అని క్షత్త్రియవంశపక్షమున నర్థము. భూభృత్కులంబు = పర్వతములసజాతీయ సమూహము యొక్క, క్షేత్రములన్ = స్థానములయందు (ప్రదేశములయందు) అని పర్వతపక్షమునర్థము. భూభృత్కులంబు = రాజవంశములయొక్క (భూభృద్భూమిధరేనృపే - అమ) క్షేత్రములయందున్ = భార్యల యందు, (క్షేత్రంపత్నీ - అమ) - అని క్షత్త్రియవంశపక్షమునర్థము. జలధరోదయ = వర్షర్తువనెడు, విప్రప్రసాద = బ్రాహ్మణానుగ్రహము యొక్క, లబ్ధిన్ = ప్రాప్తిచేత, మఱియున్ = వెండియు, వంశ = వెదుళ్ళయొక్క, వృద్ధి = అభివృద్ధి, రాజిల్లెన్ = ఒప్పెను - అని పర్వతపక్షమునర్థము. వంశ = కులముయొక్క, వృద్ధి = అభివృద్ధి, రాజిల్లెన్ = ఒప్పెను - అని రాజవంశపక్షమునర్థము.

---

22 ప. - 1 బెదిరి - గొ, బెటిలి - ర, అ.

పరశురామునిచే రాజవంశములు నిర్వంశములుకాఁగా మరల బ్రాహ్మణులవలన నియోగవిధినే క్షత్రియస్త్రీలయందు సంతతిగలిగి వంశవృద్ధిజరిగెననుమహాభారతకథయిట ననుసంధేయము.

అలం :— శ్లేషానుప్రాణితమగురూపకము.

తే॥ ప్రబల వడగండ్లు నిందగోపముల జంబు
ఫలములున బొల్చెఁబచ్చికపట్టులందు
వనధినీరాన [1] దొరల నమ్మణులనెల్ల
నంబు [2] దంబులు వెలిగ్రాసెనఱుగకనఁగ. **23**

వ్యా :— వనధినీరు = సముద్రజలమును, అనన్ = క్రోలఁగా, దొరలు = దొరలిన - ఆసముద్రజలముతోపాటుగఁగడుపు లోనికిఁబ్రవేశించిన, అమ్మణులనెల్లన్ = ఆ రత్నములనన్నింటిని, అంబుదంబులు = మేఘములు, అఱుగక = జీర్ణముకాక, వెలిగ్రా సెన్ = బయటికినుమిసెనో, అనఁగన్ = అనునట్లు, ప్రబలు = వర్ధిల్లు, వడగండ్లున్ = వర్షోపలములును. ఇందగోపములున్ = అరుద్ర పురుగులును, (ఇంద్రగోపస్త్వగ్నిరజః - అభి. చిం.) జంబుఫలము లును = నేరేడుపండ్లును, పచ్చికపట్టులందున్ = శాద్వలములయందు, పొల్చెన్ = గోచరించెను.

వడగండ్లుమేఘములువమనముచేసిన ముత్యాలవలెను, ఆరుద్ర పురుగులుకెంపులవలెను, నేరేడుపండ్లునీలములవలెను, గోచరించెనని భావము.

"పటుపురఃపవనాధిగతభ్రమాః జలముచః కరకోపలకైతవాత్ సలిలరాశిపయస్సహపాషితా, ముదవమన్నివమౌక్తికసంహతిమ్" (మధురా) అను శ్లోకమునకిదియనుస్మృతి.

---

23 ప :- 1 దెరలు - డ ద, బ; దొరలు - ర, గ; ఁదొవలు - అ.
2 దంబులెల్లగ్రోసెవరగ-త; దంబులువెలిఁగ్రాసెనఱుగకనఁగ-క,జ.

ఛం :— 3వ, పాదమున నుభయప్రాసలక్షణమునకు భిన్న మగునణప్రాసయతిప్రయుక్తము. ప్రయోగాంతరములుగలవు. 'అణఁచు నదిదంభముజ్జగించునదియార్ష్య' (కాశీ 7-120) మొ॥

జంబు - అఁదూర్ధ్వంభూజంబూ కఫేలూ కర్కంధూదిధిషూః - జంబూః -- బాహుళకాద్ధ్రస్వోపిజంబుః" (సి. కౌ. ఉణా 93) జంబుఫలమ్ - కిరాతా 10-22.

అలం :— ఉత్ప్రేక్ష

తే॥ మోవిచెలువంబుగేదంగి 1 పూవురేకు
సోయగము 2 చూపుకన్నులసొబగుఁజికుర
బర్హిబర్హప్రభయుఁజూపిప్రతిఘటించె
నంబుధరకాలసౌభాగ్యమంబుజాక్షి. **24**

వ్యా :— అంబుజాక్షి = పద్మనేత్రి - ఆ రాధాదేవి, మోవి = ఓష్ఠమనెడుమోవిపువ్వుయొక్క, చెలువంబున్ = సౌందర్యమును, గేదంగిపూవురేకు = (తెల్లని) కేతకీపుష్పదళముయొక్క, (తెలిమొగలిపూరేకయొక్క) సోయగము = అందమును, చూపు = ప్రకటించు, కన్నుల = నేత్రములయొక్క - చూపులయొక్క, సొబగున్ = చెలువును, చికుర = కేశములనెడు, (చికురః కుంతలో వాలఃకచః కేశశ్శిరోరుహః - అమ) బర్హిబర్హ = నెమలిపింఛముయొక్క, ప్రభయున్ = కాంతియును, చూపి = కనఁబఱిచి, అంబుధరకాల = వర్షర్తువుయొక్క, సౌభాగ్యము = సుభగత్వమును, (చక్కఁదనమును) ప్రతిఘటించెన్ = ఎదిరించెను - సరిపోలెను.

---

24 ప :- 1 పువ్వు - గ; పూవు - ర, అ. 2 నూపు - ర; చూపు - అ.

గేదంగిపూవు - ఇటఁదెల్లపువ్వులమొగలిచెట్టునే గ్రహింపవలెను.

(i) చదలుగేదఁగితూర్పుతుదకొమ్మనరవిరి
యై కానుపించుపూరేకులనఁగ - పారిజా 2-38
(వెన్నెలవర్ణన)

(ii) నవ్వునట్లల్లవిచ్చెఁ, గలయమూతులు కేతకీ
గహనతతులు - ఆము: క్త 4-94.

అలం :— రూపకానుప్రాణితమగునుపమ.
(ప్రతిఘటించు - ఉపమావాచకము)

క॥ 1 సలిలప్రవృద్ధ 2 జలధర
ములుపూనినయూఁతకోలమొత్తములక్రియన్
దొలువానకాళులెసఁగెన్
గలహంసకులంబులెల్లఁ 3 గలఁగంబడఁగన్. 25

వ్యా :— సలిల = నీటిచేత, ప్రవృద్ధ = బాగుగా వృద్ధి పొందిన - అని యర్థము, సలిల = నీటిచేత - శరీరమునకు నీరుపట్టుట చేత, ప్రవృద్ధ = మిక్కిలిముసలివయిన - అని యర్థాంతరము. (ముదుసలివారిదేహములకు నీరుపట్టును.) జలధరములు = మేఘములు పూనిన = తాల్చిన, ఊఁతకోల = (ముసలివారుచేతఁదాల్చు) అలంబనయష్టుల యొక్క (ఊఁతకఱ్ఱలయొక్క) మొత్తములక్రియన్ = సమూహములో యనునట్లు, తొలువానకాళులు = మేఘములయందుఁ గాళ్లవలెఁగనబడునట్లు తొలకరివర్షధారలు, కలహంసకులంబులెల్లన్ =

---

25 ప :– 1 సలిలంపువృద్ధ - ముద్రి (అ); ర; గొ; సలిలప్రవృద్ధ - అ.
2 బల - డ, ద, బ; బలి - ద; జలధర - ర, గొ; జలచర - అ.
3 గలఁకం - ర; గలఁగం - అ.

రాజహంసల సజాతీయసమూహములన్నియు, కలఁగంబడఁగన్ = వ్యాకులపడఁగా, ఎసఁగెన్ = ఒప్పెను.

మేఘహంసలవిరోధము కవిసమయప్రసిద్ధము. "నవజలధరరవ భయచకితకలహంసకుల" (కావం) "రాయంచలగుంపులు బెదరు --- ప్రథమజలధరారవమెసఁగెన్" (హరి. పూ. 6-197)

అలం :— శ్లేషానుప్రాణితమగునుత్ప్రేక్ష.

శా॥ ఆద్రిగ్రావములుర్విరాలఁ 1 బవిఘోషాడంబరంబుల్ వియో
గిద్రోహం 2 బొనరింప, వారినిధికెంగేలంటఁగా వాహినుల్
భద్రేభప్రతిమానమూర్తియగుచుంబాథోధరశ్రేణికిం
బ్రద్రోణంబులు గుమ్మరించెవిమలాంభఃపూరధారావళిన్. **26**

వ్యా :— అద్రిగ్రావములు = కొండరాళ్ళు (పాషాణప్రస్తరగ్రావోపలాశ్మానశ్శిలాదృషత్ - అమ) ఉర్విన్ = భూమియందు, రాలన్ = దొఁలిపడఁగా, పవి = వజ్రాయుధములయొక్క -పిడుగుల యొక్క, ఘోష = ధ్వనులయొక్క, ఆడంబరంబుల్ = విజృంభణములు, వియోగిద్రోహంబు = విరహులయొక్క హింసను, ఒనరింపఁగా, వాహినుల్ = నదులు, వారినిధి = సముద్రునియొక్క, కెంగేలు = ఎఱ్ఱనిచేతిని, అంటఁగాన్ = గ్రహింపఁగా - నదులు సముద్రసంగమముచేయఁగా, భద్ర+ఇభ = భద్రజాతియేనుఁగులతో, ప్రతిమాన = సాటియయిన, మూర్తియగుచున్ = ఆకృతిగలదియగుచు, పాథోధర = మేఘములయొక్క, శ్రేణి = వరుస, విమల = స్వచ్ఛమయిన, అంభఃపూర = జలప్రవాహముల యొక్క, ధారావ

---

26 ప :- 1 బల - డ, ద, బః బలి - ద, ర; బలి - అ, గొ. 2 బునొనర్చ - ప, గొ; బొనరింప - ర, అ.

శిన్ = ధారలవరుసను, కుంభద్రోణంబులు = కుండలు గాఁదూము లుగా (కుండలతోను దూములతోను బోయుచున్నట్లుగా - అనుట) కుమ్మరించెన్ = మిక్కుటముగా వెలువరించెను. (మిక్కుటముగా వర్షించెననుట)

కుంభద్రోణము - కురిసెఁగుంభద్రోణముగవృష్టిబలుమొగిళ్ళు - ఉ. నా. 4-8

క॥ పాపటతెరువునడిగి, నా
సాపుటముక్తాఫలప్రచారంబై, రా
ధాపృథువక్షోరుహముల
పైపైఁబ్రథమోదబిందుపటలము 1 నిగిడెన్. **27**

వ్యా :— ప్రథమ = మొదటిదయిన, ఉదబిందు = జల కణములయొక్క, పటలము = సమూహము - తొంకరివర్షబిందు సమూహము, పాపట = సీమంతముయొక్క, తెరువునన్ = మార్గ మునందుండి, (సీమంతరేఖనుండి - అనుట) డిగి = దిగి, నాసా పుట = ముక్కుచెరమలందు, ముక్తాఫల = శుక్తినుండిపుట్టిన ముత్య ముయొక్క. (ముక్తాఫలంశౌక్తికేయమ్ - వై ని) ప్రచారంబై = అధికమయినయాచరించుటగలదై, (ముక్కుపుటములందు ముత్యము వలెనున్నదై - అనుట) రాధా = రాధాదేవియొక్క, పృథు = పెద్ద వయిన. వక్షోరుహముల = స్తనములయొక్క, పైపైన్ = మీఁదు మీఁదుగా, నిగిడెన్ = వ్యాపించెను - సాగెను.

ఈ పద్యమున రాధాదేవితపస్సమాధియందున్న నిశ్చలస్థితియు, నామెసౌందర్యమును వ్యంజితములగుచున్నవి.

---

27 ప :- 1 నిలిచెన్ - ర, నిగిడెన్ - ర, గా.

"నాసాగ్రన్యస్తనయనః, సంవృతాస్యః సునిశ్చలః
ధ్యాయీత మనసా దేవ, మురో విష్టభ్య చాగ్రితః".

అనఁగాఁ, జూపులను నాసాగ్రమునందు నిలిపి, నోరును మూసి, ఱొమ్మును ముందుకుఁ జాఁచి, కదలకుండఁ గూర్చుండి, దేవుని మనస్సున ధ్యానింపవలెనని యర్థము.

పాపట తెరువునడిగి నాసాపుటమునందుఁ బ్రథమోదబిందుపటలము ముత్యమువలె నాచరించెననుటచే నామె సునిశ్చలస్థితివ్యంజితమగుచు న్నది. వక్షోరుహములపైపై - అనుటచే నోరుమూసికొనియున్న స్థితి గమ్యమగుచున్నది. (నోరు తెఱచియున్నచో నీటిబిందువులు నోటిలో నికిఁ బోయియుండును.) వక్షోరుహములపైపై -- అనుటచేతనే ఱొమ్ము ముందుకుఁ జాఁచియున్న స్థితియు గమ్యమగుచున్నది. పైపైనిగిడెన్ - అనుటచేఁ బ్రథమోదబిందు పటలము క్రమముగా వళులయందు స్ఖలిత ములై, నాభియందుఁ బ్రవేశించుట సూచితమగుచున్నది. ప్రథమోద బిందుపటలము - అనుచోఁ బ్రథమశబ్దము బిందువుల విరళత్వమును, పటలశబ్దము నాతివిరళత్వమును ద్యోతకము చేయుచున్నవి.

పాపటతెరువున - అనుచోఁ దెరువుశబ్దము వలనఁ బాపటయొక్క స్ఫుటరేఖాత్వము వ్యంజితమగుచున్నది. నాసాపుటము క్తాఫలప్రచా రంబై - అనుటచే, ముత్యము చేతఁ బ్రకాశించునట్లు నీటిబిందువు చేతఁ బ్రకాశించుట నాసాసౌందర్యద్యోతకము. (కిముపహి మధురాణాం మండనం నాకృతీనామ్ - అభిజ్ఞా) దీనివలన నాసాపుటముల సమున్నతత్వ మును గమ్యమగును "సమున్నత పుటానాసా లఘుచ్ఛిద్రా శుభావహా" (సాముద్ర) పృథువక్షోరుహముల - అనుచోఁ బృథుశబ్దము చేత స్తన ముల సమపీనత్వము ధ్వనితమగును. 'వక్షోరుహ' లోని ఓత్వము స్తనో న్నత్యసూచకము.

ఈపద్యము క్రింది కాళిదాసశ్లోకమున కనువృత్తి.

"స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధనిపాతచూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోదబిందవః" (కు. సం. 5-24)

పద్యవ్యాఖ్యానము పైకాళిదాసశ్లోకమునకప్పయదీక్షితులువారు చేసిన వివరణమున కనుగుణముగాఁజేయఁబడెను.

వ్యాక :— ఉదబిందు - చూ 4-21 వ్యాఖ్య.

అలం :— లుప్తోపమ, పరికరము.

సీ॥ పెరిఁగిసూచి 1 ముఖభేద్యంబులగుసంధ
కారధారాచ్ఛటల్ గారుకొనినఁ
గర్ణజ్వరాపాదకంబులై దంభోళి
గంభీరరవములు గడలుకొనిన
ముజ్జగం 2 బులముచ్చముణఁగింపఁగాజాలు
నీఁదగాడుపులు 3 బిట్టెదురుకొనిన
దుర్దమకర్దమస్తోమసంఛన్నభూ
ములసోనవానలుముంచుకొనినఁ

తే॥ జెవర 4 కఱకాలఁగన్నువచ్చిన విధాన
నాథసంకేతములకేగునడికిరేలు
కాయసంభవబాధానహాయమగుచు
స్వైరిణీకోటినిర్భయస్వైరధాటి. 28

---

28 ప :- 1 ముఖాభేద్య - ముద్రి (అ): ర; ముఖభేద్య - అ, గొ.
2 బులు - గొ; బుల - ర, అ. 3 బెట్టె - క, త; బిట్టు ర, అ.
4 కటుకాళ్ళ - ప; కఱకాళ్ల - ర, అ.

వ్యా :— కాయసంభవ = అంగజునియొక్క, (మన్మథుని యొక్క) బాధా = పీడనమే - మదనతాపమే, సహాయమగుచున్ = తోడుగలదిగానగుచు, నిర్భయ = భీతిలేని, స్వైర = స్వేచ్ఛతోఁ గూడుకొనిన, ధాటిన్ = దాడితో - విచ్చలవిడి సంచారములతో, స్వైరిణీకోటి = కులటలయొక్క సమూహము (స్వైరిణీ పాంసులా చస్యాత్ - అమ)

1) పెరిఁగి = వృద్ధిపొంది, సూచీ = సూదియొక్క, ముఖ = మొనతో, భేద్యంబులు = భేదింపఁదగినవి, అగు = అయిన, అంధకారధారా = చీకటిపరంపరయొక్క, ఛటల్ = సమూహములు, (ఛటా = సమూహః - శబ్దక) కారుకొనినన్ = అతిశయించినను.

చీకటినిసూచీముఖభేద్యమనుట కవిసమయప్రసిద్ధము.

"అసతోऽపిద్రవ్యస్యనిబంధనంయథా —

ముష్టిగ్రాహ్యత్వంసూచీభేద్యత్వంచతమసః"

(కా. మీ.) పవలుఁబర్వెమహాంధకారములుపైపై సూచి నిర్భేద్యముల్" (శివరా 1. 90) మొ॥

2) దంభోళి = వజ్రాయుధముయొక్క - పిడుగులయొక్క, గంభీరరవములు = మంద్రధ్వనులు, కర్ణ = చెవులకు, జ్వరాపాదకంబులై = జ్వరమును గలిగించునవై - బాధాకరములై, కడలుకొనినన్ = అతిశయించినను.

3) ముజ్జగంబులన్ = మూఁడులోకములను, ముచ్చముణిఁగింపఁగాఁజాలు = మిక్కిలిముడుఁగునట్లుచేయ సమర్థములయిన, ఈఁదగాడుపులు = చలిగాలులు, బిట్టు = అధికముగా, ఎదురుకొనినన్ = తారసిల్లినను.

ముజ్జగంబులు - "స్వర్గమర్త్యపాతాళభేదా స్త్రీణిజగంతి ఇత్యేకే" (శా. మా)

ముణుఁగు + ముణుఁగు = ముచ్చముణుఁగు - బా. సంధి ...

4) దుర్దమ = అడఁపరాని, కర్దమ = బురదయొక్క, స్తోమ = సమూహముచేత, సంఛన్న = బాగుగాఁగప్పఁబడిన, భూములన్ = నేలలయందు, సోనవానలు = ఎడతెగకుండఁగొలఁదికొలఁదిగాఁగురియు వర్షములు, ముంచుకొనినన్ = మునుఁగఁజేసినను.

ముంచుకొను = ముంచు. స్వార్థమున "కొను" ధాతువు.

చెదరక = తప్పిపోక - దారితప్పక, అఱకాలన్ = పాదముయొక్క యడుగుభాగమునందు, కన్నువచ్చినవిధానన్ = నేత్రము పొడమినదోయనునట్లు, నడికిరేలు = అర్ధరాత్రములయందు, నాథ = పతులయొక్క - ఉపపతులయొక్క (విటులయొక్క) సంకేతములకున్ = సంకేతస్థలములకు, ఏగున్ = అరుగును.

వ్యాక :— నడికిరేలు = నడికిరేఁయందు, కాలవాచకములకుఁ బ్రథమ ప్రాయికము - బా. కారక 25

"చనుజారసంకేతమునకుఁబాంసులరేయిఁ, జినుకఁ పంకముఱుము చీకటునక" (ఉ. నా. 4-9) అనుదానికీపద్యము వివరణప్రాయము.

అలం :— విశేషోక్తి.

క॥ త్రిదశగురుప్రతిమానులు
నిదిపగలిదిరాత్రియనుచునేఱుపఱుపలే
రు, దళితహరినీలమణి
చ్ఛదనీలము మొగులునూర్వఁదందుఁ గ్రమ్మంగన్. 27

వ్యా :— దళిత = ముక్కలుచేయఁబడిన, హరినీలమణి = ఇంద్రనీలమణులవలెను, ధ్వవ = చీకటిమార్గమువలెను, (ధ్వక్షః పలాశే గరుతిగ్రంథిపర్ణ తమాలయోః - మే ది) నీలము = నల్లనిదియగు, మొగులు = మేఘము, సూర్యచంద్రులన్ = రవిశశులను, మ్రింగన్ = ఆచ్ఛాదింపఁగా, త్రిదశగురు = దేవతాగురువుతో - బృహస్పతితో, ప్రతిమానులున్ = సాటియయినవారును, (బృహస్పతివంటి బుద్ధి మంతులును - అనుట) ఇదిపగలు = ఇయ్యదిపవనము, ఇదిరాత్రి = ఇయ్యదిరేయి, అనుచున్ = అని, ఏఱుపఱుపలేరు=నిర్ణయింపఁజాలరు.

క॥ తరణిలయానంతరమునఁ
గరమమరుదిగంతములనుఖద్యోతంబుల్
మరలఁగఁదై జసస్పృష్టికిఁ
బరమాణుచయంబుగూడఁబడుచందమునన్. 30

వ్యా :— తరణి = సూర్యునియొక్క, లయానంతర మునన్ = అస్తమయముతరువాత, మరలఁగన్=వెండియు, తైజస = తేజస్సంబంధమయిన, స్పష్టికిన్ = సృజనకు, పరమాణుచయంబు = పిలువులసమూహము, కూడఁబడుచందమునన్ = ఒకచోటికిఁజేరునో యనునట్లు, ఖద్యోతంబుల్ = మిణుఁగురుపురుగులు, (ఖద్యోతో జ్యోతి రింగణః - అమ) దిగంతములన్ = దెసలయొక్క తుదలయందు, కరము = అత్యంతము, అమరున్ = ఒప్పును.

పరమాణుసంయోజనముచే సృష్టిజరుగునని కణాదునివైశేషిక దర్శనము చెప్పుచున్నది. రెండుపరమాణువులుకలిసి యొకద్వ్యణుక మగును. మూఁడుద్వ్యణుకములుకలిసి యొకత్ర్యణుకమగును. ఇట్లు ద్వ్యణుకాదిక్రమమున సృష్టిజరుగును. సృష్ట్యారంభమునఁబరమాణు సంయోగమునకదృష్టము హేతువని వైశేషికమతము. సృష్టికీశ్వరుఁడు

నిమిత్తకారణమునిన్యాయమతము. ఈశ్వరుఁడు నిమిత్తోపాదానకారణమని యద్వైతమతము.

కూడఁబడు = కూఁడు. స్వార్థమున 'పడు' ధాతువు.

అలం :— ఉత్ప్రేక్ష.

సీ॥ ఇంద్రచాపంబుగాదిదిమౌళి 1 తటమున
నవరించుబర్హిపింఛంబుగాని
భిదుర 2 ఘాతంబుగాదిదిపాంచజన్యసం
3 జాతగంభీరఘోషంబుగాని
యాశ్రయించినబలాకావళిగాదిది
హారిముక్తాహారయష్టిగాని
ఇదికోలమెఱుఁగుగా 4 దుదిరిబంగారంపుఁ
5 బనమిగ్రిమ్మెడుపచ్చపట్టుగాని

తే॥ వృష్టిగాదిదికరుణాంబువృష్టిగాని
నీలమేఘంబుగాదిదినీలవర్ణుఁ
డౌర! నాకుఁబ్రత్యక్షమయ్యెననుచు
హర్షపులకితతనువయ్యెనవ్వధూటి. 31

వ్యా :— ఇది = ఇయ్యది, మౌళితటమునన్ = శిరోభాగమునందు, (తటమ్ = ప్రదేశః - శబ్దక) నవరించు = ఒప్పు, బర్హిపింఛంబుగాని = నెమిలిపురిగాని, ఇంద్రచాపంబుగాదు = ఇంద్రధనుస్సుకాదు.

---

31 ప :- 1 తలమున - ముద్రి (అ), ర; తటమున - అ, గొ. 2 ఘోషం- ముద్రి (అ), ర; ఘాతం - అ. 3 జ్ఞాత - త; జాత-ర,అ. 4 దిదిరి - త; దుదిరి - ర, అ. 5 పసఁడి - త; బనిమి ర,అ.

(2) ఇది = ఇయ్యది, పాంచజన్య = పాంచజన్యమను పేరు గల కృష్ణుని శంఖమువలన, సంజాత = పుట్టిన, గంభీరఘోషంబు గాని = మంద్రిధ్వనిగాని, ఛిదుర = వజ్రాయుధముయొక్క-పిడుగు యొక్క, ఘాతంబుగాదు = ప్రహారముగాదు (పిడుగుపాటుకాదనుట)

(3) ఇది = ఇయ్యది, హారి = మనోహరమయిన, ముక్తా హార = పరిశుద్ధమగు ముత్యాలదండయొక్క, యష్టిగాని = పేఁటు గాని, ఆశ్రయించిన = (ఆకాశమును) ఆధారముగాఁగొనిన (ఆకాశ మున నెగురుచున్న - అనుట) బలాకా = తెల్లనిపెద్దకొక్కెరలయొక్క (బలాకాబిసకంఠికా - అమ; తెల్లకొక్కెరపెళ్లు - గురుబాల) ఆవళి గాదు = శ్రేణి (=వరుస) కాదు.

(4) ఇది = ఇయ్యది, ఉదిరిబంగారంపుఁబసిమి = మేలిమి సువర్ణముయొక్క పసుపువన్నె, క్రమ్మెడు - ప్రకటించెడు, పచ్చ పట్టుగాని = పీతాంబరముగాని, కోఁ మెఱుఁగుగాదు = నిలువుమెఱపు కాదు. (ఐరావతికాదు)

ఇది = ఇయ్యది, కరుణా = దయయనెడు, అంబువృష్టిగాని = జడివానగాని, వృష్టికాదు = వర్షముకాదు.

ఇది = ఇయ్యది, నీలమేఘుంబుగాదు = నల్లమబ్బుకాదు, నీలవర్ణుఁడు = కృష్ణుఁడు, ఔర = అహా! నామ్రోలన్ = నాయెదుట, ప్రత్యక్షమయ్యెననుచున్ = సాక్షాత్కరించెనని, అవ్వధూటి = ఆకాంత- ఆరాధాదేవి, హర్ష = సంతోషముచేత, పులకిత = గగుర్పాటుగలిగిన, తనువయ్యెన్ = శరీరముగలదియాయెను.

అలం :— అపహ్నుతి.

వ॥ ఇట్లనవరతధ్యానధారాపరివాహమగ్నహృదయయగు నా గగనా వలగ్నకు నిఖిలజగద్వలయంబును విష్ణుమయంబై తోఁచె నంతభక్త వత్సలుండగు శ్రీవత్సవక్షుండు. 32

వ్యా :— ఇట్లు = ఈ విధముగా, అనవరత = నిరంతరమైన, ధ్యానధారా = హృదయైకాగ్రతయొక్క పరంపరయ నెడు, పరివాహ= స్రోతస్సునందు, మగ్న = మునిఁగిన, హృదయయగు = మనస్సు గలదియగు, అగగనఅవలగ్నకున్ = ఆయాకాశమువంటి నడుముగల దానికి - అరాధాదేవికి, నిఖిల = సమస్తమయిన, జగద్వలయంబును= భూమండలమును. విష్ణుమయంబై = కృష్ణాత్మకమై, (విష్ణుర్నారాయణఃకృష్ణః - అమ) తోఁచెన్ = గోచరించెను. అంతన్ = అనమయమునందు, భక్తవత్సలుండు = భక్తులయందు వాత్సల్యముగల వాఁడు, అగు = అయిన, శ్రీవత్సవక్షుండు = శ్రీవత్సమన పుట్టుమచ్చ ఱొమ్మునందుఁగలవాఁడు - కృష్ణుఁడు, (మీఁదిపద్యముతోనన్వయము)

శ్రీవత్సము - చూ 1-1 వ్యాఖ్య.

సీ॥ అరచంద్రులోని 1 చిహ్నాంశకంబునుబోలె
నుదుటఁగస్తురిబొట్టుపదనుకొనఁగ
గగనంబునందలిఖరమరీచియుఁబోలె
నురమునఁగౌస్తుభంబొఱపుమీఱ
సురభూజశాఖలఁజుట్టుతేఁటు 2 లుఁబోలె
గేలఁ 3 బచ్చలకడియాలు 4 మెఱయఁ

33 ప ।- 1 చిహ్నాంశంబులుం-ముద్రి (అ); చిహ్నాంశకంబులుబోలె-ర,అ.గౌ, 2 లువోలె – గౌ; లుఁబోలె – ర, అ. 3 పచ్చనికడి - వ, గౌ; 4 జెరయ – త; మెఱయ - ర, అ.

గొదమసంపెఁగమొగ్గతుదఁబొన్నవిరివోలె
మంకున్న 5 ముక్కర 6 ముత్తెమమర

తే॥ నీలగిరిఁగప్పువెన్నెలనిగ్గుఁ 7 బోలె
నవకమగుమేనహరిచందనంబు వొదువ
వివిధమణిభూషణప్రభల్ వెలయఫలిత
కల్పతరులీల రాధయగ్రమున నిలిచి. 33

వ్యా :— అరచంద్రులోని = అర్ధచంద్రునిలోపలి, చిహ్న= లాంఛనముయొక్క, అంశకంబునఁబోలెన్ = లేశమువలె - కళంక లేశమువలె, నుదుటన్ = లలాటమునందు, కస్తూరిబొట్టు = కస్తూరీ తిలకము, పదనుకొనఁగన్ = మెఱయఁగా.

(2) గగనంబునందలి = ఆకాశమునందలి, ఖరమరీచియుఁబో లెన్ = తీవ్రాంశుని (=సూర్యుని) వలె, ఉరమునన్ = ఱొమ్మునందు కౌస్తుభంబు = కౌస్తుభమణి, ఒఱపుమీఱన్ = మిక్కిలి ప్రకాశింపఁగా.

(3) సురభూజ = దేవతావృక్షములయొక్క, శాఖలన్ = కొమ్మల యందు, చుట్టు = మూఁగు, తేఁటులుఁబోలెన్ = తుమ్మెదలవలె, పచ్చలకడియాలు = మరకతకంకణములు, కేలన్ = హస్తముల యందు, మెఱయన్ = ప్రకాశింపఁగా.

హస్తములకు దేవతావృక్షశాఖలకు వర్ణమవివక్షితము.

తుమ్మెదలవర్ణమునలుపు. పచ్చలకడియములవర్ణమాకు పచ్చన. సామ్యమెట్లనఁ, గృష్ణహరితవర్ణముల కైక్యముకవిసమయప్రసిద్ధము. "కృష్ణహరితయోః - ఏకత్వేన నిబంధనంచ కవిసమయః" (కావ్యమీ)

సురభూజములు - చూ 1 - 62 వ్యాఖ్య.

---

5 మంగఱ - ముద్రి (ఆ). ర: ముక్కర - అ. 6 ముత్య- ముద్రి (అ), గొ: ముత్తె- ర, అ. 7 వోలె - గొ: ఁబోలె-ర,అ.

(4) కొదమ = లేఁతదయిన, సంపెఁగమొగ్గ = చంపకముకు ళముయొక్క, తుదన్ = చివరనున్న, పొన్నవిరివోలెన్ = పొన్న పువ్వువలె, ముక్కునన్ = నాసికమునందు, ముక్కర ముత్తెము = నాసికావిభూషణమగుముత్యము, (నాసికావిభూషణముముక్కుఅముంగర యనంగ - ఆం. భా) అమరన్ = ఒప్పఁగా.

నీలగిరిన్ = నీలమనుపర్వతమును, కప్పు = ఆచ్ఛాదించు, వెన్నెల = చంద్రికయొక్క, నిగ్గుఁబోలెన్ = కాంతివలె, నవకమగు మేనన్ = అందమయిన శరీరమునందు, హరిచందనంబు = హరిచందనమనెడుతెల్లచందనము, పొదువన్ = ఆచ్ఛాదింపఁగా.

"నీలః = పర్వతవిశేషః, సతుఇలావృత స్యోత్తరతోరమ్యకవర్ష స్యసీమాపర్వతః" (శబ్దక)

హరిచందన - "హరేర్విష్ణోఃప్రియంచందనమ్, శ్వేతచందనేఁగో శీర్షనామకేమలయైకదేశేజాతేచందనభేదే" (శబ్దస్తో)

వివిధ = పలువిధములయిన, మణిభూషణ = రత్నాభరణ ములయొక్క. ప్రభల్ = కాంతులు, వెలయన్ = వ్యాపింపఁగా, ఫలిత = పండిన, కల్పతరులీలన్ = కల్పవృక్షమువలె, రాధ = రాధా దేవియొక్క, అగ్రమునన్ = ఎదుట, నిలిచి = ప్రత్యక్షమయి. (మీఁదిపద్యముతో నన్వయము)

అలం :— మాలోపమ.

ఉ॥ శ్రీదనరన్ గృపారసము 1 చిల్కఁదపోనలజాయమాన హృ
త్ఖేదము 2 మానుపించి, తనకేలనుగేల్ దెమలించి నిర్భరా

---

34 ప.- 1 చిల్కి - త, ఛిల్క - ర, ఆ. 2.మానివింపుచు-ర,ఆ,మానుపించి-గొ

హ్లాదమెలర్ప 3 నయ్యుంవతినర్ధశరీరమునట్లు ప్రోచెన
య్యాదవరాజవంశమణి, యద్రిజనేలినశూలిపోలికన్. 34

వ్యా :— అయాదవరాజవంశమణి = ఆయదునకు సంబంధించిన క్షత్రియకులశ్రేష్ఠుఁడు - ఆశ్రీకృష్ణుఁడు. (యాదవః = యదు సంబంధిని, యథా - భాగవతే --- యద్యాదవంకులమహో అవిసహ్యా మాస్తే - శబ్దక) శ్రీ = శోభ, తనరన్ = ఒప్పఁగా, కృపారసము = దయారసము, చిక్కన్ = చిందఁగా, తపః = తపస్సనెడు, అనల= అగ్నివలన, జాయమాన = జనించుచున్న, హృత్తీవము = మనోవ్యథ. మానఁజేంచి = పోఁగొట్టి, తన = తనయొక్క, కేలను = చేతితో, కేల్ = చేతిని, తెమలించి = పట్టుకొని, నిర్భర = అధికమయిన, అహ్లాదము = సంతోషము, ఎలర్పన్ = అతిశయింపఁగా, అద్రిజన్ = పార్వతిని, ఏలిన = పరిగ్రహించిన, శూలిపోలికన్ = ఈశ్వరనివలె, అయ్యువతిన్ = ఆతరుణిని - ఆరాధాదేవిని, అర్ధశరీరమునట్లు = అర్ధదేహమువలె, ప్రోచెన్ = ఏలుకొనెను - భార్యగా స్వీకరించెను.

అలం :— ఉపమ.

క॥ రాధానంగమ ముదితుని
మాధవుఁగనియోటుపడిన 1 మాసిక్కఁదెరలె శం
పాధరము, తనదువర్ణము
బాధితమగునేనివెలుకక్కబాఱుఘనుండున్. 35

వ్యా :— శంపాధరము = మెఱపును ధరించునది -

---

3 నయ్యువిద - గౌ; నయ్యువతి - ర; అ.
35 ప. 1 మోదిరిలేశం - క; మాడిఁదెరలెశం - ర; అ.

మేఘము, రాధా = రాధయొక్క, సంగమ = కలయికచే, ముదితునిన్ = సంతోషించినవాఁడగు, మాధవునిన్ = కృష్ణుని, కని = చూచి, ఓటువడిన మాడ్కిన్ = అపజయము పొందెనోయనునట్లు, తెరలెన్ = చలించెను. తనదువర్ణము = తనయొక్క రంగు - అని యర్థము. తనయొక్క జాతియనియర్థాంతరము. బాధితమగునేని = బాధింపఁబడినచో, ఘనుండున్ = మేఘుఁడును - అనియర్థము. గొప్పవాఁడయినను - అనియర్థాంతరము. వెలుకఁబాఱున్ = తెల్లఁబడును- అనియర్థము. వెలవెలఁబోవునని (వివర్ణుఁడగునని) యర్థాంతరము.

మేఘునంతవాఁడునుదనవర్ణము (రంగు) బాధితముకాఁగాఁదెల్లఁబడెను - ప్రకృతార్థము. ఎంతగొప్పవాఁడయినను జాతిభ్రష్టుఁడైనచో (నవమానములుభరింపలేక) వెలవెఁబోవును - అప్రకృతార్థము. ఈ రెండర్థములకు నుపమానోపమేయభావము కల్పించి యేకవాక్యతను సాధింపవలెను. ఎట్లన, ఎంతఘనుఁడయినను వర్ణభ్రష్టుఁడైనచో వెలవెలబోవునట్లు, ఘనుఁడును (మేఘుఁడును) దనవర్ణముబాధితముకాఁగాఁ దెల్లఁబడెను. వర్ణము, ఘనుఁడుననుపదములమూలమున నీయర్థములు స్ఫురించుచుండుటచే నిదిశబ్దశక్తిమూలవ్యంజన. ఉపమానోపమేయభావముండుటచే నిది యుపమాలంకారధ్వని వర్షర్తువుపోయిశరదృతువు వచ్చెననుటకు సూచన.

అలం :— ఉత్ప్రేక్ష.

కII నీలాంజనవర్ణుఁడుగా
ధారిలా 1 పతిని బెనఁగి తనరెడుకరటిన్
గాలముశరత్సమాగమ
హేలాసౌభాగ్యమహిమనేపువహించెన్. 36

36 ప :- 1 పతిఁబెనంగి - ముద్రి (అ); ర; గ; తివిబెనఁగి - అ.

వ్యా :— నీలాంజనవర్ణుఁడు = నల్లని కాటుకవంటి దేహచ్ఛాయఁ గలవాఁడు - శ్రీకృష్ణుఁడు, రాధాలీలావతిని = రాధావిలాసినిని, పెనఁగి = కూడి; తనరెడుకరణిన్ = ఒప్పునట్లు, కాలము = కాలచక్రము, శరత్ = శరదృతువుయొక్క, సమాగమ = రాకయొక్క, హేలాసౌభాగ్య = విలాససౌందర్యస్ఫుటాధిక్యముచేత, ఏపు వహించెన్ = అతిశయించెను.

అలం :— ఉపమ.

సీ॥ కలఁకనీరెంతయుగతకల్మషముఁజేసెఁ
1 గతకఫలమురీతిఁగలశనూతి
పాప 2 టల్దిర్చెభూభాగంబు 3 నాశ్యాన
కాదంబుశకకౌఘచక్రధార
శిఖితాండవము 4 కళాసికఁజేసిపడలించెఁ
గఱకుటీకలపేరికాసెబిగువు
లుడిగిఁజడివానలుదయించెవెండియుఁ
గరిఘటామద 5 సృష్టికైతవమున

తే॥ తెల్లుశోభిల్లెమంకెనలుల్లసిల్లెఁ
గాలగంధరవాహంబుగజ్జురేఁగె
ముడిత 6 శతగోపకన్యకావదనతులిత
లలితరుచిఁబొల్చెరాకాసుధాకరుండు. 37

---

37 ప :- 1 కతకా - ముద్రి [అ]; ర; కరకా - గౌ; కతక - అ. టల్దీరె-త; టదీరె - ముద్రి [అ]; ర; టల్దీర్చె - అ. 3 నాస్యసస్వాదం-ప; నాశ్యానకాదంబు - ర; అ, గౌ. 4 కళాసిగ - ర; కళాసికచేసి-గౌ; కళాసికఁజేసి - అ. 5 వృష్టి - ర; సృష్టి - అ. 6 శర - ప; శత - అ; ర.

వ్యా :— కలశసూతి = కుంభసంభవుఁడు, అగస్త్యుఁడు, కతకఫలముఁబోలెన్ = ఇందుపగి జవలె, (దోషగ్రాహకః కతకః వైని) కలఁకనీరు = కలుషజలమును – వండనీటిని. ఎంతయున్ = అత్యంతము. గత = పోయిన, కల్మషమున్ = కలఁకగలదానిని – వండు గలదానిని. చేసెన్ = ఒనర్చెను.

అగస్త్యనక్షత్రోదయముతో శరత్కాలము ప్రవేశించి నదీజలము కలఁక దేఱునుగావున నగస్త్యునిగతకఫలముతోనుపమింతురు.

(i) కలుషితాంభఃపరిశోధైకకతకఫలము,
కోమలియుఁదానునేతెంచెఁగుంభభవుఁడు (భీమ 2.78)

(ii) వానకాలమునాఁటివండుపట్టిననీటి
కాలుష్యముడిపెడుకతకఫలము (కాశీ 2-160)

కతకః="కస్యజలస్యతకః హాసః ప్రకాశః ప్రసాదఃతియావత్" (శబ్దక)

అలం :— ఉపమ.

2) శకటౌఘ = బండ్లసమూహముయొక్క. చక్రధార = చక్రపరంపర, ఆ+శ్యాన = కొంచెముగా నెండిన, (అజీషదర్థే - అమ; శ్యాన = సంకోచఃశేషప్రాప్తేఘనీభూతే, పథశ్యానకర్దమానిఃరథమః-శబ్దస్తో) శాదంబున్ = బురదగలదియుగు, (శాదోజంబాలశష్పయోః-అమ) భూభాగంబున్ = ధరిత్రీప్రదేశమును, పాపటల్ తీర్చెన్ = పాపటలుతీఱునట్లుచేసెను – చాళ్లుపడఁజేసెను.

3) శిఖి = నెమలి, తాండవము = ఉద్ధతనృత్యమును, కళాసికన్ = నృత్యాంతమునఁ జేయుకళాసికయును నృత్యవిశేషమును చేసి = ఒనర్చి, కటకటీకలపేరి = బిఱుసైనవెడ్రుకలవ్యాజముగల కాసె = దట్టీయొక్క, కాసెకోకయొక్క, బిగువులు = పటుత్వములు, నడలించెన్ = వదులుచేసెను.

నాట్యాదులు చేయువారు దట్టీబిగించికట్టుటయు ముగిసినపిమ్మట దట్టీవదలుచేయుటయుఁబరిపాటి. నెమలికఱకుటీకలవ్యాజమున బిగించిన దట్టీని నాట్యాంతమునవదులుచేసెను.

తాండవముపుంనృత్యము. శిఖి = మగనెమలి. మగనెమలిగానఁదాండవమునఁజెప్పుట. "పుంనృత్యంతాండవంప్రాహుః స్త్రీనృత్యం లాస్యముచ్యతే" (శబ్దా. చిం.)

పేరు = వ్యాజము - విరాట 5-331; విజయ 3-218, హ.వ 4-8

వ్యాక :— పేరికాసెబిగువులు = పేరయొక్క కాసెబిగువులు. పేరియొక్క = పేరుగలిగిన - అభానబహువ్రీహి. చూ 1-213 వ్యాఖ్య

అలం :— కైతవాపహ్నుతి.

4) కరిఘటా = గజసమూహముయొక్క (కరిణాంఘటనాఘటా-అమ) మదస్ఫూర్తి = మదోత్పత్తియొక్క, కైతవమునన్ = వ్యాజముచేత, ఉడిగిన = అఁగిపోయిన, జడివానలు = ఆసారములు, అవిచ్ఛిన్నవర్షములు, వెండియున్ = మరల, ఉదయించెన్ = ఉత్పన్నములయ్యెను.

అలం :— కైతవాపహ్నుతి.

ఔల్లు = కాశము, శోభిల్లెన్ = ప్రకాశించెను, మంకెనలు = బంధూకములు. ఉల్లసిల్లెన్ = ఒప్పెను, కాలకంధర = కఱకంఠుని యొక్క (శివునియొక్క) వాహంబు = వాహనము - వృషభము, గర్జురేఁగెన్ = మదించెను. రాకాకళాధరుండు = పున్నమనాఁటి చంద్రుఁడు, ముదిత = మోదముగలిగిన, శతగోపకన్యకా = శతగోపతనయయొక్క - రాధాదేవియొక్క, వదన = ముఖముతో, తులిత = సామ్యముగలిగిన, లలిత = మనోహరమయిన, రుచిన్ = కాంతితో, ప్రాల్చెన్ = ప్రకాశించెను.

శరదృతులక్షణములకు, చూ 4-42 వ్యాఖ్య.

క॥ చనుమొలకలుగలకన్యా
జనములఁ 1 బురుడించెఁబద్మ 2 సరసీరేఖల్
నన 3 విలుతుమిట్టకోలలు
వనరుహముకుళములుగాన వచ్చుటకతనన్. 38

వ్యా :— ననవిలుతు = పుష్పధన్వునియొక్క (మన్మథుని యొక్క) మిట్టకోలలు = వాఁడిబాణములగు, వనరుహ = పద్మములయొక్క, ముకుళములు = మొగ్గలు, కానవచ్చుట కతనన్ = గోచరించుటచేత, పద్మసరసీరేఖల్ = తామరకొలఁకులపంక్తులు, రేఖా యామావళౌ - వై. ని.) చనుమొలకలుగల = స్తనాంకురములుగలిగిన, కన్యాజనములన్ = కన్యకాజనములను, పురుడించెన్ = పోలెను.

సరసీరేఖల్ - అను స్త్రీలింగప్రయోగము స్త్రీత్వద్యోతకము.

కన్య = పదేండ్లబాలిక. దశమేకన్యకాప్రోక్తా - ఇతిస్మృతిః (శబ్దక) కనుకనేచనుమొలకలనుట.

ననవిల్తుమిట్టకోలలు-మన్మథుని పంచబాణములలోఁబద్మమొకటి. మన్మథబాణములు - చూ. 2-129 వ్యాఖ్య.

అలం :— ఉపమ.

---

38 ప :- 1 బురుణించె - త, బురణించె - గ, గొ, బురుడించె - అ, ర.
2 సరసిజ - గ; సరసీ - ర, అ. 3 విల్తు-గొ విలుతు - ర, అ.

క॥ * అలరాధికాధరాధర
1 దళమునయదుభర్త 2 నినుచుదంతక్షతరే
ఖలుఁ 3 బోలెఁగ్రొత్తమంకెన
యలరులపైఁదేఁటులమరెనాసమయమునన్. **39**

వ్యా :— అలరాధికా = అరాధయొక్క, అధర + అధర దళమునన్ = పూఁజేకువంటి క్రిందిపెదవియందు, (అధస్తాదపిచాధరః, ఓష్ఠాధరౌతు అమ) యదుభర్త = యదువంశశ్రేష్ఠుఁడు - కృష్ణుఁడు. నినుచు = కలుగఁజేయు, దంతక్షతరేఖలుఁబోలెన్ = పలునొక్కుల వరుసలవలె, అసమయమునన్ = అకాలమునందు - అశరత్కాలము నందు, తేఁటులు = తుమ్మెదలు. క్రొత్తమంకెన = నవబంధూక వృక్షముయొక్క, అలరులపైన్ = పువ్వులమీఁద, అమరెన్=ఒప్పెను.

మంకెనపుష్పమెఱుపు. మోవియెఱుపు. తేంట్లునలుపు. దంతక్షత ములునలుపు. చూ 3-10 వ్యాఖ్య.

అలం :— ఉపమ.

తే॥ పాంచజన్యంబురాధికాచంచలాక్షి
1 కంధరకునోడియెచటనోక్రాఁగిపోఁక
2 దగ్గతధ్వనితద్భర్తదాయయనియొ!
చేరెవృషభంబుకంఠకుటీరవాటి. **40**

---

39 ప :- * ఈ పద్యము క, చ. ప్రతులలో లేదు. 1 దళమున-ప; గొ; ర; దళముల - అ. 2 నిలుచు - డ; ద; బ; నినుచు - అ. 3 వోలె - ర; గొ; బోలె - అ.

40 ప :- 1 కందరకు - ర (పా); కంధరకు - ర, అ; గొ. 2 దగ్గర-గొ; దగ్గత - ర, అ.

వ్యా :— పాంచజన్యంబు = (కృష్ణునిశంఖముగు) పాంచజన్యము, రాధికాచంచలాక్షి = రాధాకాంతయొక్క, కంధరకున్ = కంఠమునకు, ఓడి = భయపడి, ఎచటనో = ఎక్కడనో, క్రాఁగిపోవన్ = మఱుఁగుపడిపోఁగా, తద్గత = దానిని బొందిన - ఆపాంచజన్యము నాశ్రయించిన, ధ్వని = శబ్దము, తద్భర్త = ఆమెకాంతుని యొక్క (అరాధాకాంతునియొక్క) - ఆకృష్ణునియొక్క, దాయయనియొ = శత్రువనియో, వృషభంబు = ఎద్దుయొక్క, కంఠకుటీర వాటిన్ = గుడిసెవంటి గొంతుకప్రదేశమును, చేరెన్ = ఆశ్రయించెను. (వృషభము లుమదించి అంకెలు వేయుచుండెననుట.)

శతృవుమిత్రులు తనకుశత్రువులును. శత్రువుశతృవులు తనకు మితృలునగుదురను రాజనీతి యిటసూచితము. పాంచజన్యమురాధ కంఠమునకోడినది గనుక రాధకంఠము, పాంచజన్యమునకు శతృవు. పాంచజన్యమునకుశతృవగుటచే బాంచజన్యధ్వనికిని రాధకంఠముశత్రువగును. రాధకంఠమునుబట్టి రాధయు రాధాకాంతుఁడగుకృష్ణుఁడును బాంచజన్యమునకు దానిధ్వనికిశతృవర్గమగును. కృష్ణుఁడువృషభాసురునిసంహరించుటచేఁగృష్ణునకు శత్రువర్గములోనిది వృషభము. శతృవుశతృవు తనకు మిత్రుడనురాజనీతిచేఁ బాంచజన్యమునకు దానిధ్వనికిని వృషభము మితృవర్గములోనిది. పాంచజన్యమెక్కడనోభయపడివాగు కొనఁగాఁ బాంచజన్యధ్వని మితృవర్గములోనిదగు వృషభముయొక్క కంఠము నాశ్రయించెనుగాఁబోలునని సంభావన.

శతృవుమితృఁడు తనకుశతృవును, శతృవు శతృవు తనకు మిత్రుఁడునగుటరాజనీతి. "అరిర్మితృమరేర్మిత్రం, మితృమితృమతః పరమ్, తథారిమితృమిత్రంచ, జిగీషోః, జిగీషోఃపురతస్థితాః" (కామంద)

అలం :— ఉత్ప్రేక్ష.

తే॥ పుండరీకునిరక్షింపభూమిభార
మణఁప 1 నవనీతలంబున నవతరిలిన
యల్లునిగుఱించివచ్చుదుగ్ధాబ్ధియనఁగఁ
జంద్రికాపాండుజలధరచ్ఛాయపొదలె. 41

వ్యా :--- పుండరీకునిరక్షింపన్ = పుండరీకునిఁబ్రోచుటకును, భూమిభారము = భూభారము, అణఁపన్ = అణఁగించుటకును, అవనీతలంబునన్ = భూతలమునందు, అవతరిలిన = అవతారమునెత్తిన, అల్లునిగుఱించి = జామాతనుద్దేశించి - విష్ణువునుగూర్చి, వచ్చు = అరుదెంచు, దుగ్ధాబ్ధియనఁగన్ = క్షీరసముద్రమోయనునట్లు, చంద్రికా = వెన్నెలవలె, పాండు = తెల్లనైన, జలధర = మేఘములయొక్క, ఛాయ = కాంతి, పొదలెన్=వ్యాపించెను.

లక్ష్మీదేవి క్షీరసముద్రతనయగావున విష్ణువు క్షీరసముద్రమున కల్లుఁడగును.

అలం :--- ఉత్ప్రేక్ష.

సీ॥ కలుగకుండిననేమికడిమిపువ్వులతావి
వనిచినమరువమెంతటికి 1 నోప
దొదవకుండిననేమిమదకేకినటనంబు
2 చాలదేయంచలసంభ్రమంబు
3 మెఱవకుండిననేమి మెఱుఁగులపొలపమే
తన్మాత్రమునె 4 శాలి 5 ధళధళములు

41 ప :- 1 నవని - గొ, నవనీ - ర, అ.
42 ప :- 1 నోవ - గొ; నోప - ర, అ. 2 చాలదె - ర; చాలదే - అ. గొ.
3 మఱవ-గ; మెఱవ - ర. అ, గొ. 4 శౌరి-గొ. శాలి-ర. అ.
5 ధళధళములు - ర; ధళధళములు - అ.

సుడియకుండిననేమిసోనవానలపెల్లు
గజదానవృష్టికిఁగడమగలదె

తే॥ కారుకాలానఁగలిగిన గౌరవంబు
చౌకయైతోఁచె శరదృతుసౌష్ఠవమున
6 నుఱిలి తొల్లిటియధి కారియోనఱిలిన
వెనుక యధికారియవిగావెవిభవకళలు. 42

వ్యా :— కడిమిపువ్వుల = కదంబపుష్పములయొక్క, తావి = సుగంధము, కలుగకుండిననేమి = లభింపకున్న నేమినష్టము? ననిచిన = చిగురించిన, మరువము = మరువకవృక్షము. ఎంతటికి నోపదు = ఎంతకుసమర్థముకాదు. ఎంతకయినఁజాలుననుట.

2) మద = మదించిన, కేకి = నెమిళ్ల యొక్క, నటనంబు = నర్తనము, ఒదవకుండిననేమి = లభింపకున్న నేమినష్టము? అంచల = హంసలయొక్క, సంభ్రమంబు = సంచలనము, చాలదే = సరిపోవా! (సరిపోవుననుట)

3) మెఱుఁగులు = మెఱుపులయొక్క, పొలపము = కాంతి, మెఱవకుండిననేమి = తళుక్కునఁ బ్రకాశింపకున్న చో నేమి నష్టము. శాలి = వరిపైరుయొక్క, థళథళములు = తళతళమనుకాంతులు, ఏతన్మాత్రములె = ఇంతమాత్రములా? (సామాన్యమయినవికావనుట)

4) తోనవానలు = ఎడతెగకుండఁ గొంతఁదికొలఁదిగాఁగురియు వర్షములయొక్క, పెల్లు = అధిక్యము, సుడియకుండిననేమి = కురియకున్న నేమినష్టము. గజ = ఏనుఁగులయొక్క, దానవృష్టికనే = మదో

6 నుఱిలి = గ, నుఱిలి = ర, త, గ.

జ॰ వర్షమునకు, వ: దోదాసమ్ - అమ) కడమ = కొఱఁత, కలదె = ఉన్నదా ? (కొఱఁతలేదనుట)

కారకాలానన్ = వర్షర్తువునందు, కలిగిన = ప్రాప్తించిన, గౌరవంబు = మన్నన, శరదృతు = శరత్కాలముయొక్క, సౌష్ఠవముననన్ = అతిశయత్వమునందు, చౌకయైన = తక్కువదై, తోఁచెన్ = కనఁబడెను. ఉరిలి = పతనమయి - పదవీభ్రష్టుఁడయి, తొల్లిటియధికారి = ముందటియధికారి, ఒనరిలినన్ = తొలఁగఁగా. విభవశోభలు = వైభవమువలనఁ గలిగినశోభలు, వెనుక = పిమ్మటనైన, అధికారియవికావె = అధికారివికావా ? తరువాతియధికారివేయనుట.

ఉ॥ పాఁడియుఁబంటయుంగలిగి పంకవిహీనమనోహరాంబువుల్
వేఁడిన 1 నెల్లచోటఁబ్రభవింపఁగభానుఁడు శీతభానుఁడున్
గాఁడిన మేఘకాళిమవికారము దూరముసేయ, నెంతయున్
నాఁడెముచూపెశారదదినంబులు నిర్మలమౌక్తికాకృతిన్. **43**

వ్యా :— పాఁడియున్ = పాలును, పంటయున్ = ధాన్యసమృద్ధియు, కలిగి = కలవయి, పంకవిహీన = పంకముచేత విముక్తములయిన (పంకము తీఁగిన) మనోహర = ఒప్పిదములయిన, అంబువుల్ = నీళ్లు, వేఁడినన్ = కోరినచో, ఎల్లచోటన్ = సమస్తప్రదేశములందును, ప్రభవింపఁగన్ = పుట్టఁగా - లభ్యముకాఁగా, భానుఁడు = సూర్యుఁడు, శీతభానుఁడున్ = చలివెలుఁగును (చంద్రుఁడును) కాఁడిన = నాటుకొనిన - స్థిరపడిన, మేఘ = మొయిలుయొక్క - ఆకాశముయొక్క, కాళిమవికారమున్ = నల్లఁదనపు వికృతరూపమ్మును, దూరముచేయన్ = ధ్వస్తమగునట్లుచేయఁగా - కానరాకుండఁ

43 ష.- 1 నెల్లచోట్ల - అ. చోటనెల్ల - ర, గా.

జేయఁగా, శారదదినంబులు = శరదృతువునకు సంబంధించిన దివసములు, నిర్మల = స్వచ్ఛమయిన, మౌక్తికాకృతిన్ = ముత్యములవలె ఎంతయున్ = అత్యంతము, నాఁడెముచూపెన్ = మనోహరముఁ యెన.

అలం :— ఉపమ.

సీ॥ రక్షగట్టిరిమహీరమణులశ్వములకు
భూరినీరాజనపూర్వకముగ
ఫలకగ్రహణముఁజౌపదములగరిమంబుఁ
బరఁగెబాలకులకుగురువులిండ్ల
దుమికి 1 చిచ్చఱతోరణములుదూటినవారు
దూఱరైరిక్రొత్తుతోరణములు
భుజియించెఁబ్రజభుజాభోజనంబులు 2 సిగ
బంటిగాఁ 3 దొలిక్రొత్తవంతు 4 కముల

తే॥ నఖిలదిగ్జయకాంక్షఁబుష్పాయుధుండు
వెలిగుడారంబులోవచ్చివిడిదిచేసె
మురళిమ్రోయించెఁ 5 త్రిభువనీమోహనముగ
రాధకింపుగనాదినారాయణుండు. 44

వ్యా :— మహీరమణులు = భూపతులు, భూరి = గొప్పదయిన, నీరాజనపూర్వకముగన్ = నీరాజనమనెడి (యశ్వ) పూజావిశేషముముందటిదిగా, అశ్వములకున్ = గుఱ్ఱములకు, రక్షకట్టిరి = (పుష్టికాంత్యర్థము) మెడలో జేడికొమ్మలోనగువానిని బంధించిరి.

---

44 ప :- 1 చిచ్చురదోర - క, చ, ట; చిచ్చఱతోర - ర, అ 2 సిక-గొ; సిగ - ర; అ. 3 దొలు - ర; దొలి - అ. 4 కములు - ర, కముల - అ. 5 త్రిభువన - క, ర; ద్విభువనీ - అ, గొ.

"వాజినీరాజనావిధౌ" = నీరాజనాఖ్యే శాంతికర్మణి. శ్రీవరాహమిహిరః, భగవతిజలధర పక్షక్షపాకరార్కేక్షణేకమలనాభే ఉన్మీలయతి తురంగమకరిరథనీరాజనంకుర్యాదితి. (రఘు 4-25 సంజీ)

"నీరాజనం, నీరాజనా = వాహనాయుధాదేస్సః శేషణరాజనం యత్రిసానీరాజనా, నీరస్యశాంత్యుదకస్య అజనంక్షేపోయత్రసానీరాజనావా, ఇత్యమరటీకాయాంభరతః, తద్విధానంయథా—

"శరత్కాలేమహాష్టమ్యాం, దుర్గాయాః పరిపూజనమ్
నీరాజనం దశమ్యాంతు, కుర్యాద్వైబలవృద్ధయే....
భల్లాతకంశాలికుష్ఠం. సిద్ధార్థంసైంధవన్యతు
కంఠదేశేనిబధ్నీయాత్, షష్టిశాంత్యర్థమేవచ"
—కాళికా (శబ్దక)

2) బాలకులకున్ = బాలురకు, ఫలకగ్రహణము = పలక పట్టుటయు, చౌపదముల = చౌపదములనెడు గీతివిశేషముల యొక్క, గరిమంబున్ = గొప్పతనమును - అధిక్యమును, గురువుల = ఉపాధ్యాయులయొక్క, ఇండ్లన్ = గృహములయందు, పరగెన్ = ప్రవర్తిల్లెను.

ఫలకగ్రహణమనుటచేనక్షరాభ్యాసములుచేయించుట సూచితము.

3) దుమికి = దూకి, చిచ్చులతోరణములు = జ్వాలాతోరణములందు, తూటినవారు = ప్రవేశించిబయలు వెడలినవారు, కృతాంతు = యమునియొక్క, తోరణములు = బహిర్ద్వారములు, తూలరైరి = ప్రవేశింపరైరి.

చిచ్చులతోరణము —

"కార్తికశవేళ భీమశంకరునివద్దరఁ
దలాయించెవ్వాండు చిచ్చులతోరణంబు

నతఁడు దూఱఁడు ప్రాణనిర్యాణవేళ
ఘోరయమపట్టణద్వారతోరణంబు." (భీమ 25)

వ్యాక :— చిచ్చఱతోరణములు = చిచ్చఱతోరణములందు. (ప్రౌ. కారక 20 సూ)

అలం :— పర్యాయోక్తి.

4) ప్రజ = జనము, సిగబంటిగా = జుట్టుపరిమాణముగా, తొలిక్రొత్తవంటకములన్ = మొదటివిక్రొత్తవియగు నాహారపదార్థములతో, భుజాభోజనంబులు = విందుభోజనములు, భుజియించెన్ = తినెను.

భుజాభోజనము - విందులలోఁ బదార్థములు వేయవలదని చేతుల నడ్డముపెట్టివారించుటయాచారము. "హస్తములడ్డముంచి ననుగాగక వడ్డనఁజేతురన్నియున్" (రా. కల్ప - ఇష్టి 335 ప) కావున భుజానిరుద్ధభోజనములు విందుభోజనములని గ్రహింపనగును.
ప్రయోగాంతరము = వరాహ 10.33; పాండు 2.111

వ్యాక :— భుజాభోజనము = భుజానిరుద్ధమగుభోజనము- మధ్యమపదలోపిసమాసము.

పుష్పాయుధుండు = పువ్వులాయుధములుగాఁగలవాఁడు - మన్మథుఁడు, అఖిల = సమస్తమయిన, దిగ్జయకాంక్షన్ = దిక్కులను గెలువవలెనను కోరికతో, వచ్చి = అరుదెంచి, వెలికుడారంబులోనన్ = వెలుపలిపటకుటీరములో, (కాఱుకుడారముగూడారము గుడారుగూడారనఁగను నాల్గుపటగేహనామధేయంబులు - అం. భా) విడిదిచేసెన్ = బసచేసెను.

ఆదినారాయణుండు = ఆదివిష్ణువు - శ్రీకృష్ణుఁడు, (విష్ణుకృష్ణులకభేదము, విష్ణుర్నారాయణఃకృష్ణః - అమ) త్రిభువనమోహన

ముగన్ = ముల్లోకములకు, (స్వర్గమర్త్య పాతాళలోకములకు) మోహముగలిగించునదిగా, రాధకున్ = రాధాదేవికి, ఇంపుగన్ = ప్రియముగా, మురళి = పిల్లనగ్రోవి, మ్రోయించెన్ = మ్రోఁగఁ జేసెను - ఊఁదెను.

వ్యాఖ్య ;— త్రిభువనీ - "వా॥ పాత్రాద్యంతస్యన - పంచ పాత్రమ్, త్రిభువనమ్, చతుర్యుగమ్" అను శాస్త్రవచనముచే, త్రిభువనమ్ - అనియే కావలెను. కాని, త్రిభువనీశబ్దమును దిక్కనాదులును వాడినారు. "నిఁతివివర్తిత త్రిభువనీమహనీయుని" (శల్య 1 267) త్రిభువనీభంగోన్నమత్కంధరున్. (అరణ్య 7-147) కావున, భువనశబ్దము నుండి భువనీ - అను స్త్రీ ప్రత్యయాంతమును ముందుసాధించుకొని, త్రి+భువనీ = త్రిభువనీ - అనురీతిని ద్రిభువనీశబ్దమును బిమ్మట సాధింపనగును. భువనీశబ్దమునకు - భువనీవ్రాతవలేందాంబుధి (కు. సం.) 11-64 - వ్యా. సం. స 1136-37 పు.

వ॥ ఇట్లు నిజజలనిమజ్జజ్జంతుజాలంబులకు బుణత్రయమోచన హేతువగునాబుణత్రియమోచన తీర్థంబునందవఁబుసేసిరాధకృతార్థ యయ్యె 1 నయ్యాదవ 1 కిశోరుండును గృశోదరీసహాయుండై మాయాశబలితుఁడగు 2 జీవపురుషుని 3 పరుసున వివిధభోగపరాయణుండై 4 ప్రవర్తించుచుండెనయ్యెడఁబుండరీకాక్షుని ప్రకారం బాకర్ణింపుము. 45

45 ప :- 1 కిశోరంబును - డ, ద, బ; కిశోరుండును - ర, అ, గౌ. 2 శివపురు - త, జీవపురు - ర, అ. 3 పరుసున - ముద్రి (అ)ర; వరుసన - గ. 4 పరఁగుచు - డ, ద, బ; ప్రవర్తింపుచుం - త, గౌ; ప్రవర్తించుచుం - అ.

వ్యా ;— ఇట్లు = ఈవిధముగా, నిజ = స్వకీయమయిన, జల = నీటియందు, నిమజ్జత్ = మునుగుచున్న, జంతుజాలంబులకున్ = ప్రాణులసమూహమునకు - మానవసమూహమునకు, ఋణత్రియ = ఋణములు మూఁడింటియొక్క, మోచన = విమోచనమునకు, హేతువగు = కారణమయిన, ఆఋణత్రయమోచనతీర్థంబునన్ = ఆఋణత్రియమోచనమనెడు పుణ్యక్షేత్రమునందు, తపంబు చేసి = తపమొనర్చి, రాధ = రాధిక, కృతార్థయయ్యెన్ = కృతకృత్యురాలయ్యెను. అయ్యాదవకిశోరుండును = ఆయదువంశమునఁ బుట్టిన బాలకుఁడును - ఆకృష్ణుఁడును, కృశోదరీ = (అ) సన్నని నడుముగలదానియొక్క - అరాధయొక్క, సహాయుండై = తోడ్పాటుగలవాఁడై - రాధాసహితుఁడై, మాయా = అవిద్యచేత, శబలితుండగు = చిత్రివర్ణముగలవాఁడగు - ఆవరింపఁబడినవాఁడగు, జీవపురుషుని పగిది సునన్ = జీవాత్మవలె, వివిధభోగ = పలురకములయిన భోగములయందు, పరాయణుండై = అత్యాసక్తిగలవాఁడయి, ప్రవర్తించుచుండెన్ = వర్తిల్లుచుండెను. అయ్యెడన్ = ఆసమయమునందు, పుండరీకుని = పుండరీకునియొక్క, ప్రకారంబు = విధము, వినుము = ఆకర్ణింపుము.

కృష్ణునిమాయాపిహితుఁడగు జీవాత్మతోఁబోల్చుటచేనతఁడు లీలామానుషవిగ్రహుఁడగు పరమాత్మయనివ్యంజితము.

ఋణత్రియము - దేవఋణము, పితౄణము, ఋషిఋణము.

దేవానాంచపితౄణాంచ, ఋషీణాంచతథానరః,
ఋణవాన్జాయతే యస్మాత్ తన్మోక్షేప్రయతేత్సదా.
—(విష్ణుధ)

అలం ;— ఉపమ.

క॥ ఉపమింపఁగరానితప
స్త్తపమునఁగడువాఁడిమీఱు 1 ధరణీసుమన
స్త్తపనుఁడు కమలవికాసం
బెపుడును నుడివోనితావినింపు 2 వహింపన్. 46

వ్యా :— ఉపమింపఁగరాని = సరిపోల్పశక్యముగాని, తపః = తపస్సనెడు, తపమునన్ = (గ్రీష్మఋతువుచేత, (గ్రీష్మ -- ఊష్మాగమ స్తపః - అమ) కడున్ = మిక్కిలి, వాఁడిమీఱు = అతిశయించు, ధరణీసుమనః = భూదేవుఁడనెడు. (సుపర్వాణఃసుమనసః - అమ) తపనుఁడు = సూర్యుఁడు - పుండరీకుఁడనెడు సూర్యుఁడు, కమల = (యోగశాస్త్ర(ప్రసిద్ధములగు) శరీరమునందుండు పద్మములనెడు తామర పూవులయొక్క, వికాసంబు = వికసనము, ఎపుడున్ = ఎప్పుడును, ఉడివోని = క్షీణింపని, తావిన్ = పరిమళముతో, ఇంపువహింపన్ = ఇంపొందఁగా, ఒప్పఁగా.

అలం :— రూపకము.

క॥ ఆద్యశివాధిష్ఠితమై
యుద్యజ్జ్యోతి 1 ర్విలాసయుతమై స్వశిరః
2 పద్మోద్భవమై కడునన
వద్యమునౌధశశతారవనజమునందున్. 47

వ్యా :— ఆద్యశివ = ఆదిశివునిచేత, అధిష్ఠితమై = ఉనికి పట్టుగాఁజేసికొనఁబడినదై, ఉద్యత్ = ఉద్యమించుచున్న, జ్యోతిర్విలాస=

46 ప :- 1 ధారుణి - గ; ధరణీ - ర, అ; గొ. 2 వహించెడి - త; వహింపఁగ - ర; అ.

47 ప :- 1 ర్విభానియుతమై - క; ర్విలాస - ర, అ. 2 (ప్రద్యోద్భ-గ; పద్మోద్భ - ర, అ.

తేజోవిలసనముతో, యుతమై = కూడుకొన్నదై, స్వశిరః = తన శీర్షముయొక్క, పద్యా = మార్గమునందు, (పంథానః - పద్యా - అమ) ఉద్భవమై = పుట్టినదయి, కడున్ = మిక్కిలి, అనవద్యమునౌ = అనింద్యమయినదియునగు, దశశత = పదినూఱుల (వేయి) అర = కోణములు గలిగిన, వనజమునందున్ = కమలమునందు - సహస్రార కమలమునందు (మీఁదిపద్యముతో నన్వయము)

సహస్రార - "సహస్రసమరాఃకోణా అస్య. శిరఃస్థితేసుషుమ్నా నాడీమధ్యస్థే సహస్రదళకమలే" (శబ్దస్తో)

చ॥ 1 జోటఁజోటధారగాపడియుచున్‌గడవెత్తుసుధారసంబు 2 గ్రుంగుటుకునఁ నప్పటప్పటికిఁ గ్రోలుచువాలుగురెండుమూలలన్
గుటిలతథాల్భలోఁగివిగగుర్పొడమించుచు, దక్షిణశ్రవ
స్తటపిసరత్పయోదనినదంబునఁజొక్కుచు 3 మ్రబ్బు 4 దక్కఁగన్.

48

వ్యా :— జోటుజోటు = (సహస్రారమువందు) జోటుజోటు మని (కాఱుటయందగుననుకరణము) ధారగాన్ = పరంపరగా - అవిచ్ఛిన్నముగా, పడియుచున్ = స్రవించుచు, కడవెత్తు = పొంగెడు, సుధారసంబు = అమృతరసమును - చంద్రనాడినుండి స్రవించునమృత రసమును, గుఠ్రింగుటుకునన్ = మిక్కిలిగుటుక్కుమని, (త్రాగుట యందగుననుకరణము) అప్పటప్పటికిన్ = అప్పటప్పుడుగా,

48 ప :- 1 చొటచొట - గ; జొటజొట - ర, అ.
2 గుఠ్రగుటు - త, గ; గుఠ్రంకుటుకు - క; గ్రుక్కటుటు - చ; గుఠ్రంగుటగుట-ముద్రి (అ); త; గుఠ్రంకుటుకున - అ.
3 మ్రబ్బుగ్రక్కు - ముద్రి (అ); ర; మ్రబ్బు - అ, గ; గ్రక్కు - ముద్రి (అ); ర; దక్కఁగ - అ.

కోఁభుచున్ = పానముచేయుచు. నాలుగురెండుమూలలన్ = ఆఱుకోణములతో, కుటిలతదాల్చు = కౌటిల్యమునువహించు, భోగినిన్ = కుండలినీశక్తిని, గగుర్పొడమించుచున్ = రోమాంచముపొందునట్లు చేయుచు, దక్షిణశ్రివః = కుడిచెవియొక్క, తట = ప్రదేశమునందు; విసరత్ = ప్రసరించుచున్న, పయోదనినదంబునన్ = మేఘనినాదముచేత, చొక్కుచున్ = పరవశించుచు, క్రమ్ముదక్కుచున్ = మత్తువదలుచు, (మీఁదిపద్యముతో నన్వయము)

**కుండలిని —**

"భుజంగాకారరూపేణ, మూలాధారం సమస్థితా
శక్తిఃకుండలినీనామ, బిసతంతునిభాశుభా".

సహస్రారమునందలిచంద్రనాడినుండి సుధారసముస్రవించును-2-9
చంద్రనాడి - చూ 4-75.

వ్యాక :— గుగ్గింగుటుకు - గుటుకు+గుటుకు = గ్రుంగుటుకు - బా. సంధి 42

ఉ॥ విచ్చిన 1 కమ్మఁదమ్ములకువిందులుపెట్టువెడందఱెకన్నులన్
బచ్చనిపట్టఁబేరురముఁ 2 బాఁకినమచ్చయుఁ 3 బీల్లికెట్టెమున్
బచ్చిక 4 చాయయుంజిఱుత 5 ప్రాయముఁగల్గువెలుంగునిచ్చలో
రచ్చయొనర్పనందలిపరాకునఁదేలుచు, వేడ్కనేలుచున్. **49**

వ్యా :— విచ్చిన = వికసించిన, కమ్మఁదమ్ములకున్ =

---

49 ప :- 1 కమ్మదమ్ము - ర [టీక]; కమ్మదమ్ము - ర; కమ్మఁదమ్ము-అ, కమ్మతమ్ము - గౌ. 2 వ్రాఁకిన - గౌ; బ్రాఁకిన - ర, అ. 3 ఫిల్లి - త; బీలి - ర, అ. 4 చాయయుఁజ - ర; ఛాయయుఁజ - అ, గౌ. 5 పాయము - ర; ప్రాయము - అ, గౌ.

చక్కనిపద్మములకు, విందులు పెట్టు = విందుభోజనములు పెట్టు, వెడంద కన్నులున్ = విశాలనేత్రములను, (వికసించినపద్మములనుబోలు విశాలనేత్రములనుట) పచ్చనిపట్టున్ = పీతాంబరమును. పేరురమున్ = పెద్దదయినవక్షమును, ప్రాఁకిన = అవరించిన, మచ్చయున్ = పుట్టుమచ్చయు - శ్రీవత్సమును, పిలినెట్టియున్ = నెమలి వెంట్రుకలతోఁ జేసినదారముల పోగాయు, (నెమలి యీఁకలఁ జేను దారముల పోగ, నెట్టెమనిపేర్కొఁగాఁదగు - ఆం. భా) పచ్చికచాయయున్ = పచ్చికవంటి దేహచ్ఛాయయు, (నీలవర్ణమును - అనుట) చిఱుతప్రాయమున్ = చిన్నవయస్సును, కల్గు = కలిగిన, వెలుంగు = తేజము, నిచ్చ = ఎల్లప్పుడు, లోన్ = లోపల - హృదయములోపల, రచ్చయొనర్పన్ = కొలువుచేయఁగా, అందలి = ఆతేజమునందలి, పరాకనన్ = ఏకాగ్రతచేత, తేలుచున్ = ఆనందించుచు, వేడ్కనేలుచున్ = కుతూహలము పొందుచు, (మీఁది పద్యముతో నన్వయము)

పచ్చికచాయ - పచ్చికవర్ణమాకుపచ్చన. కృష్ణునిదేహచ్ఛాయ కృష్ణము. కృష్ణహరితవర్ణములకైక్యము కవిసమయప్రసిద్ధము. "కృష్ణనీలయోః, కృష్ణహరితయోః, కృష్ణశ్యామయోః, పీతరక్తయోః శుక్లగౌరయోరేకత్వేననిబంధనంచకవిసమయః" (కావ్యమీ)

వెలుంగు - ఇటనుపమేయమగు కృష్ణునకు నిగీర్ణత్వము.

అలం :— అతిశయోక్తి.

చ॥ గురుజనభక్తియుంగపటుగోపకుమారపదాబ్జసక్తియుం
[1] దరలుగఁ బాపభూరుహ [2] వితానములీనముగాఁ జెలంగుభా
స్వరతరయోగసింధువున సౌఖ్యమునొందుచుఁ జిద్విపాంసురా
హరణమొనర్చి భూమిసురహాగనముకాలఁ బ్రశంస [3] నొందఁగన్ ౫౦

50 ప :- 1 దరలఁగ-డ, ద, బ; దరులుగ - ర, అ, గొ. 2 నవిలీనము గ, నములీనముగా - ర, అ, గొ. 3 నందఁగన్-గొ; పొందఁగన్-ర, అ,

వ్యా :— గురుజనభక్తియున్ = గురుజనులయందలిభక్తియు-మాతాపితృభక్తియు, కపటగోపకుమార = మాయాగోపబాలునియొక్క-కృష్ణునియొక్క, పదాబ్జ = పద్మములవంటి పాదములయందలి, సక్తియున్ = ఆసక్తియు, దరులుగన్ = ఒడ్డులుగా, పాపభూరుహవితానము = అఘమనెడు వృక్షసమూహము, లీనముగాన్ = మునిఁగిపోవునట్లుగా, చెలంగు = ఒప్పు, భాస్వరతర = మిక్కిలి ప్రకాశమానమగు, యోగసింధువునన్ = చిత్తవృత్తినిరోధమనెడు (యోగశ్చిత్తవృత్తినిరోధః - పాతం) నదియందు, సౌఖ్యమునొందుచున్ = సుఖపడుచు, భూమిసురహంసము = బ్రాహ్మణుఁడనెడు హంస - పుండరీకుఁడనెడు హంస, చిత్ = జ్ఞానమనెడు, బిస + అంకుర = తామరతూఁటిమొలకయొక్క, ఆహరణము = సంగ్రహణము, ఒనర్చి= చేసి - జ్ఞానమనెడు తామరతూఁటిమొలకను సంగ్రహించి, చాలన్ = అత్యంతము, ప్రశంసనొందఁగన్ = పొగడ్తనొందఁగా, (మీఁదిపద్యముతో నన్వయము)

అలం :— రూపకము.

సీ॥ తనమొగం 1 బులు ప్రాఁతమినుకు మానికముల
గములుద్భవిల్లెడు గనులుగాఁగఁ
దనకమ్మఁడలువారి 2 దనుజారిపాదార్ఘ్య
మలవరించుట 3 కూటచెలమగాఁగఁ
దనమది నెద్దిదోఁచిననదియొక్కొక్క
రూపాంతరంబునఁ బ్రోదివడయఁ

51 ప :- 1 బున - త. బులు - ర, అ. 2 దంబువులంబుటామలవరించుట - త. దనుజారిపాదార్ఘ్యమలవరించుట - ర, అ. 3 కూటుచె - ప, కూటుచలమ - గొ, కూటచెలమ - ర, అ.

దనకట్టునజినరత్న మున్సృష్టిదీక్షకై
4 కట్టినయదివో లెఁగప్పుదేర

తే॥ 5 వీచువీవనచేఁబూని వెనుకఁదనకుఁ
జిఱుతచనుదోయియొరగుగాఁజేసిపలుకుఁ
జెలువగోలువంగఁదొలుకారుకలఁకపలుఁగు
6 మావురాహుత్తునిలిచె బ్రాహ్మణునిమోగి. 51

వ్యా :— తన = తనయొక్క; మొగంబులు = ముఖములు, ప్రాఁకమినుకు = వేదములనెడు, మానికముల = మాణిక్యములయొక్క, గములు = సమూహములు, ఉద్భవిల్లెడు = పుట్టెడు, గనులుగాఁగన్ = ఖనులుగాఁగా.

2) తన = తనయొక్క, కమండలుహారి = కమండలుజలము, దనుజారి = విష్ణుమూర్తియొక్క, పాదార్ఘ్యము = చరణప్రక్షాళన జలమును, అలవరించుటకున్ = సిద్ధపఱచుటకు, (సమకూర్చుటకు) ఊటచెలమగాఁగన్ = ఊరినజలముగలకూపకముగాఁగా.

3) తన = తనయొక్క, మదిన్ = మనస్సునందు, ఎద్దితోఁచిన నది = ఏదిపొడగట్టిన నది, ఒకొక్కొక్కరూపాంతరంబునన్ = ఒకొక్క మాఱురూపమున, (ఒకొక్కొక్కరూపభేదమున) పొదివడయన్ = అతిశయింపఁగా.

---

4 గప్పినయదివోలెగబ్బురీవి - త; కప్పినయదివోలెగబ్బుదేర - గొ; కట్టినయదివోలెఁగబ్బుదేర - ఆ, ర. 5 విలసనాసక్తి సంగిని వెనుక దనదు - త; వీచువీవనచేఁబూని వెనుకఁదనకు - ర, ఆ, గొ. 6 మాహురా - త; మావురావుత్తు - గొ; మావురాహుత్తు - ఆ.

4) తన = తనయొక్క, కట్టు = ధరించిన, అజినరత్నము = శ్రేష్ఠమయిన చర్మము. సృష్టిదీక్షకై = సృష్టినియమార్థము, కట్టిన యది వోలెన్ = ధరించినదోయనునట్లు, కప్పుదేరన్ = నలుపెక్కంగా.

సృష్టిదీక్షలో ముడిపట్టి నలుపెక్కిన దీక్షావస్త్రమో యనునట్లు, బ్రహ్మధరించిన నల్లని యిఱ్ఱిచర్మమొప్పెననుట.

వీచు = విసరెడు, వీవన = విసనకఱ్ఱ, చేన్ = చేతియందు, పూని = వహించి, వెనుకన్ = (తన) వెనుకభాగమునందు, చిఱుత చనుదోయి = లేంతచనుంగవ, తనకున్ = తనకు, ఒరగుగాన్ = ఒఱగుదిండుగా, చేసి = ఒనర్చి, పలుకుంజెలువ = భాషాంగన - సరస్వతీదేవి, కొలువంగ = సేవింపంగా, తొలుకారుకలంకపులుంగు మావురాహుత్తు = అంచగుఱ్ఱపురౌతు - బ్రహ్మ; బ్రాహ్మణుని మ్రోలన్ = పాఱునియెదుట - పుండరీకునెదుట, నిలిచెన్ = ప్రత్యక్షమయ్యెను.

తొలుకారుకలంకపులుంగు = వర్షర్తువునకుంగలంతచెందు పక్షి - హంస. మేఘహంసవిరోధముకవిసమయప్రసిద్ధము. చూ. 4-జవ్యాఖ్య

హంస, బ్రహ్మవాహనమనుట ఖగోళదృశ్యము. హంసాకార నక్షత్రసమూహమే బ్రహ్మవాహనమగుహంస. ఇదే "Cygnus" చుక్కలగుంపు.

అలం :— రూపకము, ఉత్ప్రేక్ష.

చ॥ నిలిచి, నిలింపలోకతటిని 1 తటనీరజహేమనీరజో
జ్జ్వలబిసనాళఖాదనమువంకనపొంకముమీఱుకొ్రవ్వనన్
గళముగదల్పలేనితురగంబుఁదటాలునడిగ్గి, నమ్రతా
కలితశరీరునిందిగిచి కౌఁగిటఁజేరిచెఁబుండరీకునిన్. 52

---

52. ప ॥ 1 తటి - త, ద, ఖ; తల - క, తట - ర, ఙ.

వ్యా :— నిలిచి = (పుండరీకునెదుట బ్రాహ్మ) ప్రత్యక్షమయి, నిలింపలోకతటిని = దేవలోకనదియొక్క - స్వర్గంగయొక్క (మందాకినీనదియొక్క) తట = ఒడ్డునందలి, నీర = జలమునుండి, జ = కలిగిన, హేమనీరజ = బంగారుతామరలయొక్క, ఉజ్జ్వల = మిక్కిలి ప్రకాశించెడు, బిసవాళ = తామరతూఁటియొక్క, ఖాదనము = తినుటయొక్క, వంకన్ + అ = హేతువుచేతనే, (ఆకాశగంగానది యొడ్డునందలి బంగారుమెట్టతామరతూండ్లు భక్షించినకారణముచేతనే - అనుట) పొంకముమీఁఱు = అతిశయించు, క్రొవ్వునన్ = బలుపుచేత, గళము = కంఠమును, కదల్పలేని = కదలింపలేని, తురగంబున్ = గుఱ్ఱమును - వాహనమును, (హంసననుట) తటాలునన్= తటుక్కున, డిగ్గి = దిగి, నమ్రతా = అణఁకువతో, కలిత = కూడుకొనిన, శరీరునిన్ = దేహముగలవాఁడగు, పుండరీకునిన్ = పుండరీకుని, తిగిచి = చేరఁదీసి, కౌఁగిటన్ = భుజాంతరమునందు, చేరిచెన్ = ఉండునట్లుచేసెను - కౌఁగిలించెను.

ఉ॥ చేరిచిసేమమే ? సితకుశేశయలోచనగోచరాత్మ ! నీ
వారికి నీకునన్నవిని వారిరుహాసనుఁబల్కనమ్మహా
దారుఁడమేయభద్రసముదాయ 1 నిదానమపీవువచ్చుటన్
పొరసగర్భ! యింకఁగొనసాగుఁజుమీ! కుశలంబు 2 మాదెసన్ **53**

వ్యా :— చేరిచి = కౌఁగిటఁజేర్చి, సితకుశేశయలోచన = పుండరీకాక్షుఁడు (శ్రీకృష్ణుఁడు) గోచర = స్థానమయిన, (గోచరః = స్థానః - శబ్దక) ఆత్మ = మనస్సుగలవాఁడా! నీవారికిన్ = నీకు

---

53 ప :- 1 నిదానమునీవు - మద్రి (అ); ర; గౌ; నిదానమపీవు - అ. నిధానము క. 2 మిమ్మేనహంగ, ఊ; మాదెసహా - ర; అ.

సంబంధించినవారికిని, నీకున్ = నీకును, సేమమే = క్షేమమా ? అన్నన్ = అనఁగా. విని = ఆకర్ణించి, అమ్మహోదారుఁడు = ఆ మహనీయుఁడు, వారిరుహాసనున్ = పద్మాసనునిగూర్చి (బ్రహ్మను గూర్చి) పల్కెన్ = (ఇట్లు) వచించెను. సారసగర్భ = పద్మముత్పత్తి స్థానముగాఁగలవాఁడా ! - ఓబ్రహ్మదేవా ! అమేయ = మితిలేని, భద్రసముదాయ = శుభములసమూహమునకు, నిదానమవు = ఆది కారణమవయిన, నీవు = ఈవు, వచ్చుటన్ = అరుదెంచుటచేత, మాదెసన్ = మావిషయమునందు, ఇంకన్ = ఇటుపైని, కుశలంబు = క్షేమము (కుశలం క్షేమమస్త్రియామ్ - అమ) కొనసాగుఁజుమీ = వర్ధిల్లునుజుమా !

సారసగర్భుఁడు - ఇది ఖగోళదృశ్యమునకుఁబ్రతీక. చూ 1-3 వ్యాఖ్య

క॥ అనిపరమాసనమిడి 1 తా
ననిమిషులర్చించు 2 నట్లయర్చించెజగ
జ్జననస్థితిలయకారణ
జనినజునిఁ 3 సుజనమతిరజనిరజనీశున్. 54

వ్యా :— అని పరమాసనమిడి = అని యుత్కృష్టమయిన, పీఠమును వేసి, తాన్ = తాను, సుజనమతి = సజ్జనులబుద్ధియనెడు, రజని = రాత్రికి, రజనీశున్ = చంద్రుఁడును, జగత్ = లోకము యొక్క, జనన = పుట్టుటకు - సృష్టికి, స్థితి = ఉనికికి, లయ = నాశనమునకు, కారణ = హేతువయిన, జనిన్ = జననముగల వాఁడునగు, (జనిరుత్పత్తిరుద్భవః - అమ) అజునిన్ = బ్రహ్మను, అనిమిషులు = దేవతలు, అర్చించునట్ల = పూజించునట్లే, అర్చించెన్ = పూజించెను.

54 ప :- 1 తానని - ర; తన్నని - అ, గౌ. 2 నట్టుల - ద, వ, బ.
3 సమరజని - త; సుజనమతి - ర, అ.

క॥ అర్చించి నిలిచి చేతులు
గూర్చి పురస్థ్సలికిఁ జాఁచి గోవింద పదా
బ్జార్చారస 1 పాకవిదుఁడ
నర్చిత తదితరుఁడు క్షితిసురాగ్రణి పల్కెన్. **55**

వ్యా :— అర్చించి = పూజించి, నిలిచి = నిలఁబడి, చేతులుగూర్చి = హస్తములు జోడించి, పురస్స్థలికిన్ = ముందటి భాగమునకు, చాఁచి = చాఁపి, గోవింద = కృష్ణునియొక్క, పదాబ్జ= పద్మములవంటి పాదములయొక్క, అర్చారసపాకవిదుఁడు = పూజాభిరుచియందలి పరిపాకము నెఱిఁగినవాఁడు. అనర్చిత = పూజింపఁబడని, తదితరుఁడు = గోవిందేతరుఁడు - కృష్ణుని కంటె వేఱు దేవతలను బూజింపనివాఁడు, అగు, క్షితిసురాగ్రణి = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు - పుండరీకుఁడు, పల్కెన్ = (ఇట్లు) వచించెను.

సీ॥ విజ్ఞాన 1 వీర్యుఁడీ విశ్వనిర్మాత, యా
త్మారాముఁడీ త్రిలో 2 కాధివిభుఁడు
భ్రూమధ్యజనిత 3 రుద్రుండీ మహామతి
యజ్ఞాతచర్యుఁడీ ప్రాజ్ఞతముఁడు
సర్వావయవజప్రజా వ్రజుండీ వేల్పు
ముఖ్యాత్ముఁడీ త్రయీమూలభూతి
దక్షాదికప్రజోద్భవహేతువీ యయ్య
కర్మైకసాక్షి యీ నిర్మలుండు

55 ప :- 1 పానవిథు - బ; పానవిదు - య; పాకవిధు - ర; పాకవిదు-అ.
56 ప :- 1 వంద్యు - ముద్రి (అ), ర; వీర్యు - అ. 2 కాధికారి. ముద్రి (అ). ర; కాధివిభుఁడు - అ. 3 రుద్రుఁడిమహాగతి. యగాగ యజ్ఞా - త; మహామతి - ముద్రి (అ), ర, గ; మహాగతి - అ.

తే॥ శాశ్వతుండీత, డద్భుతై శ్వర్యుఁడితఁడు
శాంతుఁడీతఁడు 4 వాఙ్మనః కాంతుఁడితఁడు
ననఁగవెలుఁగొందునీవునాకతిథివై తి
వేను 5 దొలుమేనఁజేసినదెట్టినోమొ ! 56

వ్యా :— ఈ విశ్వనిర్మాత = ఈ జగత్తునునిర్మించినవాఁడు, (ఈ సృష్టికర్త - అనుట) విజ్ఞానవీర్యుఁడు = విశేషమయిన జ్ఞానము బలముగాఁగలవాఁడు; ఈ త్రిలోక = ఈ ముల్లోకములయొక్క, అధి విభుఁడు = అధిపతి, ఆత్మారాముఁడు = ఆత్మ, క్రీడోద్యానముగాఁ గలవాఁడు. (ఆత్మయందుఁగ్రీడించువాఁడనుట)

త్రిలోకములు - స్వర్గమర్త్యపాతాళములు.

వ్యాక :— త్రిలోకములనునది స్వర్గమర్త్యపాతాళ లోకములకు సంజ్ఞగావున "దిక్సంఖ్యేసంజ్ఞాయామ్" (పాణి) అను సూత్రముచేఁదిత్రిలోకములను కర్మధారయసమాసము సిద్ధించును. "త్రయశ్చతేలోకాశ్చత్రిలోకాః" అని విగ్రహము.

త్రిలోకశబ్దము ద్విగువుమాత్రముకానేరదు. ద్విగుపక్షమున - త్రిలోకీ - అనియగును.

2) ఈ మహామతి = ఈ గొప్పదయినబుద్ధిగలవాఁడు, భూరి = బొమలయొక్క, మధ్య = అంతర్భాగమువలన (నుండి), వడిమినుండి, జనిత = పుట్టింపఁబడిన, రుద్రుండు = రుద్రుఁడుగలవాఁడు, ఈ ప్రజ్ఞతముఁడు = ఈ యత్యంత విజ్ఞుఁడు, అజ్ఞాత = తెలియఁబడని చర్యుఁడు = చర్యలుగలవాఁడు.

---

4 వాగ్మ - గొ; వాఙ్మ - ర, 5 దొలి - ర; దొలు - అ, గొ.

రుద్రుఁడు - బ్రహ్మకోపమువలననతని భ్రూమధ్యమునుండి జనించి రోదనముచేయుచుండఁగా రుద్రుఁడనునామము కలిగినట్లు భాగవతము.

3) ఈవేల్పు = ఈదేవత, సర్వ = సమస్తమయిన, అవయవ = అంగములనుండి, జ = పుట్టిన, ప్రజాప్రజుఁడు = జనసమూహముగలవాఁడు, ఈత్రయీ = ఈ వేదములకు, మూలభూతి = మూలకారణము, ముఖ్యాత్ముఁడు = ప్రధానమయిన యాత్మ - పరమాత్మ.

4) ఈయయ్య = ఈపూజ్యపురుషుఁడు, దక్ష = దక్షుఁడు, ఆదిక = మొదలుగాఁగల, ప్రజా = ప్రజలయొక్క, ఉద్భవ = పుట్టుకకు, హేతువు = కారణము, ఈ నిర్మలుండు = ఈ పవిత్రుఁడు, కర్మ = కర్మములకు, ఏక = ముఖ్యుఁడయిన, సాక్షి = ప్రత్యక్ష జ్ఞానముగలవాఁడు.

దక్షాదులు బ్రహ్మవలన జన్మించిరి "అంగుష్ఠాద్దక్షిణాద్దక్షః ప్రజాపతిరజాయత" మత్స్య)

ఈతఁడు = ఇతఁడు, శాశ్వతుండు = నిత్యుఁడు. ఇతఁడు = ఈతఁడు. అద్భుతైశ్వర్యుఁడు = ఆశ్చర్యకరమయిన యైశ్వర్యములు గలవాఁడు.

ఐశ్వర్యములు - అణిమాదులు, చూ. 1-101 వ్యాఖ్య.

ఈతఁడు = ఇతఁడు, శాంతుఁడు = అంతరింద్రియనిగ్రహము గలవాఁడు. ఇతఁడు = ఈతఁడు, వాక్ = సరస్వతీదేవియొక్క, మనఃకాంతుఁడు = హృదయేశ్వరుఁడు, అనఁగన్ = అనగా, వెలుఁగొందు = ప్రకాశించు, నీవు = ఈవు, నాకున్ = నాకు, అతిథి

వైతివి = అతిథిగానయితివి, ఏను = నేను, తొలుమేనన్ = పూర్వ జన్మమునందు, చేసినది = ఆచరించినది, ఎట్టినోము = ఎటువంటి వ్రతమో !

మ॥ అరుణావిష్కృతిభాస్కరోదయముఁ, బద్మామోదమంభోరుహా
కరమున్, వేలుపువిల్ 1 ప్రవర్షణము. నోంకారంబుమంత్రాక్షర
స్ఫురణంబుంబ్రకటింపఁగామొదలనుద్భూతంబు 2 లైనట్లు, శ్రీ
శ్వరుఁడేతెంచుటకుంద్వదాగమ 3 మపో! సంసూచకంబయ్యెడిన్

**57**

వ్యా :— అరుణ = అనూరునియొక్క, ఆవిష్కృతి = ప్రకాశనము, భాస్కర = సూర్యునియొక్క, ఉదయమున్ = తూఱుటను, పద్మ = తామరలయొక్క, ఆమోదము = సుగంధము, అంభోరుహాకరమున్ = పద్మాకరమును, (సరోవరమును), వేలుపువిల్ = సురధనుస్సు (హరివిల్లు) ప్రవర్షణమున్ = ప్రకృష్టమయిన వృష్టిని, ఓంకారంబు = ప్రణవము, మంత్రాక్షర = మంత్రాక్షరములయొక్క, స్ఫురణంబున్ = స్ఫూర్తిని, ప్రకటింపఁగాన్ = ప్రకటించుటకు, మొదలు = ఆదియందు, ఉద్భూతంబులు = ఉత్పన్నములు, ఐనట్లు = అయినవిధముగా, శ్రీశ్వరుఁడు = లక్ష్మీపతి (శ్రీకృష్ణుఁడనుట) ఏతెంచుటకున్ = వచ్చుటకు, త్వత్ = నీయొక్క, ఆగమమపో = రాకయేనిశ్చయముగా. సంసూచకం బయ్యెడిన్ = స్పష్టమయిన నిదర్శనమగుచున్నది.

ఓమ్ - అ + ఉ + మ్ = ఓమ్.

---

57 ప :- 1 ప్రకర్షణము - గొ; ప్రవర్షణము - ర, అ. 2 లైనట్టులీ - డ, ద, బ, య; తైనట్లా - అ. 3 మహా - ర; ముహా - డ,ద,బ, ముహో - అ.

"అకారోవిష్ణురుద్దిష్ట, ఉకారస్తుమహేశ్వరః,
మకారేణోచ్యతే బ్రహ్మ, ప్రణవార్థఉదాహృతః"
మహానిర్వాణతంత్రే (శబ్దక)

అలం :-- మాలోపమ.

ఉ॥ త్వాదృశులందు 1 నందకముఁ 2 దాలుచువేల్పువసించు 3 నట్టుల
ర్చాకృతులనూఁదియుండఁడనియాడుదు, రట్లగుటన్‌సమస్తవ
స్తూదయహేతుభూతివెలుఁగొందెదు మీరిటకిట్టువచ్చుటన్
శ్రీదయితాగమంబుకడుఁజేరువయౌనని నిశ్చయించితిన్. 58

వ్యా :— త్వాదృశులందున్ = నీవంటివారియందు, నంద కముఁదాలుచువేల్పు = నందకమనుఖడ్గమును ధరించుదేవత-కృష్ణుఁడు, (ఖడ్గోనందకః - అమ) వసించునట్టులు = నివసించునట్లు, అర్చా+ అకృతులన్ = ప్రతిమలులోనగువానిని (ప్రతిమాప్రతియాతనా ప్రతి చ్ఛాయాప్రతికృతిరర్చా - అమ) ఊఁది = ఆశ్రయముగాఁ జేసికొని, ఉండఁడని = వసింపఁడని, ఆడుదురు = అందురు. అట్లగుటన్ = అవిధముగానగుటచేత, సమస్తవస్తు = ఎల్ల పధార్థములయొక్క, ఉదయ = సృష్టికి, హేతు = కారణమయిన, భూతిన్ = ఐశ్వర్య ముచేత. వెలుఁగొందెదు = ప్రకాశించెదరు, మీరు = మీరలు, ఇటకున్ = ఇచ్చటికి, ఇట్లు = ఈ ప్రకారముగా, వచ్చుటన్ = అరుదెంచుటచేత, శ్రీదయిత = లక్ష్మీపతియొక్క - కృష్ణునియొక్క, ఆగమంబు = రాక, కడున్ = మిక్కిలి, చేరువయౌనని = దగ్గఱ యగునని, నిశ్చయించితిన్ = నిర్ణయించితిని, (మీఁదిపద్యముతో నన్వయము.)

---

58 ప :- 1 నందనము - గొ, వంధకమ్ము - ర, అ. 2 దాల్చునము - ప, దాలుచు - ర, అ, గొ. 3 నట్లయ - ప, నట్లన - గొ, నట్టుల - ర, అ,

క॥ నావినినగుమొగమున స
ద్దేవజ్యేష్ఠుండు వాసుదేవ ప్రియునం
భావించి సజలజలధర
రావనిభగభీర 1 కంధరాధ్వనిఁబలుకున్. 59

వ్యా ;— నాన్ = అనఁగా, విని = ఆకర్ణించి, నగు మొగమునన్ = నవ్వుముఖముతో, అద్దేవజ్యేష్ఠుండు = అసురజ్యేష్ఠుఁడు, (అబ్రహ్మ) వాసుదేవప్రియున్ = కృష్ణునకిష్టుఁడగువానిని- అపుండరీకుని సంభావించి = మన్నించి, స+జల = నీటితోఁగూడుకొనిన, జల ధర = మేఘములయొక్క, రావ = ధ్వనితో, (గర్జతో - అనుట) నిభ = సమానమయిన, గభీర = గంభీరమయిన, కంధరాధ్వనిన్ = కంఠస్వరముతో, పలుకున్ = వచించెను.

వాసుదేవ - వసుదేవునియపత్యము - తద్ధితరూపము. ఇది పరమాత్మవాచకముగూడనగును. వాసువైనదేవుఁడు, వాసుదేవుఁడు= పరమాత్మ. (వాసుశ్చాసౌదేవశ్చవాసుదేవః)

"సర్వత్రాసౌసమస్తంచ, వసత్యత్రేతివైయతః
తతఃసవాసుదేవేతి, విద్వద్భిఃపరిగీయతే" (విష్ణు)

చ॥ ఒసఁగెద 1 నీకు వేఁడువరమోపరమపవిత్ర ! యెద్దియేనియున్
మనలకయన్ననన్న యసమన్వితుఁడిట్లనునట్టిదేనియున్
బిసరుహగర్భ ! దుర్భవవిభేదనుపైఁదలఁపుందదీయసం
గసుఖమఖండధర్మపతికర్మముఁగూర్మినొసంగునాకొగిన్. 60

59 ప ॥- 1 కంధర - డ్య, ధ, బ; కంధరా - ర, అ.

60 ప ॥- 1 వేఁడునీకు - గ, ర, గొ. నీకుతేఁడ్పు - అ.

వ్యా :— ఓపరమవ్రత = ఓయుత్కృష్టమయిన (తపోరూప) నియమముగలవాఁడా! ఎద్దియేనియున్ = ఏదయినను; వరము = వరమును, నీకున్ = నీకు, ఒసఁగెదన్ = ఇత్తును. (ప్రసాదింతును) మనలక = ఆలసింపక, వేడుము = అర్థింపుము. అన్నన్ = అనఁగా, అన్నయసమన్వితుఁడు = అనీతిమంతుఁడు - అపుండరీకుఁడు, ఇట్లు = ఈ ప్రకారముగా; అనున్ = పలికెను. అట్టిదేనియున్ = అట్లయినపక్షమున, బిసరుహగర్భ = పద్మగర్భా, (ఓబ్రహ్మ!) దుర్భవవిభేదనుపైన్ = దుష్టమయిన సంసారమును బాగుగ భేదించువానిమీఁద - కృష్ణునిమీఁద, తలఁపున్ = ధ్యానమును, తదీయ = వానికి సంబంధించిన - కృష్ణునకుసంబంధించిన, సంగసుఖము = సాంగత్యసౌఖ్యమును; అఖండ = సంపూర్ణమయిన, ధర్మ = ధర్మముయొక్క, పరికర్మమున్ = ఆచరణమును, కూర్మిన్ = వాత్సల్యముతో, నాకున్ = నాకు, ఒగిన్ = లెస్సగా, ఒసంగు = ప్రసాదింపుము.

చ॥ అనవుడునట్లయిచ్చికమలాసనుఁ 1 డాశమశాలిఁబల్కెనో
మునివర! నీవుసేయుతపమున్ జపమున్ 2 బెదరేఁపనెల్లినే
టనభవదగ్రపీఠిఁగదారపటుం 3 డిటువచ్చు; 4 మున్నెయా
యననినునేలినాఁడు చరితార్థుఁడనీవు 5 చిదర్థసంపదన్. 61

వ్యా :— అనవుడున్ = అన్నయనంతరము, అట్ల = ఆప్రకారమే, ఇచ్చి = ఒసఁగి, (పుండరీకుఁడుకోరినవరములనొసఁగి) కమలాసనుఁడు = బ్రహ్మ, ఆశమశాలిన్ = ఆశాంతిగుణముచే బ్రకాశించు

---

61 పాఠ- 1 డద్దమ - గ; డాశమ - ర, అ. 2 బెకవే - మూప్రి (అ); బెరరేఁప - ర; బెదరేఁప - అ, గా. 3 డిటు - ర; డిట - అ, గా. 4 మున్న - గా; మున్నె - ర, అ. 5 చతుర్థ - ముద్రి (అ) ర, చిరర్థ - చ; చిదర్థ - అ, గా.

వాసినిగూర్చి - అపుండరీకునిగూర్చి, పల్కెన్ = (ఇట్లు) వచించెను. ఓమునివర = ఓమౌనిశ్రేష్ఠుఁడా! నీవుచేయు = నీవాచరించు, తపమున్ = తపస్సును, జపమున్ = (ఓంనమోభగవతే వాసుదేవాయ- అను) మంత్రాక్షరములయావృత్తియు, పెడరేఁపఁన్ = మిక్కిలిప్రోత్సహింపఁగా, (పురికొల్పఁగా) ఎల్లిరేటన = తప్పకరేపోనేఁడో, భవత్ = నీయొక్క, అగ్రపీఠికిన్ = ముందటిభాగమునకు (ఎదుటికి) కడారపటుండు = పీతాంబరుఁడు - కృష్ణుఁడు, ఇటువచ్చున్ = ఇందు వచ్చును. మున్నె = ఇంతకుముందే, ఆయన = అతఁడు-అకృష్ణుఁడు నినన్ = నిన్ను, ఏలినాఁడు = (భక్తునిగా) పరిగ్రహించినాఁడు. ఈవు = నీవు, చిత్ = జ్ఞానమనెడు, అర్థ = ధనముయొక్క, సంపదన్ = సమృద్ధిచేత, చరితార్థుఁడవు = కృతార్థుఁడవు.

కడారపటుండు - "కడారఃకపిలః" (అమ) "సీఁ పీతఃకపిలః - ఇతిసుభూతిః" (శబ్దక) ఇటఁబీతత్వమే వివక్షితము. కావునఁగడారపటుఁడనఁగాఁబీతాంబరుఁడనుట.

క॥ నీయాక్షేత్రమునోముని
నాయక! దేవర్షి! నరగణప్రార్థితని
శ్శ్రేయసవదాన్యమగునని
పోయెఁబయోజాతసూతి, పోయిననతఁడున్. 62

వ్యా :— ఓమునినాయక = ఓమౌనినాథా - ఓపుండరీకా! నీయాక్షేత్రమున్ = నీయొక్క యీపుణ్యస్థలమును, దేవర్షి = సురమునులచేతను, నరగణ = మనుజసమూహముచేతను, ప్రార్థిత = కోరఁబడిన, నిశ్శ్రేయసవదాన్యము = మోక్షదాత, (ముక్తిఃకైవల్య

62 ప.-1 సూత - ర (పా); వర - ర, అ, గా.

నిర్వాణ(శ్రేయోని(శ్శ్రేయసామృతమ్, మోక్షోపవర్గః - అమ) అగునని= కాఁగలదని, పయోజసూతి = తమ్మిచూలి (బ్రహ్మ) పోయెన్ = అరిగెను - అదృశ్యమయ్యెను. పోయినన్ = (బ్రహ్మ) అరుగఁగా - అదృశ్యముకాఁగా, అతఁడున్ = అతఁడును - అప్పుండరీకుఁడును. (మీఁదిపద్యముతోనన్వయము)

దేవర్షి — నారదః, అత్రిః, మరీచిః, భరద్వాజః, పులస్త్యః, పులహః, క్రతుః, భృగుః, వశిష్ఠః; ప్రచేతాః, ఇత్యమరటీకాసార సుందరీ. తుంబురు భరతాదిః ఇతి - భరతః. కణాదాదిః ఇతిత్రికాండ శేషః" (శబ్దక)

"వ్యాసాద్యాస్తుమహర్షయః, పరమర్షయస్తుభేలాద్యా,
దేవర్షయః కణాదాదిః, బ్రహ్మర్షయోవశిష్ఠాద్యా,
సుశ్రుతాద్యాశ్రుతర్షయః" (త్రి. ని.)

ఉ॥ ధాతఁదలంచిమ్రొక్కియవదాతసరోజదళాక్షుఁ 1 గాంచులో
2 బ్రాఁతివెసంచియన్నలువపల్కులు సత్యములొక్కొ 3 ప్రాక్కథా
ప్రోతుముకుందునందననుబోఁటికి 4 దక్కునె? 5 దక్కకేమి? భ
క్తాతురతాపహారిదనుజారియనావినమేఁటుథోక్తులన్. 63

వ్యా :— ధాతన్ = బ్రహ్మను, తలంచి = స్మరించి, మ్రొక్కి = నమస్కరించి, అవదాతసరోజదళాక్షున్ = తెల్లతామర

63 ప :- 1 గాంచి - డ, ధ, బః గాంచు - ర, అ. 2 భ్రాంతివసించి-క; బ్రాతియసంచ్చి - చ; బ్రాతియొసంచి - త; బ్రాఁతిపెసంచి-ర; బ్రాఁతివెసంచి - అ, గొ. 3 పాక్కథాప్రోతముకుందుఁడెందు - మూద్రి (అ). ర, ప్రాక్కథాప్రోతుముకుందునంద - అ, గొ. 4దక్కునె - గొ: తక్కునె - ర, తక్కునె - అ. 5 తక్కు...దతత,

జేకులవంటికన్నులుగలవానిని-కృష్ణుని, కాంచు=దర్శించు, లోబ్రాఁతిఁన్= లోపలికోరికను - మనోవాంఛను, పెనంచి = అతిశయింపఁ జేసి, అన్నలువ పలుక్కులు = అచతుర్ముఖుని (అబ్రహ్మయొక్క) మాటలు, నత్యములొక్కొ = యథార్థములగునా ? ప్రాక్కథా = పురాతన చరిత్రలయందు, ప్రోతున్ = కూర్పఁబడిన - చెప్పఁబడిన, ముకుందున్ = కృష్ణుని, అందున్ = పొందుట - దర్శించుట, ననబోఁటికిన్ = నావ టివానికి, దక్కునె = లభించునా? దక్కకేమి = లభింపకేమి? (లభించును - అనుట) భక్త = భక్తులయొక్కయు, ఆతుర = విపన్నులయొక్కయు, తాప = సంతాపమును, హారి = హరించువాఁడు, దనుజారియ = కృష్ణుఁడే, నాన్ = అనఁగా, బుధ = పండితులయొక్క, ఉక్తులన్ = వచనములయందు, వినమే = ఆలకింపమా ? (ఆలకింతుమనుట)

సీ॥ అవచూడబర్హిబర్హమునవొండొంట్టి 1 సి
క్థములంటుచలిదిచిక్కముదలిర్పఁ
బంటుకార్వెల్లిధమ్మి 2 దంటగెంటుసమాడు
వెడఁధకన్నులకాంతివెల్లి 3 వొడ్డువ
మెఱుఁగుఁజెక్కులమిాఁదమిట్టించి యొసలివాఁ
గడమద్దికాయల 4 కళుకులమర
వక్షస్థలమున శ్రీవత్సకౌస్తుభవైజ
యంతులిందిరతోడివంతు 5 వడయు

64 ప :- 1 సిక్కములంటి - ముద్రి (అ), ర: సిక్థముజంట - ర (టీక) సిక్థకములంటి - చ,త, (గణభంగము) సిద్ధము - గ, గౌ, సిక్థములంటి - ర. అ, 2 దంటు - ప: దంట - ర: అ, గౌ. 3 గొనఁగ- ట: త: వొడువ - ర, అ, 4 తళుకు - డ. డ. బ, ప: కరుకులదర-గౌ: కళుకులమర - ర, అ. 5 అరయు-గౌ: వడయు-ర, అ.

తే॥ నిమ్ననాభియుఁ ద్రివళి 6 వర్ణితజఠరము
కరకలితచిత్రితత్రిశంఖములు నమర
మన్న 7 నస్సీమనేపొద్దుమలయుచున్న
ధూర్తబాలుఁడునామోదిలఁదోఁచునొక్క! 64

వా ;— అవచూడ = పిల్లజుట్టునందలి (బాలురముండటి సిగయందలి) బర్హిబర్హవునన్ = నెమలిపింఛమునందు, ఒండొంటి సిక్థములంటు = ఒకదానితోనొకటిగాఁగలసిన యన్నపు మెదుకులంటు కొనిన, చలిదిచిక్కము = పర్యుషితాన్నముగలయుట్టి, తలిర్పన్ = ఒప్పఁగా.

అవచూడ - "శిఖాచూడాకేశపాశీ" (అమ) - చుల్యతేఛాద్యత, ఇతిచూడా, చులఅచ్ఛాదనే" (గుఁబాల) చులధాతువుపై అచ్ ప్రత్యయమునిల్పి, చుల + ణిజ్ + అచ్ = చూడః - అనురీతిని చూడ శబ్దమును సాధింపనగును. తుండ, క్రీడ, కందర, సభ, భుజ, ధార లోనగుశబ్దములవలెనేచూడ - అను అకారాంతమునుగలదని గ్రహింప వలెను. "అవ = అల్పమ్" (శబ్దక) పిల్లజుట్టు శబ్దమునకు, "అవచూడ" శబ్దము సంస్కృతరూపమన్నమాట.

2) పంటకార్వెలిదమ్మిదంటన్ = శరదృతువునందలి తెల్లదామర పువ్వులజంటను. (దోయిజోడు, జంటజమళిపవంట యమడయన ద్వంద్వమైపరఁగును - ఆం. భా) గెంటుసమాదు = నిష్ఠురోక్తుల పలుకు వెడఁదకన్నుల = విశాలములయిన నేత్రములయొక్క, కాంతి = ఛవి, వెల్లివొడువన్ = వ్యాపింపఁగా.

---

6 వల్గిత - ముద్రి (అ), ర. (యతిభంగము) వర్ణిత - అ, గొ.
7 నంబున - ముద్రి (అ), వన్నెము ... 

అలం :— ఉపమ. (గెంటుసమాసు - ఉపమా వాచకము చూ. 1-126 వ్యాఖ్య.)

3) మెఱుఁగుఁజెక్కులమీఁదన్ = తళతళమను కాంతిగల చెక్కుల పైభాగమునందు, మిట్టించి = అతిశయించి, మొసలివాఁగడ = మకరము యొక్క ముఖప్రదేశము గలిగిన, మద్దికాయల = మద్దికాయల నాఁకారపు కర్ణాభరణవిశేషములయొక్క, కళుకులు = కాంతులు, అమరన్ = ఒప్పఁగా.

వాఁగడ - వాయి+కడ = వాఁగడ. వేగమునఁబులివాఁగడ వెడలిపోయి - కేయూర 3-120 (సూ. ని)

మద్దికాయలు — మద్దికాయల యాకారముగలచెవిపోగులు. "వెలిదామరంటఁబోలు వెడఁదకాల్గన్నులు, మద్దికాయలతోడనద్దిపడయ" (కాశీ 3-240)

4) వక్షస్స్థలమునన్ = ఉరః ప్రదేశమునందు, శ్రీవత్సకౌస్తుభ వైజయంతులు = శ్రీవత్సమను పుట్టుమచ్చయుఁ, గౌస్తుభమణియు, వైజయంతీమాలయు, (శ్రీవత్సోలాంఛనం మతమ్, కౌస్తుభోమణిః - అమ; వైజయంతీ — కేశవస్రజి - వై. ని.) ఇందిరతోడిసంతు = లక్ష్మీదేవితోడిభాగమును, పడయన్ = పొందఁగా (లక్ష్మీదేవితోపాటు శ్రీవత్సకౌస్తుభవైజయంతులు హరివక్షస్థలమునఁబాలుపంచుకొనుననుట)

నిమ్ననాభియున్ = లోఁతయిన పొక్కిలియు, త్రివళి = మూఁడు కడుపుముడుతలనమాహారము చేత, వర్ణిత = పొగడఁబడిన, జఠరము= గర్భమును, కర = చేతులయందు, కలిత = కూడుకొనిన, చిత్ర = పలువన్నెలుగల, ఛత్రశంఖములున్ = తోలుసంచియు, శంఖమును (పాంచజన్యము - అనుట) అమరన్ = ఒప్పఁగా, మత్ = నాయొక్క మనస్సీమన్ = హృదయప్రదేశమునందు, విభ్రాజన్ = ఎల్లప్పు

డును, మలయుచున్న = వర్తించుచున్న, ధూర్తబాలుఁడు = కొంటె పిల్లవాఁడు - బాలకృష్ణుఁడు, (విఠ్ఠలుఁడు), నాల్రమోలన్ = నా యెదుట, తోఁచునొకో = ప్రత్యక్షమగునా?

భస్త్ర - కొలిమితిత్తియను నర్థముగల భస్త్రాశబ్దము మాత్రమే నిఘంటువులందుఁగలదు. భస్త్రాచర్మప్రసేవికా (అమ) ఇకఁగొలిమి తిత్తియనికాక తిత్తియను నర్థము గ్రాహ్యము. "గ్రచ్ఛకాయలతిత్తి యు" (2-152) అని తిత్తిశబ్దము ప్రయుక్తము. భసధాతువుపై 'ష్ట్రన్' ప్రత్యయమునిల్పఁగా భస్త్రశబ్దము సిద్ధించును (ఇది వస్త్రశబ్దమువంటిది) "భస్త్రీ = భస్త్రా - ఇతిశబ్దరత్నావళీ" (శబ్దక) ఇటు భస్త్రియని నిల్పనగునుగాని 'భస్త్ర' యనియేయుపలబ్ధపాఠము.

క॥ అనియీగతిమీమాంసా
వనిమానసమృగముఁద్రిప్పువైష్ణవరత్నం
బునకు నిజదక్షిణేక్షణ
వనజచ్ఛదమదరె 1 శుభనివహసిశునంబై. 65

వ్యా :— అని = బాలకృష్ణుఁడు (విఠ్ఠలుఁడు) నాయెదుటఁ బ్రత్యక్షమగునా? యని, ఈగతిన్ = ఈప్రకారముగా, మీమాంసా = సందేహమనెడు, వనిన్ = అరణ్యమునందు, మానస = మనస్సనెడు, మృగమున్ = లేడిని, త్రిప్పు = సంచరింపఁజేయు, వైష్ణవరత్నంబునకున్ = శ్రేష్ఠుఁడయిన విష్ణుభక్తునకు, నిజ = స్వకీయమయిన, దక్షిణేక్షణవనజచ్ఛదము = తామరఱేకువంటి కుడికన్ను (ఈక్షణం చక్షురక్షిణీ - అమ). శుభనివహ = మంగళసమూహమునకు, పిశునంబై = సూచకమై, అదరెన్ = చలించెను.

---

65 ప :- 1 శుభవహ - త; శుభని[illegible] - ర, అ.

పురుషునకుం గుడిశరీరభాగమునందలి యవయవములదరుట శుభ సూచకము "వామభాగశ్చనారీణాం, శ్రేష్ఠః పుంసాతుదక్షిణః" (వసంత రాజశకునశాస్త్రము) - శబ్దక.

అలం :— రూపకము.

తే॥ నాఁడు మఱునాఁడు నవ్విప్రనందనుండు
ధాతమాటఁ చందంబు, దానవారి
తనకడకువచ్చురాములుఁదలఁచితలఁచి
ముచ్చటులయేటితరఁగలమునిఁగిమునిఁగి. 66

వ్యా :— నాఁడున్ = అదినమును, మఱునాఁడున్ = మఱునటిదినమును, అవ్విప్రనందనుండు = అబ్రాహ్మణకుమారుఁడు, ధాత = బ్రహ్మయొక్క, మాటఁ చందంబు = పలుకులవిధమును, దానవారి = కృష్ణుఁడు, (విష్ణువుఁడనుట) తనకడకున్ = తనయొద్దకు, వచ్చురాములు = వచ్చుటయురాకపోవుటయు, తలఁచితలఁచి = భావించిబావించి, ముచ్చటుల = కోరికలయొక్క - కోరికలయొక్క తాద్రూప్యముగల, ఏటితరఁగలన్ = నదీతరంగములయందు, మునిఁగి మునిఁగి = నిమజ్జనముచేసిచేసి, (మీఁదిపద్యముతో నన్వయము)

వ్యాక ;— వచ్చుట+రామి = వచ్చురాములు-ప్రా. సమాన 31 ముచ్చటులయేటితరఁగలన్ = ముచ్చటులయొక్క యేటితరఁగలన్. ఇటు షష్ఠి, యుపమేయోపమానముల తాద్రూప్యరూపసంబంధమున నయినది

వ॥ మూఁడవనాఁడు యథాకాలపరిబుద్ధుండై పూర్వాశ్రితసిద్ధాశ్రమంబున బద్ధపద్మా 1 సనుండై. 67

67 వ :- 1 సనాసీనుండై - ముద్రి (అ), ర; పసనుండై - అ.

వ్యా :— మూఁడువనాఁడు = తృతీయ దివసమునందు, యథాకాల = సమయమతిక్రమింపకుఁడ, ప్రబుద్ధుండై = మేలు కొన్నవాఁడయి, (సంధ్యాద్యనుష్ఠానకాలము దాఁటిపోకుండ యుక్త సమయమునమేల్కొన్నవాఁడయి - అనుట) పూర్వాశ్రిత = మును పటినుండి యాశ్రయింపఁబడిన, సిద్ధాశ్రమంబునన్ = ఋష్యాశ్రమమునందు, బద్ధ = కూర్పఁబడిన. పద్మాసనుఁడై = పద్మాసనము గలవాఁడయి. (పద్మాసనమునఁగూర్చున్నవాఁడయి - అనుట)

పద్మాసనము - "పద్మమివపద్మాకారేణబద్ధమిత్యర్థః, ఆసనమ్"

"వామోరూపరిదక్షిణం నియమతః సంస్థాప్యవామంతథా
దక్షోరూపరిపశ్చిమేనవిధినాధృత్వాకరాభ్యాంధృతిమ్
అంగుష్ఠం హృదయే నిధాయ చిబుకంనాసాగ్రమాలోకయే
దేతద్వ్యాధివికారనాశనకరంపద్మాసనంప్రోచ్యతే"
— గోరక్షసంహిత.

"ఉత్తానౌచరణౌకృత్వాఊరుసంస్థౌప్రయత్నతః
ఊరుమధ్యేతథోత్తానౌ పాణౌకృత్వాతతోదృశౌ
నాసాగ్రేవిన్యసేద్రాజదంతమూలేతు జిహ్వయా
ఉత్తంభ్యచిబుకంవక్షస్యుత్థాప్యపవనంశనైః
ఇదంపద్మాసనంప్రోక్తంసర్వవ్యాధివినాశనమ్"

— హఠయోగదీపిక. (శబ్దార్థ) చూ-శ్లో 5 అ-160, 161

క॥ కరివదనదేవతామిళ
దరుణాభచతుర్దళాఢ్యవాదిమసాంతా
క్షరయుతమగునాధారాం
బురుహంబునఁగలుగువలపు బుగులుకొనంగన్. 68

వ్యా :— కరివదనదేవతా = వినాయకదేవునిచేత, మిళత్ = కూడకొన్న, అరుణాభ = ఎఱ్ఱనికాంతిగలిగిన, చతుర్దళ = నాలుగు ఱేకులతో, ఆఢ్య = సంపన్నమయిన, వ = వవర్ణము, ఆదిమ = మొదటిదియు, స = 'స' వర్ణము, అంత = తుదిదియునగు, అక్షర = అక్షరములతో — "వ - శ - ష - స" అను నాలుగక్షరములతో, యుతము = కూడుకొన్నది, అగు = అయిన, ఆధారఅంబురుహంబునన్ = మూలాధారకమలమునందు, కలుగు = ఉన్న, వలపు = సుగంధము, బుగులుకొనంగన్ = వ్యాపింపఁగా, (మీఁది పద్యముతోనన్వయము)

మూలాధారము — తంత్రశాస్త్రప్రసిద్ధమగు శరీరమునందలి షట్కమలములలో నొకటి.

"అథాధారపద్మంసుషుమ్నాస్యలగ్నం
ధ్వజాధోగుదోర్ధ్వంచతుఃశోణపత్రమ్
వశాదాదిసాంతైర్యుతంవేదవర్ణైః"
(శ్రీచక్రచింతామణి) - శబ్దక

"మూలాధారచక్రమునకధి దేవతవిఘ్నేశ్వరుఁడు" (సీతా)

క॥ 1 అనఁదటిత్ప్రభషడ్దల
మైనలువ 2 వసింప 3 బాదిలాంతాక్షరసం
ధానస్ఫుటమగుస్వాధి
ష్ఠానాబ్జమునందు వెడలసత్సౌరభముల్. 69

వ్యా :— తటిత్ = మెఱపుయొక్క, ప్రభ = కాంతి, అనన్ = క్రమ్మఁగా, షడ్దళమై = ఆఱుఱేకులుగలదై, నలువ = బ్రహ్మ, వసింపన్ = నివసింపఁగా, బ = బవర్ణము, ఆది = మొదటి దియు, ల = లవర్ణము, అంత = తుదిదియునగు, అక్షర = అక్షర ములయొక్క - 'బ — భ - మ - య - ర - ల' అను నక్షరము లయొక్క, సంధాన = కూడికచేత, స్ఫుటమగు = స్పష్టమగు, స్వాధిష్ఠాన = స్వాధిష్ఠానమనెడు, అబ్జమునందున్ = పద్మమునందు, సత్సౌరభముల్ = మంచిసుగంధములు, వెడలన్ = బహిర్గతము కాఁగా. (మీఁదిపద్యముతోనన్వయము.)

స్వాధిష్ఠానము - తంత్రశాస్త్రప్రసిద్ధమగు షట్పద్మములలో రెండవది.

"షడ్దలేవైద్యుతనిభే, స్వాధిష్ఠానేఽనలత్విపి
బభమైర్యరవైర్యుక్తే, వర్ణైఃషడ్భిశ్చసువ్రత. (తంత్ర)

"స్వాలింగంతత్రతఅధిష్ఠానంయస్య" (శబ్దక)

---

69 ప :- 1 ఊన - ద, ష; పూన - ముద్రి (అ), ర; 2 శయింప - చ, త; వసింప - ర, అ. 3 పఁబాది - ష, ద, బ, పబాది - ర, అ.

క॥ డాద్యము 1 ఫాంతిమమును నీ
లద్యుతియుఁ బురాణపురుషలాలితముసుధీ
వేద్యమునగుదశపత్రిన
మఁద్యన్మణిపూరకమున మొలవఁగఁ దావుల్. 70

వ్యా :— డ = డవర్ణము, ఆద్యము = మొదటియక్షర ముగాఁగలదియు, ఫ = ఫవర్ణము, అంతిమమును = తుదియక్షర ముగాఁగలదియు, (డఢణ, తథదధన, పఫ - అను వర్ణములుగలది యనుట.) నీలద్యుతియున్ = నీలకాంతిగలదియు, పురాణపురుష = విష్ణుమూర్తిచేత, (దైత్యారిశ్శ పురాణయజ్ఞపురుషః - అభి. చిం.) లాలి తము = లాలింపఁబడినది (విష్ణుమూర్తియధిదేవతగాఁగలది -అనుట) సుధీ = పండితులచేత, వైద్యము = తెలియఁదగినది, అగు = అయిన, దశపత్రి = పదిఱేకులచేత, సముద్యత్ = ఒప్పుచున్న, మణిపూరకమునన్ = మణిపూరపద్మమునందు, తావుల్ = సువాసనలు మొలవఁగన్ = మొలకెత్తఁగా, (మీఁదిపద్యముతో నన్వయము)

మణిపూరము - తంత్రశాస్త్రప్రసిద్ధమగు శరీరాంతర్గతనాభిమధ్యస్థ మగుపద్మము, షట్పద్మములలో మూఁడవది.

"తదూర్ధ్వేనాభిదేశేతు, మణిపూరంమహాప్రభమ్,

మణివద్భిన్నంతత్పద్మం, మణిపూరంతథోచ్యతే

దశభిశ్చదళైర్యుక్తం, డాదిఫాంతాక్షరాన్వితమ్"

ఇతితంత్రిమ్. తత్తుస్వాధిష్ఠానపద్మస్యోర్ధ్వదేశేతిష్ఠతి. యథా -

ఏతత్పద్మస్యోర్ధ్వదేశే, మహాపద్మంసుదుర్లభమ్,

దశపత్రంనీలవర్ణం, సజలంఘోరరూపకమ్"

—ఇతి నిర్వాణతంత్రే" (శబ్దక)

70 ప ౹- 1* ఫాంతిక -డ, ద, ఖ; భాంతికమును-గొ, ఫాంతిమమును-ర,ఆ;

"మణిపూరకచక్రమునకు శ్రీమహావిష్ణువు, అధిదేవత"
(సీతా1-181 వ)

వ్యాఖ :— పురాణపురుష – "పురాణై ర్వేదాదిభిరుపస్తుతః పురుషః ఇతి మధ్యమపదలోపిసమాసఃయద్వా,పురాణఃపురుషఃఇతికర్మధారయః–శబ్దక

కll శైవము, ద్వాదశదళరే
ఖావళిత 1 కఠంబుకమ్రకనకచ్ఛాయా
శ్రీవహముఁనౌననాహత
మేవేళఁజెడనిగంధమిఁగురొత్తింపన్. 71

వ్యా :— శైవము = శివునకుసంబంధించినదియు, (శివుఁడధిదేవతగాఁగలది – అనుట) ద్వాదశదళ = పండ్రెండు రేకులయొక్క రేఖా = వరుసచేత, వళిత = చుట్టుకొనఁబడిన, కఠంబు = కవర్ణముమొదలు ఠవర్ణముఁవఱకుఁగల పండ్రె డక్షరములు గలదియు, క్రమ = మనోహరమయిన, కనకచ్ఛాయా = బంగారుకాంతియొక్క, శ్రీ = శోభను, వహమున్ = వహించునదియు, ఔ = అగు = అనాహతము = అనాహతపద్మము; ఏవేళన్ = ఎల్లప్పుడు, చెడని = నశింపని. గంధము = సువాసనను, ఇఁగురొత్తింపన్ = కలిగింపఁగా. (మీఁదిపద్యముతో నన్వయము)

అనాహతము – తంత్రశాస్త్రప్రసిద్ధమగు శరీరమునందలి యాఱుపద్మములలో నాలుగవది.

'తదూర్ధ్వేనాహతంపద్మ, ముద్యదాదిత్యసన్నిభమ్
కాదిఠాంతాక్షరై రర్క, పత్రైశ్చసమధిష్ఠితమ్' (తంత్ర)-శబ్దక.
'దానికి (అనాహతమునకు) అధిదేవతరుద్రుఁడు' (సీతా)

---

71 ప ॥ 1 కంఠమున – త (గణభంగము) కఠంబు – ర, అ,

కరంబు -- క ఖ గ ఘ ఙ: చ ఛ జ ఝ ఞ; ట ఠ - ఇటు కవర్ణమున దు?ఠవర్ణముతో జోడింపఁగా 'కఠ' సంజ్ఞ సిద్ధించెను. కఠ శబ్దము, కవర్ణము మొదలుకొని ఠవర్ణమువఱకుఁగల వర్ణములకు సంజ్ఞ యయినది. ఇట్లు వర్ణనిర్దేశము చేయుపద్ధతి తంత్రశాస్త్రప్రసిద్ధము.

"తద్బాహ్యే హేమవర్ణాభం, వసవర్ణ చతుర్దళమ్" (తంత్రసా) వసవర్ణ = వశషస - వర్ణములు, వసశబ్దము వకారాదిసకారాంత పర్యంతముగలవర్ణములకు సంజ్ఞ.

"అకారాదిక్షకారాంతా, అక్షమాలా పరికీర్తితా" (తంత్రసా) అక్ష = అకారాదిక్షకారాంతవర్ణములకు సంజ్ఞ.

వ్యాక :— ఔ + అనాహత = ఔననాహత (ము. కౌ, సంధి)

క॥ పదియాఱు 1 రేకులందును
బదియాఱు 2 స్వరంబులమరఁబరమజ్యోతి
ష్ప్రదమైసురమునివశతన్
బొదలువిశుద్ధమునఁబొంకముఁగఁలురిమశముల్. 72

వ్యా :— పదియాఱురేకులందును = షోడశదళముల యందును, పదియాఱుస్వరంబులు = షోడశాచ్చులు - "అ - ఆ - ఇ - ఈ - ఉ - ఊ - ఋ - ౠ - ఌ - ౡ - ఏ - ఐ - ఓ - ఔ - అం - అః" అను నచ్చులు పదునాఱును, అమరన్ = ఒప్పఁగా, పరమజ్యోతిష్ప్రదమై = ఉత్కృష్టమయిన ప్రకాశమునకు స్థానమయి, సురమునివశతన్ = దేవర్షియొక్క - నారదునియొక్క, వశతన్ = అధీనమున, పొదలు =

---

72 ప. 1 రేకు - ర; రేకు - అ. 2 సారంబు - ముద్రి (అ), ర; స్వరంబు - అ, గొ. 3 లుండ - ముద్రి (అ); ర; లమర - ఆ.

వర్ధిల్లు, విశుద్ధమునన్ = విశుద్ధకమలమునందు, పరిమళముల్ = సుగంధములు, పొంకము + కన్ = అతిశయము కాఁగా - అతిశయింపఁగా, (మీఁదిపద్యముతో నన్వయము.)

విశుద్ధము — తంత్రశాస్త్రప్రసిద్ధమగు శరీరమునందలియాఱు పద్మములలో నైదవది.

"తదూర్ధ్వంతువిశుద్ధాఖ్యం, దళషోడశపంకజమ్
స్వరైశ్చషోడశైర్యుక్తం, ధూమ్రవర్ణంమహాప్రభమ్".

— ఇతితంత్రమ్. అగస్త్యసంహితాయామ్ —

అకారాదిషోడశస్వరాన్ సబిందూన్‌షోడశదళకమలే కంఠమూలే న్యసేత్ - ఇతితంత్రసారః (శబ్దక)

క॥ దళయుగమున 1 హాంక్షంబులు
పొలుపొందఁజిదంశమగుచు, భూరిమణివిభా
2 వళిఁదగునాజ్ఞాపురమునఁ
గలవానవలేసరేఁగికడలుకొనంగన్. 73

వ్యా :— దళయుగమునన్ = ఱేకుదోయియందు, హాంక్షంబులు = "హామ్ - క్షమ్" వర్ణముల, పొలుపొందన్ = ఒప్పఁగా, చిత్ = జ్ఞానముయొక్క, అంశమగుచున్ = భాగమగుచు, భూరి = అధికమయిన, మణివిభా = వజ్రమణి కాంతులయొక్క, అవళిన్ = వరుసలచేత, తగు = ఒప్పు, ఆజ్ఞాపురమునన్ = ఆజ్ఞాస్థానమునందు -

73 ప - 1 హంసం - చ; పాంక్ష - గొ; హంక్ష - ర, అ. 2 కవితావంతి పురమున - క; లలితంబగుపతిపుర - త; వలిఁదగునాజ్ఞ పురమున - ర, అ.

అజ్ఞాచక్రమునందు, కల = ఉన్న, వాసనలు = పరిమళములు, ఏసరేఁగి = అతిశయించి, కడలుకొనంగన్ = వ్యాపింపఁగా, (మీఁది పద్యముతో నన్వయము)

అజ్ఞాచక్రము - తంత్రశాస్త్రప్రసిద్ధమగు శరీరమునందలి యాఱు పద్మములలో నాఱవది.

"అజ్ఞానా మంబుజం తద్ధిమకరసదృశంధ్యానధామ ప్రకాశమ్, హక్షాభ్యాంవై కలాభ్యాంపరివిలసిత వపుర్నేత్రపత్రం సుశుభ్రమ్" (శ్రీతత్త్వ) - శబ్దక.

మణి - "రత్నంమణిః" (అమ) రత్న - మాణిక్యే, హీర కేచ" (శబ్దస్తో) అజ్ఞాచక్రము తెలుపు. కావుననిటమణి శబ్దముచే వజ్రమణిగ్రాహ్యము.

ఉ॥ ఇంతకు నూర్ధ్వమైశిరసునిక్క, నధోముఖమూర్తిఁబొల్చియ
త్యంతవికాసశాలియయి, 1 యాద్యశివాశ్రయమై, సహస్రప
త్రాం 2 తరసత్సుధారసమహాఝురదుర్దినమాచరించున
ద్దొంతరపువ్వనంగలుగుతోరపుఁగంపులు పెంపుమీఱఁగన్. 74

వ్యా :— ఇంతకున్ = ఇంతకంటె - అజ్ఞాచక్రముకంటె, ఊర్ధ్వమై = మీఁదిదై, శిరసు = శిరస్సుయొక్క, ఇక్కన్ = ప్రదేశమునందు - శిరోభాగమునందు, అధోముఖమూర్తిన్ = తలక్రిందయినస్వరూపముతో, పొల్చి = ఒప్పి, అత్యంత = మిక్కిలి, వికాసశాలియయి = వికసించుటచేత నొప్పినదయి, ఆద్యశివ = ఆదిశివునకు, ఆశ్రయమై = ఆధారమయి, సహస్రపత్ర = సహస్రారముయొక్క,

74 ప :- 1 యాద్యు - గ; యాద్య - ర, అ, గొ. 2 తరచిత్సుధా-ముద్రి (అ), ర; తరసత్సుధా - గొ; తసరత్సుధా - అ.

అంతర = లోపలనున్న, సత్పుధారస = మంచియమృతరసము యొక్క, మహోర్ఘుర = గొప్పప్రవాహముచేత, దుర్దినాయమానచరించు = మబ్బుపట్టినదివసము గానొనర్చు, (మేఘచ్ఛన్నేహ్ని దుర్దినమ్ - అమ) వానకాలమువలెఁజేయు, అద్దొంతర పుష్పవనన్ = అపరంపరగానున్న పుష్పమునందు - అసహస్రారకమలమునందు. కలుగు = ఉన్న, తోరపుఁగంపులు = సాంద్రమయినపరిమళములు, పెంపుమీఱఁగన్ = అతిశయింపఁగా. (మీఁదిపద్యముతో నన్వయము)

సహస్రారము - తంత్రశాస్త్రప్రసిద్ధమగు శిరోభాగమునందుండు సహస్రదళకమలము - 4-47.

చ॥ కనదరుణప్రభావిభవగర్వ 1 ముఖర్వముగానొన 2 ర్చుచున్
దనువుతళుక్కనన్ మెఱవఁ 3 దత్సరసీరుహపంక్తి పేరిని
చ్చెనవడినెక్కి నిక్కినిజజిహ్వికఁజాఁచి లలాటమధ్య సం
జనితసుధామయూఖసుధ సర్పపురంధ్రికగ్రోలిసోలఁగన్. 75

వ్యా :— కనత్ = ప్రకాశించుచున్న, అరుణ = సూర్యునియొక్క, (మిహిరారుణపూషణః - అమ) ప్రభావిభవ = కాంతిసంపదయొక్క, (అర్థారైవిభవాఅపి - అమ) గర్వము = దర్పమును, ఖర్వముగాన్ = తక్కువదానినిగా, ఒనర్చుచున్ = చేయుచు, తనువు = శరీరము - శరీరములోపలిభాగము, తళుక్కనన్మెఱవన్= తళుక్కమని ప్రకాశింపఁగా, తత్సరసీరుహపంక్తి పేరినిచ్చెన = ఆపద్మ శ్రేణివ్యాజమునసైన నిశ్రేణికను, వడిన్ = శీఘ్రముగా, ఎక్కి = అధిరోహించి, నిక్కి = నిగిడి, పైకుబ్బి = నిజ = స్వకీయమయిన, జిహ్వికన్ = నాలుకను, చాఁచి = దీర్ఘీకరించి, లలాటమధ్య = నుదుటినడిమినుండి, సంజనిత = ఉత్పాదితమయిన, సుధామయూఖ=

75 ప. 1 ముఖర్వ - ర, అ. 2 మనర్వ్వళ్ళు.

చంద్రనాడియొక్క - చంద్రనాడియొక్క, సుధన్ = అమృతమును, సర్పపురంధ్రిక = కుండలినీశక్తి, గ్రోలి = పానముచేసి, సోలఁగన్ = పరవశింపఁగా (మీఁదిపద్యముతో నన్వయము)

సుధామయూఖ - చంద్రనాడి సర్పపురంధ్రిక - కుండలినీ శక్తి - చూ 3-138 వ్యాఖ్య. పేరు = వ్యాజము. చూ 4-37,

అలం :— కైతవాపహ్నుతి.

క॥ హృన్మణిసూత్రాకృతియగు
చిన్మూర్తిఁబురాణపురుష 1 శేషావాసున్
గన్మోగిచిలోనిమాపున
సన్మాన్యుఁడతండు చూచుసమయమునందున్. **76**

వ్యా :— సత్ = సజ్జనులచేత, మాన్యుఁడు = పూజింపఁ దగినవాఁడగు, అతండు = అతఁడు - అపుండరీకుఁడు; హృత్ = హృదయమనెడు, మణి = రత్నమునకు, సూత్రఆకృతి = దారము వంటియాకారముగలవాఁడగు, చిన్మూర్తిన్ = జ్ఞానస్వరూపుఁడును, పురాణపురుషన్ = పురాణములందు స్తుతింపఁబడిన పురుషుఁడును, అగు, శేషావాసున్ = శేషుఁడునివాసముగాఁగలవానిని - విష్ణుమూర్తిని (విత్తులువనుట) కన్మోగిచి = కన్నులుమోడ్చి, లోనిచూపునన్ = అంత ర్దృష్టితో, చూచుసమయమునందున్ = విలోకించుకాలమునందు, (మీఁదిపద్యముతో నన్వయము)

దండకము :— (1) 1 కడిఁది 2 యసురధేనుకున్ ధేనుక

---

76 ప :- 1 ఁజింతింపుచుఁదా - గ. శేషావాసుం - ర, గొ, శేషావాసున్-అ.

77 దం :- 1 కడింది - ర (గణభంగము), కడిఁది - అ, గొ. 2 యసురు- మదిం (అ), ర; అసుర - అ, గొ.

త్క్రూరదంభోళి, 3 నస్తంభ 4 దోస్తంభ సంభూతశౌర్యాగ్ని రేఖ గ్రాంచి 5 గోలోకముంగావి, గోవర్ధనక్షోణిధృత్కంపరక్షోణి గ్రీశించువిన్నాణి (2) 6 పెన్నాడికంబైన క్రాల్గన్నులంగల్గు పెందళ్కుల 7 నల్గడం 8 జల్లునెమ్మోము జాబిల్లి 9 శోభిల్ల. (3) నతఫ్ఫుల్లగల్లద్వయిన్ హత్తి మత్తల్లి 10 నర్తించుచున్ మాకరాకారరేఖాభిరామంబులౌ కుండలంబుల్ సమగ్ర ప్రభామండలంబుల్ చలింపన్ (4) నిలింపాళుగాపాకృతిన్ మానసరంబైన మాయూరపింఛంబుతో నైక్యముంబొంను 11 చిక్కంబుచే గొప్పయై కొప్పుగన్పట్టఁ (5) 12 గన్పట్టఁగారాని వెంటున్ మహా 13 ఫాలపట్టంబుపై నెట్టుకో;

14 నిగమకమలగంధముల్ నంధిలంజేయు నాసాపుటిం x బ్రస్ఫుట స్ఫూర్తివర్తింప, (6) 15 x దృష్యద్ధనుస్సంపదల్ పెంపు మీఱంగ 7) రంగదుగ్రచిన్ 16 శార్వరస్కంధబంధుత్వగంధంబు రూపించుమూఁపుల్

---

3 సంస్తంభి - ముద్రి (అ), ర; సస్తంభ – గ; నస్తంభ అ, గొ. 4 'త'లో దోస్తంభ - లేదు. దోస్స్తంభ - ర; దోస్తంభ - అ. 5 త - లో. లేదు: 6 పెన్నాటకం – ముద్రి (అ). ర; పెన్నాడికంబైన - గొ, చ, (పెన్నాణి యం?) - అ. 7 నల్గడల్ – ర (పా). నల్గడన్ – ర, అ, గొ. 8 డల్ జిల్కు – బ; డంజిల్కు – య, ర; డంజగ్గు - అ, గొ. 9 శోభిల్లు – క, గొ; శోభిల్ల - ర, అ. 10 వర్తించుచున్ - ర; నర్తించుచున్ – అ; నర్తింపుచున్ - గొ. 11 చిక్కంబు - ర, గొ; చి (శి?) క్యంబు - అ. 12 గన్పట్టి సంహింపఁగారాని - త; గాఁగోరి – గ, డ, ద, రానివేడ్కన్ – ముద్రి (అ), ర; వెంటుక – అ, గొ. 13 ఫాల - ర, అ; భాల – గొ. 14 నిగమాకమలనూగంధ - త; నిగమకమలగంధ - ర, అ. 15 దృష్యత్-చ దృష్యత్ – ర, అ, గొ. 16 శార్వర - చ; శాక్వర - ర, అ, గొ.

పురాయింప, (8) చింపాకురేఖాత్రియీమైత్రి నేత్రప్రియంబిచ్చుచున్ గంబుపాకంబు 17 పాకంబునన్ బంధురంబై 18 వలత్కంధరంబొప్పఁ (9) గప్పెక్కనీలంపుఁ 19 గంబంబులంబోలు బక్లెలులీలావిభూషావళిం జాలఁబాసిల్ల (10) నల్లోకసౌందర్యధుర్యస్థితిన్ విస్తృత బౌనురస్సీమజీమూతమై హారవర్షోపలశ్రేణిరాణించుమించుంబురాణింపఁగా 20 జేయు (ii) నచ్ఛోనయుచ్చాన భానచ్ఛవిందచ్ఛముంజేసి కంజాతవాసాంఘ్రికం జాతలాక్షాంకశం కావహంబైనపంకేజరాగంబిగుర్పంగ (12) శ్రీ

చరణ 21 యుగళి 22 హాటకంబై, కన 23 ద్ధాటికోద్యత్తులా కోటులూటాడుచున్ జాటువాచాట 24 తల్ చాట (13) ముప్పెటగాఁ 25 జుట్టిరాఁడీఁగ 26 చుట్టుల్ కటిన్ సంఘటిల్లన్ (14) దటిల్లేఖలేఖర్షభుం 27 జేరిరంజిల్లునా 28 నల్లనత్కాంతి గోయష్టియుత్కృష్ట 29 యై హెచ్చఁగా (15) నిచ్చకున్ 30 వచ్చుచున్ గ్రచ్చకాయల్ కరాధిష్ఠితాజాండషండంబులోనాఁగడుంజిత్రభ్రమంబునన్ 31 నిల్పినన్ బొల్పుగాఁ (16) గల్పకస్వచ్ఛగుచ్ఛంబు సత్కార్యమై నిత్యముం గొత్తగాఁబూని

---

17 డదబలలోలేదు. 18 గల — గౌ; వల - ర, అ., 19 కంబంబు-గౌ (గంబంబు - ర, అ. 20 జేయు - ర; జేయు (యు?) - అ; జేయ - గౌ. 21 యుగ్మావళీ — త; యుగళ - ముద్రి (అ), ర; యుగళి-అ. 22 హాటికం - చ,గౌ. 23 ద్ధాటకో — త; ద్ధాట - వ, ర; ద్ధాటికో - అ. 24 తఁజాటి - ముద్రి (అ) తల్‌చాట - అ. గౌ; జాటు - గ; తంజాటు-ర, 25 (జుట్టినఁ-ముద్రి (అ), ర, జుట్టిరా-అ. 26 మట్టాల్-వ; చుట్టుల్-ర,అ. 27 జీరరంజిల్లునా — త, రంజిల్లు కొ — క; 28 నుల్లలత్కాంతి- ముద్రి (అ). ర; నల్లనత్కాంతి - అ. 29 మైహెచ్చ—ముద్రి (అ), ర; యై హెచ్చ - అ, గౌ. 30 వచ్చుచుఁ [నుఁ?] - అ. వచ్చుచుఁ - ర,గౌ. 31 నల్పినఁ — డ, ద, బ; నిల్పినన్ - ర, అ,గౌ

యున్నాఁ 32 డవన్ భవ్యశంఖంబునవ్యాగ్రహస్తంబు 33 నంచిమ్ముగా (17) దివ్యభూషావిశేషార్భటుల్ (×) గమ్మతేఁదెమ్మెరల్ 34 గ్రమ్మఁగా (18) నమ్రదిక్పాలకస్తుతుల్ 35 స్వస్తలంబుంతుఁగా (19) నంటఁగా రాక రాకాసుధాభాను 36 భానుజ్జ్వలజ్వాలకీలాకుల 37 ప్రాఢి 38 రీఢాకృదారూఢగాఢ 39 త్విడోఘుంబమోఘుంబుగా మేఘు 40 పీథీధరాధోజగ 41 ద్ధోరణిన్ 42 దోరణల్ 43 గట్ట (20) యా

దవరమణుఁడు నాభిసంజాతకంజాతజాతుం (21) దఖండాంఘ్రి పీఠీభవద్విశ్వవిశ్వంభరాభాగుఁ (22) డాభోగ 44 వద్భోగిభోగాసనుం, (23) డానవామోద మాధుర్యధుర్యాసుర స్త్రీ కపోలద్వయీపత్ర రేఖాపకార 45 క్రియాక్రూరచక్రాంకుఁ (24) డోంకారసర్వస్వనిర్వాహకుం(25)దుర్విదేమర్వహాంగ ప్రభాగుర్విచేనోషధుల్ గన్నపృథ్వాఖ్య పృథీశముఖ్యుండు, (21) పుండ్రేక్షుకోదండలక్షాభుఁ, (27)డంచద్దరస్మేర

---

32 దనా - త; దనక - ర, అ. 33 నందిమ్మ గానిమ్ముగా దివ్య - త; నండిమ్ముగా - ర, అ, గొ. 34 గ్రమ్మ - ముద్రి (అ), ర; కమ్మ - అ, గొ. 35 స్వస్థలం - ముద్రి (అ). ర; స్వస్తలం - అ. 36 భానూజ్జ్వ-ముద్రి(అ) భానూజ్జ్వలజ్వాలకీలా - ర; భానుజ్వలజ్వాల (లి) - అ; భానుజ్వాలాజాలి-గొ. 37 ప్రౌఢ - ముద్రి (అ). ర; ప్రౌఢి - అ, గొ. 38 లీఢాకృధారీఢాకృదా -ర, అ. 39 త్విడౌ (డో?) ఘంబు (బ?) మోఘుంబుగా - అ. త్విడోఘం బమోఘుంబుగా - ర; గొ. 40 థీకథరాధో - ముద్రి (అ) ర; ధీధరాధో అ, గొ. 41 ద్వారణిక - క; ద్ధోరణిన్ - ర, అ. 42 దోరణుల్ గట్టి-గొ; దోరణల్ గట్ట -ర, అ. 43 గట్టఁగాయాదవశ్రీరమారమణుఁడు - త; యాదవరమణుండు - ముద్రి (అ), త; రమణుఁడు - గొ. 44 అభోగిభోగా - త; వద్భోగి - ర, అ. 45 క్రియాంకూర - త; క్రియాకూర - ర; అ.

సారుం, డుదారుఁడు. (28) 46 దారోత్తముల్ నీలయన్ బాలయున్ లక్ష్మియన్ పక్ష్మలాక్షీశిరోరత్నమున్, భూమియన్ భామయున్, బ్రేమఁ గామించివెన్నాడగా మించి, 47 పంచాబ్దుఁడయ్యున్ గడున్ బ్రోడలౌ బోడలున్ 48 గానఁగా 49 లేనియావిష్కృతింజూపిడీపించియుండన్.

**77**

వ్యా :— కడిఁది = అసాధ్యుఁడగు, అసురన్ = అసురుఁడును, ధేను = గోవుల నెడు, కుత్కీల = పర్వతములకు, దంభోళిన్ = వజ్రాయుధమ నగు, ధేనుకున్ = ధేనుకుని, అస్తంభ = మాత్రము పాటులేని, దోస్తంభ = కంబముఁ బంటి భుజములవలన (నుండి) సంభూత = పుట్టిన, శౌర్య = పరాక్రమమ నెడు, అగ్నిచేన్ = వహ్నిచేత, కాల్చి = దహించి, గోలోకమున్ = ధేనుప్రపంచమును - ధేనుసమూహమును, కాచి = కాపాడి, గోవర్ధన = గోవర్ధనమనెడు, క్షోణిభృత్ = పర్వతముయొక్క, కందరక్షోణిన్ = గుహాప్రదేశమునందు, క్రీడించు = విహరించు, విన్నాణి = నేర్పరి.

ధేనుకాసురుని బలరాముఁడు వధించినను గృష్ణకృతముగాఁ జెప్పుట పరిపాటి. "పూతనాధేనుకారిష్టకేశిచాణూరమర్దనః". (త్రి. ని.) బలరాముని ద్వారమునవధించెననుట. "ధేనుకం --- నిసూదయతి బలరామద్వారేతి". (శబ్దక. దేనుక సూదన - శబ్దమునొద్ద)

---

46 రోత్తముల్ - చ; రోత్తమల్ - ర. అ. 47 ఇది 'త' లో లేదు. 48 జూడ - ముద్రి (అ); ర; గాన - అ. 49 లేనివెన్నికక్క నిక్కంబు - ముద్రి (అ), ర; లేని - అ.

× ఈ గుర్తులుగలచోట్ల గ్రంథపాతమయియుండుననితోఁచెడిని. దర్పణకముకౌనలో ఒక గురువు అధికముగానున్నది - అ. (అధోజ్ఞాపిక)

వ్యాక :— దోః + స్తంభ = దోస్తంభ. "ఖర్పరేశరివా విసర్గలోపోవక్తవ్యః" (వార్తి) పక్షమున - దోస్స్తంభ, దోఃస్తంభ అను రూపములుండును.

అలం :— రూపకము.

(2) పెన్నాడికఁ బైన = మిక్కిలినాణ్యములయిన, (మిక్కిలి ప్రశస్తములయిన - అనుట) గ్రాల్గన్నులన్ = చంచలనేత్రముల యందు, కల్గు = ఉన్న, పెండళ్కులన్ = అధికములయిన తళతళ మను కాంతులను; నల్గడన్ = నలుగుదిక్కుల సమూహమునందు, చల్లు = ప్రసరింపఁజేయు, నెమ్మోము జాబిల్లి = చంద్రునివంటి మేలయిన ముఖము. శోభిల్లన్ = ప్రకాశింపఁగా.

జాబిల్లి - జాను+బిల్లిక. జాను = ఆహ్లాదకరమయిన, బిల్లిక = బింబము. (శ ర;సూ.ని.) నాడికము-నాణకశబ్దభవము. నాణకము = నాడికము = నాడియము = నాడెము. నాడికము - సూ.ని. లో లేదు.

(3) ఉత్ఫుల్ల = విప్పారిన, గల్లద్వయిన్ = చెక్కుదోయియందు, హత్తి = అంటుకొని, మత్తిల్లి = పరవశించి - అదేపనిగా, నర్తించు చున్ = నర్తనముచేయుచు - కదలాడుచు, సమగ్రప్రభా = సంపూర్ణమయిన కాంతియొక్క, మండలంబుల్ = సమూహములు గల, మాకర = మకరసంబంధమయిన, (మొసలికిసంబంధించిన - అనుట) ఆకార = ఆకృతియొక్క, రేఖా = సంపూర్ణతచేత, (రేఖా = ఆభోగే-శబ్దస్తో) అభిరామంబులౌ = ఒప్పిదములగు, కుండలంబుల్ = కర్ణాభరణములు, (మకరకుండలములనుట) చలింపన్ = కదలఁగా, [చెక్కులయందు మకరకుండలకాంతులు నర్తించుననుటచేఁజెక్కుల కాంత్యతిశయము సూచితము]

(4) నిలింప = దేవతలయొక్క, ఆశుగాసన = శరాసనము యొక్క - ఇంద్రధనుస్సుయొక్క, ఆకృతిన్ = ఆకారముతో (ఇంద్రధనుస్సువలె - అనుట) మాసరంబైన = మనోజ్ఞమయిన, మాయూర = మయూరసంబంధమయిన, [నెమిలికిసంబంధించిన] పింఛంబుతోన్ = పురితో, [నెమిలిపురితో - అనుట] ఐక్యమున్ = ఏకత్వమును, పొందు = పొందించు, [సాంగత్యమునుబొందు- అనుట] చిక్కంబు చేన్ = శిక్యముచేత, [ఉట్టిచేత] గొప్పయై = అధికమయినదై, కొప్పు = సిగ, (కబరియు శిఖయునుగొప్పకొగ్రింబును, గొప్పని పల్కఁగా నొప్పుచుండు - ఆం. భా) కన్పట్టన్ = చూపట్టఁగా.

వ్యాక :— ఆశుగ+అస = ఆశుగాసము. ఆసనశబ్ద పర్యాయముగ 'అస' శబ్దమును సాధింపఁదగును. అసధాతువుపైఁ గరణార్థమున 'అప్' ప్రత్యయమునిల్పఁగా, అస్+అప్ = 'అస' అను రీతిని 'అస' శబ్దముసిద్ధించును. మాసరము - చూ. 2-9 వ్యాఖ్య.

అలం :— ఉపమ.

(5) కన్పట్టఁగారాని వెంటన్ = గోచరమగుటకు శక్యముకాని రీతిని, మహత్ = గొప్పదయిన, ఫాలపట్టంబుపైన్ = ఫలకమువంటినుదుటిపై (ఫాలమ్ - భ్రువోరూర్ధ్వభాగమ్ - ఇతి రాజనిర్ఘంటుః -శబ్దక) నిగమకమలగంధముల్ = వేదములనెడు పద్మములయొక్క వాసనలు, నెట్టుకోన్ = నెట్టుకొనునట్లు, సంధిలంజేయు = కూడుకొనఁజేయు, (విష్ణుమూర్తినుదుటిపైకి నిగమకమలగంధములు ప్రసరింపఁజేయు - అనుట) నాసాపుటిన్ = ముక్కుపుటములందు, (జాత్యేకవచనము) ప్రస్ఫుట = మిక్కిలి స్పష్టమయిన, స్ఫూర్తి = వికాసము - ఉబ్బు, వర్తింపన్ = వర్తిల్లఁగా.

(6) దృప్యత్ = దర్పించుచున్న, ధనుస్సంపదల్ = వింటియొక్క వైభవములు, పెంపుమీఱంగన్ = అతిశయింపఁగా.

(7) రంగత్ = వ్యాపించుచున్న, [రగ-గతౌ ఇతి కవికల్పద్రుమః శబ్దక] రుచిన్ = కాంతితో, శాక్వర = ఎద్దుయొక్క. (సౌరభేయో బలీవర్దోబాడవేయశ్చ శాక్వరః - వై. ని) స్కంధ = మూపురముతో, బంధురగంధంబున్ = చుట్టటికపువాసనను, రూపించు = ప్రకటించు, మూపుల్ = అంసములు, పురాయింపన్ = విజృంభింపఁగా.

అలం :— ఉపమ.

(8) ఇంపారు = మిక్కిలి మనోజ్ఞమయిన, రేఖాత్రయీ = గీఁతల మూఁటి సమూహముయొక్క, మైత్రిన్ = చెలిమిచేత, [మూఁడు రేఖలతోఁగూడుకొనియుండుటచేత] నేత్రప్రియంబిచ్చుచున్ = కన్నులకుఁ బ్రీతినిగలిగించుచు, కంబుపాకంబు = ప్రశస్యమయిన [పొగడఁదగిన - సూ. ని.] శంఖముయొక్క, పాకంబునన్ = పరిణామముచేత, [పాక = పరిణామేచ-శబ్దస్తో] బంధురంబై = మనోహరమయి, వలత్ = కూడుచున్న - శోభాయుక్తమగుచున్న, కంధరంబు = మెడ, ఒప్పన్ = ఒప్పఁగా.

కంఠమునరేఖాత్రయముండుట, కంఠము శంఖమువలెనుండుట శుభలక్షణములు.

"లలాటేగళేచైవ, మధ్యేచైవవళిత్రయమ్
స్త్రీపుంసయోరిదంజ్ఞేయా, మహాభాగ్యైకసూచకమ్"
— సాముద్రి

"ద్వాత్రింశద్దశవాశ్చాయం కరకంబుశిరోధరః - సర్వేశ్వరాధికః"
[కాశీ 11 - 73]

[9] కప్పెక్కు = నలుపెక్కిన, నీలంపుఁగంబంబులన్ = నీలమణినిర్మితములగు స్తంభములను, పోల్పు = ఎనయు, బల్కోలు =

దీర్ఘములయినచేతులు [దీర్ఘ బాహువులనుట] లీలావిభూష = విలాసార్థములయిన యాభరణములయొక్క, ఆవళిన్ = వరుసతో, చాలన్ = మిక్కిలి, భాసిల్లన్ = ప్రకాశింపఁగా.

వ్యాక :— బలుపు + కేలు = బల్కేలు - కేలు - జాత్యేక వచనము.

అలం :— ఉపమ.

[10] ఉల్లోక = లోకాతీతమయిన, సౌందర్య = అందముయొక్క, ధుర్యస్థితిన్ = భారమునువహించునిలుకడచేత, విస్తృతంబౌ = విస్తారమయిన, ఉరస్సీమ = వక్షఃప్రదేశము, జీమూతమై = మేఘమై, హార = ముత్యాలపేరులనెడు, వర్షోపల = వడగండ్లయొక్క, శ్రేణి = పంక్తి, రాణించు = శోభిల్లెడు, మించుగా = మెఱపును, పురాణింపఁగాఁజేయఁగా = వర్ధిల్లఁజేయఁగా.

అలం :— రూపకము.

(11) అచ్చోటన్ + అ = అచ్చోటనే - ఆ వక్షస్థలమునందే, ఉచ్ఛూన = బలిసిన - దట్టమయిన, భానుచ్ఛవిన్ = సూర్యకాంతిని తుచ్ఛముఁజేసి = హీనమయినదానినిగా నొనర్చి, (తుచ్ఛః = హీనః, ఇత్యమరకోశః - శబ్దక) తక్కువపఱిచి, కంజాతవాసా = కమలవాసినియొక్క (లక్ష్మీదేవియొక్క) అంఘ్రికంజాత = పద్మములవంటి పాదములయొక్క, లాక్షాంక = లత్తుకచిహ్నములనెడు, శంకా = సందేహమును, ఆవహించు = కలిగించునది, ఐన = అయినట్టి, పంకేజరాగంబు = పద్మరాగమణి - కౌస్తుభమణి, ఇగుర్పంగన్ = పల్లవింపఁగా - శోభిల్లఁగా.

అలం :— భ్రాంతి.

(12) శ్రీచరణయుగళిన్ = పూజనీయమగు పదయుగమందు, హాటకంబై = బంగారమయి - సువర్ణాభరణములయి, కనత్ = ఒప్పుచున్న, ధాటికా = ధాటిచేత - ధారాళతచేత, ఉద్యత్ = ఉద్యమించుచున్న, తులాకోటులు = అందెలు, (పాదాంగదంతులాకోటిః - అమ) ఊటాడుచున్ = కదలుచు, చాటు = ప్రియవచనముతోం గూడిన, (చటుచాటు ప్రియప్రాయమ్ - అభి. ౭౦) వాచాటతల్ = మంచిబహుభాషిత్వములు, (వాచాటో వాచాలో జల్పాకః సుబహుభాషీస్యాదితి శ్లోకార్థపర్యాయేవోపాలితః - శబ్దక) చాటన్ = ప్రకటింపంగా.

(13) ముప్పేటగాన్ = మూండుపేటలుగలదిగా, చుట్టిరాన్ = చుట్టివచ్చునట్లు, (పరివేష్టించునట్లు) తీంగచుట్టుల్ = తావలయములు, బంధువుల్ వలయముల్ పరంగుంజుట్టలనంగ - ఆం. భా) కటిన్ = మొలయందు - నడుమునందు, సంఘటిల్లన్ = కూడుకొనంగా.

(14) కటిల్లేఖ = మెఱపుండీంగ, లేఖర్షభున్ = ఇంద్రుని, (జిష్ణుర్లేఖర్షభశ్శక్రః - అమ) చేరి = పొంది, చేసుకొని, రంజిల్లన్గాన్ = ప్రకాశించునోయనునట్లు, ఉల్లసత్ = వ్యక్తమగుచున్న, కాంతిన్ = ద్యుతితో, గోయష్టి = అవులనుదో్రలెమగట్టి. ఉత్కృష్టయై = ప్రశస్తమయినదయి, హెచ్చగాన్ = అతిశయింపంగా.

అలం :— ఉత్ప్రేక్ష.

(15) ఇచ్ఛకున్ వచ్చుచున్ = మనస్సుకునచ్చుచు. గ్రచ్ఛకాయల్ = గ్రచ్చచెట్టుయొక్క కాయలు, కర = చేతియందు, అధిష్ఠిత = అధిష్ఠింపబడిన, అజాండ = బ్రహ్మాండములయొక్క, షండంబులో = సమూహములో, నాన్ = అనునట్లు, చిత్రి = పలువన్నెలుగల, భస్త్రంబునన్ = తోలసంచియందు, సిబ్బినన్ =

ఉంచఁగా, పొల్పు + కాన్ = ఒప్పిదముకాఁగా.

అలం :— ఉత్ప్రేక్ష.

(16) కల్పక = కల్పవృక్షముయొక్క, స్వచ్ఛ = తెల్లనైన, గుచ్ఛంబు = (పూ) గుత్తి, సత్యార్థమై = సత్యభామకొఱకై, నిత్యమున్ = ఎల్లప్పుడు, క్రొత్తగాన్ = నూతనముగా, పూనియున్నాఁడనన్ = వహించియున్నాఁడోయనునట్లు, భవ్య = శుభాన్వితమయిన, శంఖంబు = శంఖము - పాంచజన్యము; సవ్య = ఎడమదయిన, అగ్రహస్తంబునందున్ = హస్తాగ్రమునందు. (చేతిచివరయందు) ఇమ్ముగాన్ = ఉండఁగా.

వ్యాఖ్య :— సత్యా = సత్యభామ. "నామైకదేశేనామగ్రహణమ్" చూ. 2-15 వ్యాఖ్య.

అగ్రహస్త = అగ్రఃహస్తః అవయవావయవినో రభేదాత్కర్మధారయః, హస్తాగ్రే - శబ్దస్తో.

అలం :— ఉత్ప్రేక్ష..

(17) దివ్య = మనోహరములగు (దివ్యంవల్గౌ - విశ్వ) భూషావిశేష = అభరణవిశేషములయొక్క, అర్భటుల్ = ధ్వనులును, కమ్మలేఁదెమ్మెరల్ = ముక్కునకింపయిన పిల్లవాయువులును, క్రమ్మఁగాన్ = వ్యాపింపఁగా.

అర్భటి - ఇది తెలుఁగు కావ్యములలోనేకన్పట్టును. మురజాకరావార్భటుల్ - వసు 2-156 (సూ. ని.)

తెమ్మెరల్, తెంబు = దక్షిణము. ఎరల్ = గాలి - మలయమారుతము.

(18) నమ్రి = వినయాన్వితులగు, దిక్పాల = దిక్పతులయొక్క ఇంద్రాదులయొక్క, కమ్రి = మనోహరములయిన, స్తుతుల్ = స్తోత్రములు, స్వర్ = స్వర్గముయొక్క, తలంబు = ప్రదేశమును, అంటఁగాన్ = తాఁకఁగా.

దిక్పాలకు - "ఇంద్రోవహ్నిః పితృపతిర్నైరృతో వరుణో మరుత్, కుబేర ఈశః పతయః పూర్వాదీనాం దిశాంక్రమాత్" (అమ)

(19) అంటుగారాక = తాఁకశక్యముకాక, రాకానుభాభాను = పున్నమనాఁటి చంద్రుని, (భానుః కరో మరీచిః - అమ) భాను = సూర్యుని, జ్వలత్ = మండుచున్న. జ్వాలి = అగ్నియొక్క, కీలాకుల = జ్వాలలసజాతీయ సమూహముయొక్క. ప్రౌఢి = దిట్టతనమును, రీఢాకృత్ = తిరస్కరించునదియగు (తిరస్క్రియారీఢా - అమ) ఆరూఢ = ఉత్పన్నమయిన, గాఢ = దట్టమయిన, త్విట్ = కాంతియొక్క, ఓఘంబు = సమూహము, అమోఘంబుగాన్ = మొక్కవోనిదిగా, (నిరర్గళముగాననుట) మేఘపథీ = అభ్రమార్గముయొక్కయు, ధరా = భూమియొక్కయు, అధోజగత్ = పాతాళలోకముయొక్కయు, ధోరణిన్ = పరంపరయందు, తోరణల్కట్టన్ = పిక్కటిల్లఁగా. (అతిశయిల్లగా)

(20) నాభి = బొడ్డువలన, [నుండి] సంజాత = పుట్టిన, కంజాతజాతుండు = పద్మభవుఁడు [బ్రహ్మ] గలవాఁడును.

విష్ణునాభీకమలమునుండి బ్రహ్మజనించెననుట ఋగ్వేదవృత్యము. చూ. 1-3 వ్యాఖ్య.

(21) అఖండ = పరిపూర్ణమయిన, అంఘ్రిపీఠీభవత్ = పాదపీఠముగానగుచున్న, విశ్వ = సమస్తమయిన, విశ్వంభరాభాగుఁడు = భూభాగముగలవాఁడును.

(22) ఆభోగవత్ = పరిపూర్ణతగలిగిన, భోగి = సర్పముయొక్క- ఆదిశేషునియొక్క, భోగ = పడగ, ఆసనుండు = ఆసనముగాఁగల వాఁడును.

ఉత్తరాకాశమునందలి సర్పాకారనక్షత్రముల గుంపునుబట్టి విష్ణుమూర్తికి శేషుఁడుశయ్యగాఁజెప్పఁబడును.

ఈ సర్పాకారనక్షత్రములగుంపును "Serpeus oppiuchus" అని పాశ్చాత్యవ్యవహారము. (నన్న. విజ్ఞా)

(23) ఆసవ = ఆసవమనుమద్యభేదముయొక్క, ఆమోద = సువాసనయొక్క, మాధుర్యధుర్య = తీపిభారమునువహించెడు, అసుర స్త్రీ = అసురకాంతలయొక్క, కపోలద్వయీ = చెక్కుదోయియందలి, పత్రిరేఖా = మకరికాపత్రములకు (పత్రిరేఖాపత్రాంగుళిః - అమ) అపకారక్రియా = కీడుచేయుటయందు, క్రూర = నిర్దయమయిన, చక్రి = సుదర్శనము, అంకుఁడు = చిహ్నముగాఁగలవాఁడును.

ఆసవము — "శీధురిక్షురసైఃపక్వైరపక్వైరాసవోభవేత్, మైరే యంధాతకీపుష్పగుడధానామ్లసంహితమ్" (శబ్దక)

వితంతువులుమకరికాపత్రములు ధరింపరాదుగాన సురసంహారము చేయువాఁడనుటకు భంగ్యంతరముగానిట్లు చెప్పఁబడెను.

అలం :— పర్యాయోక్తి.

(24) ఓంకార = ప్రణవముయొక్క, సర్వస్వ = సమస్తమును, నిర్వాహకుండు = నిర్వహించువాఁడును. [ఓంకారశబ్దవాచ్యుఁడనుట.]

(25) దుర్వహా = వహింపరాని, అంగప్రభాగుర్విచేన్ = దేహ కాంతిచేతగొప్పదియగు, ఉర్వీచేన్ = భూదేవిచేత, ఓషధుల్ = ఓష

ధులను, కన్న = పడసిన, పృథు = పృథువనెడు, ఆఖ్య = పేరు గలిగిన, పృథ్వీశముఖ్యుండు = రాజప్రముఖుఁడును.

పృథుమహారాజుగోరూపధారిణియగు భూమినుండిక్షీరరూపమునఁ బరిణమించిన యోషధులులోనగువానిని బిండుటపురాణ ప్రసిద్ధము. గౌర్భూత్వాతువసుంధరా 'త్యాక్షీరపరిణామనీః'(విష్ణు) "భాస్వంతిరత్నాని మహౌషధీశ్చపృథూపదిష్టాందుదుహూర్ధరిత్రీమ్" (కు. సం. 1-2) విష్ణుమూర్తి యిరువది రెండవతారములలోఁబృథునవతారమొకటి. ఋషుల చేతఁగోరంబడి తొమ్మిదవజన్మంబునఁబృథుచక్రవర్తియై భూమినిధేనువుం జేసి సమస్తవస్తువులంబిదికె." [భాగ. 1 స్కం - 63వ.]

(26) పుండ్రేక్షు = నలుపుగలసిన యెఱ్ఱచెఱకు కఱ్ఱలు, కోదండ = విండ్లుగాఁగలవారియొక్క - మన్మథులయొక్క, లక్ష = నూఱువేల వలె - అసంఖ్యాకమన్మథులవలె, అభుండు = ఒప్పుచున్నవాఁడును,

(27) అంచత్ = ఒప్పుచున్న, దరస్మేర = చిఱునవ్వుయొక్క, సారుండు = సారముగలవాఁడును, ఉదారుఁడు = ఔదార్యముగల వాఁడునగు, యాదవరమణుఁడు = యాదవపతి - కృష్ణుఁడు.

(28) దార = పత్నులయందు, ఉత్తమల = శ్రేష్ఠురాండ్రగు, నీల = నీలాదేవి, అన్ = అనెడు, బాలయున్ = కాంతయు, లక్ష్మీ = లక్ష్మీదేవి, అన్ = అనెడు, పక్ష్మలాక్షీశిరోరత్నమున్ = కాంతాశిరోమణియు, భూమి = భూదేవి, అన్ = అనెడు, భామయున్ = కాంతయు, ప్రేమన్ = మక్కువతో, కామించి = కోరి, వెన్నాడఁగాన్ = వెంబడింపఁగా, మించి = సర్వోత్కృష్టుఁడయి, పంచబాణుఁడయ్యున్ = ఐదేండ్లుగలవాఁడయ్యును. కడున్ = మిక్కిలి, ప్రోడలౌ = జాణలయిన, బోటులున్ = సఖులును, కొన్నఁగాలేని = కన శక్యముగాని, అవిష్కృతిన్ = ప్రకాశమును, చూచి = [illegible]

దీపించియుండన్ = ప్రకాశించియుండఁగా - ప్రత్యక్షమయియుండఁగా (మీఁది పద్యముతోనన్వయము.)

దండకలక్షణము —

క॥ దండిగనేకపదంబున
నుండెడివిన్ నాల్గడుగులనుండెడివిన్ వే
దండావన ! దండకముల
పిండువుదనరారుఁజండవృష్ట్యాదికముల్.

"ఈ రీతితోడన్ నకారంబులున్ రెంటితర్వాతనేడాదిగాఁగా, రకారంబులొప్పారఁగా నంఘ్రినొక్కొక్క టెక్కించి కావించినంజండవృష్ట్యాదినానాలసద్దండకంబుల్ పిసాళించుఁ, గాకుండెనాల్గంఘ్రులుం జేయఁగావచ్చు, నీరీతినేకోనసాహస్రపర్యంతముంగూర్చి యిచ్ఛావిధిం జేయఁగావచ్చుగాంతంబుగా" (అప్పక 4-444, 445) "ఏకోనసహస్రాక్షరపర్యంతాదండకాంఘ్రయః ప్రోక్తాః" [వృత్తర - టీక]

పాండురంగ మాహాత్మ్యమున దండకగణము లిట్లున్నవి.

| | | | |
|---|---|---|---|
| 1 పా | — | నన + 60 ర | |
| 2 పా | — | నన + 68 ర | |
| 3 పా | — | నన + 79 ర | |
| 4 పా | — | నన + 64 ర | + 1 గ |

"ఇచ్ఛావిధింజేయఁగావచ్చు గాంతంబుగా" అను నప్పకవీయమునుబట్టి దండకాంతమునగురువుచేర్చుటయైచ్ఛికమని తెలియుచున్నది. శృంగారనైషధమునందలి దండకమునందెవర గురువుచేర్పఁబడలేదు. పాండురంగమాహాత్మ్యదండకమునఁజేర్పఁబడినది. తగణముల పైనంత మునగురువుంచి [illegible] ప్రసిద్ధము.

క॥ కనుదెఱచితనదులోనం
గనుతేజముమ్రోలఁగాంచికమలాసనుఁడా
డినయట్లనిక్కమయ్యెనె !
వినఁగననిదిక్రొత్తయనుచు వెసనుత్థితుఁడై. 78

వ్యా :— కనుదెఱచి = కన్నులువిప్పి, తనదులోనన్ = తనయొక్కలోపల - తనయొక్కమనస్సులోపల, కను = దర్శించు, తేజము = ప్రకాశమును, మ్రోలన్ = ఎదుట, కాంచి = దర్శించి కమలాసనుఁడు = బ్రహ్మదేవుఁడు, ఆడినయట్ల = చెప్పినట్లే, నిక్కమయ్యెనె = నిజమయ్యెనా ? ఇది = ఇద్ది - మనస్సులోదర్శించు తేజమెదుటఁబ్రత్యక్షమగుట, వినన్ = వినుటకు, కనన్ = కనుటకు, క్రొత్త = అపూర్వము, అనుచున్ = అనుచు, వెసన్ = వేగముగా, ఉత్థితుఁడై = పైకిలేచి నిలఁబడినవాఁడయి. (క్రిందిపద్యముతో నన్వయము.)

వ్యాక :— తనయొక్క + లోనన్ = తనదులోనన్.

## శ్రీకృష్ణుఁడు ప్రత్యక్షమగుట

సీ॥ చామరధ్వజ 1 ధనుశ్శంఖపద్మముఖచిహ్న
లలితపదార్పణాలంకృతమహి
దళితోపరిత్వగుజ్జ్వలదంశుమత్ఫలా
స్తంభాభిరామోరుదండయుగళు

వరదానముద్రాబ్జ 2 ధరణభూషితకటి
న్యస్తకుంచితసమున్నతభుజాఢ్య
సింహావ 3 లగ్నలక్ష్మీపరిహాసితో
యజగర్భగర్భవృత్తావలగ్న

తే॥ జలదసంకాశు, నిర్వ్రీడజఘనదేశుఁ
గోటికందర్పలావణ్యగుణశరణ్యు
విష్ణునిజ 4 భక్త 5 వర్ధిష్ణుఁగృష్ణుఁగాంచి
పలిచెసాక్రోశుఁడగుచునాబ్రాహ్మణుండు. 79

వ్యా :— చామర = వింజామరము, ధ్వజ = టెక్కెము ధనుస్ = విల్లు, శంఖ = శంఖము, ప్రముఖ = మొదలుగాఁగల, చిహ్న = లాంఛనములచేత, లలిత = మనోహరమయిన, (లలిత= సుందరే - శబ్దస్తో) పద = పాదములయొక్క, అర్పణ = ఉంచుట చేత, అలంకృత = అలంకరింపఁబడిన, మహి = భూమిగలవాఁడును.

చామరాది చిహ్నములు పాదములయడుగునముండుట శుభ లక్షణము. చళాసిచాపవజ్రాభారేఖాః కుర్వంతిభూపతిమ్. (సాముద్ర)

"యవపద్మాంకుశచాపచక్రఝుష రేఖాలంకృతంబైనమా, ధవు పాదద్వయము'' (భాగ 1-343) ఇత్యాది.

(2) దళిత = చీల్పఁబడిన - ఒలువఁబడిన, ఉపరిత్వక్ = పై పట్టుగలదియగుటచేత, ఉజ్జ్వలత్ = ప్రకాశించుచున్న, అంశుమత్ఫ

---

79 ప :- 1 శంఖచాప-ముద్రి (అ) ర; ధనుశ్శంఖ – అ, గౌ. 2 భరణ-ర, ధరణ - అ, గౌ, ర (టీక) 3 లగ్నతోషితవరి - పః లగ్నలక్ష్మీ పరిహాసితోయజ - ర, అ, గౌ. 4 భక్తి - గౌ; భక్త - ర, అ.

లాస్తంభ = అరఁటిబోదెవలె, అభిరామ = ఒప్పిదమయిన, ఊరుదండ యుగళున్ = దండములవంటి తొడలదోయికలవాఁడును.

(3) వరదానముద్రాఅబ్జ = పద్మమువంటి వరదముద్రయొక్క, ధరణ = ధారణముచేత, భూషిత = అలంకరింపఁబడిన, కటి = మొలయందు, న్యస్త = ఉంచబఁడిన, కుంచిత = వంచఁబడిన, సమున్నత = మిక్కిలి యెత్తయిన, భుజా = బాహువులచేత, అఢ్యున్ = సంపన్నుఁడును.

వరదముద్ర — వరదానమును సూచించుహస్తముద్రా విశేషము. చూ. 2-229 వ్యాఖ్య.

(4) సింహ = సింగముయొక్క, అవలగ్నలక్ష్మీ = నడుము యొక్క శోభను, పరిహాసి = పరిహాసించుటగల, తోయజగర్భ = బ్రహ్మదేవుఁడు, గర్భ = చూలుగాఁగలిగిన, వృత్త - గుండ్రనయిన, అవలగ్నున్ = నడుముగలవాఁడును.

నాభీకమలము నడుమునందుండునుగాన బ్రహ్మను జూలుగాఁ గలదియనుట. బ్రహ్మవిష్ణునాభీకమలమునఁబుట్టెనను పురాణోక్తిఖగోళ దృశ్యమునకుఁ బ్రతీక. చూ. 1-3 వ్యాఖ్య. నడుమునకుసన్నఁదన మును గుండ్రతనమును జెప్పుటప్రసిద్ధము. "విశాలవక్షాస్తనువృత్త మధ్యః" (రఘు 6-32) - "తనువృత్తమధ్యః, కృశవర్తులమధ్యః" (మల్లినా.)

జలద = మేఘముతో, సంకాశున్ = సమానమయిన వాఁడును. (ఘనశ్యాముఁడనుట) నిర్వ్రీడ = సిగ్గులేని, జఘనదేశున్ = కటిప్రదేశముగలవాఁడును. (దిగంబరుఁడనుట) విష్ణున్ = విశ్వమును వ్యాపించియుండువాఁడును. (విశ్వంవేవేష్టివ్యాప్నోతీతి విష్ణుః - గురు బాల) నిజ = స్వకీయులయిన, భక్త = భక్తులయందు, వర్ధిష్ణున్ =

వృద్ధిపొందుశీలముగలవాఁడును, అగు, కృష్ణున్ = కృష్ణుని, కాంచి = దర్శించి, ఆ బ్రాహ్మణుండు = ఆపాఱుఁడు - అపుండరీకుఁడు, సాక్రోశుఁడగుచున్ = ( భయముచే ) బిగ్గఱగానఱచుట గలవాఁడగుచు, పఱచెన్ = పాఱెను.

చ॥ పఱచినదేవకీసుతుఁడు పక్కననవ్వినఁ గ్రమ్మఱిల్లి, 1 మైఁ
దఱచుగ రోమహర్షణముదంచితభక్తిభరాకులత్వమే
2 ర్పఱచుచుఁగేల్మొగిడ్చి 3 పలుపల్కులతళ్కులసన్నవెన్నెలన్
బఱపుచుఁ బ్రస్తుతించె, మునిబంధవిభంజను భక్తరంజనున్.80

వ్యా :— పఱచినన్ = (పుండరీకుఁడుభయపడి) పాఱి పోఁగా, దేవకీసుతుఁడు = కృష్ణుఁడు, పక్కన నవ్వినన్ = పకాలున నవ్వఁగా, క్రమ్మఱిల్లి = మరలివచ్చి, మైన్ = శరీరమునందు, రోమహర్షణము = గగుర్పాటు, తఱచు+కన్ = దట్టముకాఁగా, ఉదంచిత = ఒప్పిదమయిన, భక్తిభర = భక్త్యతిశయము వలననైన ఆకులత్వము = కలఁతపాటు, ఏర్పఱచుచున్ = ప్రకటించుచు, కేల్ = చేతులు, మొగిడ్చి = జోడించి, పలుపల్కుల = పెక్కు మాటలయొక్క, తళ్కులన్ = కాంతులచేత, సన్నవెన్నెలన్ = లేఁతవెన్నెలను, పఱపుచున్ = ప్రసరింపఁజేయుచు, ముని = మౌనుల యొక్క, బంధ = (సంసార) బంధములను, విభంజనున్ = బాగుగాభగ్నముచేయుఁడగు, భక్తరంజనున్ = భక్తులను రంజించు వానిని - కృష్ణుని, ప్రస్తుతించెన్ = మిక్కిలికొనియాడెను.

పలుపల్కుల -- పల్కులుభారతీస్వరూపములుగానఁ దెలుపు.

---

80 ప :- 1 పై - ప; మై - ర, అ. 2 ర్పరపుచు - చ, త; ర్పఱపుచు-గొ; ర్పఱచుచు - ర, అ. 3 పలుపల్కుల - ముద్రి (అ), ర; పలుఁబల్కుల - అ.

"పంకరుహాయతాక్షి నునుఁబల్కులు --- మన్మథుడేసిన తూపులో యనన్". (శృ. నై. 4-13) ఇటుఁబల్కులుశ్వేతములు. పుష్పసామాన్య వర్ణముశ్వేతము. (సంజీ)

మాలిని :— విధిశివసనకాదుల్ వేదముల్గూడినిన్నో
మధుమథన ! యితండిమ్మాడ్కివాఁడంచునెన్న
న్విధురులయినచోటన్, నేర్చునే? గాఢమోహాం
బుధివడిఁబడుచున్నా బోఁటినీవాటమెన్నన్. 81

వ్యా :— ఓ మధుమథన = ఓ మధుఁడను రాక్షసుని నాశనముచేసినవాఁడా ! - ఓ కృష్ణా ! విధిశివసనకాదుల్ = బ్రహ్మ, యీశ్వరుఁడు, సనకుఁడు (ఇదియొక మహర్షి పేరు) మొదలగువారును వేదముల్ = శ్రుతులను; కూడి = ఏకమయి, ఇతండు = ఇతఁడు, ఇమ్మాడ్కివాఁడు = ఇటువంటివాఁడు, అంచున్ = అని, నిన్నున్ = నిన్ను, ఎన్నన్ = తెలిసికొనుటకు, విధురులయినచోన్ = వికలులయిన విషయమునందు, నాబోఁటి = నావంటివాఁడు. వడిన్ = వేగఁముగా, మోహ = అజ్ఞానమనెడు, అంబుధిన్ = సముద్రమునందు, పడుచున్ = కూలుచు, నీవాటము = నీయొక్కరీతి, ఎన్నన్ = తెలిసికొనుటకు, నేర్చునే = శక్తుఁడగునా? శక్తుఁడుకాఁడనుట.

ఛం :— గణములు - న - న - మ - య - య -

యతి ;— 1 - 8. వృత్తసంఖ్య 15-4672

అలం ;— అర్థాపత్తి

తరళము :— హరిహయోపలభూధరాకృతినందమొందిన యట్టినీ
యురుభృగుస్తుతిపాత్రమున్, గటకోజ్జ్వలంబు 1 నఖౌఘర
త్నరుచిమిశ్రమునైనపాదమునంజనించినగంగ, ని
త్యరతిఁబూనితలంతుఁదాపనిదాఘవృత్తినివృత్తికిన్. 82

82 ప :- 1 నమోఘ - గ; నఖౌఘ - ర, అ, గొ.

వ్యా :— హరిహయఉపల = ఇంద్రనీలమణులయొక్క - ఇందనీలమణినిర్మితమగు. భూధర = పర్వతముయొక్క, ఆకృతిన్ = ఆకారముతో, అందమొందిన = సొబగొందిన, నీ = నీయొక్క, ఉరు = గొప్పవాఁడయిన, భృగు = భృగుమహర్షియొక్క, స్తుతి = స్తోత్రమునకు, పాత్రమున్ = భాజనమును - అని పాదముపక్షమున నర్థము. ఉరు = గొప్పవయిన, భృగు = కొండచఱియలచేత, (ప్రపాతస్తుతటో భృగుః - అమ) స్తుతిపాత్రమున్ = పొగడఁదగినది- అని యింద్రనీలమణిమయమగు పర్వతపక్షముననర్థము. కటక=కడియములచేత, (కటకంవలయః - అమ) ఉజ్జ్వలంబు = ప్రకాశించునదియు - అని పాదముపక్షమునర్థము. కటక = పర్వతమధ్యభాగముచేత (కటకోస్త్రీనితంబోద్రేః - అమ) ఉజ్జ్వలంబు = ప్రకాశించునది - అని పర్వతపక్షముననర్థము. నఖఓఘరత్న = మణులవంటి గోళ్లసమూహముయొక్క, రుచి = కాంతికి, మిత్రమున్ = చెలియు, (గోళ్లకాంతితోనొప్పునది - అనుట) - అని పాదము పక్షముననర్థము. నఖౌఘ = గోళ్లసమూహముయొక్క యాకృతిగల, రత్న = మణులయొక్క, రుచి = కాంతికి, మిత్రమున్ = చెలియు- అని పర్వతపక్షముననర్థము. ఐన = అయినట్టి, పాదమునన్ = చరణమునందు - అని పాదముపక్షమున నర్థము. పాదమునన్ = ప్రత్యంత పర్వతమునందు, (పాదాః ప్రత్యంతపర్వతాః - అమ; కొండసమీపమునందు చుట్టువాఱనుండెడు చిన్నతిప్పలపేళ్లు - గురుబాల) - అని పర్వతపక్షమున నర్థము. జనించిన = పుట్టిన, గంగన్ = గంగానదిని, (మందాకినిని) తాప = ఆధ్యాత్మికము, నాధిభౌతికము, నాధిదైవికము, ననుతాపత్రయమనెడు, నిదాఘ = వేసవియొక్క, వృత్తి = వర్తనముయొక్క, నివృత్తికిన్ = నాశమునకు, పూని = ఉద్యమించి, (దీక్షతో - అనుట) నిత్యరతిన్ = నిరంతరప్రీతితో, తలంతున్ = ధ్యానింతును.

ఆకాశగంగవిష్ణుపాదోద్భవయను పురాణోక్తి ఖగోళదృశ్యమునకుం బ్రతీక. (చూ. 1-72 వ్యాఖ్య)

తాపములు — చూ. 1-140 వ్యాఖ్య.

ఛం :— తరళము. గణములు :— న - భ - ర - స - జ - జ - గ. యతి 1-12. వృత్తసంఖ్య. 19-186040

మిత్రి - "త్యతకారం, ఏకతకారగశ్చేత్యేకే-ఇతి-భరతః" (శబ్దక)

వ్యాక :— నఖౌఘరత్న = రత్నములవంటి నఖౌఘములు ఉపమితసమాసము. నఖౌఘాకారముగల రత్నములు - మధ్యమపద లోపిసమాసము.

అలం :— శ్లేషానుప్రాణితమగునుపమ.

భుజంగప్రియాతము :-

స్ఫురన్నాభిగర్త ప్రభూతాంబుజాతో
దరక్షోణిలో 1 వేల్పుఁదాతన్ విధాతన్
నిరాతంకసర్గైకనిర్ణేతఁగంటన్
హరీ! తాతకుందాతవై యుంటయొప్పున్. 83

వ్యా :— హరీ = ఓకృష్ణా! స్ఫురత్ = ప్రకాశించుచున్న నాభిగర్త = గోయివంటి బొడ్డువలన (నుండి) ప్రభూత = పుట్టిన, అంబుజాత = పద్మముయొక్క, ఉదరక్షోణిలోన్ = కుక్షిప్రదేశము యొక్క యంతర్భాగమువందున్న, విధాతన్ = సర్వమును ధరించు వాఁడును, నిరాతంక = అడ్డులేని, సర్గ = సృష్టియొక్క, (సర్గస్వభావ

83 ప :- 1 వేల్పుతాతన్ - ముద్రి (అ), ర; వేల్పుధాతజా - గౌ; వేల్పుఁదాతన్ - అ.

నిర్మోకనిశ్చయాధ్యాయసృష్టిషు - అమ) ఏక = ముఖ్యమయిన, నిర్ణేతన్ = నిర్ణయకర్తయు, అగు, వేల్పుఁదాతన్ = దేవుఁడయిన బ్రహ్మను (బ్రహ్మతాత -- బ్రహ్మపేరులబ్జమౌళి - ఆం. భా.) కంటన్ = ప్రసవించుటచేత, తాతకున్ = తండ్రికి, (తాతస్తుజనకః పితా - అమ) తాతవై = తండ్రివయి, ఉంట = ఉండుట, ఒప్పున్ = తగును.

సృష్టికర్త యగుటచే సృష్టికిఁదాత,(=తండ్రి) బ్రహ్మ. అబ్రహ్మకుఁ దాత (=తండ్రి) యగుటచే విష్ణుమూర్తి తాతకుఁదాతయగుట యొప్ప ననుట.

వేల్పుఁదాత = వేల్పయినతాత.ధాతృశబ్దభవముతాత. (సూ.ని.) తాతవేల్పు - అనియుఁగలదు. "తగవుగాదనిరాఁడయ్యేఁదాతవేల్పు"- శృ. నై. 4-129.

తాతకుందాత - "తాతతాత = విష్ణువు. (తాత 2) తాత 2 (సం. ధాతా) = బ్రహ్మదేఁవుఁడు - సూ. ని. తాతకు (= బ్రహ్మకు) తాత (తండ్రి) = విష్ణువు. దీనిని, తాతకు (తండ్రికి) తాత = తండ్రి అని యన్యార్థము కల్పితము.

ఛం :— భుజంగప్రయాతమునకు, గణములు - య - య - య - య. యతి :— 1-8. వృత్తసంఖ్య 12-586

వ్యాక :— తాత - ము. కౌ. తత్సమ.

అలం :— నిరుక్తి.

సగ్విణి :— సీతిమై వెన్నభూనేతవై, రత్నసం
ఘాత 1 దివ్యౌషధిగ్రామముల్, భూతహృ

---

84 ప :- 1 దివ్యౌషధ - గ; దివ్యౌషధి - ర, అ, గౌ.

త్రీప్రీతి 2 గన్పట్టవే! స్ఫీతహర్షోత్కటన్
భూతధాత్రీగవిన్, పూతనా 3 శాతనా! 84

వ్యా :— పూతనాశాతనా = పూతనను జంపినవాఁడా! (శాతనమ్ — త్రి. ఛేదకే - శబ్దక) నీతిమైన్ = నయముతో, వైన్య భూనేతవై = పృథుభూపతివై, భూతహృత్ప్రీతిగన్ = ప్రాణులహృదయములకుఁబ్రియముకలుఁగునట్లుగా, స్ఫీత = ఎక్కువయిన, హర్ష = సంతోషముచేత, ఉత్కటన్ = గొప్పదియగు, భూతధాత్రీగవిన్ = భూధేనువునుండి, రత్నసంఘాత= మణులసమూహముయొక్కయు, దివ్య= దివ్యములయిన, ఓషధి = ఓషధులయొక్కయు, గ్రామముల్ = సమూహములను, (గ్రామఃసత్వేసంవర్థేబృందేశబ్దాదిపూర్వకః - విశ్వ) పట్టవే = గ్రహింపవా? (గ్రహించితివనుట)

వైన్యుఁడు - వేనునికుమారుఁడు - పృథుమహారాజు, చూ. 4-77 వ్యాఖ్య.

ఛం :— స్రగ్విణికిగణములు :— ర - ర - ర - ర.

యతి :— 1-7. వృత్త సంఖ్య. 12-1171

లయగ్రాహి :—

ఆగమసముద్ధరణరాగరసలంపట! సుధాగమనియామక!
రసాగరిమశాలీ!
భోగపదవీనిహితభాగవత! భూగగనభాగపరిపూర్ణ
పరభాగవపు 1 రుగ్రా!

---

2 గన్పట్టలే - ముద్రి (అ), ర; గన్పట్టి - ర (పా) జన్పట్టవే-అ; జన్పట్టవే - గౌ. పూతనా - ముద్రి (అ), ర; శాతనా - అ.

85 ప :— 1 రగ్రా - చ, ముద్రి (అ), ర; రుగ్రా - అ.

త్యాగగుణధుర్య ! మునియాగపరిరక్షక ! హాలాగత
సమిద్విజయ ! సౌగతమతార్హో
దోగ్య! కలికాలకలుషాగకులిశాంక! కొనసాఁగిన
కృపన్మనుపుయోగిహితమమ్మున్. 85

వ్యా :— (1) అగమ = వేదములయొక్క, సముద్ధరణ = ఉద్ధరించుటయందలి, రాగరస = అనురాగరసమునందు, లంపట = అత్యాసక్తిగలవాఁడా! ఇది మత్స్యావతారసూచకము. విష్ణువు మత్స్యావతారమున సోమకాసురుని సంహరించి వేదములను బ్రహ్మకిచ్చెనని పురాణకథనము.

(2) సుధాగమ = అమృతప్రాప్తియొక్క. నియామక = నియమనకర్తయయినవాఁడా! ఇది కూర్మావతారసూచకము. (అజితుఁడను విష్ణునవతారము మందరమునువహించెను.(భాగ 8 స్కం-141)

(3) రసాగరిమకారీ = భూమికి గౌరవముకలిగించినవాఁడా! ఇది వరాహావతారసూచకము.

(4) భోగపదవీ = భోగపదమునందు, నిహిత = ఉంచఁబడిన, భాగవత = భగవద్భక్తుఁడుగలవాఁడా - ప్రహ్లాదుఁడుగలవాఁడా! ఇది నృసింహావతారసూచకము.

(5) భూగగనభాగ = భూమ్యాకాశప్రదేశములయందు, పరిపూర్ణ = నిండిన, పరభాగ = గుణోత్కర్షముతోఁగూడిన, వపుః = శరీరము చేత, ఉగ్ర = భయంకరమయినవాఁడా! ఇది వామనావతారసూచకము.

(6) త్యాగగుణధుర్య = దానగుణభారమును వహించువాఁడా! ఇది పరశురామావతారసూచకము. పరశురాముఁడు క్షత్త్రియసంహారముచేసి భూమిని గశ్యపమహర్షికిదానముచేసెనని పురాణకథనము.

(7) ముని = మౌనియొక్క - విశ్వామిత్రునియొక్క, యాగ = యజ్ఞముయొక్క, పరిరక్షక = రక్షణకర్తయయినవాఁడా! (విశ్వామిత్రునియజ్ఞమును రక్షించినవాఁడా! యనుట) ఇది రామావతార సూచకము,

(8) హల = నాఁగటిచేత, ఆగత = పొందఁబడిన, సమిత్ = యుద్ధములయొక్క, విజయ = గెలుపులుగలవాఁడా! ఇది బలరామావతారసూచకము.

(9) సౌగతమత = బౌద్ధమతమునకు, అర్హ = తగిన, ఉద్యోగ = ప్రయత్నముగలవాఁడా! ఇది బుద్ధావతారసూచకము. (చూ 2-64)

(10) కలికాలకలుష = కలి (యుగ) సమయమునందలి పాపములనెడు, అగ = పర్వతములకు, కులిశాంక = వజ్రాయుధము చిహ్నముగాఁగలవాఁడా - ఇంద్రుఁడయినవాఁడా! ఇది కల్క్యవతారసూచకము. కలియుగాంతమునఁబాపములుపండఁగా విష్ణువుకల్క్యవతారమునెత్తునని పురాణకథనము.

కలుషాగకులిశాంక —

ఇంద్రుఁడు పర్వతములఱెక్కలను వజ్రాయుధమున ఖండించెనని పురాణకథనము. (చూ. 3-142 వ్యాఖ్య.)

మమ్ముఁన్ = మమ్ములను, కొనసాఁగిన కృపన్ = వర్ధిల్లిన దయతో, మనుపు = కాపాడుము.

ఇది దశావతారస్తుతి.

చం :— ఉయ్యగ్రాహిమాలికావృత్తములలోనిది. గణములు-భ - జ - స - వ-భ - జ - స -స-భ - య, 8, 16, 24 అక్షరములమీఁదఁబ్రాసయతులు పాటింపవలెను.

మ॥ రవిధామంబులు, సిద్ధమంత్రిములు, చంద్రజ్యోత్స్నికల్, సన్మణి
పరివరశ్రేణులు, భవ్యభేషజతతుల్, పాథోధరంబుల్, సుధీ
భవనిస్తారక ! సేమమిచ్చి జగముంబాలించుమర్యాద, నీ
యవతారంబులశేషలోకహితచర్యాధుర్యసంచారముల్. 86

వ్యా :--- సుధీ = విద్వాంసులను, (సుధీఃకోవిదోబుధః - అమ) భవ = సంసారమువలన (నుండి) నిస్తారక = తరింపఁజేయువాఁడా ! - ఓకృష్ణా! రవి = సూర్యునియొక్క, ధామంబులు = కాంతులు, (గృహదేహత్విట్) సిద్ధమంత్రిములు = సిద్ధప్రాప్తములగు మంత్రములు, చంద్రజ్యోత్స్నికల్ = చంద్రాతపములు, అనఁగా, వెన్నెలలు, సన్మణిపరివరశ్రేణులు = మంచిరత్నశ్రేష్ఠములపంక్తులు, (సమూహములనుట) భవ్య = మేలుగలిగించెడు, భేషజ = మందుల యొక్క, తతుల్ = సమూహములు, పాథోధరంబుల్ = మేఘములు, సేమమిచ్చి = క్షేమమునొసఁగి, జగమున్ = లోకమును, పాలించు మర్యాదన్ = పరిపాలించునట్లు, నీ = నీయొక్క, అవతారంబులు = భూలోకమున స్వయంవ్యక్తములయిన జన్మములు - దశావతారములు. లోక = జగమునకు, హిత = మేలుగలిగించెడు, చర్యాధుర్య = ఆచరణభారమును వహించెడు, సంచారముల్ = సంచరించుటగలవి.

సిద్ధమంత్రిములు - "సిద్ధమంత్రః (సిద్ధోమంత్రః) సిద్ధప్రాప్త మంత్రః, యథాబ్రహ్మవైవర్తే శ్రీకృష్ణజన్మఖండే -

"ద్వాత్రింశద్విధంసిద్ధం, సర్వసాధనకారణమ్
మన్మఖాత్ శ్రోయతాంనంద, సిద్ధమంత్రంగృహాణచ"

"ఓం నర్వేశ్వరేశాయ సర్వవిఘ్నవినాశినేమధుసూదనాయస్వాహేత్యేవంమంత్రశ్చసర్వేషాంకల్పపాదపః, సామవేదేచకథితః సిద్ధానాం సర్వసిద్ధిదః" (శబ్దక.)

చంద్రిజ్యోత్స్నకల్ - జ్యోత్స్న = ప్రకాశము - సూ. ని. "ఫణమణిజ్యోత్స్న దివియకళంబములగుదురు" (భీమ 3-62) కావునఁ జంద్రజ్యోత్స్నాశబ్దముచంద్రికాపశబ్దపర్యాయముకానోపును - లేదా, జ్యోత్స్నాశబ్దమునకు వెన్నెలయనునర్థముండుటచే; నిటఁజంద్రశబ్ద సాహచర్యముచేఁ బ్రసన్నతాతిశయముగ్రాహ్యమనిచెప్పవచ్చును. చంద్ర జ్యోత్స్నయున్" (ఆది 4-89)

అలం :— ఉపమ.

ఉ॥ అంజనపుంజ నవ్యతరమైతగు నీ తిరుమేనికప్పుక
ల్మింజులుకంగఁజేకుఱుఁజుమీ! కమలేక్షణసూక్ష్మదృక్కు 1 లో
కంజభవాదివృద్ధులకుగాఢతరాక్షరలక్ష్మి, 2 యెందుఁగా
నంజనుఁగాఁదెకప్పుకతనన్ మునుదోఁపనియక్షరస్థితుల్. **87**

వ్యా :— కమలేక్షణ = ఓ పద్మాక్షా! - ఓకృష్ణా! అంజన పుంజ = కాటుకరాశివలె, నవ్యతరమౌ = మిక్కిలి నూతనమయి, తగు = ఒప్పెడు, నీ = నీయొక్క, తిరుమేనికప్పు = శ్రీపవిత్రమయిన (పవిత్రమయిన) యొడలి నల్లఁదనముయొక్క, కల్మిన్ = సంపద చేత, సూక్ష్మదృక్కులౌ = సూక్ష్మమయిన బుద్ధికలవారగు - అని యర్థము, మందగించిన చూపుగలవారగు - అని యర్థాంతరము కంజ భవ = బ్రహ్మ, ఆది = మొదలుగాఁగల, వృద్ధులకున్ = పెద్దలకు అని యర్థము; ముసలివారికి - అని యర్థాంతరము. గాఢతర = మిక్కిలి యతిశయమయిన, అక్షరలక్ష్మి = మోక్షసంపద - అని యర్థము, (అక్షరంతుమోక్షేపి - అమ) వర్ణములసమృద్ధి - అని యర్థాంతరము చులుకంగన్ = సులభముగా, చేకుఱుఁజుమీ = ప్రాప్తించునుజుమా!

---

87 ప :- 1 తాఁగంజ - ద, ధ, బ; లౌకంజ - ర, అ, గౌ. 2 యందుఁగా యందు - ర, అ.

ఎందున్ = ఎచ్చటనైనను, కప్పుకతనన్ = నల్లఁదనము కారణమున-అంజనముయొక్క నల్లనిపూఁత కారణమున, మును = ముందు, తోఁపని = గోచరముకాని, అక్షరస్థితుల్ = వర్ణములస్వరూపములు, కానంజనుఁగాదె = కనఁబడునుగదా !

శిలాక్షరములు సరిగాఁగనఁబడనప్పుడు వానికిఁగాటుకపూసినచో నవిస్పష్టముగాఁగనఁబడును. అట్లు కాటుకపూసిశిలాక్షరములు (శాసనాక్షరములు) చదువుటయాచారము. "కళింగమేదినీ విభునపకీర్తి కజ్జలము వేమఱుఁబెట్టిపఠించునిచ్చలున్ (మను 1-39)

అలం :— శ్లేషమూలకమగునర్థాంతరన్యాసము.

క॥ కమిచియణురేణుతృణకా
ష్ఠములంబరిపూర్ణవృత్తినమ 1 కూరిన నీ
యమిత 2 మహోమహిమాబ్ధికిఁ
గమలభవప్రముఖులెన్నఁగా బుద్బుదముల్. 88

వ్యా :— అణురేణు = అణుధూళియనెడు, తృణకాష్ఠములన్ = గడ్డినిగట్టెలను, కమిచి = పొదివి, పరిపూర్ణవృత్తి నమకూరిన = సంపూర్ణమయిని స్థితినిబొందిన, నీ = నీయొక్క, అమిత = అధికమయిన, మహః = తేజముయొక్క, (తేజోధామమహోవిభా - అమ) మహిమ = మహత్త్వమనెడు, అబ్ధికిన్ = సముద్రమునకు, కమలభవప్రముఖులు = బ్రహ్మాదులు, ఎన్నగాన్ = భావింపఁగా, బుద్బుదముల్ = నీటిబుడగలు.

అలం :— రూపకము.

---

88 ప :- 1 కూరెనునీ-ఉ,ద,ఖ; రిననీ-అ,ర,గొ. 2. మహా-ర,అ; మహొ-త.

పృథ్వి :- జగత్పతి! భవత్పదాబ్జయుగభక్తిసంయుక్తి 1 లో
గగుర్పొడువనన్యథాగతియెఱుంగకెవ్వాఁడు నీ
యగణ్యగుణకీర్తనంబధిగమించుటన్ 2 మించునే
నగాధభవసాగరంబతఁడు దాఁటునొక్కెత్తునన్. **89**

వ్యా :— జగత్పతి = ఓ లోకనాథా! - ఓకృష్ణా! భవత్ = నీయొక్క, పదాబ్జయుగ = పద్మములవంటి యడుగుదోయి యందలి, భక్తిసంయుక్తి = భక్తియొక్కకూడిక, లోన్ = లోపల-హృదయమునందు, గగుర్పొడువన్ = పులకింపఁగా - అతిశయింపఁగా, అన్యథాగతి = వేఱెదిక్కు, ఎఱుంగక = తెలియక, ఎవ్వాఁడు = ఎవఁడు - ఎవఁడైన, నీ = నీయొక్క, అగణ్య = లెక్కింపశక్యము కాని, గుణ = సద్గుణములయొక్క, కీర్తనంబు = స్తుతిని, అధిగమించుటన్ = స్వీకరించుటచేత, మించునేన్ = అతిశయించిన పక్షమున, అతఁడు = వాఁడు, అగాధ = మిక్కిలిలోఁతయిన భవసాగరంబు = సంసారసముద్రమును, ఒక్కెత్తునన్ = ఒక్కసారిగా, దాఁటున్ = తరించును.

వ్యాక :— ఎవ్వాఁడు = ఎవ్వాఁడైనను. ఐనను-అనునది యధ్యాహార్యము - ప్రౌ. వాక్య 13

ఛం :— పృథ్వీవృత్తమునకు, గణములు :- జ - స - జ స - య - వ. యతి 1-9. పృథ్వీలక్షణము.

"జసౌజసయలావసుగ్రహయతిశ్చపృథ్వీగురుః" (వృత్తర)
శ్రీనాథుఁడు పెద్దన రామకృష్ణుఁడు సంస్కృతలక్షణానుసారముగఁ

---

89. ప :- 1 తో - డ, ద, ఋ; తో - ర, అ, గా. 2 మించెనే-ముద్రి(అ); మించునే - అ.

దొమ్మిదవయక్షరముతో యతిమైత్రిపాటించిరి. నన్నయ 12వ యక్షర మునకు యతి వేసెను. తెనుఁగులక్షణకర్తలునన్నయమార్గమునే యను సరించిరి. "జనల్ జసయ వంబులుష్ణకరసంఖ్య విరామయుతులున్" (అప్పక) వృత్తసంఖ్య 11-896

అలం :— రూపకము.

క॥ భవదంఘ్రిదూరునకుఁబు
ణ్యవసతిసులభంబె? వెఱతునయ్య! భవంబుల్
సవరింప, యుష్మదర్చా
ప్రవణమతింజేయుననుఁబరంధామపతీ ! **90**

వ్యా :— పరంధామపతీ = ఓ వైకుంఠనాథా ! భవత్ = నీయొక్క, అంఘ్రి = పాదములకు, దూరునకున్ = దవ్వయినవానికి, పుణ్యవసతి = సుకృతనిలయము, సులభంబె = సులువుగాలభించునా? (లభింపదనుట) భవంబుల్ = జన్మములు, సవరింపన్ = ప్రాపించుటకు, వెఱతునయ్య = భయపడుదును, యుష్మత్ = నీయొక్క, అర్చా = పూజయందు, ప్రవణ = ఆసక్తమయిన, మతిన్ = బుద్ధి గలవానినిగా, ననున్ = నన్ను, చేయు = ఒనర్పుము.

పరంధామ - "పరమ్. అవ్య. కేవలే" (శబ్దస్తో) పరంధామము = అద్వితీయస్థానము (వైకుంఠము - మొ.) - సూ. ని. "పరం, ధామతతిపుట్టె" (ఉ. హ. 1-88) ఇట్లే, పరంజ్యోతి (అశ్వ 2-156) పరంపదము, లోనగునవి.

క॥ 1 జయవిజయాపూర్ణపార్శ్వ ! వి
జయజయకల్పనధురీణ ! సమదదనుజరా

---

91 ప :- 1 జయవిజయాపూర్ణవిభవ – గౌ; జయవిజయపూర్వవిభవ - ర; జయవిజయపూర్ణపార్శ్వ - అ.

జ్ఞయ ! సంరక్షితభువనా !
జయజయ! సుగుణాగుణాత్మ ! జయ! శార్ఙ్గధరా! 91

వ్యా :— జయవిజయ = జయవిజయులచేత, పూర్ణ = నిండిన, పార్శ్వ = ప్రక్కభాగముగలవాఁడా ! విజయజయకల్పన ధురీణ = అర్జునునకు గెలుపుగూర్చు భారమునువహించినవాఁడా ! సమద=గర్వముతోగూఁడిన. దనుజరాట్ జయ=దానవరాజునుజయించిన వాఁడా! సంరక్షిత = బాగుగాఁగావఁబడిన, భువనా = లోకములు గలవాఁడా ! సగుణ = సగుణమును, అగుణ = నిర్గుణమును, అగు, ఆత్మ = స్వభావముగలవాఁడా! జయజయ ! శార్ఙ్గధరా = శార్ఙ్గమును ధరించినవాఁడా ! జయ.

జయవిజయులు విష్ణుమూర్తిపారిషదులు - "ఏతౌద్వాఃపార్షదౌ మహ్యం, జయోవిజయఏవచ" - భాగ.

సగుణాగుణాత్మ --- పరబ్రహ్మము సగుణమని నిర్గుణమని రెండువిధములు.

"బ్రహ్మైకంమూర్తిభేదస్తు, గుణభేదేనసంతతమ్.
తద్బ్రహ్మద్విధంవస్తు, సగుణంనిర్గుణం శివ!" (బ్రహ్మవై)

వ్యాక :— జయజయ, జయ - ఇవి జయజయధ్వనులను దెలుపు శబ్దములు. ప్రౌ. సంజ్ఞా 16 మంటూ.

సీ॥ నడతునీ క్షేత్రింబునకుఁ 1 జెయిచాఁచి, య
ర్చింతు 2 నిన్ నమ్మిన సేవకు 3 లను

92 ప :- 1 జెయ్యి - గొ, జెయి - ర, అ. 2 నీనమ్మిన - ముద్రి (అ)ర, నిన్నమ్మిన - అ. 3 లవ - గ, గొ; లను - ర, అ.

క్రొమ్ముక్కుదునీపాద 4 ములకు, జిహ్వావీథి
నీ నామములు 5 వక్కాణింతునెపుడు
నర్పింతునీ సేవకై 6 సర్వదేహంబుఁ
జింతింతునీలీలఁజిత్తసరణిఁ
దనివోనినీచక్కఁదనము 7 నంవీక్షింతు
నీ 8 యవదానంబు నెమ్మివిందు

తే॥ బ్రహ్మరుద్రాదులకుఁగానఁబడని నీవు
నేఁడునాముందు నిలిచితి, నీలవర్ణ!
వర్ణనాతీత! మత్ప్రాగ్భవప్రవృత్త
పుణ్యపరిపాకమేరికిఁబొగడఁదరమె? 92

వ్యా :— నీ క్షేత్రంబునకున్ = నీయొక్క క్షేత్రమునకు, నడతున్ = పోవుదును. నిన్ = నిన్ను, నమ్మిన = విశ్వసించిన, సేవకులను = దాసులను, చెయిచాఁచి యర్చింతున్ = చేతులుసాఁచి పూజింతును. నీపాదములకున్ = నీయొక్కచరణములకు, మొక్కుదున్ = నమస్కరింతును. నీనామములు = నీయొక్కపేళ్లు, (విష్ణుసహస్రనామములనుట) జిహ్వావీథిన్ = నాలుకత్రోవయందు, ఎపుడున్ = ఎల్లప్పుడు, వక్కాణింతున్ = వక్కాణింతును. (నీ నామములను జపింతుననుట.) నీసేవకై = నీయొక్క కైంకర్యముకొఱకు సర్వదేహంబున్ = ఎల్లశరీరమును, అర్పింతున్ = సమర్పింతును. నీలీలన్ = నీయొక్క క్రీడను, చిత్తసరణిన్ = మనోమార్గమునందు,

4 ములకు - ర, అ; ములక - గ, గౌ. 5 వకాణింతు - అ; వక్కాణింతు - ర, గౌ. 6 నాదు - గౌ; సర్వ - ర, అ. 7 నేవీకింతు - గౌ; నంవీకింతు - అ, ర. 8 యవధా - క, ముద్రి (అ), ర; యవదా - అ.

చింతింతున్ = ధ్యానింతును. నీ చక్కఁదనమున్ = నీ యొక్క సౌందర్యమును, తనివోక = తృప్తిపడక, సంవీక్షింతున్ = లెస్సగా దర్శింతును. నీ = నీయొక్క, అవదానంబున్ = ఎల్లరకుఁబ్రశంస నీయమయిన పూర్వచరిత్రను, (అవదానంకర్మవృత్తమ్ - అమ. వృత్తం కర్మ, ప్రశస్తమథచనిర్యూఢం కర్మ. యేకర్మేప్రవృత్తి తేసకలేప్రశంస సాకతే - శబ్దక) నెమ్మిన్ = ప్రీతితో, విందున్ = ఆకర్ణింతును. నీలవర్ణ = నీలమయిన (మేసి) చాయగలవాఁడా! వర్ణన = పొగడుటకు, అతీత = అందనివాఁడా! బ్రహ్మరుద్రాదులకున్ = అజుఁడు శివుఁడు లోనగువారికి, కానఁబడని = కనవ్పట్టని, నీవు=ఈవు, నేఁడు = ఈనాఁడు - ఇప్పుడు, నామ్రోలన్ = నాయెదుట, నిలిచితి = ప్రత్యక్షమయితివి. మత్ = నాయొక్క, ప్రాక్ = ముందటిదయిన, భవ = పుట్టుకయందు, (పూర్వజన్మమునందు - అనుట) ప్రవృత్త = బాగుగానాచరింపఁబడిన, పుణ్య = సుకృతముయొక్క, పరిపాకము = పరిణామము, ఏరికిన్ = ఎవరికయినను, పొగడఁదరమె = కొనియాడశక్యమా? శక్యముకాదనుట.

శా॥ నిత్యస్ఫూర్తిసనాథువై రవి ధికంఠేకాలముఖ్యుల్ కృత
క్షిత్యానంద! 1 యనాథమూర్తివగునీచేఁ, దత్సనాథత్వసం
పత్త్యావిష్కృతినాకునుంగలుగుఁదత్ప్రాయుండనేకాన, నే
మృత్యుక్రూరభయంబుఁబాసితినిజుమ్మీ! నీదయాసంపదన్.

**93**

వ్యా :— కృత = చేయఁబడిన, క్షితిఆనంద = భూమియొక్క సంతోషముగలవాఁడా! (భూదేవికి సంతోషముకలిగించినవాఁడ మటు) అనాథమూర్తివగునీచేన్ = దిక్కులేనియాకృతిగలవాఁడవగునీచేత, విధికంఠేకాలముఖ్యుల్ = బ్రహ్మరుద్రాదులు, నిత్యస్ఫూర్తి = శాశ్వత

93 ప :- 1 యనాది - ముద్రి (అ); ర; యనాథ - అ, గౌ, ర (పా)

మయిన ప్రకాశముచేత, సనాథులైరి = దిక్కుగలవారయిరి-అనివిరోధము అనాథమూర్తివగునీచేన్=సర్వస్వతంత్రమైనయాకృతిగలవాఁడవగునీచేత విధికంఠేకాలముఖ్యుల్=బ్రహ్మరుద్రాదులు, సనాథువైరి=అధినాథునితోఁ గూడుకొన్నవారైరి - అని విరోధపరిహారము. తత్ = వారితో - ఆ బ్రహ్మరుద్రాదులతో, ప్రాయుండనేకాన = సమానుఁడనేకావున, (ప్రాయః = తుల్యమ్ - శబ్దక) తత్సనాథత్వసంపత్తి = ఆయధినాథ సహితత్వసంపదయొక్క, ఆవిష్కృతి = ఆవిష్కారము, నాకునున్ = నాయందును, (నావిషయమునందును) కలుగున్ = సంఘటిల్లునుగాక! నీదయా సంపదన్ = నీయొక్క కరుణాసంపత్తిచేత, మృత్యు = మరణముయొక్క, కూర = నిర్దయమయిన, భయంబుల్ = భీతి వలన (నుండి), పాసితినిజుమ్మీ = విముక్తుఁడనైతినిజుమా!

వ్యాక :— కంఠేకాల - కంఠమునందుఁగాలమువేనికిఁ గలదోవాఁడు - శివుఁడు. ఈపక్షమున వ్యధికరణబహువ్రీహి, అలుక్స మాసము. కంఠమునందున్న కాలమువేనికిఁగలదోవాఁడు - అన్నపక్ష మున సమానాధికరణబహువ్రీహి. ఈ రెండుపక్షములును భాష్యసమ్మ తములే. "బహువ్రీహేరవకాశఃకంఠేకాలః -- బహువ్రీహిర్భవతివిప్రతి షేధేన" (వర్ణోవర్ణేన - అను సూత్రమునొద్ద) "కంఠేస్థఃకాలోయస్య కంఠేకాలః" (అనేక మన్యపదార్థే - అను సూత్రమునొద్ద) - మ.భా. (వృత్తివి)

నాకునున్ = నా యందును - ప్రౌ. కారక 13

భయంబున్+పాసితిన్ - బా. కారక 11; ప్రౌ. కారక 11

అలం ;— విరోధాభాసము.

చ॥ అనిలోకత్రయమోహనుండగురమాప్రాణేశునెమ్మోమునన్
దనచూడ్కుల్ నిగుడంగభూమిసురరత్నంబూరకున్నంత, 1 నే
మునుగా ధాతృసమన్వితాఖిలమరున్ముఖ్యుల్ దగన్ మ్రొక్కి మో
డ్పునకేలింపుగ నమ్మునీశ్వరుగుణంబుల్ సారెఁగీర్తించినన్. **94**

వ్యా :— అని = ఈ ప్రకారముగా, లోకత్రయ = జగములమూఁడింటికి (ముజ్జగములకు - అనుట) మోహనుండగు = మోహమునుగలిగించువాఁడగు, రమాప్రాణేశు = లక్ష్మీపతియొక్క; నెమ్మోమునన్ = ప్రశస్తమయిన ముఖమునందు, తన = తనయొక్క, చూడ్కుల్ = చూపులు, నిగుడంగన్ = ప్రసరింపఁగా, భూమిసురరత్నంబు = శ్రేష్ఠుఁడయిన బ్రాహ్మణుఁడు, ఊరకున్నంతన్ = మిన్నకయున్న సమయమునందు, నేను = నేను (వక్త శివుఁడు) మునుగాన్ = మొదలుగా, ధాతృసమన్విత = బ్రహ్మతోఁగూడిన, అఖిలమరున్ముఖ్యుల్ = ఎల్లదేవతాప్రముఖ్యులు, తగన్=యుక్తముగా, (ఉచితరీతిననుట) మ్రొక్కి = నమస్కరించి, మోడ్పునకేలు = జోడించినచేతులు, ఇంపుగన్ = ఒప్పిదముకాఁగా; అమ్మునీశ్వరు = ఆమౌనినాథునియొక్క - ఆపుండరీకునియొక్క, గుణంబుల్ = సద్గుణములు, సారెన్ = మాటికి, కీర్తించినన్ = స్తుతింపఁగా.

లోకత్రయ - "స్వర్గమర్త్యపాతాళభేదస్త్రీణి జగంతి - ఇత్యేకే" (కావ్యమా)

వ్యా :— మోడ్పునకేలు - మోడ్పుయొక్క + కేలు. షష్ఠిలో నగాగమము - మోడ్పు + న + కేలు = మోడ్పునకేలు-ప్రా. సమాస.1

---

94 ప :- 1 యే - గ, గొ; నే - ర, ల.

క॥ వినిముగ్ధహాసరుచిరా
ననుఁడై తనచుట్టునున్న నానామరరా
జనికాయముతోఁబలుకున్
దనుజారి మహీసురాన్యదత్తేక్షణుఁడై. 95

వ్యా :— విని = ఆలకించి, ముగ్ధ = మనోహరమయిన, (ముగ్ధసుందరమూఢయోః - విశ్వ) హాస = నవ్వుచేత, రుచిర = మనోజ్ఞమయిన, ఆననుఁడై = ముఖముగలవాఁడయి, దనుజారి = కృష్ణుఁడు, మహీసుర = బ్రాహ్మణునియొక్క - పుండరీకునియొక్క, అన్య = ముఖమునందు, దత్త = ఈయఁబడిన - ప్రసరింపఁబడిన, ఈక్షణుఁడై = చూపులుగలవాఁడయి, తన = తనయొక్క, చుట్టు నున్న = నలువైపులనున్నట్టి, నానాఅమరరాజ = బహువిధదేవతా శ్రేష్ఠులయొక్క, (రాజన్ - పూర్వపదస్థః, ఉత్తరపదస్థస్యనమభివ్యాహృతపదార్థశ్రేష్ఠవాచకః, యథా - రాజమాషః, మునిరాజ - ఇత్యాది. శబ్దస్తో) నికాయముతోన్ = సమూహముతో, పలుకున్ = (ఇట్లు) వచించెను.

సీ॥ శాంతుండుసత్యసంధాధురంధరుఁడు మ
ద్భక్తుండు పితృహితోద్యముఁడునైన
యుద్ధరామరసూతికిప్పితం 1 బొసఁగనే
వచ్చుచో. మీరెల్లవారునితని
కర్మిలిసాహాయ్యమాచరించుటకునై
యేతెంచినారు, నాకెవ్వరేని
హితులువారలపనులెల్లమీాయవి 2 గానఁ
బరతాపతప్తులు పరముదేక

96 ప :- 1 బొసఁగు - గ; బొసఁగ - ర, అ, గౌ. 2 కానపర - అ; కానఁ బర - ర; గానఁబర - గౌ.

తే॥ ముదితులస్మత్ప్రశంసాభి 3 ముఖులునైన
వారునాభక్తులగువారు, వారియందుఁ
బ్రీతిగలవారినేనుద్ధరింతుఁగిడు
వలన, వారలకంటెనవశ్య 4 మగుట. 96

వ్యా :— దాంతుండు = తపఃక్లేశమును సహించువాఁడును, (తపఃక్లేశసహోదాంతః - అమ) సత్యసంధాధురంధరుఁడు = సత్య ప్రతిజ్ఞాధురీణుఁడును, మత్ = నాయొక్క, భక్తుండు = భక్తుఁడును, పితృ = తల్లిదండ్రులకు, (మాతాపితరౌపితరౌ - అమ) హిత = ఇష్ట సాధనమయిన, ఉద్యముఁడు = పూనికగలవాఁడును, ఐన = అయి నట్టి, ఇద్దరామర = ఈ బ్రాహ్మణునియొక్క, సూతికిన్ = బిడ్డకు - ఈబ్రాహ్మణకుమారునకు, ఈప్సితంబు = అభీష్టమును, ఒసఁగన్ = ప్రసాదించుటకు, ఏన్ = నేను, వచ్చుచోన్ = అరుదెంచునప్పుడు, నాకున్ = నాకు, ఎవ్వరేని = ఎవరు (ఏని - వాక్యాలంకారము) హితులు = ఆప్తులో, (ఓ - అర్థాపార్థము - ప్రౌ. వాక్య. 1-3) వారల = వారియొక్క, పనులెల్లన్ = కార్యములన్నియు, మీాయ వియు = మీావే. కాన = కాఁబట్టి, మీారెల్లవారున్ = మీారందఱు, ఇతనికిన్ = ఈతనికి-ఈపుండరీకునకు, అర్మిలిన్ = ప్రీతితో, సాహాయ్య మాచరించుటకునై = సాయముచేయుటకొఱకు, ఏతెంచినారు = వచ్చినారు. పర = ఇతరులయొక్క, తాప = సంతాపముచేత, తప్తులు = సంతాపితులు, పర = ఇతరులయొక్క, ముద్ = మోద ముచేత, ఏకముదితులు = ముఖ్యమయినమోదముగలవారు, మత్ = నాయొక్క; ప్రశంసా = స్తుతికి, అభిముఖులున్ = ఉన్ముఖులును, ఐనవారు = అయినట్టివారు, నాభక్తులగువారు = నా యొక్కభక్తు

3 ముఖ్యులైన - గౌ; ముఖులునైన - ర, అ. 4 మగుధు - గ; మగుట - ర, అ, గౌ.

లయినవారు. (నాకుభక్తులనుట) వారియందున్ = వారలయందు - నాభక్తులయందు, ప్రీతికలవారిన్ = ప్రియముగలవారలను, వారల కంటెన్ = వారికంటె - నాభక్తులకంటె, అవశ్యమగుటన్ = అనివార్యమగుటచేత, (నాభక్తులయందుఁబ్రీతిగలవారిని రక్షించుటతప్పనిసరియగుటచేత - అనుట) ఏన్ = నేను, కీడువలనన్ = చేటునుండి, ఉద్ధరింతున్ = రక్షింతును.

క॥ సద్భక్తసేవచేతన్
మద్భావముతుష్టిగన్నమాడ్కిఁదరుశిలా
ద్యుద్భూతప్రతి 1 మార్చన
ముద్భరితముగాదునిక్కముగఁదలపోయన్. 97

వ్యా :— సద్భక్త = ఉత్తములయిన భక్తులయొక్క, సేవచేతన్ = శుశ్రూషచేత, మత్ = నాయొక్క. భావము = హృదయము, తుష్టిగన్నమాడ్కిన్ = సంతోషముపొందునట్లు, తరుశిలాది = వృక్షములాయిమొదలగు వారివలన, (నుండి) ఉద్భూత = కలిగిన-కొయ్యలాయిమున్నగువానితోఁజెక్కిన, ప్రతిమా = విగ్రహముల యొక్క, అర్చనన్ = పూజచేత, తలపోయన్ = ఆలోచింపఁగా, నిక్కముగన్ = నిజముగా, ముత్ = మోదముతో, భరితముకాదు = నిండినదికాదు.

వ॥ 1వలనాయేటికినాశ్రయించిమనఁగావానీరముస్నిరమున్?
దల 2 వెఱ్ఱిపచరింపనేటికి నమి 3 ద్దానంబుదానంబు ? న

---

97 ప :- 1 మార్చల - ముద్రి (అ), ర; మార్చన - అ.

98 ప :- 1 వలసా - గ, గౌ; వలనా - ర, అ. 2 వెఱ్ఱిల్ - త; వెఱ్ఱి - ర, అ, 3 ద్దానంబు - ముద్రి (అ); ద్దానంబు - అ, గౌ.

చ్ఛలమాయేటికినె త్తిఁ4 గట్టుకొనఁగా 5 సన్న్యాసమున్న్యాసముఁ?
6 గలి. తేఁజాలుమదీయభక్తిరుచిభక్తశ్రేణికశ్రాంతమున్. 98

వ్యా :— వానీరమున్ = నీటిప్రబ్బలిచెట్లను, (అథ వేతసే-వానీరవంజులాః - అమ) నీరమున్ = జలమును, ఆశ్రయించి = ఆధారముగాఁజేసికొని, మనఁగాన్ = జీవించుట, ఏటికిన్ = ఎందులకు? వలనా = (ఇది) వివేకమా? (వివేకము కాదనుట)

మునివృత్తిచేకొని నీటిప్రబ్బలిచెట్లను నీళ్లనునాధారముగాఁజేసికొనుట వివేకముకాదనుట "వానీరః = దాహశమనార్థం వన్యతఇతి వానీరః. దాహశమనార్థమైపొందఁబడునది" (గురుబాల) వారి భక్షణముచేయుచుఁదపమాచరింతురు. చూ. 2-29 వ్యాఖ్య.

సమిధ్ = సమిధలయొక్క, దానంబున్ = ఇచ్చుటయు-హోమమును దానంబున్ = త్యాగమును, పచరింపనేటికిన్ = చేయుటయెందులకు? తలవెట్టి = తలకుఁబట్టినవెట్టియా?

సన్న్యాసమున్ = సన్న్యసించుటయు, న్యాసమున్ = మంత్రజపాదికాలమున దేహావయవములందుమంత్రములను బీజాక్షరములను నిక్షేపించుటయు, (అంగన్యాసకరన్యాసాదులు) నెత్తిఁగట్టుకొనఁగాన్= నిర్బంధముగాఁదెచ్చిపెట్టుకొనుట, ఏటికిన్ = ఎందులకు? అచ్ఛలమా= మొండిపట్టుదలయా ? (వృథాభిమానమా?)

కలి = కలియుగము, భక్తశ్రేణికిన్ = భక్తులపంక్తికి (సమూహమునకనుట) మదీయ = నాసంబంధమయిన, భక్తిరుచిన్ = భక్తి

---

4 గొట్టు - ముద్రి (అ), గట్టు - అ. గొ. 5 సంన్యాసమున్-గొ, సన్న్యాసమున్ - ర.అ, 6 కలిఁదే - ముద్రి (అ), ర; గలితే జాలు - గొ, గలితేఁ (గలదే) - అ,

యొక్క చవిని, అశ్రాంతమున్ = ఎల్లప్పుడు, తేన్ = తెచ్చుటకు, చాలున్ = సమర్థమగును.

తే॥ సర్వధర్మవిహీనపరిచారుఁడైన
నాత్మమద్భక్తి 1 గలఁడేని 2 యతఁడుసూవె
నాకు నత్యంతహితుఁడు సుశ్లోకరతుఁడు
నిఖిలధర్మప్రవర్తననిశ్చితుండు. 99

వ్యా :— సర్వధర్మ = సమస్తపుణ్యములచేత, (ధర్మాః పుణ్యయమన్యాయస్వభావాచారసోమపాః - అమ) విహీన = మిక్కిలి నింద్యమయిన, పరిచారుఁడు = నడవడిగలవాఁడు, ఐనన్ = అయినప్పటికిని, ఆత్మన్ = మనస్సునందు, మత్ = నాయొక్క, భక్తి = బత్తి, కలఁడేని = కలవాఁడయినచో, నాకున్ = నాకు, అత్యంత = మిక్కిలి. హితుఁడు = ఆప్తుఁడును, సుశ్లోక = సత్కీర్తియందు (పద్యే యశసిచశ్లోకః - అమ) రతుఁడు = ప్రీతిగలవాఁడును, నిఖిల = సమస్తమయిన, ధర్మపరివర్తన = పుణ్యచరిత్రచేత, నిశ్చితుండు = నిశ్చయింపఁబడినవాఁడును, అతఁడుసూవె = అతఁడేసుమా.

వ్యాక :— అతఁడు = అతఁడే. ఏ - అధ్యాహార్యము. (ప్రౌ. వ్యాక 1-3)

ఆ॥ అస్మదంకధారియగు భక్త 1 వరుమేను
నాకుఁగూర్చినట్లు నాకులార!
వదలకేవసించు వైకుంఠనగరంబు
2 నంతగొలుపదంతరంగమునకు. 100

---

99 ప :- 1 గలచేని - ముద్రి (అ) గలఁడేని - అ. 2 యతఁడుచూవె-ఆ: యతఁడచూవె - ర; యతఁడుస్తూవె - గొ.

100 ప:- 1 పరమేశు - గొ; వరుమేను - ర, అ. 2 నందుఁగొ - ముద్రి (అ), ర; నంత - అ, గొ.

వ్యా :— నాకులార = ఓదేవతలారా! అస్మత్ = నా యొక్క, అంకధారి = చిహ్నములను ధరించినవాఁడు, (శంఖచక్రాది చిహ్నములను ధరించినవాఁడనుట) అగు = అయిన, మత్ = నా యొక్క, భక్తవరుమేను = భక్తశ్రేష్ఠుని శరీరము, నాకున్= నాకు, కూర్చినట్లు = ఇష్టమయినట్లు, ఏన్ = నేను, వదలక = విడిచిపెట్టక (శాశ్వతముగా - అనుట) వసించు = నివసించు, వైకుంఠ నగరంబున్ = వైకుంఠపురమును, అంతరంగమునకున్ = మనస్సునకు, అంతగొలుపదు = అంతయిష్టముగాదు.

వ్యాక :— నాకిశబ్దమునకు బహువచనముననే ప్రయోగము. (ము. కౌ. తత్సమ)

క॥ నాయందు భక్తుఁడుండున్
బాయక యేనధివసింతుభక్తునియందున్
మాయిరువురకుంగలుగున్
గాయప్రాణానుకూల్యకౌశల్యం 1 బున్. **101**

వ్యా :— నాయందుభక్తుఁడుండున్ = నాయందు భక్తుఁడు వసించును, ఏన్ = నేను, పాయక = విడువక, భక్తునియందున్= భక్తునందు, అధివసింతున్ = ఉందును, మాయిరువురకున్ = మా ఇద్దఱకు - భక్తునకును నాకును, కాయ = దేహముయొక్కయు, ప్రాణ = అసువులయొక్కయు, అనుకూల్య = అనుకూలతయొక్క కౌశల్యంబున్ = కుశలత్వమును, కలుగున్ = ఉండును.

ఆ॥ మహితపుణ్యులైన మద్భక్తవరులకుఁ
గానివాఁడునాకుఁగానివాఁడు

101 ప॥- 1 బుల్ - ముద్రి (అ), ర॥ బున్ - అ॥

భాగవతులనన్ను భావించి యొకటిగాఁ
గన్నవాఁడునన్నుఁగన్నవాఁడు. **102**

వ్యా :— మహిత = పూజింపఁబడిన, పుణ్యులు = సుకృతముగలవారు, ఐన = అగు, మత్ = నాయొక్క, భక్తవరులకున్ = భక్తశ్రేష్ఠులకు, కానివాఁడు = సంబంధింపనివాఁడు, నాకున్ = నాకును, కానివాఁడు = సంబంధింపనివాఁడు, భాగవతులన్ = భగవద్భక్తులను (విష్ణుభక్తులననుట) నన్నున్ = నన్నును, (వక్త-విష్ణువు) ఒకటిగాన్ = ఏకముగా, (అభిన్నముగా - అనుట) భావించి = ఊహించి, కన్నవాడు = తెలిసికొన్నవాఁడు, నన్నున్ = నన్ను, కన్నవాఁడు = ప్రాపించినవాఁడు. (అగును - అని క్రియయధ్యాహార్యము.)

క॥ మీయెడమద్భక్తిగుణో
త్ప్రాచ్యయముగనుఁగొంటినేను సత్యంబు, బహూ
పాయంబులమద్భక్తుని
కై 1 యిటకేతెంచుటన్, వియచ్చరులారా! **103**

వ్యా :— వియచ్చరులారా = ఓ దేవతలారా! ఇటకున్ = ఇచ్చటికి, మత్ = నాయొక్క, భక్తుని కై = భక్తునికొఱకు, ఏతెంచుటన్ = (మీరు) వచ్చుటచేత, బహూపాయంబులన్ = అనేకసాధనములతో, మీయెడన్ = మీ విషయమునందు, మత్ = నాయొక్క, భక్తిగుణ = భక్తిధర్మముయొక్క, ఉత్ప్రాచ్యయము = ఉన్నతని, నేను = ఏను, కనుఁగొంటిన్ = తెలిసికొంటిని, సత్యంబు = (ఇది) యథార్థము.

---

103 ప :- యిటయే - గ, గ౨; యిటకే - ర, అ.

మ॥ సుర 1 కర్మందిహిరణ్యదైత్యసుతువ్యాసున్‌శౌనకున్ శ్రీపరా
శరురుక్మాంగదునంబరీషసరమాజానిన్ 2 వసిష్ఠున్‌బురం
దరపుత్రున్ శుకుదాల్భ్యభీష్ము వెఱఁగొందంజేయుమద్భక్తిత
త్పరుఁడీపుణ్యుఁడుపుండరీకుఁడితనిన్ 3 బాలింతుమేలీవులన్ **104**

వ్యా :— ఈపుణ్యుఁడు = ఈసుకృతుఁడగు. పుండరీకుఁడు = పుండరీకముని, సురకర్మందిన్ = దేవమౌనిని - నారముని, హిరణ్యదైత్యసుతున్ = హిరణ్యకశిపుఁడను దానవునియొక్క కుమారుని - ప్రహ్లాదుని, వ్యాసున్ = బాదరాయణుని, శౌనకున్ = శౌనకమహర్షిని శ్రీపరాశరున్ = శ్రీపరాశరమహర్షిని, రుక్మాంగదున్ = రుక్మాంగద మహారాజును, అంబరీషున్ = అంబరీషమహారాజును, సరమాజానిన్ = సరమ, జాయగాఁగలవానిని - విభీషణుని, వశిష్ఠున్ = వసిష్ఠమహర్షిని పురందరపుత్రున్ = ఇంద్రసుతుని - అర్జునుని, శుకున్ = శుకమహర్షిని, దాల్భ్యన్=దాల్భ్యఁడనువానిని, భీష్మున్=భీష్ముని వెఱఁగొందన్= ఆశ్చర్య పడునట్లు, చేయు = ఒనర్చెడు, మత్ = నాయొక్క, భక్తితత్పరుఁడు= భక్తియందుఁబ్రీతిగలవాఁడు. ఇతనిన్ = ఈతనిని - ఈపుండరీకుని, మేలు = శ్రేష్ఠములయిన, ఈవులన్ = దానములచేత - వరములచేత పాలింతున్ = ఏలుదును.

ఇందుఁబేర్కొనఁబడిన భాగవతులను దెలుపు శ్లోకము.

"ప్రహ్లాదనారదపరాశరపుండరీక
వ్యాసాంబరీషశుకశౌనకభీష్మదాల్భ్యాన్
రుక్మాంగదార్జునవసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్‌పరమభాగవతాన్‌స్మరామి."

---

104 ప॥- 1 సమ్మంధి - గౌ; కర్మంది - ర, అ. 2 వశిష్ఠున్ - గౌ; వసిష్ఠున్ - ర, అ. 3 భావింతు - డ; ద. ఖ; బాలింతు-ర,అ,గౌ.

వశిష్ఠ — "యథామహాభారతే"
వశిష్ఠోస్మివరిష్ఠోస్మి, వశేవాసగృహేష్వపి
వశిష్ఠత్వాశ్చవాసాశ్చ, వశిష్ఠఇతివిద్ధిమామ్
"వసిష్ఠ — వశిష్ఠః, పృషోదరాదిత్వాత్ శస్యసః" (శబ్దక)

వ్యాక :— సరమా+జాయా. "జాయాయానిఙ్" (పాణి) ఇది సమాసాంతకార్యము. చూ. 1-47. జాని శబ్దమునుగలదు. "పరస్త్రీ భార్యయోర్జానిః" (నానా) పుత్ర - ఏకతకారకమునుగలదు. చూ. 1-9 వ్యాఖ్య.

ఆ॥ వినుఁడుమీకునేనిఁ 1 గనరాని 2 యీప్సితం
బీతపస్వివరున కిత్తునేఁడ
యెద్ది 3 వేఁడెభక్తుఁడద్దియయొసఁగఁగఁ
గట్టినాఁడఁ 4 గేలఁగంకణంబు. 105

వ్యా :— వినుఁడు = ఆకర్ణింపుఁడు, మీకునేనిన్ = మీకయినను, కనరాని = తెలిసికొనశక్యముకాని, ఈప్సితంబు = అభీష్టమును, ఈతపస్వివరునకున్ = ఈతాపసశ్రేష్ఠునకు, నేఁడ = ఈ దినమే - ఇప్పుడే, ఇత్తున్ = ఒసఁగుదును. (ప్రసాదింతుననుట) భక్తుఁడెద్దివేఁడెన్ = భక్తుఁడుదేనినర్థించునో, అద్దియ = అదియే, ఒసఁగంగన్ = ఇచ్చుటకు, కేలన్ = చేతియందు, కంకణంబు = తోరమును, కట్టినాఁడన్ = బంధించినాఁడను - దీక్షవహించినాఁడను.

కంకణంబుకట్టు - చూ 1-42.

---

105 ప:- 1 వినరాని - గౌ: గనరాని - ర, అ. 2 ఈహితం - ద, ద, బ యీప్సితం - ర, అ, గౌ. 3 లేఁడు – య; వేఁడె – ర, అ. 4 కేలికం - క: గేలఁగం - ర, అ.

వ్యాక :— వేఁడెన్ = వేఁడెనో. ఓ - అధ్యాహార్యము - ప్రౌ.వాక్య. 13.

క॥ అనిదేవకీకుమారుఁడు
మునివదనముఁజూచి పలుకమోదాంబుద గ
ర్జన 1 మనఁబ్రసాదసాగర
జనితధ్వనియనఁగ నిగుడు సరసారభటిన్. 106

వ్యా :— అని = ఈప్రకారముగా, (అను = ఇత్యర్థకము ఇతి = ఇత్థమర్థే - శబ్దస్తో) దేవకీకుమారుఁడు = దేవకీసుతుఁడు - కృష్ణుఁడు, ముని = మౌనియొక్క - పుండరీకునియొక్క, వదనమున్= ముఖమును, చూచి = విలోకించి, మోద = సంతోషమనెడు, అంబుద = మేఘముయొక్క, గర్జనమనన్ = గర్జయో (ఉఱుమో) యనునట్లు, ప్రసాద = అనుగ్రహమనెడు, సాగరం = సముద్రము వలన, (నుండి) జనిత = పుట్టిన, ధ్వనియనఁగన్ = రావమోయను నట్లు, నిగుడు = వ్యక్తమగు, సరస = మాధుర్యాదిగుణములతోఁ గూడిన, (రస = మాధుర్యాదిగుణే - శబ్దస్తో) ఆరభటిన్ = ప్రౌఢితో- వాక్ప్రౌఢితో, పలుకున్ = (ఇట్లు) వచించెను.

అలం :— ఉత్ప్రేక్ష.

ఉ॥ నీపితృభక్తినీతపము నీవనిశంబు నొనర్చునర్చయు
ద్దీపితహర్షుఁజేసె జగతీసురనందన! నన్ను. నీకునా
రూపముభక్తిమత్సదనరోహణశైలముచాల 1 దక్కెఁగాం
క్షాపరిపూర్తిగాపరమొసంగెద వేఁడు యథారుచి 2 ప్రథన్ 107

---

106 ప:- 1 మున - ముద్రి (అ). ర; మన - అ.

107 ప:- 1 దక్కఁ - ముద్రి (అ), ర; దెక్క - త; చక్కఁ - క; దక్కె- అ, గౌ. 2 ప్రభన్ - డ, ద, ఖ; ప్రథన్ - ర, అ.

వ్యా :— జగతీసురనందన = ఓ బ్రాహ్మణకుమారా ! నీ = నీయొక్క, పితృభక్తి = జననీజనకభక్తి, (మాతాపితరౌపితరౌ-అమ) నీ = నీయొక్క, తపము = తపస్సు, నీవు = ఈవు, ఒనర్చు = చేసెడు, అర్చ = పూజ, నన్నున్ = నన్ను, ఉద్దీపితహర్షున్ = ఉత్తేజితమయిన సంతోషముగలవానినిగా, చేసెన్ = ఒనర్చెను. నీకున్ = నీకు, భక్తిమత్ = భక్తిగలవారియొక్క - భక్తులయొక్క, సదనరోహణశైలము = ఇంటియందలిరోహణపర్వతమగు, నా = నా యొక్క, రూపము = ఆకృతి, చాలన్ = మిక్కిలిగా, దక్కెన్ = అనుభవయోగ్యమయ్యెను. కాంక్షా = కోరికయొక్క, పరిపూర్తి = నెఱవేఱుట, కాన్ = అగునట్లు, (కోరికతీఱునట్లు) వరము = దేవతల నుండి తపోలబ్ధమగు వాంఛితమును, (వరః = తపోభిరిష్యతే యస్తు దేవేభ్యః సవరోమతః - ఇతి చభరతః - శబ్దక) ఒసంగెదన్ = ప్రసాదింతును. యథారుచిప్రథన్ = అభిలాషానుగుణమయిన ఖ్యాతిచేత, (పద్ధతిచేత - అనుట) వేఁడుము = అర్థింపుము.

క॥ భాగ్యమనై యిహపరపరి
భోగ్యార్థ 1 మనై, యగణ్యపుణ్య 2 మనై, వై
రాగ్యజ్ఞానోన్నతులగు
యోగ్యతములపాల 3 వాలియుండుదుఁజుమ్మీ ! 108

వ్యా: — వైరాగ్య = విరక్తిచేతను. జ్ఞాన=మోక్షసాధనమగుబుద్ధిచేతను (మోక్షేధీర్జ్ఞానమ్-అమ) ఉన్నతులు = గొప్పవారు, అగు = అయిన, యోగ్యతముల=అత్యంతయోగ్యులయొక్క, పాలన్ = సమక్షమునందు, భాగ్యమనై=అదృష్టమనై, ఇహ = ఇహలోకమునందును, (ఇహ = అస్మిన్‌కాలేదేశేదిశివా-శబ్దస్తో) పర= పరలోకమునందును-స్వర్గలోకము

---

108 ప :- 1, 2 మునై - గొ; మనై - ర, అ. 3 వ్రాలి - త, గొ; వాలి-ర,అ

నందును, పరిభోగ్యమనై = అనుభవింపఁదగినవాఁడనయి, అగణ్య= లెక్కింపశక్యముకాని, పుణ్యమనై = సుకృతమనై, వాలియుండుదుఁ జుమ్మా = అతిశయించి యుందును జుమా!

వ॥ విశేషించినీయెడంబ్రసన్నుండ 1 నైనవాఁడ; నభీష్ట 2 వృష్టి ఘనాఘనంబగుమదీయ 3 ఘృణాగుణంబునకు భాజనంబవైతివి; జగజ్జాలంబున వస్తుజాలంబునీకు దుర్లభంబులేదనిపలుకు యదు వల్లభువలనం 4 బ్రలోభితుండై. 109

వ్యా :— విశేషించి = అతిశయించి, నీయెడన్ = నీవిష యమునందు, ప్రసన్నుఁడన్ = అనుగ్రహముగలవాఁడను, ఐన వాఁడన్ = ఐనాఁడను. అభీష్ట = కోరికలనెడు, వృష్టి = వర్షము నకు, ఘనాఘనంబు = వర్షామేఘము (వార్షుకాబ్దోఘనాఘనః - అమ) అగు = అయిన, మదీయ = నాసంబంధముగల, ఘృణాగుణంబు నకున్ = దయాస్వభావమునకు, భాజనంబవైతివి = పాత్రుఁడ వయితివి, జగత్ = లోకములయొక్క, జాలంబునన్ = సమూహ మునందు, వస్తుజాలంబు = పదార్థసమూహము, నీకున్ = నీకు, దుర్లభంబు = పొందశక్యముకానిది, లేదు = సంభవిల్లదు. అని= ఈ ప్రకారముగా, పలుకు = వచించు, యదువల్లభువలనన్ = యదు పతివలన - కృష్ణునివలన. ప్రలోభితుఁడై = కలిగినప్రలోభముగల వాఁడయి. (మీఁదిపద్యముతో నన్వయము.)

---

109 ప:- 1 నైయున్న - ముద్రి (అ), ర: నైనవాఁడ – అ. 2 ప్రవృష్టి- క, త, గౌ: వృష్టి – ర, అ 3 గుణా – గౌ: ఘృణా -ర,అ. 4 బ్రబోధితుండై – ముద్రి (అ); ర: బ్రలోభితుండై - ర, అ.

సీ॥ పుండరీకుఁడు పల్కుబుద్బుదాభమ్ములైన
సిరులునిన్గామింపఁజేరి కల్ప
విటపిఁగుల్మాషముల్ వేఁడువెఱ్ఱి 1 గలాఁడె ?
నిఖిలదుర్లభుఁడగునీవునన్నుఁ
గరుణింతుపరమిత్రుఁగాతునిడేఱుతు
ననియున్కి 2 భయమేదియద్భుతార్థ
మర్థింతు; 3 నిపుడున్నయట్లయస్మన్నామ
చిహ్నితైతన్మహాక్షేత్రతీర్థ

తే॥ మధ్యతలముననిలువు, నామనవిఁజేసి
సకలజనులకు మోక్షరాజ్య 4 మునొసఁగుచు
5 నిదియనాకోర్కి, జగదేకహితమునిదియ
దీనిమీఱినసిరియొల్ల, దేవదేవ! 110

వ్యా :— పుండరీకుఁడు = పుండరీకముని, పల్కన్ = (ఇట్లు) వచించెను. బుద్బుదాభములైన = నీటిబుడగలవలె నొప్పునవి యగు, (క్షణభంగురములగు - అనుట) సిరులు = సంపదలను, నిన్ = నిన్ను, కామింపన్ = కోరను. కల్పవిటపిన్ = కల్పవృక్షమును, చేరి = ఆశ్రయించి, కుల్మాషముల్ = కాఱుమినుములను, (స్యాద్యావకస్తుకుల్మాషః - అమ) వేఁడు = అర్థించెడు, వెఱ్ఱి = అవివేకి, కలాఁడె = ఉన్నాడా ? (లేఁడనుట) నిఖిలదుర్లభుఁడగు = ఎల్లరకును బొందశక్యముకానివాఁడవగు, నీవు = ఈవు, నన్నున్ =

---

110 పః- 1 గలండె - గొ; గలాఁడె - ర, అ. 2 మేది? - బ, ర; మేది-అ. 3 మిపు - క; నిపు - ర, అ. 4 మునొసంమిది - క; మునొసఁగుచు - ర, అ. 5 నిదియు - గొ; నిదియ - ర, అ.

నన్నుఁ, కరుణింతున్ = దయతలఁతును, వరమిత్తున్ = వరమొసఁగుదును, కాతున్ = రక్షింతును, ఈడేరుతున్ = చరితార్థునిజేయుదును, అనియున్కిన్ = అని పలికియుండుటచేత, భయమేది = భీతియుడిగి, అద్భుత = ఆశ్చర్యకరమయిన, అర్థము = వస్తువును, అర్థింతున్ = వేఁడుదును. ఇపుడు = ఇప్పుడు, ఉన్నట్ల = ఉన్నట్లే, (ఇప్పుడు నాయెదుటనిలిచియున్న తీరుననే - అనుట) నామనవిఁజేసి = నాయొక్క యభ్యర్థనచే, సకలజనులకున్ = ఎల్లప్రజలకు, మోక్షరాజ్యమున్ = ముక్తిరాజ్యమును, ఒసఁగుచున్ = ప్రసాదించుచు, అస్మత్ = నాయొక్క, నామ = పేరిచేత, చిహ్నిత = లాంఛితమయిన, ఏతన్మహాక్షేత్రతీర్థమధ్యతలమునన్ = ఈ గొప్పపుణ్యస్థలముయొక్కయు పుణ్యనదియొక్కయు నడిమిప్రదేశమునందు, నిలుపు = ఉండుము. ఇదియ= ఇదే, నాకోర్కి = నాయొక్కకాంక్ష, జగత్ = లోకములకు, ఏక = ముఖ్యమయిన, హితమున్ = మేలును, ఇదియ = ఇదే, దేవదేవ = దేవులకుదేవుఁడా! (దేవదేవః = దేవానాందేవేషువాదేవః విష్ణుః-శబ్దర) దీనిమీాటిన= దీనినిమించిన, సిరి = సంపద, ఒల్లన్= అపేక్షింపను.

భయమేడు = భయముడుగు. ఏదు = నశించు. దీనికిఁ గర్మవాచకముమీాఁదనేప్రయోగము.

అలం :— ప్రతివస్తూపమ.

వ॥ అనివేండియునతండు చాపలాతిశయంబునఁజర్వితచర్వణంబుగా సర్వముపర్వదుప్రాప్యం[1]బగు నీరూపంబు కృపాపరతంత్రింబగుచు నాకునగపడుటకు భూతవాత్రంబులు పరిభూతాద్భుతరసమగ్నమానసంబులగుచునున్నయవి; భయదీయంబగునకారణసుకృతి

---

111 ప :— 1 బయిన - గ; బగు - ర, అ.

2 త్వంబునకు నియంతయుంగలఁడె ? 3 యుత్తరంగంబగు సంసార తరంగమాలిమునుంగుచుఁబొనుంగు 4 పడి, యనంగీకృత విజ్ఞాన జ్ఞాన 5 విలాసులై, దోసంబులఁజేసిన కరువులనందగు నలసులకు వెల 6 సులభంబు నధికఫలంబునునగు యుష్మద్దర్శనంబు భవభయ కర్శనంబునుపసర్గజలదవర్గ 7 స్పర్శనంబు. నపవర్గదర్శననిదర్శనంబు నగుఁ 8 గాత! 9 యేతత్ క్షేత్రంబు నీయాజ్ఞనశేషక్షేత్ర విశేషోత్తం సంబగుం 10 గాత! యీతీర్థంబునస్మన్నా 11 మాంకసమర్థితంబుగ నుత్తమంబగుం 12 గాత! యని. **111**

వ్యా :— అని = (ఇట్లు) పలికి, వెండియున్ = మఱియు, అతండు = అతఁడు - పుండరీకుఁడు, చాపలాతిశయంబునన్ = చాపల్యాధిక్యముచేత, చర్వితచర్వణంబుగాన్ = నమలినదే నమలు నట్లుగా - చేసినదేచేయుటుగా, సర్వసుపర్వ = ఎల్లదేవతలకు, దుష్ప్రాపంబగు = పొందశక్యముకానిదగు, నీరూపము = నీయొక్కయాకృతి, కృపాపరతంత్రంబగుచున్ = దయాధీనమగుచు, నాకున్ = నాకు, అగపడుటకున్ = గోచరమగుటకు. భూతవ్రాతంబులు = ప్రాణి సమూహములు, ప్రభూత = పుట్టిన, అద్భుతరస = ఆశ్చర్యరసము

---

2 తత్వం - డ, ద. బః త్వంబు - ర, అ, గౌ. 3 యంతరం-తః యుత్తరం - ర, అ. 4 వడి - గౌ; పడి - ర, అ. 5 విలాసంబులై - గ; విలాసులై - ర, అ, గౌ. 5 భంబును — గౌ; భంబు - ర, అ. 7 స్పర్శంబుననిదర్శనంబగు - గౌ. స్పర్శనంబునపవర్గనిదర్శంబునగుఁ - ర, అ. 8 గాక-ర, ముద్రి(అ) గాత - అ; గాకని – గౌ. 9 తత్ - గౌ: ఏతత్ - ర, అ, 10 గాతయీ - క, త, గౌ, అ. గాక-ముద్రి (అ) ర, 11 మాంకిత సమర్థనంబున - తః ముద్రి (అ), రః నామాంకసమర్థితంబుగ-అ 12 గాతమని – ముద్రి (అ), రః గాతయని - అ, గౌ.

చేత, మసృణ = స్నిగ్ధములయిన, మానసంబులు = మనస్సుగలవి, అగుచునున్నయవి = అగుచున్నవి, భవదీయంబగు = నీసంబంధము గలదియగు, అకారణ = నిర్హేతుకమయిన, సుకృతిత్వంబునకున్ = సత్కర్మత్వమునకు, నియంతయున్ = శాసకుఁడును, కలఁడె = ఉన్నాఁడా? (లేఁడనుట) ఉత్తరంగంబగు = ఎగురుపాటుగలదియగు- అని సంసారపక్షమునసర్థము. ఉద్ = పైకిలేచిన, తరంగంబగు = కెరటములుగలదియగు - అని సముద్రపక్షమునసర్థము. సంసారతరంగమాలిన్ = భవమనెడు సముద్రమునందు, (పాథోధిసింధుమకరాలయ (--ఊర్మిమాలీ - త్రి. ని. ఊర్మిమాలి = తరంగమాలి) మునుంగుచున్ = మగ్నమగుచు, (అలం :- శ్లేషమూలకరూపము) పొనుంగుపడి = కష్టపడి, అనంగీకృత = సమ్మతింపఁబడని, విజ్ఞాన = శిల్పాది విషయమైన బుద్ధియొక్కయు, జ్ఞాన = మోక్షసాధనమయిన బుద్ధి యొక్కయు, (మోక్షేధీర్ జ్ఞానమన్యత్రవిజ్ఞానం శిల్పశాస్త్రయోః-అమ) విలాసులై = విలాసముగలవారయి, దోసంబులన్ = దోషములతో, చేసిన = నిర్మించిన, కరువులనందగు = అచ్చుపోసిన బొమ్మలోయనఁదగిన, అలసులకున్ = మందులకు, (అలం :- ఉత్ప్రేక్ష) వెల = మూల్యము, సులభంబున్ = సుఖముగాలభించునదియు, అధికఫలంబునున్ = ఎక్కువ ప్రయోజనముగలదియు, అగు = అయిన, యుష్మద్ = నీయొక్క, దర్శనంబు = దర్శనము, భవభయ = సంసారంభీతికి, కర్శనంబున్ = కృశింపఁజేయునదియు, ఉపసర్గ = ఉపద్రవములనెడు, (ఉపసర్గఃపుమాన్ రోగభేదోపప్లవయోరపి _మే. ని.) జలదివర్గ = మేఘములసజాతీయ సమూహమునకు, (సమైర్వర్గః - అమ) స్పర్శనంబున్ = వాయువును, (శ్వసనః స్పర్శనోవాయుః - అమ. అలం :- రూపకము) అపవర్గదర్శన = మోక్షప్రతిపాదకశాస్త్ర భేదమునకు, నిదర్శనంబున్ = తార్కాణమును, అగుగాత = అగుఁగాక! ఏతత్ క్షేత్రంబు = ఈపుణ్యస్థలము నీయాజ్ఞన్ = నీ యొక్క

యానతిచేత, అశేష = సమస్తములయిన, క్షేత్రవిశేష = క్షేత్రభేద ములయందు, ఉత్తంసంబు = శిరోభూషణము, (పుంస్యుత్తంసావతంసౌద్వౌకర్ణపూరేచశేఖరే - అమ) అగుఁగాత = అగుఁగాక! ఈతీర్థంబున్ = ఈ క్షేత్రమును, అస్మద్ = నాయొక్క, నామఅంక = నామధేయచిహ్నముచేత, సమర్థితంబుగన్ = సమర్థింపఁబడినట్లుగా, ఉత్తమంబు = ఉత్కృష్టమయినది, అగుఁగాత - అగుఁగాక! అని = ఈప్రకారముగా, (మీఁదిపద్యముతోనన్వయము)

వ్యాక ;— కాత - అను కళారూపమునుగలదు.
(ము. కౌ. క్రియా)

ఉ॥ అనతమౌళియై 1 యటులుప్రార్థనసేయు 2 మునీంద్రుశాంబరీ
మానుషవేషధారి 3 దయమాన 4 మనస్థితి 5 బిగ్గనవ్వుచున్
పీనులఁదాఁకుకన్గడలవేమఱు చూచుచుఁబల్కుఁజిల్కుపూఁ
దేనియసోన 6 వెల్లువలఁదెప్పలఁదేలెడుమేలిపల్కులన్. **112**

వ్యా ;— శాంబరీమానుషవేషధారి = మాయామానవ సంబంధమయిన భూమికనుధరించువాఁడు-కృష్ణుఁడు, అనతమౌళియై = వంగినశిరస్సుగలవాఁడయి, అటులు = అట్లు, ప్రార్థనసేయు = ప్రార్థించు. మునీంద్రున్ = శ్రేష్ఠుఁడయిన మునినిగూర్చి (పుండరీకునిగూర్చి - అనుట) దయమాన = కరుణించుచున్న, (దయ - పాలనే. భ్వా - ఆత్మ - సక - సేట్, దయతే - శబ్దస్తో) మనః = హృదయముయొక్క, స్థితిన్ = అవస్థచేత, బిగ్గనవ్వుచున్ = బిగ్గరగా

112 ప:- 1 యిటులఁబ్రా - ర, గౌ; యటులు - అ. 2 మునీంద్ర - గౌ; మునీంద్రు - ర, అ, గౌ. 3 నయ - ర: దయ - అ, గౌ. 4 మనః - ర: మన - అ. 5 బిగ్గె - గ: బిగ్గ - ర, అ. 6 వెల్లివలు - త, వెల్లువలఁ - ర, అ.

హసించుచు, వీనులన్ = చెవులను, తాఁకు = స్పృశించు, కన్గడలన్ = కంటికొనలతో (ఆకర్ణాంతవిలోచనములతో - అనుట) వేమఱు = పలుమాఱు, చూచుచున్ = వీక్షించుచు, చిల్కు = చిందెడు, పూఁదేనియసోన = మకరందపుఁ జిఱువానలయొక్క; వెల్లువలన్ = ప్రవాహములయందు, తెప్పలఁదేలెడు = ఓలలాడెడు, మేలిపల్కులన్ = మేలయినమాటలతో, పల్కన్ = (ఇట్లు) వచించెను.

వ్యాక :— మనః+స్థితి = మనస్థితి, మనఃస్థితి. "ఖర్పరే శరివావిసర్గలోపోవక్తవ్యః" (వా.)

పల్కన్ = పల్కెన్, భూతమునలాట్టు - బా. క్రియా 22 సూ

సీ॥ అతిదుర్లభంబు వేఁడితి; దుర్ల 1 భుఁడనైన
నేనిక 2 దక్కితిమౌనివర్య!
త్వత్ప్రియార్థముగ నీస్థలమునఁబరివార
యుక్తుండనైనిల్చియున్న నన్ను
సేవించువారెల్లఁజిరపుణ్యవంతులు
నిహపరసుఖలాభహృష్టమతులు
కలికాలకల్మషగరళకూటాటోప
కాకోలకంఠులు, గళితభవులు

తే॥ నయ్యెదరుసర్వదేవో త్తమాస్మదాజ్ఞఁ
బూనియీక్షేత్రమును దీర్ఘమునుసమస్త
భువనవర్ణితవిఖ్యాతిఁబొదలుఁగాత!
3 యెల్లపుణ్యస్థలములకునెక్కుడగుచు. **113**

---

113 ప:- 1 భుండనైయే-త: భుఁడనైనయే.ర గొ. 3 భుడనైననే-అ 4 దక్కుట ముద్రి-(అ), ర: దక్కితి - ఊ. 3 మెల్ల - ముద్రి (అ), ర: యెల్ల-అ, గొ.

వ్యా :— మౌనివర్య = ఓ మునిశ్రేష్ఠా! — ఓ పుండరీకా! అతిదుర్లభంబు = మిక్కిలి ప్రాపింపరాని దానిని, వేఁడితి = అర్థించితివి, దుర్లభుండన్ = ప్రాపింపశక్యము కానివాఁడను, ఐన = అయినట్టి, నేన్ = నేను, నీకున్ = నీకు, దక్కితిన్ = అధీనుఁడనైతిని త్వత్ప్రియార్థముగన్ = నీయొక్క ప్రీతి ప్రయోజనముగా (నీప్రీతికొఱకు - అనుట) ఈస్థలమునన్ = ఇచ్చట, పరివార = పరిజనముతో, యుక్తుండనై = కూడుకొన్నవాఁడనయి; నిల్చియున్న నన్నున్ = ప్రతిష్ఠితుఁడనైయున్నవాఁడనగునన్ను, సేవించువారెల్లన్ = భజించువారందఱు, చిరపుణ్యవంతులున్ = బహుకాల సుకృతులును. ఇహపరసుఖలాభ = ఇహలోక పరలోకములయందలి (భూలోకస్వర్గలోకములయందలి-అనుట) సౌఖ్యములయొక్కప్రాప్తిచేత హృష్ట = సంతోషించిన, మతులు = బుద్ధిగలవారును, కలికాల కల్మష = కలికాలసంబంధమయినపాపమనెడు, గరళకూట = విష రాశియొక్క - కాలకూటవిషముయొక్క, (కూటః = రాశిః - శబ్దక) ఆటోప = సంరంభమునకు, కాకోలకంఠులు = కాకోలము (గరళము) కంఠమునందుఁగలవారును - శివులును, గళిత = జాఱిన - నశించిన, భవులు = పుట్టుకలుగలవారును, (పునర్జన్మలేనివారును - అనుట) అయ్యెదరు = అగుదురు. సర్వదేవ = ఎల్లదేవతలయందు, ఉత్తమ = ఉత్కృష్టుఁడనగు, అస్మత్ = నాయొక్క, ఆజ్ఞన్ = అనతిచేత, ఎల్లపుణ్యస్థలములకున్ = సమస్తక్షేత్రములకంటె, ఎక్కుడు= ఉత్కృష్టమయినది. అగుచున్ = అగుచు, పూని = ఉద్యమించి, ఈ క్షేత్రమును = ఈపుణ్యస్థలమును, తీర్థమును = ఈపవిత్రోదకమును- (ఈ) పుణ్యనదియు, సమస్తభువన = ఎల్లలోకములచేత, వర్ణిత = పొగడఁబడిన, విఖ్యాతిన్ = విశేషమయిన ప్రసిద్ధిచేత, పొదలుఁగాత = వర్ధిల్లుఁగాక!

పాఠపరిశీలన :— కాతమెల్ల - అనునది బాలవ్యాకరణాను సారముగాఁజేసిన సవరణయేగాని యుపలబ్ధపాఠముకాదు. (ము. కౌ. క్రియా)

వ్యాక :— ఎల్లపుణ్యస్థలంబులకున్ — ఇట నిర్ధారణ పంచమికి షష్ఠి (ము. కౌ. కారక.)

క॥ త్వన్నామచిహ్నితంబగు
నిన్నెలయెతెల్లదీవియేనుండుటకున్
మన్నించి భక్తవాంఛా
భ్యున్నతులొసఁగుటయెనాకు యుక్త వ్రత 1 మున్. 114

వ్యా :— త్వత్ = నీయొక్క, నామ = నామధేయము చేత, చిహ్నంబగు = లాంఛితమయినదియగు, ఇన్నెలయె = ఈ ప్రదేశమే - ఈ పౌండరీకమే, ఏన్ = నేను, ఉండుటకున్ = నివసించుటకు, తెల్లదీవి = శ్వేతద్వీపము, వైకుంఠము. (శ్వేతద్వీపః = చంద్రద్వీపః, స్వచ్ఛవైకుంఠాఖ్య విష్ణుధామ - శబ్దర) నాకున్ = నాకు, యుక్త = యోగ్యమయిన, వ్రతమున్ = నియమముసైతము, భక్త = భక్తులయొక్క, వాంఛా = కోరికలయొక్క, అభ్యున్నతులు = అతిశయములు. మన్నించి = అనుగ్రహించి, ఒసఁగుటయె = ప్రసాదించుటయే.

సీ॥ 1 వినుధాతృనుత! యప్పుడనిమిషులనురారి
కృపకు నచ్చెరువంది కేలుమొగిచి
పరమేశ! యోభక్త పరతంత్రభావాను
వర్తి! పరబ్రహ్మ 2 మూర్తి! నిన్ను

114 ప :- 1 మున్ — ర (పా), గౌ; ముఞ — ర, అ.
115 ప:- 1 విను—ర, గౌ, విను (అన?) — అ. 2 మూర్తిడిటకు — ప; వరదనిన్ను - ముద్ర (అ) ర; మూర్తినిన్ను — అ.

నరచేతిమణిఁ 3 జేసి యవనివారలకెల్ల
నపవర్గమొసఁగునీయయ్య 4 నెట్లు
వోలు విశ్రాణన పాలంబు 5 యాచక
కాంక్షితమాత్రాప్తి కారణంబు

తే॥ 6 నీకెతగు నీతనికెతగు నిఖిలగమ్య
పూజవడయంగఁబూజించిపొగడువడయ
నని మురద్వేషిఁబుండరీకుని బొగడుచుఁ
జనిరిసమ్మర్దముగ నిజ 7 స్థానములకు. 115

వ్యా :— ధాతృసుత = ఓ బ్రహ్మతనయా - ఓనారదా ! విను = ఆకర్ణింపుము. అప్పుడు = ఆసమయమున, అనిమిషులు = దేవతలు, అసురారి = కృష్ణునియొక్క, కృపకున్ = దయకు, అచ్చెరువంది = ఆశ్చర్యపడి, కేలుమొగిచి = చేతులు జోడించి, (కేలు - జాత్యేకవచనము) పరమేశ = ఓకృష్ణా ! (పరమేశ్వరః = విష్ణుః - త్రివ్యూహంత్వేకమూర్తిశ్చతథోక్తః పరమేశ్వరః, ఇతివామనే- శబ్దః) ఓ భక్తపరతంత్ర భావానువర్తి = ఓ భక్తులకధీనమయిన స్వాభావికగుణముననుసరించి ప్రవర్తించువాఁడా! పరబ్రహ్మమూర్తి = పరబ్రహ్మస్వరూపుఁడా! నిన్నున్ = నిన్ను, అరచేతిమణిఁజేసి = హస్తతలమునందలి రత్నముగానొనర్చి - అధీనమొనర్చుకొని, అవని వారలకెల్లన్ = భూలోకమునకు సంబంధించినవారికందఱకు, (భూలోక వాసులందఱకు - అనుట) అపవర్గము = మోక్షమును, ఒసఁగు = ప్రసాదించెడు, ఈయయ్యన్ = ఈ పూజ్యుని - ఈ పుండరీకుని,

---

3 చేసి - గౌ; ఁజేసి - ర, అ. 4 యెట్లు-ర, అ, గౌ. 5 కాచక-త; యాచక - ర, అ. 6 నీక ... నిక - గౌ; నీకె ... నికె -ర,అ. 7 సదన - ర (పా), స్థాన - ర, అ, గౌ.

యాచక = అర్థులయొక్క, కాంక్షితమాత్ర = కోరికలనుమాత్రము అప్తి = పొందుటకు, కారణంబు = హేతువగు, విశ్రాణనసాలంబు= త్యాగసంబంధమయిన వృక్షము - కల్పవృక్షము, (విశ్రాణనం వితరణమ్ - అమ) ఎట్లు = ఏప్రకారముగా, పోలున్ = సరిపోలును? (సరిపోలదనుట) నిఖిలగమ్య = ఎల్లరకుఁబ్రాపింపఁదగినవాఁడా ! పూజవడయంగన్ = అర్చనమునందుట, పూజించి = అర్చించి, పొగడువడయన్ = వినుతినందుట, నీకె = నీకే, తగున్ = అర్హమగును. ఈతనికె = ఇతనికే - ఈపుండరీకునికే; తగున్ = అర్హమగును. (పూజలందుటనీకేతగును, నిన్నుఁబూజించివినుతి గనుట పుండరీకునకేతగుననుట) అని = ఈప్రకారముగా, మురద్వేషిన్ = కృష్ణుని, పుండరీకుని = పుండరీకమౌనిని, పొగడుచున్ = స్తుతించుచు సమ్మర్దముగన్ = సంకులముగా, నిజ = స్వకీయములయిన, స్థానములకున్ = నివాసములకు, చనిరి = అరిగిరి.

అలం :— వ్యతిరేకము.

ఆ॥ పొగడిరఖిలమునులు జగములానందించె
నాటపాటచూపి రమరరమణు
లాదినంబుసుటన 1 మయ్యో, దుర్దినమయ్యు
విబుధతరు 2 లతాంతవృష్టిగురియ. 116

అఖిలమునులున్ = ఎల్లమౌనులును, పొగడిరి = స్తుతించిరి. జగములు = లోకములు, ఆనందించెన్ = సంతోషించెను. అమర రమణులు = దేవతాస్త్రీలు - అప్సరసలు, ఆటపాట = నృత్యగీత

---

116 ప:- 1 మయ్యుదుర్దినయ్యో-ముద్రి (అ).ర;గౌ. మయ్యోదుర్దినమయ్యో-ప; మయ్యోదుర్దినమయ్యు - అ. 2 లకోత్త-క; లతాంత - ర, అ.

ములను, చూపిరి = ప్రదర్శించిరి. అదినంబు = అదివసము, విబుధతతు = దేవతావృక్షములయొక్క - కల్పవృక్షములయొక్క, లతాంత వృష్టి = పుష్పవర్షము, కురియన్ = వర్షించుటచేత, దుర్దినము = చెడ్డదినము - అని విరోధము. మబ్బులుపట్టిన దినము - అని విరోధ పరిహారము. (మేఘచ్ఛన్నేహ్నిదుర్దినమ్ - అమ) అయ్యున్ = అయినప్పటికి, సుదినము = మంచిదివసము, అయ్యెన్ = అయెను.

వ్యాక :— అటుపాటు - ప్రా. సమాస రీతి

అలం :— విరోధాభాసము.

సీ॥ శిఖిపింఛధారియై చేదోయికటినిల్పి
హరి, తీర్థమునఁబశ్చిమాభిముఖుఁడు
క్షేత్రంబునందుఁబ్రా 1 గ్దిగభిముఖుండునై
రెండుమూర్తులు 2 దాల్చియుండు, నతసి
పదపీతమైయొప్పుఫణిభర్త 3, శముగొల్చు
ప్రహియన శ్రీయనరెండుగడలఁ
జామరహస్త శియై, ఛందోమయాకృతి
ఖగలోకనాథుఁడగ్రమున వెలయు

తే॥ దక్షిణంబున సనకపరిధానములుఁ
దానుఁబొగడుచు సేవింపఁదమ్మిచూలి
యేనురుద్రులు సేవింతు మెడమవలన
వెనుకనుండుదు రింద్రాది విబుధవరులు. 117

117 పః- 1 గ్దిశకభిముఖుఁడునై - క; గ్దిగభిముఖుండునై - ర, అ.
2 దాల్చుచుండు – ముద్రి (అ), ర; దాల్చియుండు - అ.
3 వై - త; యై – అ, గౌ.

వ్యా :— హరి = కృష్ణుఁడు (విట్ఠలుఁడనటు) శిఖిపింఛ ధారియై = నెమిలిపింఛెమును ధరించినవాఁడయి, చేదోయిన్ = హస్త ద్వయమును, కటిన్ = మొలయందు, నిల్పి = ఉంచి, తీర్థమునన్= పుణ్యనదియందు - భైమీనదీతీరమునందు, పశ్చిమాభిముఖుఁడు = పడమటి దిక్కునకెదురు మొగమయినవాఁడును, క్షేత్రంబునందున్ = పుణ్యస్థలమునందు - పౌండరీకమునందు, ప్రాగ్దిక్ = తూర్పుదిక్కు నకు, అభిముఖుఁడునై = ఎదురుమొగమయివానఁడునై, రెండు మూర్తులు = రెండురూపములు, తాల్చియుండున్ = ధరించియుండును. అతని = అతనియొక్క - విట్ఠలునియొక్క, పదపీఠమై = పాదపీఠమై (కాళ్లుంచుకొను పీఁటయై) ఫణిభర్త = సర్పరాజు - ఆదిశేషుఁడు, ఒప్పున్ = ప్రకాశించును. రమ = లక్ష్మీదేవి, హ్రీయనన్ = హ్రీదేవి యనఁగా; శ్రీయనన్ = శ్రీదేవియనఁగా, రెండు కడలన్ = ఇరు వైపులయందు, చామరహస్తయై = వింజామరలుచేతియందుఁగలదై, కొల్చున్ = సేవించును. ఛందోమయ = వేదమయమయిన, (ఛందస్తు నిగమః-త్రి.ని.) ఆకృతి = ఆకారముగలవాఁడగు (వేదాంగుడనుటు) ఖగ లోకనాథుఁడు = పక్షిజగత్పతి - గరుత్మంతుఁడు, అగ్రమునన్ = పురోభాగమున; వెలయున్ = ఒప్పును.

గరుత్మంతుఁడు ఛందోమయాకృతియనుటకు - "వేదాంగువినత సుతుని" (ఆముక్త 7-33) "వైనతేయేనపురతః సేవితశ్రుతిరూపిణా- ది. సూ. చ" (నంజీ)

దక్షిణంబునన్ = దక్షిణదిక్కునందు, తమ్మిచూలి = బ్రహ్మ తానున్ = తానును, సనకప్రధానమునులున్ = సనకముఖ్యులగు మౌనులును, సేవించున్ = కొలుచును. ఏనున్ = నేనును. రుద్రులున్ = ఏకాదశరుద్రులును, ఎడమవలనన్ = వామభాగమునందు;

సేవింతుము = కొలుతుము. ఇంద్రాదివిబుధవరులు = ఇంద్రుడు మొదలగు దేవతాశ్రేష్ఠులు, వెనుకన్ = పశ్చాద్భాగమునందు, ఉందురు = ఉందురు.

ఏకాదశరుద్రులు —

"అజైకపాదహిర్బుధ్న్యో విరూపాక్షస్సురేశ్వరః
జయంతోబహురూపశ్చ, త్ర్యంబకో ప్యపరాజితః
వైవస్వతశ్చసావిత్రో హరోరుద్రా ఇతిస్మృతాః"
- ఇతి జటాధరః అన్యశ్చ -
"అజైకపాదహిర్బుధ్నస్త్వష్టారుద్రశ్చవీర్యవాన్
త్వష్టుశ్చాప్యాత్మజః పుత్రో విశ్వరూపోమహాతపాః
హరశ్చబహురూపశ్చత్ర్యంబకశ్చాపరాజితః
వృషాకపిశ్చశంభుశ్చకపర్దీరైవతస్తథా
ఏకాదశైతే కథితారుద్రాస్త్రిభువనేశ్వరాః" ఇతిగారుడే.
అగ్నిపురాణేత్వష్టస్థానేకృత్తివాసాః; అపరశ్చ.
"అజైకపాదహిర్బుధ్నో విరూపాక్షోథరైవతః
హరశ్చసావిత్ర్యశ్చజయంతశ్చ, పినాకీచాపరాజితః
ఏతేరుద్రాసమాఖ్యాతా ఏకాదశగణేశ్వరాః.
- ఇతిమాత్స్యే" (శబ్దక)

వ్యాక :— సనకపరిధానమునులుఁదానుసేవించుఁదమ్మిచూలి - బా. క్రియా 120

తమ్మిచూలి = తమ్మివలనిచూలు (జననము) వేనికిఁగలదో వాఁడు - బ్రహ్మ.

వ॥ వత్సా! శ్రీ వత్సలాంఛనుభక్తవత్సలత్వంబునీవు నెఱింగిన 1 యదియకదా! విను 2 మత్తె అంగున మెఱుంగుటొల్లియగొల్ల దొర కరకలితచిత్ర 3భస్త్రజలజశుక్తియు,విరచితవినతముక్తియుఁ, గుటిలకోమలవినీల కుంతలనికరుండును, నపరిమితకరుణాకరుం డును, గటి 4 తటఘటితదోస్తంభయుగళుండును, జటులని శాట 5 నిగళుండును, మకరకుండలమండితకపోలఫలకుండును, యదుకులతిలకుండును, క్షుల్లకా 6 శిక్యసఖ్యాభిరామమృదులోరు ద్వయుండును. 7 నద్వయుండును బుండరీకప్రభృతిమునిజన సేవ్యమానుండును, ననూనుండును, నఖండజ్ఞానానందైక విగ్ర హుండును, 8 విదళితజగన్నిగ్రహుండునునై, పంచాబ్దంబును, బంచశరనహాసాత్రికాయి విలసన 9 రసంబును, నిచ్ఛాదిగంబ రంబునునైన 10 ప్రాయంబున నవరత్నసాను ప్రాయంబును,11 బాహ్యాభ్యంతరికద్వారాష్టక విస్పష్టంబును, నదభ్రంబు, నభ్రం కషంబును,12 శరదభ్రశుభ్రంబునగు మహాప్రాసాదంబునందుఁ వాసవవై శ్రవణ 13 వరుణవైవస్వత ప్రముఖమఖభుగలఘుకిరీట

---

118 వ:- 1 యదియకాదా - గొ; యదియకదా - ర, అ. 2 మిత్తెఅం-త; మత్తెఅం - ర, అ. 3 భస్మజలశుక్తి - వ; భస్త్రజలజశుక్తియు - ర, అ. గొ. 4 తటి – గొ; తట - ర, అ. 5 దళ - గ; గళ-ర, అ, గొ. 6 సిక్య – గ; శక్య - ద; శిక్య – ర, అ, గొ. 7 ఇది 'గొ' లోలేదు. 8 విగళిత - ర; విదళిత - అ, గొ. 9 సరసం- ముద్రి (అ). ర; రసం - అ. 10 ప్రాయంబును – ర, గొ; ప్రాయంబును (న?) - అ. 11 బాహ్యంభ్యంతర లీకద్వారాష్టక విశ్వష్టకంబును - క; బాహ్యాభ్యంతరికద్వారాష్టకవిస్పష్టంబును-అ; విస్పష్టంబు - త. 12 ఇది 'ర' లోలేదు. అ, గొ లలోఁగలదు. 13 వరుణ - డ, ద, బ, లలోలేదు. ర, అ, గొ లలోఁ గలదు.

మణిగణఘృణి మంజరీపింఛరీకృతంబగుశేష14పీఠంబునధిష్ఠించి, చరణద్వయాంతరాళోపలాలిత 15 గోయష్టిలతామతల్లియై, భువన త్రితయకామితకల్పవల్లి యునైన తనయాకృతిఁయవికృత 16 పరిభావంబునఁబరిభవింపఁదల్ క్షేత్రతీర్థ మధ్యం 17 బులనంగి కృతా 18 ధ్యాసికుండై వాసుదేవాది 19 వ్యూహంబులు,20 జ్ఞాన క్రియాదిశక్తులు, వసురుద్రాదిత్యాదిమరుద్విశేషంబులు, నశేష నిగమంబులు, నఖిల 21 సిద్ధాంతంబులు, సమస్త తీర్థసార్థంబులు, సకలమంత్రరహస్యంబులు, సర్వ 22 గాంధర్వసర్వస్వంబులు, విశ్వ 23 విశ్వాధికైశ్వర్యంబులు, ననశ్వరసంపదలంబొదలి సేవింపఁబెంపు మెఱసి యుండెనని వెండియుఁగుండలి కుండలుం డిట్లనియె. **118**

వ్యా :— వత్సా = నాయనా ! (ఇది వాత్సల్యసూచకము), శ్రీవత్స లాంఛను = శ్రీవత్సముపుట్టుమచ్చగాఁగలవానియొక్క- (శ్రీవత్సము- చూ 1-1 వ్యాఖ్య) - విష్ణుమూర్తియొక్క, భక్తవత్సలత్వంబు = భక్తవాత్సల్యము, నీవున్ = నీవును, ఎఱింగినయదియకదా ! = ఎఱిఁగినదేగదా ! వినుము = ఆకర్ణింపుము. అత్తెఱంగునన్ = ఆవిధ

---

14 పీఠంబున - గౌ; పీఠంబు - ర, అ. 15 గోష్ఠిలతా – త; గోయష్టిలతా – ర. అ. 16 భావం - ముద్రి (అ) ర, 17 బుల- ర, గౌ; బుల (న?) - అ. 17 ధ్యాసీనుండై - ముద్రి (అ) ర; ధ్యాసకుం - క; ధ్యాపికుండై - అ; ధ్యాసికుండై-గౌ. 18 శక్తులు త, ప, గౌ, 19 వ్యూహంబులు - ర, అ, 20 ఇది 'గౌ'లోలేదు 21 శుద్ధాం - డ, ద, బ. సిద్ధాం - ర, అ, గౌ, 22 గంధర్వ స్వరసారస్యంబులు - డ, ద, బ, గాంధర్వసర్వస్వంబులు - ర,అ 23 విశ్వాది - త; విశ్వాధి – ర, అ.

ముగా, మెఱుంగుటొల్లియగొల్లదొర =పీతాంబరధారియగుగోపాలుఁడు, కర = చేతులయందు, కలిత = గ్రహింపఁబడిన చిత్రభద్రజలజ శుక్తియున్ = పలువన్నెలతోలుసంచి, పద్మము, శంఖముగలవాఁడును, (శుక్తిః కపాలశకలే శంఖే శంఖనఖేపిచ - మే. ని) విరచిత = కూర్పఁ బడిన - పొందింపఁబడిన, వినత = నమస్కరించువారియొక్క, ముక్తి యున్ = మోక్షముగలవాఁడును, (వినతులకుమోక్షమునిచ్చువాఁడును- అనుట) కుటిల = వక్రములును, కోమల = మృదువులునగు, వినీల = మిక్కిలినల్లనయిన, కుంతల = కేశములయొక్క, నికరుండు నున్ = సమూహముగలవాఁడును, అపరిమిత = మితిలేని, కరుణా = దయకు, అకరుండును = స్థానమయినవాఁడును, కటితట = ఒడ్డు వంటిమొలయందు, ఘటిత = కూర్పఁబడిన, దోస్స్తంభయుగ ళుండును = స్తంభములవంటి భుజయుగముగలవాఁడును. చటుల = చంచలములయిన, నిశాట = రాక్షసులయొక్క, గళ = కంఠము లకు, నిగళుండును = శృంఖమయిన, వాఁడును, మకరకుండల = మొసలియాకృతిగలకర్ణాభరణములచేత, మండిత = అలంకరింపఁబడిన, కపోలఫలకుండును = ఫలకములవంటి చెక్కిళ్లుగలవాఁడును. (మకర కుండలములు చెక్కిళ్లయందు ప్రతిఫలించుననుట) యదుకులతిల కుండును = యదువంశశ్రేష్ఠుఁడును, క్షుల్ల = లఘువయిన, శాశిక్య = చిఱుచిక్కముయొక్క (చూ 2-103 వ్యాఖ్య) సఖ్య = చెలిమిచేత, అభి రామ = ఒప్పిదములయిన, మృదుల = కోమలములగు, ఊరు ద్వయుండునున్ = తొడలదోయికలవాఁడును, అద్వయుండును = సజాతీయమగు రెండవవస్తువు లేనివాఁడును, పుండరీకప్రభృతి = పుండ రీకుఁడు మొదలుగాఁగల. మునిజన = మౌనిజనులచేత, సేవ్యమా నుండునున్ = కొలువఁబడుచున్నవాఁడును; అనూనుండునున్ = పరిపూర్ణుఁడును, అఖండ = సంపూర్ణమయిన, జ్ఞాన = మోక్షబుద్ధి యొక్క, (మోక్షేధీర్జ్ఞానమ్ - అమ) ఆనంద = హర్షము, ఏక =

ముఖ్యముగాఁగల, విగ్రహుండును = శరీరముగలవాఁడును, (శరీరం వర్ష్మవిగ్రహః - అమ) విదళిత = ఛేదింపఁబడిన - పోఁగొట్టఁబడిన, జగత్ = లోకముయొక్క, నిగ్రహుండునునై = బంధనముగల వాఁడునై, (నిగ్రహః = బంధనమ్ - శబ్దక) పంచాబ్దంబును = ఐదుసంవత్సరములుగలదియు, పంచశరసహస్ర = మన్మథుల వేయి సంఖ్యను - అసంఖ్యాక మన్మథులను, అతిశాయి = అతిక్రమించునట్టి; విలసనరసంబునున్ = విలాసరసముగలదియు, ఇచ్ఛా = అభిలాషచే, దిగంబరంబున్ = దిక్కులు వస్త్రములుగాఁ గలదియు - నగ్నమును, ఐన = అయినట్టి, ప్రాయంబునన్ = వయస్సుతో, నవ = క్రొత్తదయిన, రత్నసాను = మేరుపర్వతముతో, (మేరుఃసుమేరుర్హేమాద్రిరత్నసానుః సురాలయః - అమ) ప్రాయంబును = తుల్యమయినదియు; (ప్రాయోవయసిబాహుళ్యేతుల్యానశన మృత్యుషు - వై. ని.) బాహ్య = వెలుపలిదియు. అభ్యంతరిక = లోపలిభాగమునకు సంబంధించినదియునగు, ద్వారఅష్టక = వాకిళ్ల యొక్క యెనిమిదింటిచేత, (ఎనిమిదివాకిళ్లచేత - అనుట) విస్పష్టంబునున్ = ప్రకటమయినదియు, అదభ్రంబున్ = అనల్పమును, (అదభ్ర = దభ్రమల్పంన - శబ్దస్తో) అభ్రంకషంబును = ఆకాశము నొరయునదియు - అత్యున్నతమును, (అభ్రంకష = అభ్రమాకాశం కషతిగచ్ఛతిధాతూనామనేకార్థత్వాత్ - మేఘుస్పర్శీ,అత్యున్నతః-శబ్దక) శరత్ = శరత్కాలమునందలి, అభ్ర = మేఘమువలె, శుభ్రంబున్ = తెల్లనిదియు, (శుభ్రముద్దీప్తశుక్లయోః - అమ) అగు = అయిన, మహాప్రాసాదంబునందున్ = గొప్పదేవగృహమునందు, (హర్మ్యాది ధనినాంవాసః, ప్రాసాదోదేవభూభుజామ్ - అమ) వాసవ =ఇంద్రుఁడు వైశ్రవణ = కుబేరుఁడు, వరుణ = ప్రచేతుఁడు, వైవస్వత = యముఁడు, (వైవస్వతోంతకః - అమ) ప్రముఖ = మొదలుగాఁగల, మఖభుక్ = దేవతలయొక్క, అలఘు = గొప్పవయిన, కిరీట = మకుటములయందలి, మణిగణ = రత్నములసమూహముయొక్క,

ఘృణిమంజరీ = కాంతిగుచ్ఛములచేత, పింజరీకృతంబు = పీతరక్త వర్ణముగలదిగాఁజేయఁబడినది, అగు = అయిన, శేషపీఠంబున్ = శేషరూపమగునాసనమును, అధిష్ఠించి = ఉనికిపట్టుగాఁజేసికొని, చరణద్వయఅంతరాళ = అడుగుదోయియొక్క మధ్యభాగమునందు, ఉపలాలిత = లాలింపఁబడిన - ఉంచఁబడిన, గోయష్టిలతామల్లియై = తీఁగవంటి శ్రేష్ఠమయిన యావులనుద్రోలు కఱ్ఱగలదియు, భువనత్రితయ = లోకత్రియముయొక్క, (స్వర్గమర్త్యవల్లియున్ = కల్పవృక్షశాఖయు, (సమేశాఖాలతే - అమ; లతా = వల్లి.) ఐన = అయినట్టి, తన = తనయొక్క, ఆకృతి = ఆకారము, అవికృత = మార్పులేని, ప్రభావంబునన్ = మాహాత్మ్యముతో, (ప్రభావము = మాహాత్మ్యము - శే. ని. - సూ. ని) ప్రిభవింపన్ = ఆవిర్భవింపఁగా, తద్+క్షేత్రతీర్థ = అపుణ్యప్రదేశము (పౌండరీకము) యొక్కయు, నాపుణ్యనది (భైమీనది) యొక్కయు, మధ్యంబులన్ = నడిమిప్రిదేశములందు, అంగీకరింపఁబడిన, అధ్యాసికుండై = అధ్యాసించుటగలవాఁడయి, వాసుదేవాది వ్యూహంబులు = వాసుదేవుఁడు మొదలుగాఁగల వ్యూహములు, (వాసుదేవ సంకర్షణప్రద్యుమ్నానిరుద్ధ వ్యూహములు, చూ 1-69 వ్యాఖ్య.) జ్ఞానక్రియాదిశక్తులు = జ్ఞానము క్రియమున్నగు శక్తులు - జ్ఞానక్రియేచ్ఛాశక్తులు, (చూ 1-53 వ్యాఖ్య) వసురుద్రఆదిత్యఅది = వసువులు, రుద్రులు. నాదిత్యులుమొదలగు, మరుత్ = దేవతలయొక్క, విశేషంబులు = భేదములు - గణదేవతలు, గణదేవతలు —

"ఆదిత్యవిశ్వవసవస్తుషితాభాస్వరానిలాః,

మహారాజికసాధ్యాశ్చరుద్రాశ్చగణదేవతాః"

— ఇతి జటాధరః (శబ్దక)

అశేషనిగమంబులున్ = సమస్తవేదములును, (ఋగ్యజుస్సామాథ్వరణవేదములనుట) అఖిలసిద్ధాంతంబులు = సమస్తరాద్ధాంత

ములు, పరిమాణాదులచేఁ బూర్వపక్షమును నిరసించి సిద్ధపక్షమును (నిశ్చితపక్షమును) స్థాపించెడు రూపమునఁగల వాక్యసమూహమును. సమస్తతీర్థసార్థంబులు = ఎల్లపుణ్యనదుల సమూహములును, (సార్థో వణిక్సమూహేస్యాదపిసంఘాతమాత్రకే - మే. ని.) సకలమంత్రి రహస్యంబులున్ = ఎల్లమంత్రములయొక్క రహస్యములును, సర్వ గాంధర్వ = ఎల్లసంగీతశాస్త్రములయొక్క, సర్వస్వంబులున్ = సంపద లును, విశ్వ = సమస్తములయిన, (విశ్వమశేషంకృత్స్నంసమస్త నిఖి లాఖిలానిసశ్శేషమ్ - అమ) విశ్వ = జగత్తులకంటె, అధిక = ఎక్కువయిన. ఐశ్వర్యంబులున్ = విభూతులును, అనశ్వర = నశ్వ రముకాని, (శాశ్వతమయిన) సంపదలన్ = సంపత్తులతో, పొదలి = వర్ధిల్లి, సేవింపన్ = భజింపఁగా, పెంపుమెఱపియుండెనని = అతిశ యించియుండెనని, కుండలికుండలుఁడు = సర్పములు కుండలములుగాఁ గలవాఁడు - శివుఁడు, వెండియున్ = మఱియు, ఇట్లు = ఈప్రకా రముగా, అనియెన్ = పలికెను.

క॥ నారద ! ధృతహేమరసా
సారచ్ఛురితంబువిష్ణుసదనంబది 2 దే
వీరచితారాత్రికతతి
భూరమణీమణికిరీటమున్ 3 బురుడించున్. 119

వ్యా :— నారద = ఓ కలహాశనా ! ధృత = ధరింపఁ బడిన, హేమరస = బంగారుదరవముయొక్క, (గుణేరాగేద్రవేరసః- అమ) ఆసార = ప్రసరణముచేత, ఛురితంబు = తాపఁబడిన-పూయఁ బడిన, (బంగారుపూఁతపూయఁబడిన - అనుట) విష్ణుసదనంబది =

119 పః- 1 ధృత (ద్రుత?) - అ; ధృత - ర, గౌ. 2 వేదీ -ముద్రి(అ);ర. దేవీ - అ, గౌ. 3 బురణించుఁజా - గ; గౌ; బురుడించుఁజా - ర, అ.

హరియొక్క నిలయము - విట్ఠలాలయము, దేవీ = దేవపత్నులచేత; (దేవీ = దేవపత్న్యామ్ - శబ్దస్తో) రచిత = కూర్పఁబడిన - ఈయఁ బడిన, ఆరాత్రికతతిన్ = నీరాజనములయొక్క సమూహముచేత, భూరమణీ = భూకాంతయొక్క, మణికిరీటమున్ = రత్నమకుటమును, పురుడించున్ = సరిపోలును.

వ్యాక :— విష్ణుసదనంబది - 'అది' యర్థశూన్యము.
ప్రౌ. శబ్ద 63.

అలం :— ఉపమ.

క॥ అలతీర్థస్థలిక్షేత్ర
స్థలిలీలావిగ్రహద్వితయయుతుఁడై భా
సిలుపౌండరీకవల్లభుఁ
దలఁచినఁగనుఁగొన్న గరగతములిహపరముల్. **120**

వ్యా :— అలతీర్థస్థలిన్ = అపుణ్యనదీ (భైమీనదీతీర) ప్రదేశమునందు, క్షేత్రస్థలిన్ = (అ) పుణ్యప్రదేశ (పౌండరీకక్షేత్ర) మందును, లీలావిగ్రహద్వితయ = క్రీడార్థమయిన శరీరద్వయముతో, యుతుఁడై = కూడుకొన్నవాఁడయి, (చూ 4-117) భాసిలు = ప్రకాశించెడు, పౌండరీకవిభున్ = పౌండరీకక్షేత్రాధిపతిని - పాండురంగవిట్ఠలుని, తలఁచినన్ = స్మరించినను, కనుఁగొన్నన్ = దర్శించినను, ఇహపరముల్ = ఇహపరలోకములు - ఇహపరసుఖములు, కరగతములు = హస్తప్రాప్తములు - అధీనములు.

క॥ 1 వినఁబడఁడు చెవులఁ 2 గన్నుల
గనఁబడఁడత్యుగ్రనారకవ్యథ చేతన్

121 వ:- 1 వినఁబడుచెవులను - గొ; వినఁబడఁడుచెవుల - ర, అ.
2 గన్నుఁ - త; గన్నుల - ర, అ.

బొనుఁగుపడిజడియువైష్ణవుఁ
డనవధిదురిత ప్రవర్తియయ్యుఁగుమారా ! 121

వ్యా :— కుమారా! = పుత్రా! (ఇదివాత్సల్య సూచకము) నారదా ! అనవధి = హద్దులేని, దురిత = పాపమునందు, ప్రవర్తి = వర్తించువాఁడు, అయ్యున్ = అయినప్పటికి, అత్యుగ్ర = మిక్కిలి భయంకరమయిన, నారక = నరకసంబంధమయిన. వ్యధచేతన్ = బాధచేత, పొనుఁగుపడి = తేజోహీనుఁడయి, జడియు = సుక్కెడు, వైష్ణవుఁడు = విష్ణుభక్తుఁడు, చెవులన్ = వీనులచేత, వినఁబడఁడు = ఆలకింపఁబడఁడు, కన్నులన్ = నేత్రములచేత, కనఁబడఁడు = చూడఁబడఁడు.

చ॥ ఇరుగడలన్ ద్విరూపములఁ 1 గృష్ణుఁడుదైత్యనిరాకరిష్ణుఁడ
ప్పురుసుననుండ నన్నడిమిభాగము 2 నన్ వసియింతురెవ్వరా
3 నరులమనుష్య రూపభరణంబునఁగ్రీడయొనర్చుయక్షకి
న్నరగరుడోరగద్యుచర 4 నాథులుగాఁగొనిమొ్రక్కఁగాఁదగున్. 122

వ్యా :— ఇరుగడలన్ = రెండుప్రక్కలయందు - తీర్థక్షేత్రములకు రెండుప్రక్కలయందు, (చూ 4-117ప) ద్విరూపములన్ = రెండు మూర్తులతో, దైత్య = దితిపుత్రులను, నిరాకరిష్ణుఁడు = నిరాకరించు స్వభావముగలవాఁడగు, కృష్ణుఁడు = హరి, అప్పురుసునన్ = అవిధముగా, ఉండన్ = ఉండఁగా, అన్నడిమిభాగమునన్ = అమధ్యప్రదేశమునందు, ఎవ్వరు = ఎవరు, వసియింతురు = నివసింతురో, అనరులన్ = అమానవులను, మనుష్యరూప = మానవా

---

122 ప:- 1 కృష్ణుఁడె - త; గృష్ణుఁడు - ర, అ. 2 నణవసియింతు- గొ; నందువసింతు - ర, అ. 3 నరులు - ర,అ. 4 నాథులె - త; నాథులు - ర, అ.

ృతియొక్క, భరణంబునన్ = ధరించుటచేత, క్రీడయొనర్చు = క్రీడించు, యక్షకిన్నర గరుడోరగద్యుచరనాథులుగాన్ = యక్షులు కిన్నరులు గరుడులు నాగులు విద్యాధరపతులుగా, (నభశ్చర = విద్యాధరే. నభశ్చర = ద్యుచర) కొని = గ్రహించి, మ్రొక్కఁగాఁదగున్ = నమస్కరింపఁదగును.

యక్షకిన్నరవిద్యాధరులుదేవయోనివిశేషములు- 3-116 వ్యాఖ్య.

వ్యాక ;— నివసింతురు = నివసింతురో. ఓ - అధ్యాహార్యము. (ప్రౌ. వ్యాక. 13)

ఆనరులన్ -- ద్యుచరనాథులుగా. విధేయవిశేషణముద్వితీయకుఁబ్రథమ - ప్రౌ. కారక 24)

ఉ॥ ఎయ్యదిదివ్యసేవ్యతర, మెయ్యదిమౌనిమనోభిగమ్యమౌ
నెయ్యదినీవునేనుభజియింపఁగనింపగునెల్లనాఁడు, నా
దయ్యపువెల్గుసుమ్మునతతస్థితివెల్గెడుఁబుండరీకవా
గ్దాయ్యలఁబ్రజ్వరిల్లుచు, జగత్త్రియదుష్కృతదాహదక్షమై **123**

వ్యా :— ఎయ్యది = ఏది, దివ్య = దేవతలచేత, సేవ్యతరము = మిక్కిలి కొలువఁదగినదో, ఎయ్యది = ఏది, మౌని = మునులయొక్క, మనః = హృదయములచేత, గమ్యమౌ = పొందఁదగినదియగునో, ఎయ్యది = ఏది, నీవున్ = నీవును, నేనున్ = నేనును, భజియింపఁగన్ = సేవించుటకు, ఎల్లనాఁడు = ఎల్లప్పుడును ఇంపగున్ = ప్రియమగునో, ఆదయ్యపువెల్గుసుమ్ము = అద్వైతమనెడు నగ్నిజ్యోతిసుమా! జగత్త్రియ = లోకములు మూఁడింటియొక్క, (స్వర్గమర్త్యపాతాళలోకములమూఁడింటియొక్క) దుష్కృత = పాపములయొక్క, దాహ = దహించుటయందు, దక్షమై = సమర్థమయి,

పుండరీక = పుండరీకునియొక్క, వాక్ = వచనములనెడు, ధాయ్యలన్ = (అగ్నిని బ్రజ్వలింపఁజేయునప్పుడుపఠించు) సామిధేనీమంత్రములచేత, (ఋక్సామిధేనీధాయ్యాచయస్యాదగ్నిసమింధనే - అమ) సతత = ఎడతెగని, స్థితిన్ = ఉనికిచేత, వెల్గెడున్= ప్రకాశించును.

వ్యాక :— సేవ్యతరము. మనోభిగమ్యము. ఇంపగున్ = అనుచోట్ల 'ఓ' - అధ్యాహార్యము. ప్రౌ. వాక్య 13

దయ్యపువెల్గు - దయ్యమనెడు వెల్గు. రూపకమునఁబుంపులు.

అలం :— రూపకము.

మ॥ అలసంబుల్మునిరాట్ప్రణీతములు ప్రాయశ్చిత్తముల్ పాతకం
బులనిర్జింపఁగ, విష్ణు! భక్తియతగుంబో! దానికింబూనఁ బా
ములపల్గాటులుచీరలందుడిచినంబోనేర్చునే ? మాంత్రికా
కలితాహిప్రతివీరమంత్రపదరేఖాశ్లాఘచేతన్ బలెన్. **124**

వ్యా :— పాతకంబులన్ = పాపములను, నిర్జింపఁగన్ = జయించుటకు - నశింపఁజేయుటకు, మునిరాట్ = మౌనిరాజులచేత, ప్రణీతములు = చేయఁబడినవగు-ఏర్పఱుపఁబడినవగు, ప్రాయశ్చిత్తముల్ = పాపపరిహారార్థము చేయుకర్మములు, అలసంబుల్ = మందములు - అసమర్థములు, దానికిన్ = అద్దానికి - పాపములను నశింపఁజేయుటకు, పూనన్ = ఉద్యమించుటకు, భక్తియ = భక్తియే, తగున్ = సమర్థమగును. పాముల = సర్పములయొక్క, పల్గాటులు = కోఱలయొక్క దంశనములు, మాంత్రిక = మంత్రగాండ్రచేత, ఆకలిత = కూర్పఁబడిన, అహిప్రతివీరమంత్రి = ప్రతి

124 పః- భక్తియు - ర; భక్తియ - అ, గౌ.

స్పర్థులయిన పాపములకు సంబంధించిన మంత్రములయొక్క, పద రేఖా = చిహ్నలేశములయొక్క - సంకేతవర్ణములయొక్క (పదమ్- చిహ్నె - శబ్దస్తో) శ్లాఘచేతంబలెన్ = ప్రశంసచేతవలె, (ఉచ్చారణముచేతవలె - అనుట) చీరలన్ = వస్త్రములచేత, తుడిచినన్ = పాపిమినచో, పోనేర్చునే = పోఁజాలునా? పోనేరవనుట.

పాముకాటుసీరఁదుడిచినన్, బోవునె - ఉ. హ. 4-150

అలం ;— దృష్టాంతము.

సీ॥ జగదధిష్ఠానంబుసచ్చిదానందాత్మ
కమునందనంద 1 నాంగకము క్షేత్రి
తీర్థస్థితముపృథగ్దీపితంబున్నసింహా
రామమత్స్యాది విగ్రహములెట్టి
యువియనఁదగియుండునట్టిదయగుదాని
2 హైతుకులఘుతమః ప్రోతమతులు
గాంచియర్చలయందొకటిగాఁగఁదలఁచి, వి
కత్థనంబొనరించిగరుసు 3 లేని

తే॥ రౌరవంబున 4 డింది 5 దుర్భవములంది
వనరుదురుగాని విజ్ఞానవంతులైన
వారుశిలగాఁగఁదలఁచరెవ్వారు, దృష్టి
గోచరబ్రహ్మమనిచూచికొలిచియునికి. 125

125 ప :- 1 నాత్మకము-ముద్రి (అ), ర, గౌ. (యతిభంగము) నాంగము-త, నాంగకము- అ. 2 హేతి - డ, ధ, బ, గౌ; ద్వైతి -గ; హైతి-క.త; హైతుకులఘుతమఃప్రోతమతులు - ర, అ. 3 లేక - ర; లేని-అ. 4 లడింది - ర, గౌ; నడిగ్గి - అ. 5 పారంబులేక - ర, అ; దుర్భవములంది - గౌ.

వ్యా :— జగత్ = లోకముయొక్క, అధిష్ఠానంబు = ఆధారమును, సచ్చిదానందాత్మకము = సత్యము, జ్ఞానము, నానందము, స్వభావముగాఁగలదియు, క్షేత్రతీర్థ = క్షేత్రతీర్థములయందు- పౌండరీకక్షేత్రభైమీనదీతీరములయందు, స్థితము = ఉన్నదియగు, నందనందన = నందతనయునియొక్క. కృష్ణునియొక్క, అంగకము= దేహము - విగ్రహము, పృథక్ = వేఱుగా, దీపితంబు = ప్రకాశితము. (విట్ఠలుని విగ్రహముపౌండరీకక్షేత్రమునందును, భైమీనదీ తీరమునందును వేఱువేఱుగా రెండురూపములతోఁ బ్రకాశించుననుట. చూ. 4-117) నృసింహరామమత్స్యాది విగ్రహములు = నరసింహశరీరము, రామశరీరము. మీనశరీరము మొదలగు నవతారమూర్తులు, ఎట్టియవి = ఎటువంటివి, అనఁదగియుండున్ = అనుటకు యుక్తముగానుండునో, అట్టిదయగున్ = అటువంటిదేయగును. దానిన్ = దానిని- ఆపౌండరీకమునందలి కృష్ణుని (విట్ఠలుని) విగ్రహమును, అఘ = పాపములనెడు, తమః = చీకట్లచేత, ప్రోత = కూర్పఁబడిన, మతులు= బుద్ధిగలవారగు, హైతుకులు = హేతువాదులు - పాషండుల లోనగువారు, కాంచి = చూచి, అర్చలయందున్ = ప్రతిమలయందు, (ప్రతిమా — ప్రతికృతిరర్చా - అమ) ఒకటిగాఁగన్ = ఒక్కటిగా- ఒకప్రతిమగా, తలఁచి = భావించి, వికత్థనంబొనరించి = మిథ్యాస్తుతిచేసి, (శ్లాఘాప్రశంసార్థవాదః, సాతుమిథ్యావికత్థనమ్ - అభి. చిం.) గరుసులేని = అవధిలేని, రౌరవంబునన్ = రౌరవమను నరకభేదమునందు, డింది = క్రుంగి, దుర్భవములు = దుష్టములయిన జన్మములను, అంది = ప్రాపించి, వనరుదురుగాని = దుఃఖింతురుగాని, విజ్ఞానవంతులైనవారు = విశేషమయిన మోక్షసాధనమగు బుద్ధిగలవారు, (వి = విశేషే - శబ్దస్తో; మో క్షేధీర్ జ్ఞానమ్ - అమ) ఎవ్వరున్ = ఎవరును, దృష్టిగోచర = కంటికగపడునట్టి, బ్రహ్మమని = పరబ్రహ్మమని, చూచి = ఎఱిఁగి, కొలిచియునికిన్ = సేవించి యుండుటచేత, శిలగాఁగన్ = ఱాయిగా, తలఁచరు = భావింపరు.

హైతుకులు - "హైతుకః = హేతుద్వారా సత్కర్మసుసందేహ కర్తా, యథా - పాషండినీవికర్మస్థాన్, బైడాలవ్రతికాన్ శఠాన్, హైతుకాన్ బకవృత్తీంశ్చ, వాఙ్మాత్రేణాపినార్చయేత్ - ఇతి విష్ణు పురాణే" (శబ్దక.)

రౌరవశబ్దనిరుక్తి —

"తవీవరురవోభూత్వా, పరత్రపీడయంతితమ్
తస్మాద్రౌరవమిత్యాహుః, పురాణజ్ఞామనీషిణః
రురుఃసర్పాదపికూరోజంతురుక్తఃపురాతనైః" (దేవీ) - శబ్దక.

వ్యాక :— అనఁదగియుండున్ = అనఁదగియుండునో. ఓ - అధ్యాహార్యము, (ప్రౌ. వాక్య 13)

శా॥ అవాణీరమణుండుప్రార్థనముసేయన్ దేవకీదేవియం
దావిర్భావమునొంది, యేరికినలభ్యంబైన 1 తేవన్, జగ
జ్జీవాతుస్థితి 2 నుండ సందుదొర విస్మేరాననున్, నిత్యసం
సేవన్3దెల్పుచు జితేంద్రియుండుతమముంజించుంగనున్4దత్త్వమున్ 126

వ్యా :— అవాణీరమణుండు = అసరస్వతీపతి - అబ్రహ్మ, ప్రార్థనముసేయన్ = ప్రార్థింపఁగా, దేవకీదేవియందున్ = (వసుదేవ పత్నియగు) దేవకీదేవియందు, అవిర్భావమునొంది = జన్మించి, ఏరికిన్ = ఎవరికిని, అలభ్యంబైన = పొందశక్యముకానట్టి, తేవన్ = రీతిచేత, విస్మేరాననున్ = నవ్వుతోఁగూడిన ముఖముగలవాఁడగు,

---

126 ప:- 1 సేవన్ - ప; తేవఙ - ర, అ, 2 నిండి - త; నిండు-ర, అ. 3 దెల్పి - డ, ద. బ, గొ; దెల్పు-ర, అ. 4 దత్త్వమున్-ర,అ; దత్త్వముఙ - గొ.

జగత్ = లోకమునకు, జీవాతు = జీవనౌషధమగు, స్థితిన్ = ఉనికిచేత, ఉండు = వర్తించు, నిండు = అతిశయించు, దొరన్ = విభుని - కృష్ణుని, నిత్యసంసేవన్ = నిరంతరభజనముచేత, తెల్చు= స్తుతించు, జితేంద్రియుండు = గెలువబడిన యింద్రియముగలవాఁడు- వశి, తమమున్ = తమోగుణమును, చించున్ = విడఁగొట్టును - నశింపఁజేయును, తత్వమున్ = పరమాత్మను. (తత్త్వంస్వరూపే పరమాత్మని - మే. ని.) కనున్ = దర్శించును.

తే॥ భక్తిగద్గదరీతివాగ్భరములొలయ
నటనమునఁ 1 గూడి గోపికానాథుమ్రోల
నిలిచికీర్తించుపుణ్యుండునలినబంధు
దళనమొనరించి 2 తత్వపదమున కరుగు. 127

వ్యా :— భక్తిన్ = భక్తితో, గద్గదరీతిన్ = డగ్గుత్తికపడిన వైఖరితో, (డగ్గుత్తికపడిన కంఠస్వరముతో -అనుట) వాగ్భరములు= మాటలయతిశయములు, ఒలయన్ = ఒప్పఁగా, నటనమునన్ = నర్తనమునందు, కూడి = గుమిగాఁజేరి, గోపికానాథు = గోపీవల్లభునియొక్క - కృష్ణునియొక్క, (విఠ్ఠలునియొక్క - అనుట) మ్రోలఁ = ఎదుట, నిలిచి = నిలఁబడి, కీర్తించు = స్తుతించు, పుణ్యుండు = సుకృతుఁడు, నలినబంధు = సూర్యునియొక్క, దళనమొనరించి=భేదనమునొనర్చి(సూర్యమండలమునుభేదించి-అనుట)తత్వపదమునకున్=పరమాత్మస్థానమునకు-వైకుంఠమునకు, అరుగున్=చనును.

కర్మనిష్ఠులగు జీవులకు ధూమాది మార్గమును, సగుణబ్రహ్మోపాసకులకర్చిరాది మార్గమునునుపనిషత్ప్రతిపాదితము. విఠ్ఠలుని

---

127 ప:- 1 గూడ - గ, గౌ; గూడి - ర, అ. 2 తత్త్వ - ర, అ. తత్వ - గౌ.

యెదుట నర్తనముచేయుచుఁగీర్తించుభక్తులర్చిరాది మార్గమున వైకుంఠ మునకరుగుదురనుట. సూర్యమండలభేదనమర్చిరాది మార్గమునకు సూచకము.

క॥ 1 హరి సోపహారు లక్ష్మీ
శ్వరు నెవ్వఁడుచూతురట్టివారలు సకలా
మరపూజ్యులు; వారందునఁ
బొరసినపుణ్యములగణ్యములు గుణజలధీ! 128

వ్యా :— గుణజలధీ = సద్గుణసముద్రుఁడా! - (నారదునకు సంబోధన.) సఉపహారున్ = ఉపాయనముతోఁగూడుకొన్న వాఁడును, (భక్తులుసమర్పించు నైవేద్యములతోఁగూడుకొన్న వాఁడును - అనుట) లక్ష్మీశ్వరున్ = రమాపతియునగు, హరిన్ = కృష్ణుని - పాండు రంగవిట్ఠలుని, ఎవ్వరు = ఎవరు, చూతురు = దర్శింతురో, వారలు= వారు, సకలఅమర = సమస్త దేవతలచేతను, పూజ్యులు = పూజ నీయులు, వారు = వారలు. అందునన్ = అందుచేత, పొరసిన పుణ్యములు = పొందిన సుకృతములు, అగణ్యములు = లెక్కింపఁ శక్యముకానివి. (అపరిమితములనుట)

వ్యాక :— చూతురు =చూతురో. ఓ - అధ్యాహార్యము. ప్రౌ. వ్యాక. 13

క॥ ఇతిహాసపురాణ కథా
శ్రుతిస్మృతులునందగోపసుతుకట్టెదురన్
సతతముపఠియించుమహా
మతిపరమపదంబునందుమతిమన్నుతభ్యా!. 129

128 ప.- 1 హరుగో - గౌ; హరిసో - ర, అ.

వ్యా :— మతిమత్ = బుద్ధిమంతులయందు, ముఖ్యా = శ్రేష్ఠుఁడా ! (ముఖ్యవర్యవరేణ్యశ్చ - అమ) ఇతిహాస = (రామాయణభారత) పురావృత్తములయొక్కయు, (ఇతిహాసఃపురావృత్తమ్ - పురాణ = పంచలక్షణములయొక్కయు, (పురాణంపంచలక్షణమ్-అమ) కథా = చరిత్రలు, శ్రుతిస్మృతులు = వేదములు, ధర్మశాస్త్రములు, నందగోప = నందగోపునియొక్క, సుతు = కుమారునియొక్క — కృష్ణునియొక్క. (విట్ఠలునియొక్క - అనుట) కట్టెదురన్ = మిక్కిలి ముందటిభాగమునందు, సతతము = ఎల్లప్పుడు, పఠియించు = చదువు, మహామతి = గొప్పబుద్ధిగలవాఁడు, పరమపదంబున్ = ఉత్కృష్టస్థానమును - వైకుంఠమును, అందున్ = ప్రాపించును.

క॥ తీర్థములనాడి బహ్మా
భ్యర్థితలీలావతారుభక్తాధారున్
బార్థసఖుఁ 1 గొల్వఁగలమో
క్షార్థులకుం 2 గలుగునిలనదానందంబుల్. 130

వ్యా :— తీర్థములన్ = పుణ్యజలములయందు - పుణ్యనదులయందు, ఆడి = స్నానముచేసి, బ్రహ్మ = నలువచేత, అభ్యర్థిత = ప్రార్థింపఁబడిన, లీలావతారున్ = విలాసార్థమయినయవతారముగలవాఁడును, భక్త = భక్తులకు, ఆధారున్ = ఆశ్రయమయినవాఁడునగు, పార్థసఖున్ = అర్జునునిమిత్రుని - కృష్ణుని, (విట్ఠలుననుట) కొల్వఁగల = సేవింపఁజాలిన, మోక్షార్థులకున్ = ముక్తినపేక్షించువారికి, ఇలన్ = భూమియందు, సత్ఆనందముల్ = సత్యమయిన యానందములు, కలుగున్ = ప్రాప్తించును.

---

130 ప॥- 1గొలువ -గో; గొల్వ - ర, అ. 2 గలవుసచ్చి - ముద్రి(అ)ర; గదానందంబుల్ - గో. (గ-తరువాతఁగొంతఖాలీవదలఁబడినది) గలుగునిలసదా - అ.

సీ॥ భ్రూణహంతుండును, సురాపుఁడు, బ్రహ్మఘాతియు
గురుతల్ప 1 గుఁడు, స్తేయి, గోవధోప
జీవి, పితృద్రోహి, శిశు 2 హంత, పరదార
రతుఁడు, నిందకుఁడు, 3 సర్వత్రభోక్త
4 సత్పరిత్యక్తుండు, సర్వాభిమర్షి, 5 హై
తుకుఁడు, సర్వాపలాపకుఁ, డశుచియు
నిజధర్మవిద్వేషి, నీచుండు, పాషండ
షండప్రవణుఁడు, స్వేచ్ఛావిహారి

తే॥ కృతమెఱుంగనివాఁడు, సూనృతములేని
వాఁడు, నమ్మినఁజెడఁజూచువాఁడుమొదలు
పాపకారులకేనియుఁబౌండరీక
తీర్థహరిమూర్తియుగమిచ్చుదివ్యపదము. **131**

వ్యా :— భ్రూణహంతుండును = భ్రూణ (గర్భస్థపిండమును) హత్యచేసినవాఁడును, సురాపుఁడున్ = కల్లుత్రాగినవాఁడును, బ్రహ్మఘాతియున్ = బ్రాహ్మణవధచేసినవాఁడును, గురుతల్పగుఁడు = గురుభార్యాగమనముచేసినవాఁడును, (తల్పంశయ్యాట్టజాయాసు - వై.ని.)

---

131 ప.- 1 గస్తేయి - డ, ద, బ; గౌ; గుఁడుస్తేయి - ర, అ. 2 హంతృ... రతులు - డ, ధ, బ; హర్తృ...రతులు- గౌ; హంత, పరదార రతుఁడు - ర, అ. 3 సర్వస్వ-ముద్రి (అ), ర; సర్వత్ర-అ, గౌ. 4 సత్యారి (త్యర?) క్తుండును - అ; సత్పరిత్య - ప, ర; సాత్త్విక రహితుండు-త. 5 హైతి - త, ప; హేతి- డ,ద,బ, హైతుః-ర,అ. 4, 5. సత్వండు సర్వాభిమర్షి హైతుకుఁడు సర్వాపలాపకుఁడ శుచియు-గౌ. (గణభంగము)

గురోఃపితురాచార్యోపాధ్యాయాదేర్వాతల్పంశయ్యాం పత్నీమితియావత్ గచ్ఛతిఇతి - శబ్దక) స్తేయి = చోరుఁడును - సువర్ణముదొంగిలించువాఁడును. (ఇవినాలుగుపంచమహాపాతకములలోనివి.చూ3-10వ్యాఖ్య)

గోవధఉపజీవి = గోవులనుజంపుటచేతజీవించువాఁడును, పితృద్రోహి = తల్లిదండ్రులకు ద్రోహముచేయువాఁడును, (మాతాపితరౌ పితరౌ - అమ) శిశుహంత = బాలకులను హత్యచేయువాఁడును, పరదార = ఇతరునిభార్యయందు, రతుఁడున్ = రతిగలవాఁడును, (పరకాంతను రమించినవాఁడనుట) నిందకుఁడు = (పరులను) నిందించువాఁడును. సర్వత్ర = అన్నిచోట్ల (నిషిద్ధస్థలములందనుట) భోక్త = భుజించువాఁడును, సత్ = సజ్జనులచేత, పరిత్యక్తుండున్ = పరిత్యజింపఁబడినవాఁడును, సర్వాభిమర్శి = అందఱను స్పృశించువాఁడును (మైలపడువాఁడనుట) హైతుకుఁడున్ = హేతువాదియు, (చూ 4-125 వ్యాఖ్య) సర్వ = సమస్తమును, అపలాపకుఁడు = తెలిసియుండియు మఱుగుపఱుచువాఁడును, (అపలాప = సతోప్య సత్త్వేన కథనరూపే అపహ్నవే-శబ్దస్తో) అశుచియున్ = అపరిశుద్ధుఁడును నిజ = తనదైన, ధర్మ = ఆచారముయొక్క, విద్వేషి = ద్వేషించువాఁడును, నీచుండు = హీనుఁడును. పాషండ = సర్వలింగుల (సర్వవర్ణచిహ్నధారుల) యొక్క - బౌద్ధక్షపణకాదులయొక్క, (పాషండాః సర్వలింగినః - అమ) బౌద్ధక్షపణకాదిః - ఇతిభరతః - శబ్దక; చూ 1-211) షండ = సమూహమునందు, ప్రవణుఁడున్ = ఆసక్తిగలవాఁడును, స్వేచ్ఛావిహారి = (విధినిషేధములు లేకుండ) తన యిచ్ఛవచ్చినట్లు సంచరించువాఁడును. కృతము = చేసిన మేలును, ఎఱుంగనివాఁడున్ = గుర్తింపనివాఁడును - కృతజ్ఞుఁడు కానివాఁడును, (కృతఘ్నుఁడును - అనుట) సూనృతములేనివాఁడున్ = ప్రియముతోఁ గూడిన సత్యవాక్కులేనట్టివాఁడును. (సూనృతంప్రియేసత్యే - అమ) నమ్మనన్ = విశ్వసింపఁగా, చెడఁజూచువాఁడున్ = చెఱుచువాఁడును,

మొదలుగన్ = మొదలుకొని, పాపకారులకేనియున్ = పాతకములు చేయువారికయినను, పౌండరీకతీర్థ = పౌండరీకక్షేత్రమునందలి, హరిమూర్తియుగము = కృష్ణునియొక్క (విట్ఠలునియొక్క - అనుట) యాకృతిద్వయము, దివ్యపదమున్ = లోకాతీతస్థానమును-వైకుంఠమును, ఇచ్చున్ = అనుగ్రహించును.)

వ్యాక :— స్త్రేయి - లోనగుచోట్లసముచ్చయార్థమధ్యాహార్యమని గ్రహింపవలెను. (ప్రౌ. వాక్య. 13)

చ॥ అలఁతిపిసాళినవ్వుమధురాధరబింబఫలంబుతమ్మిఱే
కులనగుసోఁగకన్నులు ప్రకుంచితకుంతలచారు ఫాలమున్
బలుచని చెక్కులంగలయఁబర్వినకుండలరత్నకాంతులుం
గలశిఖిపింఛలాంఛనుమొగంబుగనందగు ధూపవేళన్. **132**

వ్యా :— అలఁతిపిసాళినవ్వు = అల్పమును మనోజ్ఞమునగు హాసము, (మనోహరమందహాసమనుట) మధుర = తీయనయిన, అధరబింబఫలంబు = దొండపండువంటిమోవి, తమ్మిఱేకులన్ = పద్మదళములను, నగు = హసించు - పోలు, సోఁగకన్నులు = నిడుదలయిన నేత్రములు, ప్రకుంచిత = మిక్కిలి వక్రములయిన, కుంతల = కేశములచేత, చారు = మనోహరమయిన, ఫాలమున్ = నుదురును, పలుచని చెక్కులన్ = నన్ననికపోలములయందు, కలయన్ = అంతటను. పర్విన = వ్యాపించిన; కుండల రత్నకాంతులున్ = కర్ణభూషణమణి దీప్తులును, కల = కలిగిన, శిఖిపింఛలాంఛను = నెమలిపురి చిహ్నముగాఁగలవానియొక్క - కృష్ణునియొక్క, (విట్ఠలునియొక్క - అనుట) మొగంబు = ముఖము, ధూపవేళలన్ = సుగంధిద్రవ్యపుఁబొగవేయుసమయములందు, కనన్ = చూచుట, తగున్ = యుక్తమగును.

క॥ క్షణముక్షణార్ధ 1 మయినఁదీ్రి
క్షణలలితంబగు పయోధిశయనువదనమీ
క్షణమొనరించుకృతికి నా
క్షణమునఁగలవఖిలసుకృత జాతఫలంబుల్. **133**

వ్యా :— క్షణముక్షణార్థమయినన్ = క్షణకాలమయినను, క్షణకాలములోసగభాగమయినను, త్రి = మూఁడు, ఈక్షణ = కన్నుల చేత, లలితంబగు = మనోహరమయినదగు, పయోధిశయను = విఠ్ఠలునియొక్క (సముద్రముశయనముగాఁగలవాఁడు-విష్ణువు. విష్ణువునకు విఠ్ఠలునకునభేదము) వదనము = ముఖము, ఈక్షణమొనరించు = దర్శించు, కృతికిన్ = పుణ్యునకు, (కృతీ = పుణ్యవాన్, ఇతి శబ్ద రత్నావళీ - శబ్దక) అక్షణమునన్ = అక్షణమునందే, అఖిల = సమస్తమయిన, సుకృత = పుణ్యములవలన, జాత = కలిగిన, ఫలంబుల్= ఫలితములు, కలవు = ఉన్నవి.

త్రీక్షణ -- పాండురంగవిఠ్ఠలునకు ఫాలనేత్రముండునుగానఁ దీ్రక్షణలలితమనుట - చూ 5-56

క్షణము -- 3 మినిట్లకాలము. క్షణార్థము = $1\frac{1}{2}$ మినిట్లకాలము. మినిట్టు, నిమిషముకాదు. నిమిషము = 1/5 సెకెండు.

సీ॥ మువ్వంక 1 మురువుతోమురళియొక్కొకవేళ
మోత్రియించుభువనైకమోహనముగఁ

---

133 పః- 1 మైనఁద్రిక్ష - డ, ద, బ, గౌ; ర్థంబైనఁది్వ - బ, య, బేఁదీ్వ-రః మైనదీ - త; మైన (మయిన?) దీక్షణ - అ.

134 పః- 1 రవళి — క; మురువు - ర, అ.

గ్రీడించునొకవేళఁదోడిబాలురఁగూడి
యక్షిణి 2 రతిఁగుబేరాక్షకేళి
సవరించునొకవేళజలవిహారముచాలఁ
బ్రేమభీమరథీగభీరవారిఁ
గొలువుండునొకవేళనలిననంభవపుండ
రీకాక్షదాదులు ప్రీతిఁగొలువ

తే॥ సురగరిపువాహనముననొక్కొక్కవేళ
వేడ్కవేంచేసి మెఱయుఁదిర్వీధులందు
నెన్నికల్పంబులరిగిన 3 నేనయేండ్ల
వెలయుప్రాయంబుగల కొయ్యవిట్ఠలయ్య. 134

వ్యా ;— ఎన్నికల్పంబులు = ఎన్ని బ్రహ్మదినములు, అరిగినన్ = కడచినప్పటికి, ఏను+ఐ = అయిదేయయిన, ఏండ్లన్ = సంవత్సరములతో. వెలయు = ఒప్పెడు, ప్రాయంబుగల = వయస్సు గలిగిన, కొయ్య = కొంటెవాఁడగు, విట్ఠలయ్య = పాండురంగ విట్ఠలనాథుఁడు —

1) ముువ్వంక = మూఁడువంకరల సమాహారముతోఁగూడు కొనిన, మురువుతోన్ = విలాసముతో, భువన = లోకములకు, ఏక = ఒక్కటియేయయిన, మోహనముగన్ = మోహముగలిగించునదిగా, ఒక్కొకవేళన్ = ఒక్కొక్కసమయమునందు, మురళి = పిల్లన గ్రోవిని, మ్రోయించున్ = మ్రోఁగఁజేయును - ఊఁదును.

2) ఒకవేళన్ = ఒకసమయమునందు, తోడిబాలురన్ = సహ

2 గతి - ర, అ. రతి - గొ. 3 యేన - గొ;. నేవ - ర, అ.

చరులయిన పిల్లలను, కూడి = కలిసి, అక్షీణరతిన్ = అధికమయిన యానక్తితో, కుబేరాక్షకేళిన్ = కుబేరాక్షమను పేరుగలయాటచేత, క్రీడించున్ = విహరించును.

3) ఒకవేళన్ = ఒకసమయమునందు, భీమరథీ = భీమరథీ నదియొక్క, గభీరవారిన్ = లోతుగలనీటియందు, చాలన్=మిక్కిలి, ప్రేమన్ = ప్రీతితో, జలవిహారము = జలక్రీడను, సవరించున = చేయును.

4) ఒకవేళన్ = ఒకసమయమునందు, నలినసంభవ = తమ్మిచూలి (బ్రహ్మ) పుండరీక = పుండరీకుడు, అస్మదాదులు = నేను మొదలగువారు (శివుడు - వక్త) ప్రీతిన్ = ప్రియముతో, కొలువన్ = సేవింపగా, కొలువుండున్ = సభాసీనుడగును.

ఒకొక్కవేళన్ = ఒకొక్కసమయమునందు, వేడ్కన్ = వేడుకతో, ఉరగరిపువాహనమునన్ = గరుడవాహనమునందు, వేంచేసి = విచ్చేసి (కూర్చుండి - అనుట) తిర్వీథులందున్ = దేవుడూరేగువీథులయందు, మెఱయున్ = ఒప్పును.

కల్పము = 864 కోట్ల మానవాబ్దములు. (చూ 1-120) ప్రథమపరార్థములోగడచిన కల్పములు - 30 × 12 × 50 = 18000 కల్పములు. ద్వితీయపరార్థములో శ్వేతవరాహకల్పము నడచుచున్నది. అయినను విఠ్ఠలుని వయస్సు మాత్రమైదేండ్లే. అనగా బాలకృష్ణ స్వరూపుడన్నమాట. విఠ్ఠలశబ్దనిరుక్తికి - చూ 1-213 వ్యాఖ్య.

శా॥ శ్రీరంగంబున, ద్వారకన్, గయగురుక్షేత్రంబునన్, నైమిశా
ఖ్యారణ్యాంజనశైలపుష్కరమహేంద్రానంతశయ్యాహరి

ద్వారశ్రీపురుషోత్తమంబుల, నయోధ్యన్, సేతు 1 గంగాబ్ధిసం
గారూఢస్థలిఁబౌండరీకమున, దైత్యారాతియుండుగడున్. **135**

వ్యా :— శ్రీరంగంబునన్ = శ్రీరంగమునందును, ద్వార
కన్ = ద్వారకయందును, కురుక్షేత్రంబునన్ = కురుక్షేత్రము
నందును, నైమిశఆఖ్య అరణ్య, అంజనశైల, పుష్కర, మహేంద్ర,
అనంతశయ్యా, హరిద్వార, శ్రీపురుషోత్తంబునన్ = నైమిశమను పేరు
గలయరణ్యమునందును, మహేంద్రగిరియందును; ననంతశయనము
నందును, హరిద్వారమునందును, శ్రీపురుషోత్తమ క్షేత్రమునందును,
అయోధ్యన్ = సాకేతమునందును, సేతు = సేతువుయొక్కయు,
గంగాబ్ధిసంగ = గంగాసాగరసంగమముయొక్కయు, ఆరూఢ =
ప్రసిద్ధమయిన, స్థలిన్ = ప్రదేశమునందును, పౌండరీకమునన్ =
పౌండరీకమునందును, దైత్యారాతి = విష్ణుమూర్తి కడుః =
అత్యంతము, ఉండుః = వర్తించును.

విష్ణువు సర్వాంతర్యామియయ్యు నీపుణ్యప్రదేశములందుఁదత్తేజో
వ్యాప్తి గాఢముగానుండుననితాత్పర్యము.

క॥ హరియుత్తరభాగంబునఁ
బురుషుఁడుదాఁబాపమైనఁబుణ్యంబైనన్
సురకానియంతచేసినఁ
బరిణతమైమేరుకుధరభారముఁజూపున్. **136**

వ్యా :— హరి = కృష్ణునియొక్క - పాండురంగవిట్ఠలుని
యొక్క, ఉత్తరభాగంబునన్ = ఎడమభాగమునందు, (ఉత్తరము =
ఎడమది, దాపటిది. వ్యతి. దక్షిణము - సూ. ని.) పురుషుఁడు =
జీవుఁడు, (పురుషః = జీవః - శబ్దక) తాన్ = తాను, పాపమైనన్=

135 పః- 1 గంగాభిసం - డ, ధ, బ; గంగాబ్ధిసం - ర, అ, గౌ.

అఘమునయినను. పుణ్యంబైనన్ = సుకృతమునయినను, సురకాని యంత = సురకానియనెడు చిన్నదాగినాణెమంత, చేసినన్ = ఒనర్చి నచో, పరిణతమై = పరిణామమునందినదై. మేరుతుధరభారమున్ = మేరుపర్వతము యొక్కబరువును. (తూనికపనుట) చూపున్ = కనంబఱుచును.

"సురకాని = కానిలో నాలుగవభాగము." (సూ. ని.) "సురకాని. A fraction (ciphered) thus; సు 1) of a unit, being 1/1024 the one thousand and twenty fourth part సు 11 is two cura canis, or 1/512 and సు 111 three suracanis, is 1/256" (?) కాని (ణి) - కాకణీశబ్దభవము 3 దమ్మిడీలు = 1 కాణి. 4 కాణులు = 1 అణా. 16 అణాలు = 1 రూపాయి. కాణి = 1/64 రూపాయి. 1/4 కాణి = సురకాని అనఁగా 1/256 రూపాయి - సూ. ని. 1/1024 రూపాయి-బ్రౌ. అనఁగా కాణిలో 16వ, వంతు సురకాణి.

సీ॥ 1సమ్మార్జనమునధ్వాంక్షము, నుపలేపనం
బునమరాళము, రంగమునవి. త్రి
శుకము, దీపాంకురప్రకటనంబునఁబాము,
పదపద్మతీర్థానుభవముకతన
నరఘుయు, మూధస్యపరిషేచనంబున
ధేనువు, మోక్షంబుతెరువు 2 గనియెఁ
3 గాన నేతత్పరికల్పనంబునఁబొందు
రంగాధినాథుఁజేరంగవలయు

---

137 ప॰- 1 సంతతసలిలసమ్మార్జనమునుప - త. సమ్మార్జనమునధ్వాంక్షము నసులేప- ర, అ. 2 గనిరి-డ,ద,బ,గౌ; గలిగి-గ; గవియె - ర.

తే॥ ననినవారదుఁడిట్లను నభవ! జ్ఞాన
విరహితంబులు జడములు, వీనికెట్లు
మనుజకృత్యంబు 4 చేకూరె? మధువిరోధి
యెట్లువరమిచ్చె? ననివేఁడనీశుఁడనియె. 137

వ్యా :— సమ్మార్జనమునన్ = తుడుచుటచేత, ధ్వాంక్షమున్ = కాకియు, (ధ్వాంక్షాత్మఘోషపరభృద్బలిభుగ్వాయసా అపి- అమ) ఉపలేపనంబునన్ = అలుకుటచేత, (గోముఖంతూపలేపనమ్ - త్రి. ని.) మరాళమున్ = హంసయు, రంగమునన్ = రంగుచేత - రంగురంగుల కాంతులను గూర్చుటచేత, విచిత్ర = పలువన్నెలుగల, శుకమున్ = చిలుకయు - పంచవన్నెల (రామ) చిలుకయు, (చూ 4-223 వ్యాఖ్య.) దీపఅంకుర = దివ్వెకొనయొక్క, ప్రకటనంబునన్= ప్రకాశపఱుచుటచేత, పాము = సర్పమును, పదపద్మ = అడుగుఁదమ్ములయొక్క, తీర్థ = పుణ్యోదకముయొక్క, అనుభవముకతనన్ = అతిభూతిహేతువున, సరఘయున్ = తేనెటీఁగయు, (సరఘామధుమక్షికా -అమ) ఊధస్య = క్షీరముయొక్క, (గోరసంక్షీరమూధస్యమ్- అభి. చిం.) పరిషేచనంబునన్ = చిందుటచేత, ధేనువున్ = ఆవును, మోక్షంబుతెరువు = ముక్తిమార్గము, కనియెన్ = ప్రాపించెను. కానన్ = కావున, ఏతత్పరికల్పనంబునన్ = ఈ నిర్ణయముచేత, (సూ. ని.) - కాకిలోనగు తిర్యక్కులు పాండురంగవిఠ్ఠలునిమూలమున మోక్షమార్గమునుగనుటనుబట్టి యతని నాశ్రయించినచో మోక్ష ప్రాప్తి కలుగునన్న నిర్ణయముచేత, పాండురంగాధినాథున్ = పాండురంగ క్షేత్రాధిపతిని, చేరంగవలయున్ = ఆశ్రయింపవలెను. అనినన్ = అని (శివుఁడు) పలుకఁగా, నారదుఁడు = కలహభోజనుఁడు, ఇట్లు =

3 గానవి - గౌ; గాననే - ర; గాననే (యే?)-అ. 4 చేకూర-గౌ; చేకూరె - ర, అ.

ఈ ప్రకారముగా, అనున్ = అనెను. అభవ = ఓ యీశ్వరా! జ్ఞాన విరహితంబులు = మోక్షబుద్ధిలేనివి; (మోక్షేధీర్జ్ఞానమ్-అమ) జడములు = మూఁగజీవులు - (జడ=మూకే - శబ్దస్తో) నోరుమాలిన తిర్యక్కులు, అగువీనికిన్ = ఈవాయసాదులకు. మనుజకృత్యంబు = మానవకర్మ. ఎట్లు = ఏప్రకారముగా, చేకూరెన్ = సాధ్యపడెను. మధువిరోధి = విష్ణుమూర్తి - విట్ఠలుఁడు, ఎట్లు = ఏప్రకారముగా, వరమిచ్చెన్ = వరప్రదానముచేసెను. అనివేఁడన్ = అనియర్థింపఁగా, ఈశుఁడు = శివుఁడు, అనియెన్ (ఇట్లు) పలికెను.

వ్యాక :— పాము = పామున్ - సముచ్చయమధ్యాహార్యము. (ప్రౌ. వాక్య 13) అనున్ = అనెను. భూతమునలాట్టు— బా. క్రియా 22.

## కాకహంసశుకసర్పసరఘాధేనువుల ముక్తి కథ

ఉ॥ మూర్తిమదిక్షుకార్ముక నముజ్జ్వలకీర్తియుఁబోని చంద్రికా
స్ఫూర్తి వెలుంగఁజేయుచునభోవనకేసరి చంద్రుఁడుబ్బఁగాఁ
గార్తిక 1 పూర్ణిమన్ యదుశిఖామణిమున్నొకనాఁడుచూళికా
నర్తితపింఛగుచ్ఛలసనంబున భీమరథీతటంబునన్. 138

వ్యా :— నభోవనకేసరి = ఆకాశమనునరణ్యమునకు సింహమగు, చంద్రుఁడు = శశాంకుఁడు, మూర్తిమత్ = ఆకారముగలిగిన (రూపుకట్టిన) ఇక్షుకార్ముక = చెఱకువిలుకానియొక్క (మన్మథుని

---

138 పః- 1 పున్నమన్ - గొ; పూర్ణిమజ- ర, అ.

యొక్క) సముజ్జ్వల = మిక్కిలి ప్రకాశించునట్టి, కీర్తియుఁబోని = యశస్సువంటి, చంద్రికా = వెన్నెలయొక్క, స్ఫూర్తిన్ = స్ఫురణమును, వెలుఁగఁజేయుచున్ = ప్రకాశింపఁజేయుచు, ఉబ్బఁగాన్ = బయలుమెఱయఁగా, కార్తికపూర్ణిమన్ = కార్తికమాసపుఁబున్నమతిథియందు, యదుశిఖామణి = యదుశ్రేష్ఠుఁడు -- కృష్ణుఁడు (విఠ్ఠలుఁడనుట) మున్ను = పూర్వము, ఒకనాఁడు = ఒకదినము, చూళికా = సిగజుట్టునందు, నర్తిత = నర్తించునదియగు, పింఛగుచ్ఛ= గుత్తివంటి నెమలి పురియొక్క, లసనంబునన్ = కాంతిచేత, (లస-దీప్తౌచ - శబ్దస్తో) భీమరథీతటంబునన్ = భీమరథీనదియొడ్డునందు. (మీఁదిపద్యముతో నన్వయము)

మ॥ సురలీలావతులున్, నరాంగనలు, చక్షుశ్శ్రోత్రకన్యల్, స్మర
జ్వర 1 లీఢాశయలై తనుంగొలువ, రాసక్రీడఁ 2 బెన్‌ప్రోఢయై
కరలీనోర్మికలంగుళీచలనరింఖత్కాంతులై క్రాలఁగా
మురళీనాదవినోదకేళిఁదవిలెన్, మోదంబు 3 బసాదంబుగన్. 139

వ్యా :— సురలీలావతులున్ = వేలుపుసొగసుకత్తెలు -- దేవకాంతలును, (అప్సరసలనుట) నరాంగనలు = మనుష్య స్త్రీలు, చక్షుశ్శ్రోత్రకన్యల్ = సర్పకాంతలు, స్మరజ్వర = మదనతాపముచేత, లీఢ = ఆస్వాదింపఁబడిన - పీడింపఁబడిన, ఆశయులై = మనస్సుగలవారయి. (ఆశయః = చేతః - శబ్దక) తనున్ = తన్ను, కొలువన్ = సేవింపఁగా, రాసక్రీడన్ = రాసకేళియందు, పెన్ ప్రోఢయై = గొప్పనేర్పరియై, కర = చేతులయందు, లీన = కలసి

---

189 ప:- 1 పీడా - ముద్రి (అ) ర; లీఢా - అ, గొ. 2 బెన్‌బోఁదయై-అ బెన్‌ప్రోఢయై - ర. గొ; డలై - గ. 3 బుసాదం - డ, ఢ, బ,గొ; బునాదం - య; బసాదం - అ.

పోయిన - హత్తుకొనిన, ఊర్మికలు = ఉంగరములు, అంగుళీ = వేళ్లయొక్క, చలన = కదలుటచేత, రింఖత్ = జాఱుచున్న - వ్యాపించుచున్న, కాంతులై = దుత్యులుగలవై, శ్రీలఁగాన్ = ఒప్పఁగా, మోదంబు = సంతోషము, అసాదంబుగన్ = అవిచ్ఛిన్న ముకాఁగా, మురళీనాద = పిల్లనగ్రోవిధ్వనియొక్క, వినోదకేళిన్ = వినోదక్రీడయందు. తవిలెన్ = ఆసక్తుఁడయ్యెను.

రాసము - మండలనృత్యము. (చూ 3 - 178) "మండలేనతు యన్నృత్యంతదాసమితి స్మృతమ్" (భావప్ర)

"కార్తికీ పూర్ణిమాయాంచ, కృత్వాతురాసమండలమ్
గోపానాంశతకం కృత్వాగోపీనాంశతకంతథా"

(బ్రహ్మవై) - శబ్దక

138, 139 పద్యములరెంటికి నన్వయము. కావనదియుగ్మకము. "ద్వాభ్యాంతుయుగ్మకమ్" - సా. ద.

క॥ ఆనాదము 1 తద్వనజగ
తీనివసన్మౌనిహోమధేనువొకటిసాం
ద్రానంద మొదవవినితన
మేనుమఱచికుఱిసెనపరిమితదుగ్ధంబుల్. **140**

వ్యా ;— తద్వనజగతీ = ఆయరణ్యభూమియందు, నివసత్ = నివసించుచున్న, మౌని = మునియొక్క, హోమధేనువు = హోమార్థమగుగోవు, ఒకటి = ఒక్కటి, సాంద్ర = అతిశయమయిన, ఆనందము = సంతోషము, ఒదవన్ = కలుగఁగా, విని =

140 పః- 1 దవ్వున - డ, ధ, బ; తద్వన - ర, అ, గొ.

అలకరించి, తన = తనయొక్క, మేనుమఱచి = ఒడలువిస్మరించి (పరవశించి - అనుట) అపరిమిత = అమితయిన, దుగ్ధంబుల్ = క్షీరములు, కురిసెన్ = వర్షించెను - పొదుఁగునుండికార్చెను.

ఉ॥ కాననగంధవాహవశగంబగుటన్ వెస 1 నొండుతత్పయః
ఫేనకణంబువచ్చిమురభేదనుమౌళినలంకరించె, శ్రీ
జానియుఁబాటమాని నిజసౌధమునందు 2 సుఖించుచుండె; నా
ధేనువులెస్సగాముదిసిదేహమునూడ్చిభవాంతరంబునన్. 141

వ్యా :— తత్పయః ఫేనకణంబు = ఆపాలనురుగుయొక్క బిందువు, ఒండు = ఒకటి, కాననగంధవాహవశగంబగుటన్ = అడవి గాలికివశీభూతమగుటచేత, వెసన్ = వేగముగా, వచ్చి = అరుదెంచి-ఎగిరివచ్చి, మురభేదను = కృష్ణునియొక్క - విఠ్ఠలునియొక్క, మౌళిన్ = సిగను, (చూడాకిరీటంకేశాశ్చసంయతామౌళయస్త్రయః - అమ) అలంకరించెన్ = కైసేసెను. శ్రీజానియున్ = లక్ష్మీపతియు-విఠ్ఠలుఁడును, పాటమాని = సంగీతమును విరమించి, (వేణుగానమును విరమించి - అనుట) నిజ = స్వకీయమయిన, సౌధమునందున్ = రాజగృహమునందు, (సౌధోస్త్రీరాజసదనమ్ - అమ) సుఖించుచుండెన్ = సౌఖ్యమునొందుచుండెను. ఆధేనువు = ఆగోవు లెస్సగా = బాగుగా, ముదిసి = ముదిమినొంది, దేహమున్ = శరీరమును, ఊడ్చి = విడిచి, భవఅంతరంబునన్ = వేఱుజన్మమునందు. (మీఁదిపద్యముతో నన్వయము.)

---

141 పః- 1 నుండు - గౌ; నొండు - ర, అ. 2 సుఖింపు - గౌ; సుఖించు - ర, అ.

క॥ హరిమౌళిపతితనిజదు
గ్ధరసోత్కరఫేనకణకృతపరమసుకృత
స్ఫురణంబున నొకవైష్ణవ
వరునకుఁదనుజాతయగుచువసుధంబుట్టెన్. **142**

వ్యా :— హరి = కృష్ణునియొక్క (విట్ఠలునియొక్క - అనుట) మౌళి = సిగయందు, పతిత = పడినదగు, నిజ = స్వకీయ మయిన, దుగ్ధరస = క్షీరరసముయొక్క, ఉత్కర = సమూహము యొక్క, ఫేనకణ = నురుగుబిందువుచేత, కృత = సంపాదింపఁ బడిన, సుకృత = పుణ్యముయొక్క, స్ఫురణంబునన్ = స్ఫూర్తిచేత, ఒకవైష్ణవవరునకున్ = ఒకవైష్ణవశ్రేష్ఠునకు, తనుజాతయగుచున్ = కూఁతురగుచు, వసుధన్ = భూమియందు, పుట్టెన్ = జన్మించెను.

141, 142 పద్యములురెండింటికన్వయము. కాననిదియుగ్మకము. (చూ 4-139)

## సుశీలోపాఖ్యానము

వ॥ సుశీలాభిధానయగు నబ్బాలగుణగణభాస్వరయై
యథోచితకాలంబున. **143**

వ్యా :— సుశీల = సుశీలయనెడు, అభిధాన = పేరు గలది, అగు = అయిన, అబ్బాల = అకన్య; (బాలా = కన్యా యాంచ - శబ్దస్తో) గుణగణ = సద్గుణసమూహముచేత, భాస్వరయై=

ప్రకాశమానయై, యథోచితకాలంబునన్ = యోగ్యసమయమునతిక్ర మింపకుండ, (వివాహయోగ్యమగు కాలమునందనుట) మీఁదిపద్య ముతోనన్వయము.

ఉ॥ తాళివిభుండుగట్టినమొదల్ పతిదేవతయానుశీల, పెన్
గోలతనంబునన్ మగఁడుకొట్టినఁదిట్టిన 1 రట్టుపెట్టినన్
దాళి, దినంబుఁదచ్చరణతామరసంబులు 2 గొల్చు, నేలయుం
బోలునె? 3యీ పెనంచుఁగృతబుద్ధులు 4 వృద్ధులుప్రస్తుతింపఁగన్ 144

వ్యా :— విభుండు = భర్త, తాళి = మంగళసూత్రమును కట్టినమొదల్ = (మెడలో) బంధించినది మొదలుకొని. పతిదేవత = భర్త దేవతగాఁగలదియగు (భర్తనుదేవునిగా భావించునదియగు-అనుట) -పతివ్రతయగు. అనుశీల = అనుశీలయనునది, మగడు = భర్త, కొట్టినన్ = తాడించినను, తిట్టినన్ = దూషించినను, రట్టుపెట్టినన్= బాధకలిగించినను, పెన్గోలతనంబునన్ = మిక్కిలి ముగ్ధత్వముతో, తాళి = సహించి, నేలయున్ = భూమియైనను, ఈపెన్ = ఈమెను, పోలునె = సరిపోలునా? అంచున్ = అని, కృతబుద్ధులు = స్థిర చిత్తులగు, (కృతధీ = స్థిరచిత్తే - శబ్దస్తో, ధీ = బుద్ధి) వృద్ధులు = పెద్దలు, ప్రస్తుతింపఁగన్ = మిక్కిలికొనియాడఁగా, దినంబున్ = ప్రతిదివసమును, తత్ = అతనియొక్క - భర్తయొక్క, చరణ తామరసంబులు = పద్మములవంటి పాదములు, కొల్చున్=సేవించును.

తాళి - మంగళసూత్రధారణమునకు శాస్త్రప్రమాణము మృగ్య మందురు. "కామేశబద్ధమాంగళ్యసూత్రశోభితకంధరా" (లలితాసహ) ఇది శిష్టాచారము.

---

144 పః- 1 సద్దపెట్టి – గ; రట్టుచేసి - డ, ద, బ; రట్టుపెట్టినన్ - ర, అ,గౌ. 2 గొల్చె – క; గొల్చు - ర, అ. 3 యీకెనంచు – త, గౌ; యాపెనంచు - అ; యీపెకంచు - ర. 4 పెద్దలు – గ; వృద్ధులు – ర, అ.

సీ॥ రూపహీనుఁడు, మహాక్రోధనుఁ, డతిలోభి
బద్ధమత్సరుఁ, డన్యబుద్ధి 1 యాయి
చంచలస్వాంతుండు, సకలబంధువిరోధి
2 బహుళశపథోక్తిలంపటుఁడు, శఠుఁడు
3 సంతతావిశ్వాసనస్యప్రరోహుండు,
గర్వపర్వతమస్తకస్థితుండు
కలహాశ 4 నుఁడు, కుతర్కక్రియాకుశలుండు
సంగతోన్మాదోత్తమాంగకుఁడు

తే॥ నగునయేనియునటువంటి మగనితోడఁ
గాఁపురముసేయుసతిదొడ్డగరితయగుచుఁ
గనఁడి 5 కోతఁలకోర్చిలో 6 విసిగికొనక
ధాతదూఱక తండ్రి 7 చేఁతకు వగవక. 145

వ్యా :— రూపహీనుఁడు = సౌందర్యహీనుఁడు, మహాక్రోధనుఁడు = గొప్పకోపముగలవాఁడు, అతిలోభి = అధికతృష్ణ గలవాఁడు (పరద్రవ్యమునందధికమయిన యభిలాషగలవాఁడనుట.)
లోభము —

"పరవిత్తాదికందృష్ట్వా, నేతుంయోహృదిజాయతే
అభిలాషోద్విజశ్రేష్ఠ: సలోభః పరికీర్తితః" (పద్మ) - శబ్దక.

---

145 పః- 1 మాయి - ముద్రి (అ). రః యాయి - అ. గౌ. 2 బహుళ-క, బహుశ - ర. అ. 3 సంతాపవి (ని?) శ్వాస - అ; సంతతావిశ్వాస -ర; గౌ. 4 నుండుతర్క — డ, ద, బః నుఁడుకుతర్క - ర,అ. 5 తకునోర్చి - ముద్రి (అ). ర; తలకోర్చి — అ. 6 విసివి — -ర, గౌ; విసిగి — అ 7 సేఁత - ముద్రి (అ), ర. చేఁత-అ,గౌ.

బద్ధ = పాదుకొనఁబడిన, మత్సరుఁడు = అసూయగలవాఁడు, అన్యబుద్ధియాయి = పరులబుద్ధిననుసరించిపోవువాఁడు.

2) చంచలస్వాంతుండు = నిలుకడలేని మనస్సుగలవాఁడు, సకలబంధు = ఎల్లచుట్టములకు, విరోధి = వైరి, బహు = అనేకము లయిన, శపథోక్తి = శపథవచనములయందు - తానుచెప్పినది నిజ మని నమ్మించుటకుఁజేయు ప్రమాణవచనములందు, లంపటుఁడు = అత్యాసక్తుఁడు, శఠుఁడు = ధూర్తుఁడు. శఠలక్షణము —

"ప్రియంవక్తి పురోన్యత్ర, విప్రియంకురు తేభృశమ్,
వ్యక్తాపరాధచేష్టన్య, శఠోయంకథితోబుధైః" (విష్ణు) - శబ్దక.

3) సంతత = నిరంతరమయిన, ( ఎడతెగని ) అవిశ్వాస = నమ్మకములేకపోవుటయనెడు, సస్య = చేనియొక్క, ప్రరోహుండు = మొలకెత్తుటగలవాఁడు, గర్వ = దర్పమనెడు, పర్వత = కొండ యొక్క, మస్తక = తలయందు - శిఖరమునందు, స్థితుండు = ఉన్నవాఁడు.

4) కలహ = జగడములు, అశనుఁడు = అహారముగాఁ గల వాఁడు, కుతర్క = కుత్సితములయిన యూహలయొక్క, క్రియా = వ్యాపారములందు, కుశలుండు = చతురుఁడు, సంగత = కూడు కొనిన, ఉన్మాద = వెఱ్ఱిగల, ఉత్తమాంగకుండు = తలగలవాఁడు.

అగునయేనియున్ = అగుటయేనిజమయినను, అటువంటిమగని తోడన్ = అట్టిరీతిగల భర్తతో, సతి = ప్రతివత - అనుశీల, దొడ్డ గరితయగుచున్ = ఉత్తమగృహిణియై, (గరితయనఁగ నిల్లాలనంగ, గృహిణిచెలఁగును - అం. భా) కసిఁడికోఁతలకున్ = చిన్నచిన్న ముక్కలుగాఁజేయుకోఁతలకు - నిరంతరబాధలకు, ఓర్చి = సహించి, లోన్ = లోపల - మనస్సులోపల, విసిగికొనక = నిర్వేదమునొందక,

ధాతన్=బ్రహ్మను, దూఱక = నిందింపక, (ఇట్టిభర్తనుబ్రాపింపఁజేసెనని బ్రహ్మనునిందింపక-అనుట) తండ్రి= జనకునియొక్క, చేఁతకున్=పనికి, (ఇట్టియయోగ్యునకిచ్చి వివాహముచేసిన తండ్రికృత్యమునకు -అనుట) వగవక = దుఃఖింపక, కాఁపురముచేయున్ = సంసారముచేయును.

శా॥ అతీవ్రాంశునివేఁడికోర్చిమను ఛాయాదేవియుంబోలె, స
త్పాతివ్రత్యగుణాభిరామయగు 1 నబ్జాభమాలలామంబు, సం
2 ప్రీతుంజేయునసహ్య 3 వర్తనములంబిర్వీఁకులంబెట్టుదు
ర్జాతునవీత 4 దయున్బ్రియున్దదుచితా 5 చారంబులన్నిచ్చలున్

**146**

వ్యా :— సత్పాతివ్రత్యగుణ = మంచిపతివ్రతాస్వభావము చేత. అభిరామ = ఒప్పునది, అగు = అయిన, అబ్జాభమాలలామంబు = అశ్రేష్ఠురాఁగుకాంత - అనుశీల, (లలామమ్ = శ్రేష్ఠేచ - శబ్దక.) అతీవ్రాంశుని = అవేఁడివెలుఁగుయొక్క, (అసూర్యునియొక్క) వేఁడికిన్ = ఉష్ణమునకు, ఓర్చి = సహించి, మను = వర్తించు, ఛాయా= దేవియుంబోలెన్ = ఛాయాదేవివలె, అసహ్యవర్తనములన్ = సహింపరానినడవడులతో, పిర్వీఁకులంబెట్టు = కష్టములుపెట్టు, దుర్జాతున్ = చెడుపుట్టువును; వీతదయున్ = నిర్దయుఁడును, అగు. ప్రియున్ = భర్తను, (ధవః ప్రియః పతిర్భర్తా - అమ) తదుచిత = అతనికియుక్తమగు. అచారంబులన్ = నడవడులచేత, (అతనికనుకూలమయిన నడవడులచేత - అనుట) నిచ్చలున్ = ఎల్లప్పుడు, ప్రీతుంజేయున్= ప్రీతిపొందినవానినిగాఁ జేయును.

---

146 ప:- 1 నాభామా - ర. అః నబ్జామా - గౌ. 2 ప్రీతింజేయు - ర; ప్రీతిం-(తు?) జేయు - అ; ప్రీతుంజేయు - గౌ. 3 దర్శనములం - ర; వర్తనములన్ - అ, గౌ. 4 దయానయుఙ - డ, ద. బః దయుఙబ్రియుఙ — ర, అ. 5 చారప్రచారంబులన్-గౌ; చారంబులఙ నిచ్చలుఙ - ర, అ.

ఛాయాదేవి - సూర్యునిభార్యయగు సంజ్ఞాదేవి, భర్త వేఁడిమికిఁ దాళఁజాలక ఛాయాదేవిని సృష్టించియుంచిపుట్టింటికేగెనని పురాణకథనము

వ్యా ;— పిర్వీఁకు - పీఁకు+పీఁకు. బా. సంధి. 42 చే - పిరుపీఁకు. ప్రకీర్ణక 16 చే - పిర్వీఁకు.

అలం ;— ఉపమ.

ఉ॥ కొన్ని గొణంగి 1 కొన్గినిసికొన్ని తుటారములాడిమానరా
2 కెన్నికనిన్నినాళ్లకివియిన్ననికూటికిఁబిచ్చపాటిగొ
మ్మన్న మహాప్రసాదమని హర్షరసోల్లసదాననాబ్జయై
యన్నలినాక్షి భర్తయిడినన్నియకై కొను 3 ముక్కధాన్యముల్. 147

వ్యా ;— మానరాక = మానుటసాధ్యముకాక, కొన్ని= కొన్నింటిని - కొంతపరిమాణముగల ముక్కధాన్యమును, గొణంగి= పైకివినఁబడకుండునట్లునోటిలో నుచ్చరించి, కొన్ని = కొన్నింటిని - కొంతపరిమాణముగల ముక్కధాన్యమును, కినిసి = కోపించి, కొన్ని= కొన్నింటిని - కొంతపరిమాణముగల ముక్కధాన్యమును, తుటారములు = పరుషములయిన వాక్యములు, ఆడి = పలికి, ఎన్నికన్ = లెక్కచేత, (లెక్కగా - అనుట) ఇన్నినాళ్లకున్ = ఇన్నిదినములకు, ఇవి = ఈయివి - ఈముక్కధాన్యము, ఇన్నని = ఇంతపరిమాణము గలవియని, కూటికిన్ = తిండికి, పిచ్చ = అల్పమయిన, పాటి = పరిమాణము, కొమ్మన్నన్ = తీసికొనుమనఁగా, మహాప్రసాదమని= మహాప్రసాదమనిపలికి, హర్షరస = సంతోషరసముచేత, ఉల్లసత్ =

---

147 ప॥- 1 కన్గొనిసి - త; కొన్గినిసి - ర, అ. 2 కెన్నక - డ, ద. బ, కెన్నిక - ర, అ. 3 ౖముక్క - క; ముక్క - ర, అ, గ; ౖముక్క - డ, ద, బ.

ప్రకాశించుచున్న, ఆననఅబ్జయై = పద్మమువంటి ముఖముగలదై, అన్నలినాక్షి = ఆతమ్మికంటి-అనుశీల, భర్త = పతి, ఇడునన్నియ= ఎన్నియిచ్చునోయన్నే, మ్రుక్కధాన్యముల్ = సారహీనములయిన వడ్లను, కైకొనున్ = స్వీకరించును.

పాఠ :— మ్రుక్క-మ్రుక్కు ధాతుసంబంధముగల పదము. మ్రిక్కడి - శబ్దమునుబట్టి మ్రుక్కుధాతువురేఫసంయుక్తమని తెలియ నగును. (రేఫలోపమున, "ముక్కు" ధాతువు సిద్ధించును.) కాన మ్రిక్క - పాఠము గ్రహింపఁబడినది.

మహాప్రసాదము — విష్ణుపాదోదకాదులు గ్రహించునప్పుడు మహాప్రసాదమని యుచ్చరింపలెను.

"పాదోదకంచ నిర్మాల్యం, నైవేద్యంచవిశేషతః

మహాప్రసాదఇత్యుక్త్వా, గ్రాహ్యంవిష్ణోః ప్రయత్నతః"

-"ఇత్యేకాదశీతత్త్వధృతమత్స్యసూక్తవచనమ్" (శబ్దక.)

ఇట్లు విష్ణుపాదాదోకాదులను గ్రహించునప్పుడుచ్చరింపవలసిన పదము. పెద్దలిచ్చుస్వల్పవస్తువును గ్రహించునప్పుడు పిన్నలుచ్చరించు పదముగాఁగూడవాడుకకెక్కినది.

వ్యాక :— కొన్ని = కొని - బా. ప్రకీర్ణక 8 సూ. కొని + కినిసి = కొనిగినిసి (బా. సంధి 13) = కొన్గినిసి (ము. కౌ. ప్రకీర్ణక) నాళ్లు - నాఁడు + లు. బా. అచ్ఛిక 12 చే - నాఁడ్ + లు = నాళ్లు (ము కౌ. ప్రకీర్ణక)

సీ॥ చతురసమ్మార్జనాచరణంబుతొలునాఁటి
ప్రాఁచివన్నియ 1 తోఁపువడుటగాఁగ
గోమయగోముఖ శ్రీముంగిటఘటించు
టలు 2 ముఖమజ్జన కలనగాఁగఁ
గమనీయపూర్ణకుంభములపూజాక్లృప్తి
కుచలిఃచాకల్పరచనగాఁగ
నన్నసంపాదనార్థాగ్నిఁబుట్టినధూమ
పటలిసంస్కారధూపంబుగాఁగ

తే॥ విఘటితకవాటకద్వారవిశదనయన
యర్చితా 3 ధర 4 దేహళికాధరోష్ఠ
భాండగోపనయవనికాంబరపరీత
యింతిగృహలక్ష్మియత్యంతకాంతిఁదనరు. 148

వ్యా :— విఘటిత = విడఁగొట్టఁబడిన - పూర్తిగాఁ దెఱవఁబడిన, కవాటక = తలుపులుగల, ద్వార = వాకిటిచేత, విశద నయన = వ్యక్తమయిన కన్నులగలదియు, అర్చిత = పూజింపఁబడిన, అధరదేహళికా = క్రింది గడపయనెడు, (అధస్తాదపిచాధరః- అమ) అధరోష్ఠ = క్రింది పెదవిగలదియు, భాండగోపనయవనికా = కుండలను మఱుఁగుపఱుచుటకు సంబంధించిన తెరయనెడు, అంబర= వస్త్రముచేత, పరీత = చుట్టుకొనఁబడినదియు, అగు, ఇంతి = (ఆ)

---

148 ప:- 1 దోడు - గ; తొడుపు – ర (పా), ౹తోపు - ర, అ. 2 సుఖ-ర; ముఖ – అ 3 ధర (వర?) - అ; ధర - ర. అ, గౌ. 4 గేహళి - ముద్రి [అ]. ర, చ; దేహళికావరోష్ఠి – త; దేహళీ – క; గేహళికాధరోష్ఠి - గౌ. దేహళికాధరోష్ఠి - అ.

కాంతయొక్క - అనుశీలయొక్క, గృహలక్ష్మి = గేహలక్ష్మి - గేహమనెడుపుణ్యస్త్రీ.

1) చతుర = నిపుణమయిన, సమ్మార్జన = తుడుచుటయొక్క ఆచరణంబు = పని, తొలునాఁటి = పూర్వదినముయొక్క, ప్రాఁచి వన్నియ = అపరిశుద్ధమగురంగుచీరయొక్క, త్రోపువడుటగాఁగన్ = తొలఁగింపఁబడుటకాఁగా.

2) ముంగిటన్ = మునివాకిటియందు, గోమయ = పేఁడయొక్క, గోముఖ = కలయంపియొక్క; (కలవడంబు కలాఁపికలయంపిచానపి యనగోముఖాఖ్యలైయలరుచుండు - ఆం. భా.) - పేఁడనీళ్లకలయంపి యొక్క, శ్రీన్ = శోభను, ఘటించుటలు = కూర్చుటలు, ముఖ మజ్జన = మొగము కడుగుకొనుటయొక్క, కలనగాఁగన్ = కూర్చుటకాఁగా.

3) కమనీయ = మనోహారమయిన, పూర్ణకుంభముల = నిండు కుండలయొక్క, పూజా = అర్చనముయొక్క, క్లప్తి = కూర్చుట, కుచలికుచ = గజనిమ్మపండ్లవంటి స్తనములయొక్క, ఆకల్పరచన గాఁగన్ = వేషముయొక్కకూర్పుకాఁగా, (ఆకల్పవేషౌనైపథ్యమ్-అమ)

4) అన్నసంపాదన = అన్ననిష్పాదనమునకు, (కూడువండుటకు -అనుట) అర్హ = తగిన. అగ్నిన్ = అనలమువలన (నుండి) పుట్టిన= జనించిన, ధూమ = పొగయొక్క, పటలి = సమూహము, సంస్కార = దేహశోధనము కొఱకయిన, ధూపంబుగాఁగన్ = సుగంధిద్రవ్యము నుండి కలిగినపొగకాఁగా అత్యంత = అధికమయిన, కాంతిన్ = ఒప్పిదమనెడు మన్మథవర్ధితమగు రూపయౌవనాదిజన్యమగు సౌందర్య ముతో, తనరున్ = ఒప్పును.

కాంతి - అయత్నసిద్ధమగు శృంగారచేష్టలలో నొకటి. రూప యౌవనాదులచే సిద్ధించుసౌందర్యముశోభ, మన్మథవర్ధితమయిన శోభ, కాంతి.

"రూపయౌవనలాలిత్య, భోగాద్యైరంగభూషణమ్
శోభాసైవకాంతి, ర్మన్మథాప్యాయితద్యుతిః" (సా. ద.)

ఈ పద్యమున సుశీలగృహము పుణ్యస్త్రీగా రూపింపఁబడినది. స్త్రీలింగలక్ష్మీశబ్దమువలన స్త్రీత్వముద్యోతకమగును.

తెలుచినతలుపులు, తెలుచినకన్నులు. క్రిందిగడప క్రిందిపెదవి. కుండలు మలుఁగుపలుచుటకుఁగట్టినతెర, కట్టుకొన్నచీర. చెత్తయూడ్చుట గత దినముకట్టినచీర నూడ్చుట. ముంగిటఁజల్లినపేఁడనీళ్లకలయంపి, ముఖ ప్రక్షాళనము. మంగళార్థముంచినపూర్ణకుంభములు, స్తనములు. అన్నము వండునప్పుడు పొయ్యిలోని నిప్పునుండి వెలువడుపొగ, శరీరసంస్కా రము కొఱకు వేసికొన్న ధూపము. (సాంబ్రాణిపొగ.) ఇంటియొప్పి దము, మన్మథవర్ధితమగు రూపయౌవనాది జన్యమగు సౌందర్యము.

అలం ;— రూపకము.

సీ॥ పరిస్తుతంబని పదార్థములు రాజులవేఁడి
కొనితెచ్చియమ్మించుఁగోమటిండ్ల
మూసి 1 ముల్లడఁచిగుమ్ములకొల్చుపైమెత్తు
లూడ్వఁడుపస్తైననుండుఁగాని
యెట్టిమట్టం 2 బేని యింటికేతేరరెం

149 పః 1 ముల్లడిచి - ర, అ; ముల్లడఁచి - సూ. ని. 2 బెనని - గ, బైన - ర [పా] బేని - ర, అ.

డవసూతకముదెల్పియవలఁ 3 జొనుపు
మునుప్రతి 4 శ్రుతముచేసిన పైఁడిరాకున్న
ముచ్చిచ్చునను 5 వేఁగువచ్చుదనుక

తే॥ 6 వనరు "శాకాయలవణాయవా" యటంచుఁ
బెనఁగు "ధూళిః పరగృహాదపి" యనునాన
7 ముంచియీఁగకుఁ 8 గాటుఁబామునకు బలియు
9 నొసఁగఁడని భర్తకైవొక్కనువిదమదిని. 149

వ్యా :— ప్రస్తుతంబని = ఉత్సవదినమని, రాజులను = భూపతులను, పదార్థములు = వస్తువులు (సరకులు - అనుట) వేఁడికొనితెచ్చి = అర్థించి తీసికొనివచ్చి, కోమటిండ్లన్ = వైశ్యగృహములయందు, అమ్మించున్ = విక్రయింపఁజేయును.

ప్రస్తుతము - ప్రస్తుతము or శుభపరిస్తుతము = A festive rite (బ్రౌ.) సూ. ని. శ. ర. లలో నీయర్థములేదు.

2) పస్తయినన్ = ఉపవాసమయినను, ఉండుఁగాని = ఉండునుగాని, కుమ్ములకొల్చు = కుమ్ములందున్న ధాన్యమును, మూసి = ఆచ్ఛాదించి, ముల్లడఁచి = ముండ్లుగ్రుచ్చియానవాలుచేసి, పైమెత్తులు = మీఁదిపూఁతలు, (మీఁదిభాగమున మన్నులోనగువానితో దట్టముగాఁ బూఁసిన పూఁతలు) ఊడ్వఁడు = తొలఁగింపఁడు.

---

2 జొన్పు-ర (పా), జొన్ప - గౌ; జొనుపు - ర, అ 4 శ్రితము-డ. ద. బ; శ్రుతము - ర, అ. 5 వేడు - క, చ. త; వేఁడు-గౌ వ్రేఁగు - ర; వేఁగు - అ. 6 వచ్చు గౌ; - వనరు - ర. అ. 7 మొనసి – గౌ; ముంచి - ర. అ. ముచ్చి - త. 8 పాటు-చ, త, గౌ; కాటు – ర, అ. 9 నొసఁగనీరీతి - క; నొసఁగఁడని భర్త - ర, అ.

కుమ్మి - కసూలభేదము, ఒకరకమయినగాది

3) ఎట్టిచుట్టంబేని = ఎటువంటి మిత్రుఁడయినను -- ఎంత యాప్తుఁడయిన మిత్రుఁడయినను, (చుట్టముపక్కముచుట్టనెచ్చెలి .... నాఁగమిత్రుని నామములగు - ఆం. భా.) ఇంటికిన్ = గృహమునకు, ఏతేరన్ = రాఁగా, రెండవసూతకము = మృతాశౌచమును, తెల్పి = ప్రకటించి, అవలఁజొనుపున్ = వేఱుచోటఁబ్రవేశపెట్టును. (వేఱు చోటికిఁబంపివేయుననుట)

సూతకము - ఇది రెండువిధములు - (i) జాతాశౌచము = పుత్రాదిజన్మమునఁగలుగు నశౌచము. (ii) మృతాశౌచము = పితాది మరణమునఁగలుగు నశౌచము. రెండవసూతకము మృతాశౌచమగును.

4) మును = పూర్వము, ప్రతిశ్రుతము చేసిన = ప్రతిజ్ఞ చేసిన - వాగ్దానముచేసిన, పైఁడి = ధనము, రాకున్నన్ = తిరిగి రాకున్నపక్షమున, వచ్చుదనుకన్ = తిరిగివచ్చుదాఁక, ముచ్చిచ్చు నను = మూఁడుచిచ్చులసమాహారమునందు, వేఁగున్ = తపించును (అగ్నిలోఁబొరలుచున్నట్లు తపించుననుట)

ముచ్చిచ్చు - గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్నియను యజ్ఞాగ్నులమూఁడింటిసమాహారము.

శాకాయలవణాయవాయటంచున్ = కూరకొఱకు లేదా యుప్పు కొఱకునని, వనరున్ = దీనాలాపములు పలుకును. (స్వల్పద్రవ్యము కొఱకును దేవులాడుననుట) పరగృహాత్ = అన్యగేహమువలన (నుండి) ధూళిః అపి = దుమ్మునను - దుమ్మయినను లభించినఁజాలును. అను = అనెడు, ఆసన్ = ఆశతో, పెనఁగున్ = ప్రయాస పడును. ముంచి = పూనుకొని, ఈఁగకుఁగాటుఁబామునకు బలియు నొసఁగఁడని = ఈగకుఁగాటుఁబామునకు బలియీయనంతటి పినాసి యని, భర్తకై = పతికై, ఉవిద = యువతి - అనుశీల, మదిన్ = మనస్సునందు, పొక్కున్ = పరితపించును.

ఈఁగకుఁగాటుఁబామునకుబలియు నొసఁగఁడు - పినాసితనమును దెలుపులోకోక్తి.

(i) పాముకుబలిపెట్టనిప్రతినవారు
 నీఁగకెన్నఁడుగాటునేనిడనివారు. (శృ నై. 7-53)

(ii) ఈఁగకుంగాటీకపామునకున్ బలిపెట్టక. (వరాహ 9-123)

వ॥ ఇవ్విధంబున నవ్విధుబింబవదన వివిధకుటిలాచార చతురుండగు జీవితేశ్వరునీశ్వరుంగాఁదలంచుచుఁ, దదుపాసనంబుతనకు నిహ పరశుద్ధి సంసూచకంబుగ నిండుడెందంబునన్గోచరింపఁజేయుచుఁ గీర్తితచరితంబునంబ్రవర్తిల్లుచుండునంత. **150**

వ్యా :— ఇవ్విధంబునన్ = ఈ ప్రకారముగా, అవ్విధు బింబవదన = అచంద్రబింబముఖి - అనుశీల, వివిధ కుటిలాచారచరిత్రుండగు = పలువిధములయిన కపటవర్తనములు స్వభావముగాఁగల వాఁడగు, జీవితేశ్వరున్ = ప్రాణేశ్వరుని, (భర్తను) ఈశ్వరుంగాన్ = పరమేశ్వరునిగా, తలంచుచున్ = భావించుచు, తత్ = అతనియొక్క- భర్తయొక్క, ఉపాసనంబు = సేవ, తనకున్ = తనకు, ఇహపరశుద్ధి సంసూచకంబుగన్ = ఇహలోకపరలోక పవిత్రతకు సూచనయయినదానినిగా, నిండుడెందంబునన్ = నిండుమనస్సుతో, గోచరింపఁజేయుచున్ = తోఁపఁజేయుచు, కీర్తితచరిత్రంబునన్ = కీర్తినొందిన నడవడితో, ప్రవర్తిల్లుచుండునంతన్ = వర్తిల్లుచుండు సమయమునందు. (మీఁదిపద్యముతోనన్వయము)

క॥ అటనొకనాఁడాభూసుర
 కుటుంబినీసదనమునకుఁగుహనాపటువున్

1 బటువగుమైజిగిఁ 2 దెగడం
3 బటువగఁనొక 4 వడువువచ్చె 5 భక్తాపేక్షన్. **151**

వ్యా ;— అటన్ = అచ్చట, ఒకనాఁడు = ఒకదినమునందు; అభూసురకుటుంబినీ = ఆ బ్రాహ్మణపురంధ్రియొక్క - ఆ సుశీలయొక్క, సదనమునకున్ = గృహమునకు, కుహనావటువున్ = కపటబ్రహ్మచారిని - వామనుని, బటువగు = మనోజ్ఞమగు, మై= శరీరముయొక్క, జిగిన్ = ప్రకాశముచేత, తెగడన్ = తిరస్కరించుటకు, పటువగు = సమర్థుఁడగు. ఒకవడువు = ఒకబ్రహ్మచారి, భక్తఅపేక్షన్ = అన్నకాంక్షతో, (భిస్సాస్త్రీభక్తమంధోన్నమోదనోస్త్రీ సదీదివిః - అమ) వచ్చెన్ = అరుదెంచెను.

కుటుంబినీ - "కుటుంబ+ఇని. పతిపుత్రాని యుతాయాం ప్రశంసితాంయాంస్త్రియామ్" (శబ్దస్తో)

సుశీలకప్పటికి సంతానములేదు భగవత్కృపవలనఁద్వరలోఁ బుత్త్రిలు కలుగఁబోవుచున్నారు కాన నిటుఁగుటుంబినీశబ్దము పుత్రిజననయోగ్యతాసూచకము.

అలం ;— ఉపమ.

వ॥ 1 వచ్చి, యమ్మచ్చెకంటి గెంటుని నెయ్యంబు 2 వియ్యంబగునంతః కర 3 ణంబున నడలుగడలుకొన గాఢమాంతరాసక్తుండగు

---

151 ప:- 1 బటువై - ప, ర; బటువగు - అ, గౌ. 2 దెగడున్ – ముద్రి (అ), ర; దెగడన్ – అ; దెగడం - గౌ. 3 బుటువగు- ముద్రి (అ) ర; బటువగు - అ, గౌ. 4 వడుగు - ముద్రి (అ) ర; వడువు – అ, గౌ. 5 భుక్తా - ముద్రి (అ); ర; భక్తా - అ, గౌ.

152 వ:- 1వచ్చిననమ్మచ్చె - ముద్రి (అ), ర; వచ్చియమ్మచ్చ - అ; వచ్చియమ్మెచ్చె –గౌ. 2 వియ్యం - వ; లియ్యం - ర, అ. 3 ణంబు నడలు – గౌ; ణంబుననడలు - ర, అ.

ప్రాణనాథుండు తనుం బిలిచినయట్లైనఁ 4 గోనింటిబోనమాని తొంగి చూచుతఱిఁ బొడకట్టి, బొట్టునకు 5 మేదావి 6 మేదునలవాటునం గండిన యంగిశ్రీ 7 ద్వితయంబుకల్మిఁ దేఁటిగుట్టినం 8 బృథగ్వర్ణమూర్తులగు సంవర్తికలుగల జలరుహంబనఁ బ్రశస్తంబగు హస్తంబెత్తి, 'స్వస్త్యస్తుతే' యని యాశీర్వదించుటయుఁ గృతనమస్కారయై, యపారసామోదమ్మృదులన్వనంబున నిట్లనియె.

**152**

వ్యా :— వచ్చి = (బ్రహ్మచారి) అరుదెంచి, అమ్మచ్చకంటి = అమీనాక్షి - అమశీల, గెంటని = తొలఁగని, నెయ్యంబు = అనురాగము, వియ్యంబగు = మిక్కిలికలిసినదగు, అంతఃకరణంబునన్ = మనస్సునందు, (అంతఃకరణంచమనోనిగుః - త్రి. ని.) అడలు = భయము, కడలుకొనన్ = అతిశయింపఁగా, గ్రామాంతర = వేఱుగ్రామమునందు - వేఱుగ్రామమునకేగుటయందు, అనక్తుండగు = ఆసక్తిగలవాఁడగు, ప్రాణనాథుండు = జీవితేశ్వరుఁడు (భర్త) తనున్ = తన్ను, పిలిచినయట్లైనన్ = ఆమంత్రించినట్లు కాఁగా, (పిలిచినట్లనిపింపఁగా - అనుట) కోనఇంటి బోనము = మూలయింటి భోజనమును - చలిదియన్నమును, అని భుజించి తొంగిచూచుతఱిన్ = వంగికనుఁగొను సమయమునందు, పొడకట్టి = అగపడి,

---

4 లోనింపానరు – ప; లోనింటిపానరూని – త; పోనరూని-చ; లోనింటిబాస – క; లోనింటిబోనమాని [?]—అ, ర; కోనింటిబో (పో?భో?) నమాని - గౌ. 5 మేథావి - చ, త, మేదావి-ర. అ. 6 వెడవు - గ; మెలవు - క. చ, త; మెదవు—గౌ. 7 ద్వితయంబుదేఁటి - ముద్రి [అ], ర; ద్వితయంబుకల్మి - అ, ఓ్వితయంబునకల్మి - గౌ. 8 పృథుస్వర్ణ – క; బృథగ్వర్ణ - ర, అ.

బొట్టునకున్ = తిలకమునకు, మేదావిన్ = అగ్నికార్యము తీర్చిన పిమ్మటవచ్చిన బూదిని, మేదు = మెదిపెడు, అలవాటునన్ = అభ్యాసముచేత, కందిన = నల్లనయిన, అంగుళీద్వితయంబు = వ్రేళ్ల జతయొక్క, కల్మిన్ = కలుగుటచేత, తేఁటి = తుమ్మెద, కుట్టినన్ = కుట్టఁగా, (నోటిలోనిముల్లుతోఁబొడువఁగా - అనుట) పృథగ్వర్ణమూర్తులగు = వేఱువన్నెపొందినయాకృతిగలవియగు, (మాఱురూపుపడినవగు - అనుట) సంవర్తికలు = లేఁత (తామర) ఱేకులు, (సంవర్తికానవదళమ్ - అమ) కల = కలిగిన; జలరుహంబనన్ = పద్మమనునట్లు, ప్రశస్తంబగు = శ్రేష్ఠమగు, హస్తంబు = చేతిని, ఎత్తి = ఉన్నమితముచేసి, (చేయెత్తి - అనుట) "స్వస్త్యస్తుతే" యని = స్వస్తస్తుతేయనువాక్యమునుచ్చరించి,(తే = నీకొఱకు; స్వస్తి + అస్తు=స్వస్తియగుఁగాక - అనియర్థము) ఆశీర్వదించుటయున్ = దీవించుటయు, కృత = చేయఁబడిన. నమస్కారయై = నమస్కృతిగలదై, (నమస్కరించినదై - అనుట) అసారసామోద = అపద్మగంధి - అసుశీల, మృదుల = కోమలమయిన, స్వనంబునన్ = (కంఠ) సర్వముతో, ఇట్లు = ఈ ప్రకారముగా, అనియెన్ = పలికెను.

వ్యాక :— కోనయొక్క + ఇల్లు = కోనిల్లు. (ము. కొ.) మచ్చెకంటి = మచ్చెములవంటి కన్నులు దేనికిఁగలదోయది-మీనాక్షి. (ము. కొ. సమాస)

అలం :— ఉపమ.

సీ॥ ఎందుండిరాక? యిందేతేరఁగతమేమి?

1 గ్రాసార్థిభావంబుగానవచ్చె

---

153 ప;- 1 గ్రాసాద - త; గ్రాసాదన - చ (గణభంగము) గ్రాసార్థి-ర, అ.

నగునన్న, నట్లేనిమొగసాల 2 నుండుఁ, డా
యనయూరలేఁడు, యామార్గమునకె
కావించు 4 నన్న సంస్కారంబు, మీరార
గింతురుగాని వేగిరమె, యనుడు
మాణవకుఁడుపల్కు, మగువ! 5 నేఁడే న్నాళ్ల
నుండియుఁగుడువఁగూడొదవకునికి

తే॥ వేఁడియగుదాఁకనోరువ, మూఁడుగలిగెఁ
బులిసినదిగల్గెనన్నంబుపోఁకయంత
6 యొసఁగి 7 క్షుత్తార్పు వెసఁ, జల్దిమెసవనైన
పాప 8 ముడిగించి కొందుఁ 9 దపంబు 10 కల్మి. 153

వ్యా :— ఎందుండిరాక = ఎక్కడనుండివచ్చుట? ఇందున్ = ఇక్కడికి, ఏతేరన్ = వచ్చుటకు, కతమేమి ? = కారణమేమి ? గార్హస్థ్యభావంబు = ఆహారమును గోరుహానియొక్క విధము, కాన వచ్చెన్ = (నీ యందు) కనఁబడెను. (అని సుశీలయనఁగా) అగు నన్నన్ = (మాయావటువు) అవునని పలుకఁగా, అట్లేని = అట్ల యినచో, మొగసాలన్ = తలవాకిటిపంచయందు, ఉండుఁడు =

2 యందుండుడాయనలేఁడు - త; మొగసాలనుండుఁడాయన యూరలేఁడు – ర, అ. 3 మునక – గౌ; మునకె - ర, అ. 4 నశన - త, గౌ; నన్న – ర, అ. 5 నేఁడే న్నాళ్ల - ముద్రి (అ. నేనేన్నాళ్ల - ర, నేఁడేనాళ్ల - అ. నేఁడే నాళ్ల - గౌ. 6 యొసఁగు – గౌ, త; యొసఁగి – ర అ. 7 క్షుధయార్పు – త; క్షుత్తార్పవే - క, క్షుత్తార్పు - ర, అ. 8 ముడిపించు - ర, అ. ముడిగించి – గౌ. 9 దర్పంబు—క; ఁపదంబు - ర, అ; 10 కలిమి - ర, అ; కల్మి – గౌ.

నిలువు(డు. ఆయన = నాభర్త, ఊరలేదు = గ్రామమునందులే(డు, (గ్రామాంతరమేగెను - అనుట) అన్నసంస్కారంబు = వంటకము యొక్క పచనము. యామఅర్ధమునకె = అరజాములో(గానే, కావింతున్ = చేయుదును, మీరు = మీరలు, వేగిరమ = త్వరగానే, ఆరగింతురుగాని = భుజింతురుగాని, (కాని - వాక్యాలంకారము.) అనుడున్ = అన్నయనంతరము - అని సుశీల పలికినయనంతరము, మాణవకు(డు = బాలు(డు, (బాలస్తుస్యాన్మాణవకః-అమ) పల్కెన్= (ఇట్లు) చెప్పెను. మగువ = ఓకాంతా! - అమ్మా! కుడువన్ = భుజించుటకు,ఏనాళ్లను(డియున్ = ఏడుదినములనుండియు, కూడు= భోజనము, ఒడవకునికిన్ = దొరకకపోవుటచేత, నే(డు = ఈదినము, వే(డి = వెచ్చనిది - వే(డియన్నము, అగుదా(కన్ = అగువఱకు, ఓరువన్ = సహింపను, (తాళలేను - అనుట) అన్నంబు = ఆహారము, మా(డు = అడుగంటినది, కలిగెన్ = ఉండెనేని, షలిసినది = పులుపెక్కినది, కల్గెన్ = ఉండెనేని, పో(కంత = పో(కచెక్కంత, (కొల(దిపాటి - అనుట) ఒస(గి = ఇచ్చి -తినుటకు(బెట్టి, వెసన్ = వేగముగా, క్షుత్తు = ఆ(కలి, అర్చు = ఉపశమిల్ల(జేయుము. చల్ది= పర్యుషితము, మెసవనైన పాపము = భుజించుటచేత( గలిగిన యఘమును, తపంబుకల్మిన్ = తపస్సంపదచేత, ఉడిగించికొందున్ = పో(గొట్టుకొందును.

చలిది, పర్యుషితాన్నము(గాన భుజింపరాదు.

"భక్తంపర్యుషితోచ్ఛిష్టం, శ్వస్పృష్టం, పతితేక్షితమ్
ఉదక్యాస్పృష్టసంస్పృష్టం, పర్యాయాప్తంచవర్జయేత్"
(గరుడ) - శబ్దక.

భావము = రీతి. అంబుజాక్షు భావమున --- హర 7-120;
యయాతిభావంబున - విక్రమా 2-69.

అయన - ఇది భర్తృనిర్దేశమున వ్యవహార ప్రసిద్ధము.
మాయాయన - అనియుఁగలదు.

యామార్ధము - 30 ముహూర్తములు = 1 దినము. దినములో 1/8 వంతు, యామము = 3. 3/4 ముహూర్తము. అనఁగా 3 గంటలు. యామార్ధము = 1. 1/2 గంట.

వ్యాక :— ఏన్నాళ్లు - ఏడు + నాళ్లు = ఏన్నాళ్లు. ప్రౌ. సంధి 15. నాళ్లు-నాడు + లు = నాళ్లు - ము. కౌ అచ్చిక.

తే॥ అనుడు నెలనాఁగయిట్లను, ననఘ! నీకుఁ
జలదియేనెట్టు లిడనేర్తు? క్షణములోన
వంటఁగావింతు, భుజియించి వలయు నెడకు
నేగునావినిసతిఁబల్కె ఱాఁగవడుగు. 154

వ్యా :— అనుడున్ = (మాయావటువిట్లు పలికినయనంతరము. ఎలనాఁగ = ఆయువతి - అనుశీల, ఇట్లు = ఈ ప్రకారముగా, అనున్ = పలికెను. అనఘ = ఓసుకృతీ! నీకున్ = నీకు, ఏన్ = నేను, చలిది = పర్యుషితాన్నము, ఎట్టులు = ఏప్రకారముగా, ఇడనేర్తున్ = పెట్టఁగలను? క్షణములోనన్ = క్షణకాలములోపల - అత్యల్పకాలమున, వంటన్ = పాకమును, కావింతున్ = చేయుదును. భుజియించి = తిని, వలయు నెడకున్ = ఇష్టమగుచోటికి, ఏగు = అరుగుము, నాన్ = అనఁగా, విని = ఆకర్ణించి, ఱాఁగవడుగు = ధూర్తుఁడగుబ్రహ్మచారి, సతిన్ = (ఆ) పతివ్రతనుగూర్చి - అనుశీలనుద్దేశించి, పల్కెన్ = (ఇట్లు) వచించెను.

ఎలనాఁగ - ఎల + నాఁగ. నాఁగ = నంగ. ఎల = లేఁత, నాఁగ = స్త్రీ - మానవల్లి వారి "కు. సం." టీక. (వి. వేం.)

తే॥ త్రోవ 1 గమియించు చోటనో పూవుఁబోఁడి !
యవరవర్ణ సమాచారమైనఁ 2 జెడదు
బ్రాహ్మ్య, మీతడ వేటికిఁ, బ్రాణరక్ష
నెఱపుమొకయింతమెదుకిన్ని నీళ్ళు నొసఁగి. **155**

వ్యా :— ఓపూవుఁబోఁడి = ఓకాంతా - ఓ సుశీలా! త్రోవన్ = మార్గమునందు, గమియించుచోటన్ = వెళ్ళుసమయమునందు, (మార్గ మధ్యమున - అనుట) అవరవర్ణ = కడపటి వర్ణముయొక్క - శూద్రవర్ణముయొక్క, సమాచారము = నడవడిక, ఐనన్ = అయి నప్పటికి, బ్రాహ్మ్యము = బ్రాహ్మణధర్మము, చెడదు = నశింపదు. ఈ తడవు = ఈయాలస్యము, ఏటికిన్ = ఎందులకు? ఒకయింత = ఒకకొంచెము, మెదుకున్ = అన్నకణమును - కొలఁది పాటియన్న మును, ఇన్నినీళ్ళన్ = కొలఁదిపరిమాణముగల జలమును, ఒసఁగి = ఇచ్చి, ప్రాణరక్ష = అసువులకు రక్షణ, నెఱపుము = కావింపుము. (ప్రాణములు కాపాడుమనుట)

మార్గమధ్యమునబ్రాహ్మణునకు శూద్రాచారముతప్పుకాదు.

"స్వగ్రామేపూర్ణమాచారః, అన్యగ్రామేతదర్ధకమ్,
పట్టనేపాదమాత్రంతు, పథిశూద్రవదాచరేత్"

వ్యాక. :— పూవుఁబోఁడి = పూవువంటిపోఁడిదేనికిఁగలదోయది - బహువ్రీహి. (ము. కౌ. సమాస. 2)

---

155 వ.- 1 గమకించు - గొ; గమియించు - ర, అ. 2 బడదు - చ; జెడదు - ర. అ.

తే॥ వాఙ్మనః కాయ 1 సంకల్పవర్తనముల
సంభవించిన పాపంబు సంహరించి
యతిథిగృహమేధికిచ్చు శాశ్వతసుఖములు
వినవె? యభ్యాగతస్స్వయం 2 విష్ణుఁడనుట. 156

వ్యా :— వాఙ్మనః కాయసంకల్ప వర్తనములన్ = మాటలచేతను, హృదయముచేతను, శరీరముచేతను, ఇచ్ఛచేతను, ప్రవర్తనచేతను, సంభవించిన = కలిగిన, పాపంబున్ = అఘమును, సంహరించి = నిరోధించి, అతిథి = ఆగంతుకుఁడు, (ఆగంతురతిథిః - అమ) గృహమేధికిన్ = గృహస్థునకు, (గృహమ్ధీగృహస్థః - అభి. చిం.) శాశ్వత = నిత్యములయిన, సుఖములు = సౌఖ్యములు, ఇచ్చున్ = ఒసఁగును. అభ్యాగతః = అతిథి, (అభ్యాగతోఽతిథిః - అభి. చిం.) స్వయం విష్ణుః = తానుగావిష్ణువు - సాక్షాద్విష్ణువు, అనుట = అని పలుకుట, వినవె = ఆకర్ణింపలేదా? (ఆకర్ణించియుందువనుట)

అభ్యాగతస్స్వయం విష్ణుః - అన్నవాఁడు నిజముగా విష్ణువే యగుటయిటఁజమత్కారము.

వ్యాక :— వాక్+మనస్ = వాఙ్మనస - అని కావలెను. "అచతురవిచతురసుచతురస్త్రీ పుంసధేన్వడుహర్క్సామ వాఙ్మనసాక్షిభ్రువ — గోష్ఠశ్వాః". (సి కౌ. 945) కాని యటసీనిపాతమునకుఁ బ్రసక్తి లేదు. వాక్చ + మనశ్చ + కాయశ్చ + వర్తనంచ - అను బహుపద ద్వంద్వముచే, "వాఙ్మనః కాయసంకల్పవర్తన" అను రూపము సిద్ధించును.

---

156 ప:- 1 కర్మప్రవర్తనముల - ముద్రి (అ) ర; సంకల్పవర్తనముల - అ. గౌ. 2 విష్ణువనఁగ - అ, ర, విష్ణువనుట - క, ప, విష్ణుడఁగుట - త. విష్ణుఁడనుట - గౌ.

వ్యా॥ :— అభ్యాగతస్స్వయంవిష్ణుః + అనుట = అభ్యాగతస్స్వయంవిష్ణుఁడనుట - ము. కౌ. సంధి.

తే॥ అతివ! తీర్థా 1 దరత్వరనరుగు దెంచి
త్రోవనాఁకటివేళకు దొరకకునికిఁ
2 గాంతునీయాన! యేఁగూటికలలె, జఠర
వహ్నినొకయేనకాదెట్టివాఁడు నెరియు. 157

వ్యా :— అతివ = ఓకాంతా - ఓనుశీలా! తీర్థ అదర త్వరన్ = పుణ్యక్షేత్రములయందలి యభిలాషవలని వేగిరపాటుచేత, అరుగుదెంచి = వచ్చి, త్రోవన్ = మార్గమునందు, ఆఁకటివేళకున్= ఆఁకలియగుసమయమునకు, దొరకకునికిన్ = (తిండి) లభింపకపోవుట చేత. ఏన్ = నేను, కూటికలలె = భోజనమునకు సంబంధించిన స్వప్నములే, కాంతున్ = కందును, నీయాన = నీమీఁదనొట్టు. జఠరవహ్నిన్ = కడుపుచిచ్చుచేత - క్షుధాగ్నిచేత, ఒకయేనకాదు = ఒక్కనేనేకాదు, ఎట్టివాఁడున్ = ఎటువంటివాఁడును, ఎరియున్ = బాధపడును.

వ్యా॥ :— నీయాన = నీ+యొక్క+"మీఁదన్+అన = నీ+మీఁదన్+అన. బా. సమాస 20 చే - 'మీఁదన్' అను మధ్యమ పదమునకులోపము. నీ+అన = నీయాన, "నామీఁదానసుమతేమి యనినన్" (సారంగ 3-75)

157 ప॥- 1 వర - ర (పా), దర - ర, అ, గా. 2 కానయాననయేగూటి కలలె - త॥ గూటికలర - క॥ కాంచనీయాన - గ, గూటికలన డ, ద, ఖ, కాంచ - ర [పా] గాంతునీయానయేఁగూటికలలె - ర, అ. గాంతునీయానయాఁగూటి కలరె - గా.

వ॥ నాతోడంగూడి యాడువడుగులు బడుగులయ్యు॰ను వడిచెడక 1 కడ౹కమెఱసి, యేముసంకల్పించి మున్నె తేరసమట్టిన పౌండరీ కంబునకుఁ బాండురంగ 2 సేవాసావధానులైచనిరి; నేనుఁగూటి బీదతోడుతప్పిన తెఱంగుననిచ్చటుందడసితి, వెండియువినుము.

**158**

వ్యా :— నాతోడన్ = నాతో, కూడియాడు = కలిసి క్రీడించు, వడుఁగులు = బ్రహ్మచారులు, బడుగులయ్యున్ = కృశించిన వారయినప్పటికి, వడిచెడక = వేగముతగ్గక, (గతిమందకింపఁక - అనుట) కడఁకమెఱసి = ఉత్సాహము ప్రకటించి, ఏము = మేము, సంకల్పించి = (పోవలెనని) ఉద్దేశించి, మున్ను = పూర్వము. ఏతే రన్ = అరుగుదెంచుటకు, సమకట్టిన = పూనుకొనిన, పాండురంగ = పాండురంగ విఠ్ఠలునియొక్క, సేవ = ఆరాధనమునందు, (సేవా = ఆరాధనా -- ఇతిసేవధాత్వర్థదర్శనాత్ - శబ్దక) సావ ధానులై = ఏకాగ్రతతోఁగూడుకొన్నవారయి, చనిరి = అరిగిరి. నేను = ఏను, కూటిబీదతోడుతప్పిన తెఱంగునన్ = కూటికిలేనిపేద సాయముకోల్పోయినట్లు, ఇచ్చటన్ = ఇక్కడ, తడసితిన్ = మసలి తిని, వెండియున్ = మఱియును, వినుము = ఆకర్ణింపుము.

వ్యాక :— పాండురంగ - పాండురంగవిఠ్ఠలుఁడను పేరిలో "నామైకదేశేనామగ్రహణమ్" అను న్యాయమునఁ బాండురంగనామము వాడఁబడినది. పక్షమున-విఠ్ఠలుఁడనియువాఁడబడును. "వినాపిత్యప్రయం పూర్వోత్తరపదయోర్వాలోపః" (వార్తి)

కూటిబీద = కూటియొక్క లేకపోవుటచేత బీద - మధ్యమ పదలోపిసమాసము.

---

158 వ:- 1 కడక-'గ' లో లేదు. 2 సేవావధా - గ; సేవాసావధాను-ర,అ.

క॥ తరుణీ! క్షుధాతురాణాం
నరుచిర్న చ 1 కాలమనుచు నరులాడుటలో
నరసివివేకింపఁగదగుఁ;
దెరువరులకుఁ 2 బాయసంబుతిరిసినఁగలదే. 159

వ్యా ,— తరుణీ = ఓ యువతీ - ఓ సుశీలా! క్షుధా = ఆకటిచేత, ఆతురాణామ్ = ఉత్కంఠితుఁడయినవానికి, రుచిః = చవి, న = లేదు, కాలః, చ = సమయమును, న = లేదు. అనుచున్ = అని, నరులు = జనులు, ఆడుట = పలుకుట, లోన్ = లోపల - మనస్సులోపల, అరసి = తెలిసికొని; వివేకింపఁగఁదగున్= విచారణచేయుట యుక్తమగును. తెరువరులకున్ = బాటసారులకు, తిఁసినన్ = బిచ్చమెత్తినచో, పాయసంబు = పరమాన్నము, కలదే = లభించునా? (లభింపదనుట)

పాఠ - నచకాలమనుచు - అన్నదే యుపలబ్ధపాఠము. నచకాల యనుచు - అన్నది బాలవ్యాకరణానుసారముచేసిన సవరణ. ఉపలబ్ధ పాఠమేగ్రాహ్యము. చూ. ము. కౌ సంధి.

వ్యాక :— కలదు - కలుగునకుఁబ్రాప్త్యర్థమునఁగలాదేశము, (ము. కౌ. క్రియా)

ఆ॥ ఎంతభాండశుద్ధి! యెటువంటిగృహశుద్ధి!
యెట్టిచిత్తశుద్ధి! యిచటఁజలిది
కూడు 1 దక్కు నెడఁబురోడాశమునకునో
యమ్ము 1 పాటివచ్చు, నదియుఁగాక. 160

---

159 వ :- 1 కాలయనుచు - ర; కాలమ [య?] నుచు - అ. కాలమనుచు - గౌ. 2 బాయజంబు - త; బాయసంబు - ర, అ.

160 వ :- 1 చిక్కు - డ, ధ, బ; దక్కు - ర, అ, గౌ.

వ్యా :— ఎంతభాండశుద్ధి = ఎంతకుండల పరిశుభ్రిత ! ఎటువంటి గృహశుద్ధి = ఎట్టిదయినయింటి పరిశుభ్రత! (పాత్రలపరి శుభ్రితయు, నింటిపరిశుభ్రితయు నాశ్చర్యకరములనుట) ఇచటన్ = ఇక్కడ, చలిదికూడు = పర్యుషితాన్నము, దక్కెనేడన్ = లభించు నేని, ఓయమ్మ = ఓతల్లీ! పురోడాశమునకున్ = యవలపిండితోఁ జేసిన హవిస్సునకు. (పురోడాశోహవిర్భేదేచముస్యాంపిష్టకస్యచ- మే. ని "హవిర్భేదః", సతుయవచూర్ణనిర్మితరోటికావిశేషః - శబ్దక) సాటి వచ్చున్ = ఈడగును. అదియుఁగాక = అంతేకాకుండ. (మీఁది పద్యముతో నన్వయము)

క॥ అనుచితశతములొనర్చియుఁ
దనువులురక్షించు 1 కొనరె? దమశమతేజో
ధనులగుగాధిసుతాదులు
తనప్రాణము నిలుపుకన్న ధర్మముగలదే? 161

వ్యా :— దమశమతేజోధనులగు = బహిరింద్రియనిగ్రహము వలనను, నంతరింద్రియనిగ్రహమువలనను గలిగినతేజస్సుధనముగాఁ గలవారగు, గాధిసుతాదులు = గాధేయాదులు, (విశ్వామిత్రాదులు) అనుచిత = అయుక్తములయొక్క - అయుక్తకార్యములయొక్క, శతములు = నూఱులు - అనేకములగునయుక్తకార్యములు; ఒనర్చియున్ = ఆచరించియు, తనువులు = శరీరములు, రక్షించుకొనరె = కాపాడుకొనరా ? (కాపాడుకొనిరనుట) తన = తనయొక్క, ప్రాణమున్ = జీవమును, నిలుపుకన్నన్ = కాపాడుటకంటె, ధర్మము = న్యాయము, (ధర్మాః పుణ్యయమన్యాయస్వభావాచార సోమపాః - అమ) కలదే = ఉన్నదా? (లేదనుట)

---

161 ప - నట్టి - గొ; కొనరె - ర, అ.

ద్వాదశవర్ష క్షామమేర్పడినప్పుడు తపస్సునుండి లేచిన విశ్వామిత్రుఁడు చండాలునివలన శునకమాంసమును గ్రహించినట్లు మహాభారతము. (శాంతి 3-303)

అలం ;— అర్థాంతరన్యాసము

తే॥ తొలుతనేవేఁడినప్పుడు చలిదినీకు
ననఘ! నేనెట్టులిడుదాననంటి, గాన
యశనశేషస్థితికిసందియంబువలదు
చాలుఁజాలదొయనువృథాశంక విడువు. 162

వ్యా :— తొలుతన్ = మున్ను, నేన్ = ఏను, వేఁడినప్పుడు = (భోజనముపెట్టుమని) అర్థించినప్పుడు, అనఘ = ఓ సుకృతీ! నీకున్ = నీకు, చలిదిన్ = పర్యుషితమును, నేను = ఏను, ఎట్టులు = ఏప్రకారముగా, ఇడుదానన్ = ఇచ్చుదానను - వడ్డించుదానను, అంటి = అంటివి (వచించితివి) కాన = కాఁగానెంతమాత్రము, అశనశేష = అన్నశేషముయొక్క (తినఁగామిగిలినయన్నముయొక్క) స్థితికిన్ = ఉనికికి, సందియంబు = సంశయము, వలదు = వలవదు. (చలిదియన్నముపెట్టుటెట్లన్న సంశయమక్కఱలేదు - అనుట) చాలున్ = సరిపడును. చాలదు = సరిపడదు, అను = అనెడు, వృథాశంక = అక్కఱమాలిన సందేహమును, విడువు = వదలుము.

క॥ సతి! యాత్మస్తుతియతిగ
ర్హితమనినా నాపెంపు దెలుప, నేనొకఁడనో

163 ప :- 1 దలఁప - త, దెలుప - ర, అ.

గతిఁదృప్తిగనిన భువన
త్రితయ 2 మునకుఁబరమతృప్తితిలకించుఁజుమీ! 163

వ్యా :--- సతి = ఓ సాధ్వీ - ఓసుశీలా! ఆత్మస్తుతి = తన్నుఁదానుపొగడుకొనుట, అతిగర్హితమని = మిక్కిలి నిందింపఁబడినదని, నాపెంపు = నాయొక్క గొప్పతనమును, తెలుపన్ = ఎఱిఁగింపను, ఏను = నేను, ఒకఁడన్ = ఒక్కఁడనే, మనోగతిన్= హృదయ ప్రవృత్తియందు, తృప్తి గనినన్ = తనివినందినచో, భువన త్రితయమునకున్ = లోకత్రయమునకు, ముల్లోకములకు - అనుట) పరమతృప్తి = మిక్కిలితనివి, తిలకించుఁ జుమీ = కలుగునుజుమా!

భువనత్రితయము - స్వర్గమర్త్యపాతాళభేదాత్త్రీణి జగంతి - ఇత్యేకే" (కావ్యమీ)

వ్యాక :-- ఒకఁడన్ = ఒకఁడనే - "ఏ" అధ్యాహార్యము. (ప్రౌ. వ్యాక. 13)

వ॥ అనియంతనిలువక. 164

వ్యా ,-- అని = ఇట్లు పలికి, అంతన్ = అంతటిలో, నిలువక = విరమింపక. (మీఁదిపద్యముతో నన్వయము)

క॥ పెట్టకపోననియాఁకటఁ
1 దొట్టగిలంబడుచుఁబడుచు 2 దురదురఁజని వే

---

2 మ్మునకుఁబరితుష్టి - డ, ద, బ; యమ్మునసుబరమతృప్తిఁదల - త; త్రితయమ్మును బరమతృప్తి - ర; త్రితయమ్మును బరమతుష్టి - గౌ; త్రితయమునకుఁబరమతృప్తి - అ.

165 వ:- 1 ద్రొట్ట - త; దొట్టి - ర, అ. 2 దూరదూరంజని - గౌ. (గణభంగము. లిపికరప్రమాదముకావచ్చును) దురదురఁజని- ర,అ

నట్టింటఁగూరుచుండిన
నెట్టుననంజాలకమ్మృగేక్షణభీతిన్. 165

వ్యా :-- పెట్టక = (తిండి) ఇడక, పోనని = వెళ్లనని, ఆఁకటన్ = క్షుధతో, తొట్టిగిలంబడుచున్ = తత్తఱపడుచు, వడుచు = బాలుఁడు - మాయావటువు, దురదురఁజని = గబగబవెళ్లి, వే = వేగముగా, నట్టింటన్ = అంతర్గృహమునందు, కూరుచుండినన్ = ఆసీనుఁడుకాఁగా, అమ్మృగేక్షణ = అహరిణాక్షి - అనుశీల, ఎట్టున్ = ఏప్రకారముగాను, అనఁజాలక = పలుకలేక, భీతిన్ = భయముతో (మీఁదిపద్యముతో నన్వయము.)

సీ॥ పరిహరించుటకీడు తెరువరిఁబసిబిడ్డ
నర్థినాఁకటిచేతనలయువానిఁ
బర్యుషితమును నర్పణసేయఁజాలఁ, బా
పమురాదె? 1 యపచారపరతమెలఁగ
మినుకొక్కటిచ్చిపొమ్మనినఁబోవునా! పోవఁ
డధ్వపరిశ్రాంతవిప్రాలుఁడితండు
చాల నోచాలదో! చలిదియుమద్భర్తృ
పాథేయశేషమల్పంబెయగుటఁ

తే॥ జాలకుండిననగుఁజెట్ట, బాలుఁడితఁడు
కొసరిగొంతెమకోరికల్గోరెనని
యిడక 2 పోఁబోలదిడఁబోలదీయుదివియఁ
జేసురాకున్నె? త్రైర్థికుల్ పెలుచులందు3 166

---

166 ప:- 1 యుప - డ, ద, బ; యప - ర. అ, గొ. 2 పోరాదులు యిదిపో - గ; యిడకపోఁబోలడిడఁబోల - ర, అ. 3 పెలుచ-గ - పెళుచులంద్రు - ర; పెళుచలంద్రుడు అ, గొ.

వ్యా :— తెరువరిన్ = బాటసారిని. పసిబిడ్డన్ = చంటిపాపని (స్తనపాయిపరఁగును జంటివాఁడు, పసిబిడ్డవంటిపాపఁడుపాలపాపఁడనంగ - ఆం. భా.) అర్థిన్ = యాచకుని, ఆఁకటిచేతన్ = క్షుత్తుచేత, అలయువానిన్ = బాధపడువానిని, పరిహరించుట = దిగవిడుచుట, కీడు = దుష్కృత్యము. పర్యుషితమునున్ = చలిదిని, అర్పణసేయన్ = అర్పించుటకు, చాలన్ = ఓపను. అపచారపరతన్ = అపరాధమునందలియాసక్తితో, మెలఁగన్ = ప్రవర్తింపఁగా, పాపము రాదె = అఘముప్రాపింపదా ? (ప్రాపించుననుట) మినుకు = మినుకనుపేరుగల చిన్నబంగారునాణెమును, ఒక్కటి = ఒకటి, ఇచ్చి = ఒసఁగి, పొమ్మనినన్ = అరుగుమన్నచో, పోవునో = అరుగునేమో! (ఇది మనస్సునఁబొడమినసందేహము) అధ్వప్రయాస = మార్గాయాసముచేత, (ప్రయాణపుబడలికచేత - అనుట) విహ్వలుఁడు = వ్యాకులుఁడగు, ఇతండు = ఈతఁడు - ఈబ్రహ్మచారి, పోవఁడు = (మినుకొక్కటిచ్చి యరుగుమన్నచో) అరుగఁడు. చలిదియున్ = పర్యుషితమును. మద్భర్తృ = నానాథునియొక్క, పాథేయశేషము = దారిబత్తెముకట్టఁగామిగిలినది. (పాథేయంశంబలంసమే - అభి. చిం.) అల్పంబ = కొంచెమే, అగుటన్ = అగుటచేత, చాలునో = సరిపడునో, చాలదో = సరిపడదో! చాలకుండినన్ = (చలిదియన్నము) సరిపడకున్నచో, చెట్టు = కీడు, అగున్ = కాఁగలదు. బాలుఁడీతఁడు = ఈకుఱ్ఱవాఁడు, గొంతెమకోరికల్ = అసాధ్యములయిన వాంఛితములను, కొసరి = చెఱేఁగి, కోరెనేని = వాంఛించినచో, ఇడకపోఁబోలదు = ఒసఁగకపోవుటయుక్తముకాదు. ఇడఁబోలదు = ఒసఁగుట శక్యముకాదు. ఈరుదివియఁబేనురాకున్నె = ఈళ్లుతీసినచోఁ బేళ్లు రాకుండునా? (చలిదివడ్డింపక తప్పదనియుఁదాత్పర్యము) తైర్థికుల్ = తీర్థయాత్రలు చేయువారు, పెఱుచులు = పెంకెవారని, అందురు = అందురు. (లోకులు చెప్పుదురనుట)

ఈరు = పేనుగుడ్డు, లీక్ష, పేను = యూకము. పేననంగ నలరు యూకాఖ్య - అం. ఖా.)

గొంతెమ - ఒకానొకగ్రామదేవత. (బ్రౌ) "వ్యవ. గొంతెమ్మ పండుగు, గొంతెమకోరిక - అసాధ్యపుఁగోరిక" (సూ. ని.)

తే॥ వంటయగుదాఁక నుండఁడీవడుగు, బండి
మీఁదఁ 1 బోవుచున్నాఁడు 2 మేటిధాటి
నైన 3 దయ్యెడుఁగాకేమి! 4 యప్పటికిని
మీఁదుగడగట్టనేలంచుమించుఁబోఁడి. 167

వ్యా :— ఈవడుగు = ఈబ్రహ్మచారి, వంటయగుదాఁకన్= పాకమగువఱకు, ఉండఁడు = అగఁడు. మేటిధాటిన్, బండిమీఁదఁ బోవుచున్నాఁడు = అదుపుచేయుటకు వీలులేకుండ వేగిరపెట్టుచున్నాఁడు. అప్పటికిని = అసమయమునకు, ఐనదయ్యెడుఁగాకేమి = అయినదేదోయగుఁగాక, యేమిపోయినది, మీఁదు = కాఁబోవుదానిని, కడగట్టన్ = (ముందుగా) నిశ్చయించుట, ఏల = ఎందులకు? అంచున్ = అని, మించుఁబోఁడి = మెఱుఁగుఁబోఁడి - అనుశీల. (మీఁదిపద్యముతో నన్వయము)

వ్యాక :— మించుఁబోఁడి = మించువంటి పోఁడిదేనికిఁగలదో యది - బహుబ్రీహి. (ము. కౌ. సమాస)

---

167 ప:- 1 బంపుచున్నా - క; బొడిపించుచున్నా - గ; గౌ; బోవుచున్నాఁడు - ర, అ. 2 మేటితాడియై - క, త, గౌ (తాడి=దాడి. దాకు: 'తా' వ్రాయుటలేఖన సంప్రదాయము) 3 దైయుండుగా-క; దయ్యెడుఁగా - ర, అ. 4 అప్పటికిన - గౌ; అప్పటికిని-ర, అ.

శా॥ రారయ్యా!యని శుద్ధిమచ్చరణు గోత్రాదేవతాపుత్రు వి
స్ఫారాగ్ని ప్రభుఁగూరుచుండ 1 నిడి, 2 మ్రోల్చేపట్టుగావించి, నీ
రారంబండిన ప్రాఁతరాజనపుదివ్యాన్నంబునొక్కింత వా
ర్ధారాధౌతముఁగుండవెయ్యూడ్చి 4 యొసగెన్రంభాపలాశంబునన్
**168**

వ్యా :— శుద్ధిమత్ = పరిశుద్ధితోఁగూడిన, చరణున్ = పాదములుగలవాఁడును. (పాదప్రక్షాళనచేసి కొన్నవాఁడును-అనుట) విస్ఫార = బాగుగావికసించిన - బాగుగా వెలుఁగొందిన, అగ్ని = అనలమువంటి, ప్రభున్ = ప్రభగలవాఁడును. (తేజస్సుగలవాఁడును) అగు, గోత్రాదేవతాపుత్రున్ = భూసుర (బ్రాహ్మణ) కుమారుని, రారయ్యాయని = రండీ! యని, కూరుచుండనిడి = కూర్చుండఁ బెట్టి, (ఆసీనునిజేసి) మ్రోల్ = ముందుభాగమును, చేపట్టుగావించి= చేతితో గోమయమున నలికి, ఒక్కింత = కొంచెము, వార్ధారా = జలధారచేత, ధౌతమున్ = పరిశుద్ధముచేయఁబడిన, నీరారన్ = జలసమృద్ధికలుగఁగా, పండిన = ఫలించిన, ప్రాఁతరాజనపు దివ్యాన్నంబున్ = ప్రాఁతవయిన రాజనపువడ్లయొక్క యింపయిన (చలిది) కూటిని, కుండ = భాండమును, ఊడ్చి = ఊర్చి, రంభాపలాశంబునన్ = అరఁటియాకునందు, (కదళీవారణబుసారంభా - అమ) ఒసఁగెన్ = ఇడియెను. చేపట్టుగావించు - "గోమయోపలిప్తే ప్రావృతే దేశే - ప్రవిష్టా" (శబ్దక)

వ్యాక :— మ్రోల + చేపట్టు. (ము. కౌ. ప్రకీర్ణక)

---

168 ప:- 1 నిడె - గౌ; నిడి - ర, అ. 2 నోర్వేవ - క; మ్రోల్చేపట్టు- ర, అ. 3 యూడ్చి - గ, యూడ్చి - ర, అ; గౌ. 4 యిడి యెన్ - ర; యొసఁగెన్ - అ, గౌ.

తే॥ ఒసఁగి 1 సవ్యంజనంబుదధ్యోదనంబు
నారగింపుడుక్షమియింపుఁడనుచుఁబలికి
ముదితముదితాత్మభావసంపదయుఁబోని
సలిలపరిపూర్ణమగుగిండినిలిపిచనిన. 169

వ్యా :— ఒసగిఁ = (రాజనపు దివ్యాన్నమును) ఇడి, (వడ్డించి) సవ్యంజనంబు = సంజుడుపదార్థముతోఁగూడిన, దధ్యోదనంబున్ = పెరుఁగన్నమును, అరగింపుఁడు = భుజింపుఁడు, క్షమియింపుఁడు = మన్నింపుఁడు, అనుచున్ = అని, పలికి = వచించి; ముదిత = (ఆ) వెలఁది - అనుశీల, ముదిత = సంతోషించిన, ఆత్మభావసంపదయుఁబోని = (తన) మనస్సునందలి యభిప్రాయసంపత్తి వంటి, సలిల = నీటితో, పరిపూర్ణమగు = నిండినదగు, గిండిన్ = సన్ననిమెడగల పాత్రవిశేషమును, భృంగారువును, (భృంగారుగిండి నాఁజను - ఆం. భా.) నిలిపి = ఉంచి, చనినన్ = అరుగఁగా. (మీఁదిపద్యముతో నన్వయము)

దధ్యోదనము - ఇది దధ్యోదనమనుపేరుగల యాహారపదార్థముకాదు. పెరుఁగన్నమునకుఁ సంస్కృతీకరణరూపము. (ము. కౌ.)

క॥ చేనాపోశన 1 మున్నుచు
ధ్యానంబొనరించి 2 యతఁడు 3 తగననుమతిచం
ద్రానసచేఁగొని 4 మెసఁగెన్
బ్రాణాహుతి 5 విరచితముగఁబర్యుషితంబున్. 170

---

169 ప :- 1 యవ్యంజ - ద, ద, బ; సవ్యంజ - ర, అ.
170 ప :- 1 ముంపుచు - ర; మున్నుమ - అ. 2 యపుడు - ప; యతఁడు - ర, అ. 3 తగునని - త; తగనను - గౌ; తగునను - ర, అ. 4 మెసఁగుణ్ - ర; మెస(గుణ్ [మెసఁగెణ్?] - అ. మెసఁగెణ్ - గౌ. 5 విరచిత - ద, ధ, బ; విరహితముగ - ర, అ.

వ్యా :— అతఁడు = అతఁడు - అమాయావటువు, చేన్= చేతియందు, ఆపోశనము = భోజనారంభకాలమున మంత్ర పూర్వక ముగాఁబుచ్చుకొనుటకుఁబుడిసిటఁ బోసికొనుజలమును, ఉన్పుచున్ = ఉంచుచు, ధ్యానంబొనరించి = ధ్యానముచేసి - ప్రజాపతినిధ్యానించి, చంద్రాననచేన్ = (ఆ) ఇందుముఖిచేత - అనుశీలచేత, తగన్ = యుక్తమగునట్లు, (ఉచితరీతిననుట) అనుమతిన్ = అనుజ్ఞను, కొని = పొంది, ప్రాణాహుతి = భోజనమునకుముందు పంచప్రాణరూపాగ్నిని గూర్చిచేయు నాహుతులచేత, విరచితముగన్ = కూర్పఁబడినదిగా, (ప్రాణాహుతి పూర్వకముగా - అనుట) పర్యుషితంబున్ = చలిదిని, మెసఁగెన్ = భుజించెను.

ధ్యానంబొనరించి --- భోజనమునకుముందు ప్రజాపతిని ధ్యానింపవలెను.

"ధ్యాత్వాతన్మనసాదేవమాత్మానంవై ప్రజాపతిమ్"
(కూర్మ) - శబ్దక.

భోజనమునకుఁబూర్వమాపోశనము పట్టవలెననుటకు—

"అమృతోపస్తరణమసీత్యాపోశనక్రియాంచరేత్"
(కూర్మ) - శబ్దక.

ప్రాణాహుతి —

"అపఃపీత్వాపంచభిస్తైఃప్రాణాహుతీర్జుహోతి, ప్రాణేనివిష్టోఽమృతం జుహోమిశివోమావిశాప్రదాహాయప్రాణాయస్వాహా, అపానే-స్వాహా, సమానే --- స్వాహా --- ఉదానే --- స్వాహా, వ్యానే - స్వాహా"

తే॥ తిరిగిచూచినయంత 1 నా౽దిమ్మరీఁడు
సిక్థమొక్కటియేనియుఁజిక్కనీక
మ్రింగిమీఁదులుచూచుచుమృదులఫణితిఁ
బిలిచియిట్లనుశరదిందుబింబముఖిని. 171

వ్యా :— అ, త్రిమ్మరీఁడు = అసంచారశీలుఁడు - అ బాటసారి, తిరిగిచూచినయంతన్ = వెనుకకు మరలిచూచినంతసేపటిలో (అత్యల్పవ్యవధానములో - అనుట) సిక్థము = అన్నపుమెదుకు (సిక్థోనాభక్తపులాకే మధూచ్ఛిష్టేక్వచిన్నపుమ్ - వై. ని.) ఒక్కటి యేనియున్ = ఒకటయినను, చిక్కనీక = మిగులనీయక, మ్రింగి = గబగబతిని. మీఁదులు చూచుచున్ = సంకోచముతో, నాకసము వైపుదృష్టి ప్రసరింపజేయుచు, మృదులఫణితిన్ = కోమలమయిన వాక్యములతో, పిలిచి = రమ్మనిచీటి, శరదిందుబింబముఖిని = శరత్కాఁచంద్రబింబమువంటి ముఖముగలదానినిగూర్చి - అనుశీలనుద్దేశించి, ఇట్లు = ఈప్రకారముగా. అనున్ = పలికెను.

వ్యాక ,— అ+త్రిమ్మరీఁడు = అద్రిమ్మరీఁడు. కర్మధారయమున, గసడదవలు. (ము. కౌ. సంధి) ఫణితి - భణితిశబ్దప్రాకృత రూపము. (ము. కౌ. తత్సమ)

తే॥ చూడుమీ 1 సారి 2 భాండమో శోభనాంగి!
భిస్సటుంబొండెఁదాటితప్పినదియొండెఁ
3 గలిగిలేకుండ 4 దూడ్చితెమ్మలఘుజఠర
జాతవేదంబుహెచ్చెనిస్వల్పభుక్తి. 172

---

171 ప:- 1 నద్దిమ్మ - త, గౌ; నా౽దిమ్మ - ర. అ.
172 ప - 1 సారె - క, త, గౌ: సారి - ర, అ. 2 చాడయో - క; చేరియో-ప; చేడెయో - గౌ; భాండమో - ర, అ. 3 కలుగవే! కుండనూడ్చి-అ కలుగులేకుండ - ముద్రి [అ], ర; కలిగిలేకుండ - గౌ; 4 దూడ్చి - ర; దూర్చి - గౌ; గూర్చి - త.

వ్యా :— ఓశోభనాంగి = ఓ శుభాంగి! - ఓ సుశీల! ఈసారి = ఈపర్యాయము, భాండము = (చలిది) కుండ, చూడుము = పరిశీలింపుము. భిస్సటంబొండెన్ = మాఁడినయన్నముగాని, (భిస్స టాదర్గికా - అమ) జాఱితప్పినది యొండెన్ = జాఱిపడి (చేతికి) చిక్కనిదిగాని, (ఒండెన్ - పక్షాంతరమును దెలుపును) కలిగి లేకుండదు = ఉండియుండకపోదు. ఊడ్చి = ఊర్చి, (చేతితోఁదడివి తీసి) తెమ్ము = తీసికొనిరమ్ము. అలఘు = గొప్పదయిన - దుర్భర మయిన, జఠరజాతవేదఁబు = కడుపుచిచ్చు - క్షుధాగ్ని, (జఠరో దరమ్; జాతవేదస్తనూనపాత్ - అమ) ఈస్వల్పభుక్తిన్ = ఈయత్యల్ప భోజనముచేత, హెచ్చెన్ = అధికమయ్యెను.

కలిగిలేక - జాతీయము. కలిగిలేకొక్కఁడుగానిలేఁడు
(భాగ 10 స్కం. పూ 364)

వ్యాక :— భిస్సటము — భిస్సటాశబ్దము కంధరాదిగణ గణ్యమని గ్రహింపవలెను. (బా. తత్సమ 66)

భిస్సటము, భిస్సట, జాఱి+తప్పినది = జాఱిదప్పినది. (ము.కౌ. సంధి)

చ॥ అనుటయుసంభ్రమంబడర నంగనతొల్లిటినాఁటియామినిం
దనకనివండిడించికొనినాథుఁడు పల్లియకేగు 1 నెంజిలిన్
దనికిభుజింపకున్కిభరితంబయి 2 యట్టికనట్టుకట్టియొ
శెప్పు ననవనౌదనం4 బొసఁగెఁబూని 5తదాజ్ఞను6 శ్రాణమూఁకుటన్
173

---

173 పా:- 1 నెంజెలిన్ - గౌ; నెంజలిఁ - ర, అ. 2 యట్టుకనట్టి - గౌ; యట్టుకనట్టు - ర, అ. 3 పృనభినవౌదనం - ర. అ; పృనభి నవో - గౌ; పృననభివా - త. 4 బొసఁగు - గౌ; బొసఁగె - ర. అ. 5 తదాజ్ఞనశ్రావ - గౌ; తదాజ్ఞనె - ర, గ; తదాజ్ఞను - అ. 6 శ్రావ - గ, గౌ, అ. శ్రాణ - ర.

వ్యా :— అనుటయున్ = (ఇట్లు) పలుకుటయు, అంగన = కాంత - అనుశీల, సంభ్రమంబు = వేగిరపాటు, అడరన్ = అతి శయింపఁగా, తొల్తటినాఁటి యామినిన్ = ముందటిదినము రాత్రి యందు, తనకని = తనకొఱకని, (తానుభుజించుకొఱకనుట) వండి= పాకముచేసి, డించికొని =(పొయ్యిమీఁదనుండి) క్రిందికి దింపికొని, నాథుఁడు = భర్త, పల్లియకున్ = పల్లెకు, (గ్రామాంతరమునకు) ఏగు = అరిగెడు, నెంజిలిన్ = మనోవ్యథచేత, (నెంజిలి యనఁగ మనికితంబనఁగదుందుడుకనందగు మనోవ్యథకు సమాఖ్య - అం ఖా) తనికి = తాపమునొంది, భుజింపకున్కిన్ = భోజనముచేయకుండుట చేత, భరితంబయి = నిండినదయి - వెలితిలేకుండ నిండుగానున్నదై, అట్టికన్ = దాకయందు, (వెడల్పుమూఁతిగల చిన్నకుండభేదము నందు) అట్టుకట్టి = అట్టుగానేర్పడి, ఒప్పు = ఒప్పెడు, అనవన = క్రొత్తదికాని - పాఁచిదైన, ఓదనంబు = అన్నమును, పూని = ఉద్యమించి, తదాజ్ఞను = అతనియొక్క యానతిచేత, కాణమూఁకు టన్ = కాఁపుడుగంజిమూఁకుటియందు, (యవాగూరుష్ణికాకాణా- అమ) ఒనఁగెన్ = ఇడెను.

మూఁకుడు - మూఁత+కుడుక = మూఁకుడు, (శ.ర; సూ.ని)

వ్యాక :— అనవన - ఇఞ్ + నవన = అనవన, నవశబ్ద పర్యాయముగానవనశబ్దము గ్రాహ్యము. "నవ = ను+ అప్ - స్తవే, అచ్ - నూతనే" (శబ్దస్తో) కావున, ను+ల్యుట్ = 'నవనమ్' అను రీతిని నవనశబ్దము సిద్ధించును. స్తుతి, నూతనము ననునర్థములు గ్రాహ్య ములగును. స్తుతికి - భవనారీతతనవనా. (హ, న. 1-34)

కాణమూఁకుటన్ - కాణయొక్కమూఁకుటన్. (కాణా = కాణ - తత్సమము.

తే॥ ఒసఁగియెడ పేర్పులోఁగాఁగుచున్న యాల
పాలువడ్డించుటయుమౌనిపాల! వేళ
మవలివారలచేతికి నందియిచ్చు
వడువునభుజించె 1 వడువిపుర్వంటకంబు. **174**

వ్యా :— ఒసఁగి = (ప్రాఁచియన్నమును) ఇడి, మౌని పాల = ఓమునినాయకా - ఓనారదా ! (వక్త - శివుఁడు) ఎడపేర్పు లోన్ = దూరమునందున్నదాకలో, కాఁగుచున్న = మరుగుచున్న, ఆలపాలు = గోక్షీరమును, వడ్డించుటయున్ = వడ్డనచేయుటయు; (ప్రాఁచియన్నమున గోక్షీరమును బోయుటయు - అనుట) వడువు = బ్రహ్మచారి, అవలివారలచేతికినందియిచ్చు వడువునన్ = అవతలివారి హస్తమునకందిచ్చునట్లు, ఇపుర్వంటకంబున్ = ఇగిరినయన్నమును, (అత్తెసరును) వేళము = వేగముగా, భుజించెన్ = భక్షించెను.

క॥ భుజియించి మఱియుఁదెమ్మని
గజిబిజిసేయుటయునతియుఁగలఁగక వికస
న్నిజవదనయగుచు హస్తాం
బుజములు 1 మొగుడించిపల్కు భూసురసూతిన్. **175**

వ్యా భుజియించి = (ఇపుర్వంటకమును) భక్షించి, మఱియున్ = ఇంకను, తెమ్మని = తీసికొనిరమ్మని, గజిబిజి సేయుటయున్ = అల్లరి యొనర్చుటయు, సతియున్ = (ఆ) సాధ్వియు - అనుశీలయు, కలఁగక = క్షోభపడక, వికసత్ = వికసించుచున్న, నిజ = తనదైన, వదనయగుచున్ = ముఖముగలదియగుచు, హస్తాం

---

174 ప :- 1 వడుగిగు - గా; వడువిగు - ర, అ,

175 ప :- 1 మొగిడించి - ర, అ, మొగుడించి - గొ.

బుజములు = పద్మములవంటి చేతులు, మొగుడించి = మోడ్చి, భూసురసూతిన్ = బ్రాహ్మణాపత్యమునుగూర్చి, (సూతిః = సంతానమ్-శబ్దక) పల్కున్ = (ఇట్లు) వచించెను.

వ్యాక ;— మొగుడు + ఇంచు = మొగుడించు (ము.కౌ. క్రియా)

శా॥ అన్నం 1 బొండొకలేదు చల్దియది 2 విన్మధ్వశ్రమారూఢ! తె
మ్మన్నందెచ్చెద, సాధుగుప్తములు నవ్యంబుల్ కజాయంబులిం
దెన్నే 3 నున్నవి 4 క్రొత్తయట్టికలఁగాదే! లేచివార్వుఁడు, వే
గన్నిర్మించెదఁగూడుఁగూరమటియుంగ్రైకోలుమేల్భక్తికిన్. 176

వ్యా ;— అధ్వశ్రమారూఢ = మార్గాయాసము నొందినవాఁడా! విన్ము = ఆకర్ణింపుము. చల్దియది = చల్లనిదయిన, అన్నంబు = కూడు - (గతరాత్రివండిన చల్లనియిపుర్వంటకము - అనుట) బండొక = కొంచెమయినను, లేదు = కలుగదు - మిగుల లేదు. సాధుగుప్తములు = చక్కఁగాదాఁచఁబడినవి. నవ్యంబుల్ = క్రొత్తవి, యగు, కజాయంబులు = అపూపములు, (అపూపాభిధానమ్ము దనరుఁగజ్జ, మప్పమప్పచ్చికజ్జాయమనఁగ - అం. భా) ఇందున్ = ఇక్కడ - ఇంటియందు, ఎన్నేన్ = ఎన్నియయినను, (పెక్కులు - అనుట) క్రొత్త = నూతనములయిన, అట్టికలన్ = దాకలయందు (వెడల్పుమూఁతులుగల చిన్నకుండవిశేషములందు) ఉన్నవి = కలవు. తెమ్మన్నన్ = తీసికొని రమ్మన్నచో, తెచ్చెదన్ = తీసుకొనివత్తును. కాదేన్ = కానిచో, లేచివార్వుఁడు = లేచియాచమింపుఁడు. వేగన్ =

176 ప :- 1 బొండిక - ర. అ. బొండొక — డ, ద, బ, గౌ. 2 విన్మాధ్వద్రమారూఢ — కః విన్మధ్వశ్రమారూఢ - ర. అ. 3 యున్నవి- త. ప. గౌః నున్నవి - ర. అ; 4 మున్నక్రొత్తటికలందే - త; మున్నొకొత్తటికలందే - గౌ; క్రొత్తయట్టికలఁగాదే - ర, అ.

త్వరగా, కూడున్ = అన్నమును, కూరన్ = శాకమును, నిర్మించెదఁ = చేసెదను. మఱియుఁ = మరల, భుక్తికిన్ = భోజనమునకు కైకోల్ = అంగీకరించుట, మేల్ = లెస్స. (కజ్జాయములుతినుట కంటె, వార్చిలేచి, మరలభోజనమునుజేయుటయే మేలనుట)

వార్చు = ఆచమించు. "చూపుడువేల్లిలు పొడవుగాఁజిపిన పుడిసిటుజలము గ్రహించిమూఁడుసార్లు పుచ్చుకొను. వార్చు" శ. ర.

వ్యాక :— చర్దియది - 'అది' యర్థశూన్యము. "బావులు నూఱిటికంటె నొక్కసత్క్రతువదిమేలు - ఆది 4-93. (ప్రౌ. శబ్ద 63) కజ్జాయము = కజాయము - బా. ప్రకీర్ణక 8. ఇది యక్కటాదులలోనిది.

ఉ॥ నావిని నాఁతిఁ బల్కెఁ గుహనావటువో వనితామతల్లి! యో
పావనశీల! తైలపరిపక్వము 1 లేనియుఁ దెమ్ము; గాదనన్
లేవడియైన భుక్తిఁ గొని లేవదిగంబడదాఁక 2 లింతయు
న్ధావనమాచరించుకతనన్ దడవున్నిలుఁ బోలదిచ్చుటన్. **177**

వ్యా :— నాన్ = అనఁగా. విని = ఆలకించి, కుహనావటువు = మాయాబ్రహ్మచారి, నాఁతిన్ = కాంతనుగూర్చి - సుశీలనుద్దేశించి, పల్కెన్ = (ఇట్లు) వచించెను. ఓవనితామతల్లి = ఓయుత్తమకాంతా! ఓపావనశీల = ఓపవిత్రమయిన స్వభావముగలదానా! (శీలంస్వభావే - అమ) తైలపరిపక్వములేనియున్ = నూనె

---

177 పః- 1 లెన్నియు - ముద్రి (అ), ర; లేనియు - అ; 2 లింతయున్-
ధావన - ర, అ. [ఇది సంయుక్తాక్షరయతికి విరుద్ధము]
గావన - గౌ.

యందు బాగుగాఁ బచనమయినవానినైనను - పిండివంటలనైనను, తెమ్ము = తీసికొనిరమ్ము. కాదనన్ = వలదనను. వేవడియైన = అల్పమగు, భుక్తిగొని = భోజనముచేసి, లేవన్ = లేచుటకు, ఆఁకలి = క్షుత్తు; ఇంతయున్ = కొంచెమయినను, దిగంబడదు = తగ్గదు. ధావనమాచరించుకతనన్ = పరుగెత్తనున్న హేతువున (పరుగెత్తిపో వలసియుండుటచేత) ఇచ్చటన్ = ఇక్కడ, తడవున్ = ఎక్కువసేపు నిలఁబోలదు = ఆఁగఁదగదు.

వ్యాక :— వనితామతల్లి - "ప్రశంసావచనైశ్చ" (2-1-66) అను సూత్రముచేనయిన సమాసము. "మతల్లీ చాసౌవనితాచ" మతల్లీ శబ్దమునకు - చూ 3-190 వ్యాఖ్య.

మ.్రస.:- అనినన్వడ్డింపఁజొచ్చెన్హరిణనయననిండారుడెందంబుతో, వే
గనభావిప్రాణనాథాగ్రహసహమతితోఁగమ్మనైకారమైనే
తనవండంబొల్చిచేతందడవినఁదుఁముర్రై 1 తాఱుటల్లేకసద్యో
జనితంబుల్వోలెఁజాలంజవులొదవు2సమత్స్యండికాపూపపంక్తుల్ 178

వ్యా :— అనినన్ = అనఁగా - పిండివంటలనుదెమ్మనఁగా, హరిణనయన = మృగాక్షి - అనుశీల, కమ్మనై = రుచ్యమై, కారమై = గుబాళింపుగలదై. నేతిన = ఘృతముతోనే, వండన్ = పాకము చేయుటచేత, పొల్చి = ఒప్పి, చేతన్ = హస్తముతో, తడవిఁనన్ = నిమురఁగా, తుమ్రై = విఱుగుటగలదై, తాఱుటలేక = చెడిపోవుట లేక, సద్యః = అప్పుడే, జనితంబుల్వోలెన్ = ఉత్పాదితములయిన వానివలె, (తయారుచేసినవానివలె) చాలన్ = మిక్కిలి, చవులొదవు =

178 పా. 1 తాఁకుటల్ - గొ; తాఱుటల్ - ర, అ. 2 సమచ్చండికా- డ, ధ, బ, గొ; సమత్స్యండికా - ర, అ.

రుచులొప్పెడు, సమత్స్యండికా = ముదురు బెల్లపుఁబాకముతోఁగూడిన, అపూపపంక్తుల్ = కజ్జాయములవరుసలు, (పూపోఽపూపఃపిష్టకస్స్యాత్ - అమ; చూ 4-176 ప) నిండారుడెందంబుతోన్ = నిండుమనస్సుతో, భావి = కలుగఁబోవు, ప్రాణనాథ = జీవితేశ్వరునియొక్క (భర్త యొక్క) ఆగ్రహ = కోపమును, సహ = సహించెదు, మతితోన్= భవిష్యజ్జ్ఞానముతో (మతిరాగామిగోచరా) వేగన = త్వరితముగానే - వెంటనే, వడ్డింపఁజొచ్చెన్ = వడ్డనచేయఁదొడఁగెను.

మత్స్యండికా—

"ఇక్షోరసోయః సంపక్వో, ఘనః కశ్చిద్ద్రవాన్వితః,
మందంయత్ స్యందదేయస్మా, త్తన్మత్స్యండీనిగద్యతే"
(భావప్ర) - శబ్దక.

"ఇక్షోరసోయః సంపక్వో, జాయతేలోష్టవద్దృఢః
సగుడోగౌడదేశేతు, మత్స్యండ్యేవగుడోమతః"
(భావప్ర) - శబ్దక.

"మత్స్యండీఫాణితంఖండవికారా" (అమ) "సారభూతమై, ఘుటికయగునట్లు కాఁచినచెఱఁకుపాకు మత్స్యండియనంబడును. అర్ధపాకముగాఁగాఁచినపాగు ఫాణితమనంబడును --- పా. మత్స్యండీ. శర్కరావికారములు" (గురుబాల) మత్స్యండి (ది) = సారభూతమై ఘుటికయగునట్లు కాఁచినచక్కెర, కండచక్కెర" (సూ. ని.) కండ చక్కెరతో నప్పములు చేయరుగాననిది ప్రకృతమునకుసరిపడదు.

వ్యాక :— వడ్డించు - వడ్డ + ఇంచు = వడ్డించు. వడ్డ - అంగలాదులలోనిదిగా గ్రాహ్యము. (బా. క్రియా 63) "వర్ధ, ఛేదనే పూరణేచ" (శబ్దస్తో) వర్ధధాతుమూలకము 'వడ్డ' ధాతువు. వర్ధనశబ్ద భవము; వడ్డన. (పరివేషణం వర్ధనంచ - వై. ని.) వడ్డధాతువు -

'అప్ప' ధాతువువంటిది. అర్పణ = అప్పన = అప్ప. ఇట్లే, వర్ధన= వడ్డన = వడ్డ.

ఛం ;— మహాస్రగ్ధర - గణము :- స - త - న - స - ర - ర - గ. యతి 1-9-16. యతినియతి పాటింపఁబడినది వృత్త సంఖ్య 22-605988.

వ॥ ఇట్లుబుణగ్రహణప్రవణ పురు 1 షోపదీకృతంబులు, ప్రాణవల్లభ సమ్యగభిరక్షితంబులు, తదుపహితగణనావహంబులు, నచ్ఛిద్ర ముద్రాముద్రితంబు 2 లునై, సజ్జన వితరణంబులగతి 3 మహిత భాజననిహితంబులు, ననురక్తవధూహృదయంబుల పగిది నతి స్నేహపిచ్ఛిలం 4 బులు, నుపవనంబులయుపమ 5 సురభీష్టం బులునైన పిష్టవికారంబులు నిర్వికారుండై భూసురకుమారుండు నిరవశేషంబుగా 6 నాహారించియు, వెండియునవనతాననంబగు మిథ్యాలజ్జాభినయంబునఁదనబహుభోక్తృత్వంబు 7 నపశ్లోకకలు షితంబగునని విశంకమానమానసుండు నుంబోలెఁగానందగు 8 నా పొట్టినెట్టికసిల9దిట్టపడుచుకడుపునిండమియెటింగి, తరంగితాద్భు తాంతరంగయై యాకురంగనయనయిట్లని వితర్కించు. **179**

---

179 వ:- 1 షోపదికృతం – గ; షోవధీ - ప; షాధికృ - చ, త; గౌ; పుష షోపదీ - అ. 2 లై – గౌ; లునై - ర, అ. 3 మహా - ప; మహిత – ర. అ, గౌ. 4 బులును - గౌ; బులు - ర, అ 5 సురభిష్ఠంబు -ముద్రి [అ], ర; సురభిళం - ప; సురభీష్ఠం త; సురభీష్టం - అ; సురభిషం - గౌ. 6 అనాహరించి – గ; అహా రించియు - ర, అ; ఆహారించి – గౌ; 7 నుప - క, చ, త,ప,గౌ. నప - ర, అ. 8 నావింటినట్టికసిలయంతదిట్ట – త;/ నట్టికసిల యంత - గౌ; చ; నాభాట్టినట్టకసీలయంత - క; నాపొట్టినెట్టిక సీల - ర, అ. 9 తిట్టపడుచు - ప. [సరళములకుఁబరుషములు వ్రాయుటలేఖవసంప్రదాయముకాననిదియట్టిదే) దిట్టపడుచు-ర,అ.

వ్యా :— ఇట్లు = ఈప్రకారముగా, ఋణగ్రహణ = అప్పు గ్రహించుటయందు, (అప్పుచేయుటయందు - అనుట) ప్రవణ = ఆసక్తుఁడగు, పురుష = మగవానిచేత - భర్త చేత, ఉపదీకృతంబులు= ఉపదగాఁ (కానుకగా) జేయఁబడినవియు, ప్రాణవల్లభ = జీవితే శ్వరునిచేత, (భర్త చేత) సమ్యక్ = బాగుగా, అభిరక్షితంబులు = దాఁచఁబడినవియు, తత్ = అతనిచేత - భర్త చేత, ఉపహిత = ఉంపఁ బడిన, గణన = లెక్కను, ఆవహంబులున్ = పొందించు నవియు, (లెక్క పెట్టియుంచినవియనుట) అచ్ఛిద్ర = సందులేని, ముద్ర = ఆచ్ఛాదనముచేత; ముద్రితంబులునై = మూసివేయఁ బడినవియునై, సజ్జన = సత్పురుషులయొక్క, వితరణంబులగతిన్ = త్యాగములవలె, మహిత=పూజింపఁదగిన, భాజన = (దాన) పాత్రుల యందు, నిహితంబులున్ = ఉంచఁబడినవియు(సమర్పింపఁబడినవియు- అనుట) - అని సజ్జన వితరణపక్షమున నర్థము. మహిత = గొప్ప వయిన, భాజన = పాత్రలయందు, నిహితంబులు = ఉంచఁబడిన వియు - యప్పముల పక్షముననర్థము. అనురక్త = అనురాగముగల, వధూ = స్త్రీలయొక్క, (నారీసీమంతినీ వధూః - అమ) హృద యంబులపగిదిన్ = మనస్సులవలె, అతిస్నేహ = అధిక ప్రేమచేత; పిచ్ఛిలంబులున్ = స్నిగ్ధములును - అని వధూహృదయపక్షమున నర్థము. అతిస్నేహ = అధికమయిననేతిచేత, (సౌహృదేఘృతతైలాదౌ స్యాత్ స్నేహః - త్రి ని. అప్పములు నేతితోఁజేసినవి - సూ 4-178) పిచ్ఛిలంబులున్ = జిడ్డుదేఱినవియు - అని యప్పముల పక్షముననర్థము. ఉపవనంబులయుపమన్ = ఆరామములవలె, సురభి = వసంతునకు, (సురభిశ్చంపకేస్వర్ణేజాతీఫలవసంతయోః - విశ్వ) ఇష్టంబులున్ = ప్రియములును - అని యుపవనపక్షముననర్థము. సురభి = సుగంధము చేత, (సుగంధేచమనోజ్ఞేచ వాచ్యవత్సురభిఃస్మృతః - విశ్వ) ఇష్టం బులున్ = కోరఁబడినవియు - అని యప్పములపక్షముననర్థము. (ఇష్ట మాశంసితేఽపిస్యాత్పూజితే ప్రియసిత్రిషు- మే. ని.) ఐన = అయినట్టి

పిష్టవికారంబులు = పిండియొక్క - వికృతులు - పిండితోఁజేసిన పదార్థములు- అప్పములు, (=బెల్లము, పిండియుఁగలిపిచేసిన భక్ష్యవిశేషములు కజ్జాయములు.) భూసురకుమారుండు = బ్రాహ్మణబాలుఁడు, నిర్వికారుండై = స్వభావస్థితినుండి మాఱుపాటులేనివాఁడయి, నిరవశేషంబుగాన్ = మిగులులేనివిగా,(మిగులకుండ - అనుట) ఆహారించియున్= భక్షించియు, వెండియున్ = మరల, అవనత = వంచిన, ఆననంబగు = ముఖముగలదియగు, మిథ్యాలజ్జా = అసత్యపుసిగ్గుయొక్క (నిజముగాలేని సిగ్గుయొక్క - అనుట) అభినయంబునన్ = నటనచేత, తన = తనయొక్క, బహుభోక్తృత్వంబున్ = తిండిపోఁతు తనమును, అపశ్లోక = అపకీర్తిచేత, (పద్యేయశసిచ శ్లోకః - అమ) కలుషితంబగునని = చెడునని, విశంకమాన = మిక్కిలిసందేహించుచున్న మానసుండునుంబోలెన్ = మనస్సుగలవానివలె, కానంబడు = కనుపట్టు, అహొట్టనెట్టికలసీల = అకుబ్జుడును బ్రహ్మచారియునగు; దిట్టపడుచు = పెంకిపిల్లవానియొక్క, కడుపునిండమి = ఆఁకలితీఱకపోవుట. ఎఱింగి = తెలిసికొని, (గ్రహించి) తరంగిత = సంచలించెడు, అద్భుత = ఆశ్చర్యముతోఁగూడిన, అంతరంగయై=మనస్సుగలదయి, ఆకురంగనయన = అమృగాక్షి - అనుశీల, ఇట్లని = ఈప్రకారముగా, (అని - వాక్యాలంకారము) వితర్కించున్ = ఊహించును.

"నెట్టికసీల 2. సం. నైష్ఠికశీలః ప్రా నెట్టిఅసీల" - సూ ని.

అలం :— శ్లేషోత్థాపితములగునుపమలు.

క॥ ఇసుమంతగానిలేఁడీ

పసిబాలుఁడు 1 కుడుక 2 కూటిపాత్రియమువాఁడి

---

180 ప.- 1 కుడువ - క; ప; కుడుచు - చ; కుడుకు - ర, అ, గొ. కూడు - ధ, ద, ఖ; 2 కూట్టి - గొ, గూటి - త, అ.

3 గ్లెసరిబహుభక్ష్య 4 రాశులు
5 మెసవెడు విసువఁడు ప్రతుష్టిమేకొనఁడుఁగదే! **180**

వ్యా :— కుడుకకూటిప్రాయమువాఁడు = పాలగిన్నెలో నాహారముతినుపాటి వయస్సుగలవాఁడగు, ఈ పసిబాలుఁడు = ఈ బాల్యదశయందున్న పిల్లవాఁడు, (అషోడశాద్భవేద్బాలః - ఇతి భరత ధృతస్మృతిః - శబ్దక) ఇసుమంతగాని లేఁడు = ఇసుకరేణువంత పరిమాణములేఁడు. ఇట్లు = ఈప్రకారముగా, ఎసరి = విజృంభించి, బహుభక్ష్యరాశులు = పెక్కుఖాద్యములరాసులు, మెసవెడున్ = తినుచున్నాఁడు విసువఁడు = విసుగుచెందఁడు. ప్రతుష్టిన్ = సంతృప్తిని, మేకొనఁడుఁగదే = పొందఁడునుగదా !

ఇసుమంతగానిలేఁడు - 'కాని' వాక్యాలంకారము. ప్రియోగాంతరములు —

(i) అానునెట్టికసీలంతగానిలేదు - క్రీడా 143 ప.

(ii) రూకంతగానిలేదేకై వడిసమంబు
వచ్చుబంగారుమై హెచ్చుజిగికి (సారంగ 2-47)

పసిబాలుఁడు - బ్రాహ్మణులకు గర్భాష్టమవర్షమున నుపనయనముశ్రేష్ఠమగుటచేఁబసిబాలుఁడనునది యేడేండ్లపిల్లవానిని దెలుపును.

గర్భాష్టమేష్టమేవాబ్దే, బ్రాహ్మణస్యోపనాయనమ్
రాజ్ఞామేకేదశేసైకే, విశామేకేయథాకులమ్''
(సైకే = ద్వాదశవర్షే)

---

3 గ్లెసఁగి - గ; గ్లెసరి - ర, అ. 4 రాసులు - ర, అ; రాశులు - గొ; 5 మెసఁగెడి - ర, అ; మెసవెడు - గొ;

వ్యాక :— కుసుకకూటిప్రియమువాఁడు = కుడుకకూటి ప్రియముయొక్క వాఁడు (=ప్రియముగలవాఁడు) - అభాసబహువ్రీహి. (ము. కౌ. సమాస; విక్ర)

పాఠ :— భక్ష్యరాశులు - 'గౌ' పాఠము. 'రాసులు' అనునది దంత్యోచ్చారణమునుబట్టివచ్చిన యపపాఠము (ము. కౌ. తత్సమ)

ఉ॥ మాయపుబిడ్డయీఁనిసువుమానిసిపుట్టువు 1 గాఁడు, దేవతా
నాయకుఁడో! చతుర్ముఖుఁడొ! నాభవబంధములూడ్వనున్న నా
రాయణమూర్తియో!యెఱుఁగరాదొకయించుకయున్,2బుభుక్షువై
చేయిదొ అంగఁడప్పములుసెల్లెసమస్తమునంచునివ్వెఅన్. 181

వ్యా ,— ఈనిసువు = ఈపిల్లవాఁడు, మాయపుబిడ్డ = కపటబాలకుఁడు. మానిసిపుట్టువుగాఁడు = ప్రాకృతమానవుఁడుకాఁడు దేవతానాయకుఁడో = సురపతియో! (ఇంద్రుఁడో - అనుట) చతుర్ముఖుఁడొ = బ్రహ్మయో! నా = నాయొక్క, భవబంధములు = సంసారబంధనములు, ఊడ్వనున్న = సడల్పనున్న, నారాయణమూర్తియో! ఒకయించుకయున్ = ఒక్కింతయు, ఎఱుఁగరాదు = తెలియశక్యముకాదు. బుభుక్షువై = ఆకలిగొన్నవాఁడయి, చేయిదొఅంగఁడు = చేతినిదీయఁడు. అప్పములు = అపూపములు, సమస్తమున్ = సర్వమును, చెల్లెన్ = అయిపోయెను. అంచున్ = అని, నివ్వెఅన్ = నిర్భరమయిన యాశ్చర్యముతో, (నిర్భరాశ్చర్యంబునివ్వెఅనఁగ - ఆం. భా) మీఁదిపద్యముతోనన్వయము.

---

181 ప :- 1 గాదు - ముద్రి[అ]; ర, గాఁడు - అ; గౌ. 2 బుభుక్షపై-ముద్రి [అ], బుభుక్షమైచేయి – ర; బుభుక్షమైఁజేయి – గౌ; బుభుక్షువై - అ.

వ్యాక :— మానిసిపుట్టువు = మానిసి (పుట్టువు) వంటి పుట్టువు వేనికిఁగలదో వాఁడు - ప్రాకృతమానవుఁడు. (బహువ్రీహి. ఊద్వనున్న - (ము. కౌ. క్రియా)

అలం :— సందేహము,

చ॥ తలఁచుమనంబులోన వసు 1 ధావిబుధాధిపధర్మపత్ని ని
ర్మలకనకావదాతముఁగరాళతరా 2 లఘుకీలమాలికో
జ్జ్వలము 3 జగత్క్రియాకరణసాక్షి 4 మదక్షిమదంగ 5 భాగతా
తిలకితవిభ్రమంబగునుదీర్ణ 6 మహత్త్వముదివ్య 7 తత్వమున్.

182

వ్యా ;— వసుధావిబుధాధిప =భూసుర (బ్రాహ్మణ) నాయకుని యొక్క; ధర్మపత్ని = ధర్మార్థమయినభార్య, నిర్మల = పరిశుద్ధమగు, కనక = బంగారమువలెను, అవదాతమున్ = పసుపురంగు గలదియు, (అవదాతస్సితేపీతేశుద్ధే - అమ) కరాళతర = మిక్కిలి భయంకరములయిన, (కరాళేదంతురే తుంగేభీషణేచాభిధేయవత్ - మే. ని.) అలఘు = గొప్పవయిన, కీలమాలికా = జ్వాలలవరుస చేత, (మాలాల్యావళిపంక్తయః - అభి. చిం.) మాలికా = మాలైప కన్ అతఇత్వమ్ - శబ్దక) ఉజ్జ్వలమున్ = ప్రకాశించునదియు. జగత్ = లోకముయొక్క - లోకులయొక్క, క్రియా = వ్యాపారములయొక్క, (పనులయొక్క) కరణ = ఆచరణములకు, సాక్షి =

---

182 ప:- 1 ధామరయాజక - డ. ద. బః ధాధిపయాజక - ర; వసుధావిబుధాధిప - అ. గౌ. 2 లఘులీల - డ, ద, బః లఘుఁగీల-గః లఘుకీల - ర, అ, గౌ. 3 జగత్ప్రియా - పః జగత్క్రియా - ర. అ. గౌ. 4 ముదకి - ముద్రి [అ], రః మదకి - అ. గౌ 5 భాగి - గ, రః భాగ - అ. గౌ. 6 మహత్వము - గౌః మహత్త్వము - ర, అ. 7 తత్త్వముఁ - ర, అ. తత్వముఁ-గౌ ;

సాక్షాద్దృష్టయు, మత్ = నాయొక్క (వక్త - శివుఁడు) అక్షి = నేత్రమును, మత్ = నాయొక్క, అంగభాగతా = అవయవాంశత్వ మంచేత, తిలకిత = బొట్టుగలదియనెడు, విభ్రమంబగు = విశేషభ్రాంతి గలదియగు, ఉదీర్ణ మహత్త్వమున్ = అధికమయినయౌన్నత్యమగు, దివ్యతత్త్వమున్ = లోకాతీతమయిన వస్తువును. (సత్వంతత్వంచవస్తుచ -త్రి. ని.) - అగ్నిదేవుని, మనంబులోన్ = హృదయములోపల, తలఁచున్ = ధ్యానించెను.

కనకావదాతము - కనకవర్ణము పసుపురంగు. అగ్నివర్ణ మెఱుపు. పీతలోహితవర్ణములకైక్యము కవిసమయము. "పీతరక్తయోః -ఏకత్వేనవిబంధనంచ కవిసమయః" (కావ్యమీ)

జగత్క్రియాకరణసాక్షి - "పురుషవృత్తమెఱుంగుచునుండుఁజూవేవే,"

దములును బంచభూతములు ధర్మువుసంధ్యలునంతరాత్మయున్
యముఁడును జంద్రసూర్యులు నహంబునురాత్రియునన్ మహా
పదార్థములు - ఆది 4-78

పంచభూతములు - పృథివ్యప్తేజోవాయ్వాకాశములు. కానఁ బంచభూతములలోనొకటగునగ్ని జగత్క్రియాకరణసాక్షి యగును.

వ్యాక :— ధర్మపత్ని = ధర్మముయొక్క పత్ని. షష్ఠి తాదర్థ్యముననయినది. ప్రకృతి వికృతిభావములేకుండుటచేనిటఁజతుర్థీ తత్పురుషచెప్పరాదు.

"చతుర్థీతదర్థార్థబలిహితసుఖరక్షితైః (2-1-36) -- తదర్థేన ప్రకృతి వికృతిభావ ఏవగృహ్యతే, బలిదక్షితగ్రహణాజ్ఞాపకాత్, యూపాయదారుయూపదారు. అశ్వఘాసాదయస్తుషష్ఠిసమాసాః" (సి. కౌ. 702)

"ధర్మపత్నీత్వ(త్ర)తఅశ్వఘాసాఽవృత్తాదర్థేషష్ఠీ సమాసః, ప్రకృతి వికృతివికారాభావాత్" (రఘు 2-2 మల్లినా.)

అలం ;— అతిశయోక్తి.

క॥ పతియీగతిశ్రియమిచ్ఛె
ద్ధుతాశనా త్తనుటయెఱిఁగిహుతవహునఖిలే
ప్సితవితరణగుణలీలా
చతురుం బ్రార్థింపఁదత్ప్రసాదముకలిమిన్. 183

వ్యా ,— నతి = (అ) సాధ్వి - అనుశీల, ఈగతిన్ = ఈప్రకారముగా, హుతాశనాత్ = అగ్నివలన, శ్రియమ్ = సంపదను, ఇచ్ఛేత్ = కోరవలెను, అనుట = అన్నమాటను, ఎఱిఁగి = తెలిసికొని, అఖిల = సమస్తమయిన, ఈప్సిత = అభీష్టములయొక్క వితరణగుణ = దానగుణముయొక్క, లీలా = క్రీడయందు, చతురున్ = నేర్పరియగు, హుతవహున్ = అగ్నిని, ప్రార్థింపన్ = వేఁడఁగా, తత్ = అతనియొక్క, ప్రసాదముకల్మిన్ = అనుగ్రహము యొక్క కలుగుటచేత. (మీఁదిపద్యముతోనన్వయము)

సీ॥ ఒకకొన్నివడియంబులొకకొన్నివరుగులు
నొకకొన్నితెఱఁగులయొలుపుఁబప్పు
లొకకొన్ని ద్రబ్బెడలొకకొన్నితాలింపు
లొకకొన్నివిధముల 1 యొట్టుఁజారు
లొకకొన్ని 2 కలగల్పులొకకొన్ని 3 బజ్జులొ

---

184 పః- 1 యొట్టుచేరు - ముద్రి (అ), ర; యొట్టుఁజారు - అ, గౌ. 2 కలకల్పు - ముద్రి (అ), ర, కలగల్పు - అ. 3 బజ్జులునొక - ముద్రి (అ), ర; బజ్జువులొక్కొక్క - గౌ; బజ్జులొక్కొక - అ.

కొ్కకొన్ని రీతులయూర్పువగలు
నొకకొన్ని 4 శిఖరులునొకకొన్ని 5 యంబళ్లు
నొకకొన్ని 6 వహులపూపొత్కరములు

తే॥ వివిధఫలకందమూలంబులవియుఁగొన్ని
యూరుఁబిండులునొకకొన్ని, యొక్కకొన్ని
యూరుఁగాయలుఁ 7 బచ్చళ్లునొక్కకొన్ని
పెరుఁగుపాల్ తేనెనేతులుపెచ్చు 8 పెరుఁగ. **184**

వ్యా :— 'ఒకకొన్ని వడియంబులు = కతిపయసంఖ్యగల వడియాలు, ఒకకొన్నివరుగులు = కతిపయసంఖ్యగల, తఱిగియెండ వేసినకాయదినుసులు, ఒకకొన్ని తెఱఁగుల = కతిపయ విధముల యొక్క - కతిపయ విధములకుఁజెందిన (కొన్నిరకములయిన -అనుట) ఒలుపుఁబప్పులు = చాయ (పొట్టుతీసిన) పప్పులు, ఒకకొన్ని ద్రబ్బెడలు = కతిపయ సంఖ్యగల ద్రబ్బెడలను పేరుగల భక్ష్యవిశేషములు, ఒకకొన్ని తాలింపులు = కతిపయసంఖ్యగల తిరుగఁబోఁతపెట్టిన శాకవిశేషములు, ఒకకొన్ని విధముల = కతిపయవిధములయొక్క - కొన్ని రకములకుఁజెందిన, ఒఱ్ఱఁజారులు = మిరియాలచారులు, ఒకకొన్ని కలగల్పులు = కతిపయసంఖ్యగల, కూరలుకాఁడలు గింజలులోనగునవి కలిపివండిన కూరలు, ఒకకొన్నిబజ్జులు = కతిపయసంఖ్యగల బజ్జులను పేరుగలవ్యంజనవిశేషములు, ఒకొ్కకకొన్ని రీతుల = వేఱువేఱయిన కొన్ని రకములకుఁజెందిన, ఊర్పువగలు = ఊర్పు - అను

---

4 సిగరులు - ముద్రి (అ). ర; శిఖరులు - అ, గొ. 5 యంబళ్ళు - అ; యంబళ్లు - ర; యంబళ్లులొక - గొ. 6 వగల - గ; వహుల - ర, అ. 7 బచ్చళ్లులొక్క - గొ; బచ్చళ్ళునొక్క-ర,అ. 8 వెరుగ - అ; వెరుగు - గొ; పెరుగ - ర,

పేరుగలయొక విధముగావండిన కూరగాయలు, ఒకకొన్ని శిఖరులు = కతిపయసంఖ్యగలమజ్జిగ పులుసులు, ఒకకొన్ని = కతిపయసంఖ్య గల, అంబళ్లు = చోళ్ళలోనగువాని పిండితోఁగొంచెము పలుచగాఁ గాఁచిన యంబలియనుపేరుగల పదార్థములు, ఒకకొన్నివహాుల = కతిపయవిధములకుఁజెందిన, పూప = అప్పములయొక్క - పిండి వంటలయొక్క, ఉత్కరములు = సమూహములు, వివిధఫలకంద మూలంబులవియుఁగొన్ని = పలురకములయిన పండ్లుముల్లంగిదుంపలు కొన్నియు, ఒకకొన్ని = కతిపయసంఖ్యగల, ఊరుఁబిండ్లులున్ = ఊరుఁబిండియనుపేరుగల వ్యంజనవిశేషములు. ఒక్కకొన్ని = కతిపయ సంఖ్యగల, ఊరుఁగాయలున్ = ఊరుఁగాయలనుపేరుగల వ్యంజన విశేషములు, ఒక్కకొన్ని = కతిపయసంఖ్యగల, పచ్చళ్ళున్ = పచ్చడులనుపేరుగల పప్పుదినుసులు లోనగునవి ముద్దగారుబ్బిచేసెడు వ్యంజనవిశేషములు, పెరుఁగుపాల్తేనె నేతులు = దధిక్షీరమధుఘృత ములు, పెచ్చుపెరుఁగన్ = మిక్కిలియతిశయింపఁగా. (మీఁదిపద్య ముతోనన్వయము.)

శిఖరులు - "సజీరకంఠరసాలః స్యాన్మార్జితా శిఖరిణ్యపి" = అల్లముజీలకఱ్ఱమున్నగునవి కలిపినమజ్జిగ" (వై. ని.) "శిఖరిణి = పొగిచినపెరుఁగు, మెంతిపెరుఁగు" (సూ. ని.) శిఖరిశబ్దము శిఖరిణీశబ్ద పర్యాయముకావచ్చును.

వ్యాక ;— ఒఱ్ఱఁజారులు - ఒఱ్ఱని+చారులు = ఒఱ్ఱన్+ చారులు = ఒఱ్ఱఁజారులు (ము. కౌ. సంజ్ఞా)

కందమూలంబులవియు - "అవియు" వాక్యాలంకారము. (ప్రౌ. శబ్ద 63)

కలగల్పు - కలుపు+కలుపు = కలగలుపు - బా. సంధి 42. కలగలుపు = కలగల్పు - బా. ప్రకీర్ణక. 17

చ॥ అమితములై మహానసమునందపుడుద్భవమందుచున్నయ
1 న్నములను పక్వగంధములనంతములై యటు వోవుచోట, న
య్యమరతరు ప్రసూనతతులంగనపైఁగురియంగఁబుట్టుగం
ధములిటుడిగ్గుచోటఁ 2 దగుఁదద్ద్వితయారచితోపగూహముల్. 185

వ్యా :— అమితములై = కొలఁదిలేనివయి, మహానసము నందున్ = వంటింటియందు, (రసవత్యాంతుపాకస్థానం మహానసమ్-అమ) ఉద్భవమందుచున్న = పుట్టుచున్న, అన్నముల = ఓదనములయొక్క, (వంటకములయొక్క) సుపక్వ = బాగుగాఁబ?ిణతమయిన, గంధములు = సువాసనలు, అనంతములై = అంతులేనివయి, అటు = ఆవైపు - మీఁదివైపు, (ఆకాశమునకనుట) పోవుచోటన్ = అరుగునప్పుడు. అయ్యమరతరు = ఆదేవతావృక్షములయొక్క, ప్రసూనతతులు = పూలసమూహములు, అంగనపైన్ = (అ), కాంతమీఁద - అనుశీలమీఁద, కురియంగన్ = వర్షింపఁగా, పుట్టు = కలుగు గంధములు = సువాసనలు, ఇటు = ఈవైపు - క్రిందివైపు, (భూమికి అనుట) డిగ్గుచోటన్ = దిగునప్పుడు, తద్ద్వితయ = ఆరెంటి?ిటియొక్క - వంటకముల సుగంధములయొక్కయు, దేవతావృక్షముల పూవులయొక్కయు, ఆరచిత =బాగుగాఁగూర్పఁబడిన, ఉపగూహముల్= ఆలింగనములు - మేళనములు, తగున్ = ఒప్పెను.

అమరతరువులు - చూ 1.62 వ్యాఖ్య.

శా॥ ఆలీలావతినిత్యసత్యశమదైర్యౌదార్యసంశుద్ధులన్
జాలన్ మెచ్చివటుత్వముందొరఁగిసాక్షాత్కారముఁ బొందెను
ద్వేలాలోలకృపాజపాప్రసవకాంతిభ్రాంతికృల్లోచనా
జ్ఞాళిందాశ్రితరాధికాసురతరాగాంకూరుఁడౌశౌరియన్. 186

---

185 ప :- 1 న్నములుసుపక్వగంధములనందములై ర, గౌ; న్నములు[ల?] సుపక్వగంధములనంద [త] ములై-అ. 2 దగ- గౌ; దగు-ర, అ.

వ్యా :— అలీలావతి = అవిలాసవతియొక్క - అనుశీల యొక్క, నిత్య = నిరంతరమయిన, సత్యశమధైర్యౌదార్యసంశుద్ధులన్ = ఋతముశాంతిధీరత్వమునుదారతపరిశుద్ధియనువానిని. చాలన్ = అత్యంతము, మెచ్చి=మెచ్చుకొని, (ప్రశంసించి) వటుత్వమున్=బ్రహ్మచారిత్వమును, తొరఁగి = విడిచి, ఉద్వేల = మిక్కిలియగు, అలోల = ఆసక్తితోఁగూడిన, కృపా = కరుణయనెడు, జపాప్రసవ =దాసనపుఁబువ్వుయొక్క, కాంతి = ద్యుతియనెడు. భ్రాంతికృత్ = భ్రమకలిగించుచున్న, లోచనాబ్జ = పద్మములవంటి కన్నులయొక్క, ఆళింద = వాకిటిచావడిని - పద్మములవంటి కన్నులతుదలను, ఆశ్రిత = ఆశ్రయించిన, రాధికా = రాధాదేవియొక్క, సురతరాగ = సురతానురాగముయొక్క, అంకూరుఁడు = అంకురములుగలవాఁడు, ఔ = అగు, శౌరియున్ = కృష్ణుఁడును (విఠ్ఠలుఁడును - అనుట) సాక్షాత్కారముం బొందెన్ = ప్రత్యక్షమగుటను బ్రాపించెను. (ప్రత్యక్షమయ్యెననుట)

అనురాగవర్ణమెఱుపు. దాసనపుఁబువ్వువర్ణమెఱుపు.

"దాసనపుఁబువ్వుచాయతోఁదప్రస్తరించు

చుదయమయ్యెఁడునదెచూడుమొదలినఁజ" (క్రీడా 62)

అలం :— ఉత్ప్రేక్ష.

సీ॥ 1 నీలంబుభక్తానుకూలంబుహరిదంత

చేలంబునవనీత 2 లోలమాది

మూలంబుకరుణావిశాలంబు 3 ధృతజగ

జ్జాలంబు 4 శ్రీలతావాలమమర

---

187 ప:- 1 శీలంబు – క; నీలంబు - ర, అ. 2 చోర -ముద్రి [అ] ర: లోల – ర, అ, గౌ. 3 కృత - డ, ద, బ, గౌ; ధృత - ర, అ. 4 శ్రితల – డ, ద, బ; శ్రీలతా - ర, అ, గౌ.

5 మౌలంబుభవవనోత్కీలంబు 6 తల్పిత
వ్యాళంబు శిక్యావధూళమమిత
లీలంబు 7 హృతమరుత్సాలంబు 8 శిఖిసఖి
ఫాలంబువరదానశీలమఖిల

తే॥ కాలజంఘాల 9 మసురకృత్ క్ష్వేళ 10 మరిక
రాళమాపత్పయోదవాతూలమునగు
యదుకులసరోమరాళంబునతివగాంచి
నతియునుతియునొనర్ప నన్నగధరుండు. **187**

వ్యా :— నీలంబు = నీలవర్ణవముగలదియు, భక్త = భక్తులకు, అనుకూలంబు = అనుగుణమయినదియు, హరిత్ = దిక్కులయొక్క, అంత = తుదలు, చేలంబు = వస్త్రముగాఁగలదియు, (దిగంబరమయినదియు_అనుట. విట్ఠలుఁడుదిగంబరుఁడు- చూ 1-123) నవనీత = వెన్నయందు, లోలము = మిక్కిలి యాసక్తిగలదియు, ఆదిమూలంబు = ఆదికారణమయినదియు, కరుణా = దయచేత; విశాలంబు = గొప్పదియు, (విశాలంపృథులంమహత్ - అమ) ధృత= ధరింపఁబడిన - రక్షింపఁబడిన, జగత్ = లోకములయొక్క, జాలంబు = సమూహముగలదియు, శ్రీలతా = సంపదయనెడుతీఁగకు,

---

5 మౌళంబు – గౌ; మూలంబు - ర, అ; మేలంబు డ,ధ,బ. 6 కల్పిత - త; తల్పిత – ర, అ., 7 హృతమధూత్సాలంబు-త; హృతమఘూత్సాలంబు – గౌ; హృతమరుత్సాలంబు – ర, అ. 8 శిఖిసఖి - గౌ; శశిసఖ - ర, అ. 9 మశనకృత్క్ష్వేళ ము(ద్రి) [అ] మసురకృత్వేల - క, త; మసురకృత్క్ష్వేళ – గౌ; మసు రకృ [హృ?] త్క్ష్వేళ - అ. 10 మతి - డ, ద, మలికతాళ-క; మరికరాళ - ర, అ.

అవాలము = పాదును, అమర = దేవతలకు, మౌలంబు = మూల భూతమును, (మౌలః = మూలభూతః - శబ్దర) భవ = సంసార మనెడు, వన = అరణ్యమునకు, ఉత్ = పైకెగసిన, కీలంబు = అగ్ని (దావాగ్ని) జ్వాలయు, తల్పిత = శయ్యగాఁజేయఁబడిన; వ్యాళంబు = సర్పముగలదియు, (ఆదిశేషుఁడు గలదియు - అనుట) శిక్యా = చిక్కము, అవచూళంబు = భూషణముగాఁగలదియు, (చూలా = చూడాయమ్; చూడా = భూషణమాత్రే - శబ్దస్తో) అమితలీలంబు = కొలఁదిలేనిక్రీడగలటయు, హృత = హరింపఁబడిన, మరుత్ = దేవతలయొక్క, సాలంబు = వృక్షముగలదియు (హరింపఁబడిన పారిజాతవృక్షముగలదియు - అనుట. సత్యభామకొఱకుఁబారిజాతమును దెచ్చుటసూచితము) శిఖి = అగ్నికి, (కుక్కుటేసగ్నౌమయూరేంశౌవృక్షేకేతుగ్రహేశిఖీ - వై. ని.) సఖి = మిత్రమయిన, ఫాలంబు = నుదురుగలదియు, (విట్ఠలునకు ఫాలనేత్రముండును - చూ 5-56) వరదానశీలము = వరములనిచ్చుట స్వభావముగాఁగలదియు, అఖిలకాల = సమస్తకాలములయందు. జంఘాలము = అతివేగముగలదియు (జంఘాలోఽతిజవంతుల్యౌ - అమ) అసురకృత్ = అసురవిచ్ఛేదకమగు (సంహరించునది - అనుట) క్ష్వేళము = విషమును, అరి = శత్రువులకు, కరాళము = భయంకరమును, (కరాళో- భీషణే - మే. ని) అపత్ = విపత్తులనెడు, పయోద = మేఘములకు, వాతూలమున్ = సుడిగాలియు, (వాతూలః పుంసివాత్యాయామ్ - అమ) అగు = అయిన. యదుకుల = యదువంశమనెడు, సరః = సరోవరమునకు, మరాళంబున్ = హంసను - కృష్ణుని, అతివ = (అ) కాంత - అనుశీల, కాంచి = దర్శించి, నతియున్= నమస్కారమును, నుతియున్ = స్తోత్రమును, ఒనర్పన్ = చేయఁగా అన్నగధరుండు = అగిరిధారి - అగోవర్ధన పర్వతమునెత్తినవాఁడు (మీఁదిపద్యముతో నన్వయము)

పాఠ :— శిఖిసఖి - ఇటశశిసఖఫాలంబు - అను పాఠము సరికాదు. ఫాలమును శశిఖండముతోనేగాని శశితోఁబోల్చుట సరిపడదు. విట్లులనకు ఫాలనేత్రముండునని గుర్తింపకపోవుట యీ యపపాఠమునకు మూలము.

వ్యాక :— అసురకృత్ - "కృతీఛేదనే (అష్టా. తుదాది 1435 ధాతువు) కృంతతీతికృత్. చూ 1-4. ఫాల - భాలశబ్ద ప్రాకృతరూపము. (ము. కౌ. తత్సమ)

ఛం :— సర్వతః ప్రాసము. (గీతమునరెండు పాదముల వఱకుమాత్రమే ప్రాసయతినియమము పాటింపఁబడెను. కాన గీతమునఁబ్రాసయతి, నియతముకాదననగును.)

అలం :— రూపకము.

ఉ॥ అనతిఁబల్కెనీహృదయమారయఁ 1 గోరియుయిట్లొనర్చితిన్
గాసి, కుశేశయాననలు గల్గిరయేనియుఁగల్గనిమ్ము, నీ
చేసిన భాగ్యమేసతియుఁజేయదు, నీయెదుటన్ మునీశ్వరా
ధ్యానదురానదంబగు 2 మదాకృతియీగతినుల్ల సిల్లుటన్ 188

అనతిన్ = అసాధ్వినిగూర్చి - అనుశీలనుద్దేశించి, పల్కెన్ = (ఇట్లు) పలికెను. నీహృదయము = నీయొక్కమనస్సు, అరయగోరియు= పరీక్షింపనభిలషించియే, ఇట్లు = ఈప్రకారముగా, గాసి = బాధ, ఒనర్చితిన్ = కూర్చితిని, (బాధకలిగించితినినుట) కుశేశయాననలు= పద్మముఖులు - స్త్రీలు. (కమలంశతపత్రింకుశేశయమ్ - అమ) కల్గిర యేనియుఁగల్గనిమ్ము = నిస్సందేహముగా, నున్నచోనుండనిమ్ము.

---

188 పః- 1 గోరినయ - గ్రా; గోరియుయి - ర, అ. 2 మదాకృతి - ర,గ్రా; మధాకృతి [గతి?] - అ.

(ఇమ్ము - అనాదరసూచకము; వారిలెక్కేమి - అనుట) నీయెదుటన్= నీయొక్కముందట; మునీశ్వర = మౌనినాథులయొక్క, అభ్యాస = (యోగ) సాధనములచేత, దురాసదంబు = పొందరానిది, అగు = అయిన, మత్ = నాయొక్క, ఆకృతి = ఆకారము, ఈగతిన్ = ఈవిధముగా, ఉల్లసిల్లుటన్ = ఒప్పుటచేత, నీ చేసిన = నీ యొక్క చేసిన - నీవొనర్చిన, భాగ్యము = అదృష్టము, ఏసతియున్ = ఏ సాధ్వియుచేయదు = ఒనర్పదు.

క॥ సుచరిత్ర! నేఁడునీచే
తిచలిదిభుజియింపఁజాలఁదృప్తియొదవె, 1 విన్
పచరణగాదీగతిమును
రుచియింపదుశబరివిందు, ద్రోవదివిందున్. **189**

వ్యా :— సుచరిత్ర = మంచినడవడిగలదానా! నేఁడు = ఈ దినము, నీచేతిచలిది = నీచేతియొక్క చలిది - నీచేతితోవడ్డించిన శీతాన్నమును, (చలిదినాశీతాన్న సంజ్ఞదనరు - ఆం భా) భుజియింపన్ = తినఁగా, చాలన్ = మిక్కిలి, తృప్తి = తనివి, ఒదవెడిన్ = కలిగెను. విన్ = వినుము, (ఆకర్ణింపుము) పచరణగాదు = ముఖప్రీతివచనముకాదు, ఈగతిన్ = ఈవిధముగా, మును =పూర్వము, శబరివిందు = శబరియొక్క యాతిథ్యము, (విందునాఁగ మనుష్య యజ్ఞము పొల్చు - ఆం. భా) రుచియింపదు = ఇష్టపడదు. ద్రోవది విందున్ = ద్రౌపదియొక్క యాతిథ్యమును - రుచియింపదు - (అని క్రియయధ్యాహార్యము.

---

189 ప:- 1 నీవుచర - క; విశ్వచరణగాదిగతి – గౌ; డిజ, బచరగాణది మ్ముల – ముద్రి (అ); డిజ, బచరణగాడీగతిమును - అ. విన్పుచరణ - త.

రాముునకు శబరిఫలములు విందు పెట్టుట రామాయణప్రసిద్ధము. దుర్వాసుఁడు ద్వైతవనముననున్న పాండవులయొద్దకు వచ్చినప్పుడు పాత్రకంటియున్న శాకలేశమును గృష్ణుడుభజించి తృప్తిపొందఁగా, దుర్వాసునకు శిష్యులకు క్షుత్తునశించెనని భాగవతము.

(భాగ. 1 స్కం - 364 ప,)

వ్యాక ;— వినుము+పచరణ = విను + పచరణ (బా. సంధి. 47) విన్ పచరణ (బా. ప్రకీర్ణక 16)

"రుచియింపదు శబరివిందు, ద్రోవది విందున్." ఇటు ద్రోవది విందున్ - అనుచోటు, రుచియింపదు - అను క్రియయధ్యాహార్యము. ప్రౌ. వాక్య 14.

క॥ అతిమానుషమసిధారా
వ్రతమగు 1 మనువంటు నిప్పువంటి 2 దదియనన్
బతి 3 దేవతవై మను 4 నీ
గతిభావారూఢమయ్యెఁగా 5 జగములకున్. **190**

వ్యా ;— పతిదేవతవై = భర్త, దైవముగాఁగలదానవై. (పతివ్రతవై - అనుట) మను = జీవించు, నీగతిన్ = నీవిధముచేత, అతిమానుషము = మనుష్యశక్తిని మించినది, అసిధారావ్రతము = అతిదుష్కరము, అగు = అయిన, మనువు = కాఁపురము, అంటన్= స్పృశించుటకు, నిప్పువంటిదది = అగ్నివంటిది, అనన్ = అనుట,

190 పః- 1 మనవంటి - త, ప; మనువట్టె [ట్టి] - గౌ; మనువంట - ర, అ. 2 దుది - త; దిది – ర, అ. 3 దైవమై – గౌ (గణభంగము) దేవతవై - ర, అ. 4 నివిగతి - ప; నీగతి - ర, అ. 5 జన ప; జగ - ర, అ, గౌ.

జగములకున్ = లోకములకు, భావారూఢమయ్యెఁగా = మనస్సున కెక్కినదియయినదిగదా ?

అసిధారావ్రతము --- శయనమధ్యమున ఖడ్గమునుంచుకొని దంపతులు పాటించు బ్రహ్మచర్యవ్రతము. (సూ. ని.) ఇది దుష్కర కృత్యమును దెలుపును. "జనవర! యసిధారావ్రత, మనఁదగియెడు ధారణానియతి -- శాంతి 5-593

వ్యాక :— నిప్పువంటిదది - 'అది' యర్థశూన్యము. (ప్రౌ. శబ్ద 63) ఇది వాక్యాలంకారము.

చ॥ తనుశతకోటులెత్తిబహుధర్మవినిర్మితిఁ బేర్మిగాంచినన్
నను౯గన 1 లేని 2 లేఁతలకునాఁతి! 3 యభోగ్యము భాగ్యమీవుప్రా
గ్జననమునందొనర్చితివొకానొక యర్చననన్నుఁగూర్చి; దా
ననసమకూరెఁజుమ్ము నుజనవ్రజనందితచర్యనీదెసన్, **191**

వ్యా :— నాఁతి = ఓకాంతా - ఓసుశీలా! తను = శరీరములయొక్క, శతకోటులు = నూఱుకోట్లు - అసంఖ్యాకములగు జన్మములు, ఎత్తి = ధరించి, బహుధర్మ = పెక్కుపుణ్యములయొక్క, (ధర్మఃపుణ్యయమన్యాయ స్వభావాచారసోమపాః - అమ) వినిర్మితిన్ = విశేషాచరణముచేత, పేర్మిగాంచినన్ = పెంపువహించినను, ననున్ = నన్ను, కనలేని = ఎఱుఁగఁజాలని, లేఁతలకున్ = అల్పులకు, భాగ్యమూ = అదృష్టము (నాదర్శనభాగ్యమనుట) అభోగ్యము = అనుభవింపశక్యముకానిది, ఈవు = నీవు, ప్రాక్ = ముందటిదైన,

---

191 ప ;- 1 రేని – ప; లేని – ర, అ, గౌ. 2 చేఁత – గౌ; లేఁత -ర,అ. 3 అభోగము–గౌ,అభోగ్యము - ర, అ.

జననమునందున్ = జన్మయం౧దు (పూర్వజన్మమునందు - అనుట) నన్ను౯గూర్చి = నన్నుగుఱించి, ఒకానొకయర్చన = ఒకానొకపూజనొక ఒనర్చితి = చేసితివి. దానన = దానిచేతనే - పూర్వజన్మమున నొకా పూజనన్ను౯గూర్చిచేసియుండుటచేతనే, నీదెసన్ = నీవిషయమునందు, సుజనవ్రజ = సజ్జన సమూహముచేత, నందిత = అభినందింప౯బడిన, (ప్రశంసింప౯బడిన) చర్య = నడవడి, సమకూరె౯జుమ్ము = సిద్ధించెనుజుమా!

వ్యాక :— దానన - దానన్ + అ, 'అ' అవధారణార్థకము.

తే॥ అతివ! తొల్లింటిపుట్టువునందునొక్క
మౌనివేలిమిజన్నైమన్నాఁడు
నామధురవేణునాదంబునమదిగరఁగి
తొరఁగ౯ 1 జేసితిసుస్నిగ్ధదుగ్ధరసము. 192

వ్యా :— అతివ = ఓకాంతా! - ఓసుశీలా! తొల్లింటి పుట్టువునందున్ = పూర్వజన్మమునందు, ఒక్కమౌని = ఒకముని యొక్క, వేలిమిజన్నైవై = హోమధేనువవయి, మన్నాఁడు = జీవించినప్పుడు, నా = యొక్క. మధుర = ఇంపయిన, వేణు నాదంబునన్ = పిల్లనగ్రోవిధ్వనిచేత, మది = మనస్సు, కరఁగి = ద్రవించి, సుస్నిగ్ధ = మంచిచిక్కనయిన, దుగ్ధరసమున్ = క్షీర రూపద్రవమును, తొరఁగ౯జేసితి = స్రవింప౯జేసితివి.

వ్యాక :— వేలిమిజన్నై = వేలిమియొక్కజన్నై, తాదర్థ్యమున షష్ఠీవిభక్తి. అశ్వఘాసాదులవలె షష్ఠీతత్పురుషము. చూ 4-182వ్యాఖ్య)

---

192 ప :- 1 జేసిన – గ్రా; జేసితి – ర, అ.

క॥ అపాలనురువుపవన
వ్యాపారముచేతఁదెరలివచ్చినిలిచె లీ
లాపింఛచ్ఛవిభర్త్సిత
తాపింఛమదీయమౌళితటిఁ 1 గుటికలచా! **193**

వ్యా :— కుటిలకచా = వక్రములయిన శిరోజములుగల దానా! - ఓ సుశీలా! అపాలనురువు = అక్షీరముయొక్క ఫేనము, పవన = వాయువుయొక్క, వ్యాపారముచేతన్ = ప్రయత్నముచేత, (వాయువశమున - అనుట) తెరలివచ్చి = పైకెగిరివచ్చి, లీలాపింఛ = విలాసార్థమయినసెమలిపురియొక్క, ఛవి = కాంతిచేత, భర్త్సిత = అధిక్షేపింపఁబడిన, తిరస్కరింపఁబడిన, తాపింఛ = చీకటిమ్రానుగల, (కాలస్కంధస్తమాలఃస్యాత్తాపింఛోప్యథసిందుకే - అమ) మదీయ = నాదయిన, మౌళితటిన్ = శిరఃప్రదేశమునందు, (మౌళిర్ధమ్మిల్లకమస్తకే- అభి. చిం.) నిలిచెన్ = (కొంతసేపు) ప్రతిష్ఠితమయ్యెను.

వ్యాక :— పాలనురువు = పాలయొక్క నురువు, పాలు - బహువచనరూపము. 'పాయి' అనునేక వచనరూపముగౌరవప్రయుక్తము (ద్వి. హరిశ్చ) ఈపక్షమున - పాయి+లు = పాలు. (బా-అచ్చిక21)

క॥ దానఁబయస్సంతా 1 నపుఁ
దానంబుననన్నుఁ 2 దనుపుదానవయితి, చం
ద్రాననా! తత్ఫలమునఁగా
దా! నీకును 3 దక్కితిన్ ముదముమదిఁబొదలన్. **194**

---

193 ప:- 1 గుచలికుచా - ర; గుటికలచా - అ, గౌ.

194 ప - 1 నముదా - ర [పా], నపుదా - ర, ర, ద, బ, గౌ; నపు [ఁ?] దా—అ. 2 దడపు - ర, అ; దడవు - గౌ; తనుపు - ద, ద, బ. 3 డక్కితిన్ - ర; దక్కితిన్ - అ, గౌ.

వ్యా :— దానన్ = దానిచేత - పాలసురువృతలపై నిలుచుట చేత, పయస్సంతానపుఁ దానంబునన్ = క్షీరసమూహముయొక్క స్నానముచేత - క్షీరాభిషేకముచేత, నన్నున్ = నన్ను. తనువు దానవు = సంతృప్తిపటిచినదానవు, అయితి = ఐతివి. చంద్రానన = ఓశశిముఖీ! - ఒసుశీలా! తత్ఫలమునఁగాదా = అఫలితముచేతఁగదా! నీకును = నీకు, ముదము = సంతోషము, మదిన్ = మనస్సునందు, పొదలన్ = అతిశయింపఁగా, దక్కితిన్ = చిక్కితివి, లభించితివి.

ఆ॥ ఒక్కఁడకృత సత్క్రియుఁ 1 డును విప్రుండు
గలఁడు; ఘోర 2 కలుషకఠినబుద్ధి,
వసుధయెల్లఁదిరుగు; వసుదాను 3 డనుఱేని
పట్టణముననుండుఁ; బుట్టు 4 బడుగు. **195**

వ్యా :— అకృతసత్క్రియుండు = అకృతసత్క్రియుఁడు' అను = అనెడు, (అనుపేరుగల) విప్రుండు = బ్రాహ్మణుఁడు, ఒక్కఁడు = ఒకఁడు, కలఁడు = ఉండును, ఘోర = భయంకరము లయిన, కలుష = పాపములచేత, కఠినబుద్ధి = కర్కశమయినమతి గలవాఁడు వసుధయెల్లన్ = భూమియంతయు, తిరుగున్ = సంచరించును. (తిరుగుఁబోతు - అనుట) వసుధానుఁడనుఱేసి = వసుధానుఁడను పేరుగలరాజుయొక్క, పట్టణమునన్ = నగరమునందు, ఉండున్ = నివసించును. పుట్టుబడుగు = పుట్టుకనుండియునల్పుఁడు - అజన్మక్షుద్రుఁడు.

---

195 పఃా- 1 డను - ర, గౌ: డను [గు?] - అ. 2 కఠినకలుష - డ, ద; బ; కలినబు — త; కలుషకఠిన - ర, అ, గౌ. 3 వసుపేరి - ముద్రి (అ) ర; వసుఱేని - అ; తనుఱేని - గౌ. 4 వడుగు - ర, అ; బడుగు - త, గౌ.

సీ॥ ధనవంతుఁడయ్యు నుద్వాహంబుతోఱఁగి, మూ
తులునాకుఁబెఱవితంతువులఁదగిలి
కులవంతుఁడయ్యుఁబెద్దలఁబాసివిహరించుఁ
బాషండ 1 భండానుబంధియగుచు
మతిమంతుఁడయ్యునామ్నాయముల్ చెవిఁబెట్టఁ
డశ్లీల 2 ఖేలనవ్యసన 3 మెసఁగి
స్థితిమంతుఁడయ్యులక్ష్మికిఁగాక 4 త్రిమ్మరుఁ
బలుగూడు 5 మరిగియాధ్యులభజించి

తే॥ తలఁచుబ్రహ్మన్వదేవస్వములకునెగ్గు
6 కుప్పఁజిచ్చిడి 7 పే్రలాలుకొఱుకఁదివురు
గ్రహణకాలంబు 8 లందు 9 ముస్గడుజలముల
10 సెబ్రచెంచడసూబ్రాహ్మణబ్రువుండు. **196**

వ్యా :— సెబ్రిచెంచడము = చెడ్డదయిన చెంచడపుజాతి దేగవంటివాఁడగు - ఘాతకుఁడగు, అబ్రాహ్మణబ్రువుండు = ఆజాతి మాత్రవిప్రుఁడు - ఆ యకృతసత్క్రియుఁడు.

---

196 పః- 1 పండాను - ముద్రి (అ), రః బంధాను - గౌ; భండాను - అ. 2 లేఖన - రః ఖేలన - అ, గౌ. 3 మెసఁగ - గౌ; మెసఁగి - ర, అ. 4 త్రిమ్మరుఁ - ర, గౌ: త్రిమ్మరు – అ. 5 మఱిఁగి - అ; మరిగి - ర 6 ఁగుప్ప - రః కుప్ప - అ. గౌ. 7 పేలాలు - ముద్రి [అ]. ర, గౌ: పే్రలాలు - అ; ప్రేఁబాలు – శ. ర. 8 నందు - ర. అః లందు - గౌ. 9 ముల్గఁడు - గౌ; ముస్గఁడు ర, అ. 10 శబ్రచంచడ - త; చెంజడ – గ; శబ్రచంచద–గౌ; సెబ్రచెంచెడ – ర, అ.

1) ధనవంతుఁడయ్యున్ = విత్తవంతుఁడయినప్పటికిని, ఉద్వాహంబున్ = వివాహమును, తొఱఁగి = మాని, పెఱవిత తువులన్ = అన్యవిధవలను, తగిలి = వలచి, మూతులునాకున్ = పెదవులు చప్పరించును.

పెదవులుచప్పరించుట, యభిలాషను సూచించును.

2) కులవంతుఁడయ్యున్ = కులీనుఁడయినప్పటికి, పెద్దలన్ = పెద్దవారిని, (వంశవృద్ధులననుట) పాసి = విడిచి, పాషండభండ = అశ్లీలభాషణులగు బౌద్ధక్షపణకాదులయొక్క, (భండ = అశ్లీలవాక్యభాషకే - శబ్దక) అనుబంధి = అనుబంధముగలవాఁడు, అగుచున్ = అగుచు, విహరించున్ = స్వేచ్ఛగాసంచరించును.

పాషండ - చూ 4-131 వ్యాఖ్య.

3) మతిమంతుఁడయ్యున్ = తెలివిగలవాఁడయినప్పటికిని, అశ్లీల= వ్రీడా (లజ్జా) కరములు, జుగుప్సాకరములు, నమంగళకరములునగు వచనములయొక్క, ఖేలన = క్రీడయందు, వ్యసనము = దురభ్యాసము, ఎసఁగి = అతిశయించి, అమ్నాయముల్ = వేదములను, చెవిఁబెట్టఁడు = వినఁడు.

అశ్లీలము - "అసభ్యార్థాంతరమసభ్యస్మృతిహేతుశ్చాశ్లీలమ్" (కా. సూ.)

"వ్రీళ, జుగుప్సామంగళ,
శీలములగు పదములొకటఁజేర్చినయవియ
శ్లీలములగు' (నరస 4-13)

4) స్థితిమంతుఁడయ్యున్ = అస్తిగలవాఁడయినప్పటికిని (స్థిరాస్తిగలవాఁడయినప్పటికిని - అనుట) అర్థ్యులన్ = సంపన్నులను, భజించి= సేవించి, పలుగూడు = దుష్టమయినతిండిని-అభక్ష్యభక్షణమును, మరిగి=

అంహాటుపడి, లక్ష్మికిఁగాక = సంపదకుఁగానివాఁడయి, (సఁదననుభ వింపక - అనుట) తిర్మ్మరున్ = సంచరించును.

బ్రిహ్మస్వదేవస్వములకున్ = బ్రాహ్మణ ధనమునకు, దేవధన మునకు, (స్వోస్త్రియాంధనే - అమ) ఎగ్గున్ = హాని, తలఁచున్ = తలపెట్టును.

కుప్పన్ = వడ్లకంకులరాశియందు, చిచ్చిడి = అగ్నిపెట్టి, ప్రేలాలు = లాజలు, (పేలగింజలు) కొఱుకన్ = నమలుటకు. తవురున్ = యత్నించును - వివేకశూన్యములగు పనులుచేయును.

గ్రిహణకాలంబులందున్ = (సూర్యచంద్రి) గ్రిహణములు పట్టుసమయములందు, జలములన్ = నీళ్లయందు, మునుఁగఁడు = స్నానముచేయఁడు.

చెంచడము — శ్యేనభేదము. (ఆం భా.) డేగహింసించు లక్షణముగలపక్షి కావుననే, క్రూరము, ఘాతిపక్షి భయంకరమునను పేళ్లుడేగకుఁగలవు. చెంచడమనుచోఘాతకుఁడనునది లక్షణార్థము.

బ్రహ్మస్వదేవస్వములకెగ్గుచేయుట పాపహేతువు.

"దేవస్వంబ్రాహ్మణస్వంవా, లోభేనోపహినస్తియః

సపాపాత్మాపరేలోకే, గృధ్రోచ్ఛిష్టేన జీవతి" (మ. స్మృ.)

గ్రిహణకాలమున స్నానమువిహితము—

"సర్వేషామేవవర్ణానాం, సూతకంరాహుదర్శనే

స్నాత్వాకర్మాణికుర్వీత, శృతమన్నం విసర్జయేత్"

ఇత్యాది. (శబ్ద)

రాహువు, భూచంద్రిచ్ఛాయలకుఁబ్రతీక. కావుననే రాహువు

ఛాయాగ్రహమనఁబడును. "రాహు, సర్వంబుగాకయుః భానుఁగప్పె" సభా 2-29. కప్పుటయేకబళనక్రియగాఁజెప్పఁబడును.

బ్రాహ్మణబ్రువుఁడు = 'బ్రాహ్మణంజాతిమాత్రేణాత్మానంబ్రూతే'

"విప్రసంస్కారయుక్తోఽపి, నిత్యంసంధ్యాదికంచయః

నైమిత్తికంచనోకుర్యాత్, బ్రాహ్మణబ్రువఉచ్యతే"

"ఇత్యుక్తేకదాచారవతివిప్రే" (శబ్దస్తో)

వ్యాక :— పలుగూడు - పలుగు+కూడు = పలుగూడు ప్రా సమాస 36. "తెఁచుబ్రహ్మస్వదేవస్వములకు నెగ్గు" అనుచోవాక్యావసానమున ద్రుతలోపము. కాన సరళాదేశము ప్రసక్తముకాలేదు. సెబ్బర = సెబ్రి (ము. కౌ)

వ॥ వాఁడొక్కకందువనొక్కవెలయాలికింజిక్కి మహీమండలకుండలంబగు పౌండరీకంబునఁగొండొకకాలంబుండి, యొక్కపెనుఁబండువునఁగన్నులపండువగు మదీయనైవేద్య ప్రకల్పనంబుధూపోత్సవానంతరంబుననెడము 1 గాచిచూచి తనవలయు తెఱఁగు సంజని, 2 బహుతిథంబగు కాలంబుమని, ముదిసి. తన వువిడిచి యత్యుత్తమంబగు ధరామరవంశంబునంబుట్టి, 3 పుట్టిన నాఁటు నుండియుం 4 జదువు చదువులంజదుకుండై, నిండుప్రాయంబున 5 నిన్నుం 6 జెట్టవట్టియున్న 7 వాఁడు,8 వినుము. **197**

---

197 ప:- 1 గాచికొని - ప: గాచిచూచి - ర, అ, గౌ. 2 బహువిధంబగు -ర, గౌ; బహుతీర్థంబగు - గ: బహువిధం [తిథం?] — అ. 3 పుట్టిన — 'గౌ'లోలేదు 4 జదువుననచదురుండై - ర: జదువులన - క; చదువులంజదురుం - త: జదువుచెదువునన[నః?] చ[జ] - అ; జదువుచదువులంజతురుండై — గౌ. 5 నినుం-గౌ; నిన్నుం - ర, అ. 6 జెట్టవట్టించి-ర, గౌ: జెట్టవట్టించి [వట్టి?]-అ. 7 నాఁడు - గౌ; వాఁడు - ర, అ. 8 వినుము - 'త' లోలేదు.

వ్యా :— వాఁడు = అతఁడు - ఆయుక్తకృత్తి (?) యుఁడు, ఒక్కకందువన్ = ఒకానొకచోట, ఒక్క వెలయాలికిన్ = ఒకానొక వేశ్యకు, చిక్కి = వశుఁడయి, మహీమండల = భూమండలమునకు, కుండలంబు = కుండలమనుపేరుగల కర్ణాభరణవిశేషము, అగు = అయిన (భూమికలంకారమయిన - అనుట) పౌండరీకంబునన్ = పౌండరీక క్షేత్రమునందు, కొండొకకాలంబు = కొంచెము కాలము, ఉండి = నివసించి, ఒక్క = ఒకానొక, పెనుఁబండువునన్ = పెద్ద పండుగున - సంక్రాంతిపర్వదినమున, కన్నులపండువగు = నేత్రో త్సవమగు. మదీయ = నాదయిన, నైవేద్య = నివేదనీయద్రవ్యము యొక్క, పరికల్పనంబున్ = అతిశయమయినకూర్పును, ధూపోత్స = ధూపోత్సవము యొక్క, అనంతరంబునన్ = అనంతర కాలమున, ఎడము గాచి = అవకాశము కల్పించుకొని, చూచి = దర్శించి, తన = తనయొక్క, వలయు తెఱంగునన్ = ఇష్టమయిన విధమున, (తనకిష్ట మయినట్లు - అనుట) చని = అరిగి, బహుతిథంబు = బహుసంఖ్యా తము (గణపూరణంగణఃథం పూగతిథం చైవమేవసంఘతిథమ్, బహు తిథసంవత్సరతమ మాసతమాన్యర్ధమాసతమమ్ - వై. ని.) అగు = అయిన, కాలంబు = సమయము, (బహువత్సరములకాలము - అనుట) మని = జీవించి, ముదిసి = ముదిమినొంది, తనువువిడివి = దేహమును త్యజించి - మరణించి, అత్యుత్తమంబగు = మిక్కిలి శ్రేష్ఠ మగు, ధరామరవంశంబునన్ = బ్రాహ్మణకులమునందు, పుట్టి = జన్మించి. పుట్టిననాఁటనుండియున్ = జన్మించినప్పటినుండియు, చదువు చదువులన్ = వేదవిద్యలయందు, (చదువు నా బ్రహ్మయజ్ఞము, చదువు నా విద్యాభిధానంబు - ఆం, భా.) చదురుఁడై = నేర్పరియయి నిండుప్రాయంబునన్ = నిండుజవ్వనమునందు, (ప్రాయావయాం స్యస్య) దశాస్తారుణ్యంయౌవనంవయః - వై. ని.) నిన్నున్ = నిన్ను, చెట్టపట్టి = పాణిగ్రహణముచేసికొని, (వివాహమాడి) ఇట్లు = ఈ ప్రకారముగా, ఉన్నవాఁడు = ఉన్నాఁడు. వినుము = ఆలకింపుము.

పెనుఁబండువు - సంక్రాంతిఁబెద్దపండుగని వ్యవహారము.
ప్రయోగాంతరములు —

(i) "ఏడఁబోయెనోకదా ! మేడలోమాంజిష్ఠ
పెనుఁబండువునబైటఁబెట్టఁజాల" (కాశీ 4.108)

(ii) "పెనుఁబండువునసైనఁబెట్టు నూల్కొనవుత
ట్టాణిముత్యంబులోయలరుఁబోఁడి (వరాహ 2-56)

పాఠ :— బహుతీర్థ, బహువిధ - అను పాఠములను బట్టి 'అ' ప్రతిలోనూహించిన, 'బహుతిథ' కవిప్రయుక్తపాఠమని విశ్వసింపఁదగును.

"బహుతిథః (బహు+బహుపూగగణసంఘస్య తిథుక్ - ఇతి తిథుక్. ముగ్ధబోధమతే - బహుగణపూగసంఘాత్తాస్తిథళ్ తలోపశ్చ - ఇతి తిథట్ బహునాంపూరణః ఇతివ్యాకరణమ్. యథామార్కండేయపురాణే - "తతఃకాలే బహుతిథేగతేరాజాపునః సుతమ్ - " [శబ్దక]

తే॥ తరుణి! 1 మద్భక్తదర్శనోత్సవసుకృతము
పాపవహ్నికి సలిలమై భద్రమొనఁగెఁ
గాక! లేకున్న నితఁడు ప్రాగ్జనినొనర్చు
కల్మషములకు నిష్కృతిగలదె? యెందు. 198

వ్యా :— తరుణి = ఓయువతీ - ఒనుశీలా! మత్ = నాయొక్క, భక్త = అన్నముయొక్క - నైవేద్యముయొక్క, (భిస్సా స్త్రీ భక్తమంధోన్నమ్ - అమ) దర్శన = చూచుటయనెడు, ఉత్సవ = వేడుకవలనఁగలిగిన, సుకృతము = పుణ్యము, పాపవహ్నికన్ = అఘమనెడునగ్నికి, సలిలమై = జలమయి, భద్రమొనఁగెఁగాక =

---

198 ప ౼ 1 మద్భుక్త - ర; మద్భక్త - అ.

శుభమునిచ్చెనుదప్ప, లేకున్నన్ = లేనియెడల, ఇతఁడు = ఈతఁడు, ప్రాక్ = ముందటిదయిన, జనిన్ = జన్మమునందు - పూర్వజన్మమునందు, (జనుర్జననజన్మాని, జనిరుత్పత్తిరుద్భవః - అమ) ఒనర్చు = చేసిన, కల్మషములకున్ = పాపములకు, ఎందున్ = ఎక్కడనయినను నిష్కృతి = విముక్తి, కలదె = ఉన్నదా? (లేదనుట)

వ్యాక :— ఎందున్ = ఎందయినను -- 'అయినను' అధ్యాహార్యము. (ప్రౌ. వాక్య 13)

అలం ;— రూపకము.

వ॥ 1 అవ్విధంబుగ సోపహారంబగు మదీయరూపంబు నాకస్మి 2 కంబకనుంగొని భస్మసాత్కృత దుష్కృత 3 నీరసయవసరాశియై భూసుర కేసరికిశోరంబై వాసి 4 వడసియు 5 నతండు కట్టెఁడియగుటకుఁగారణము, వినుము. **199**

వ్యా :— అవ్విధంబుగన్ = అరీతిగా, సోపహారంబగు = నైవేద్యముతోఁగూడినదగు, మదీయ=నాదయిన, రూపంబున్=ఆకృతిని అకస్మికంబ = హఠాత్సంభవముగా, కనుంగొని = దర్శించి, భస్మసాత్కృత = భస్మీభూతములయిన, దుష్కృత = పాపములనెడు, యవసరాశియై = ఎండుగడ్డి కుప్పలుగలవాఁడయి, భూసుర కేసరి కిశోరంబై = శ్రేష్ఠుఁడయిన బ్రాహ్మణసంతానమై, వాసివడసియున్ = ప్రసిద్ధిపొందియు, అతఁడు = అతఁడు, కట్టెఁడియగుటకున్ = నిర్దయుఁడగుటకు, కారణంబు = హేతువు, వినుము = ఆలకింపుము.

---

199 పః- 1 ఇవిధ్వంబున - గౌ; అవ్విధంబుగ - అ. 2 కంబుగఁగనుం - డ, ద, బ; కంబకనుం - ర, అ, గౌ. 3 నిరయవన - గౌ; నీరసయవస - ర, అ. 4 వడయునతరి - త; వడసియు - ర, అ. 5 నతఁడు - ర; నతండు - అ, గౌ.

వ్యాక :— భస్మసాత్కృత - "విభాషాసాతికార్త్స్న్యే-(5-4-52) చ్విషయేసాతిర్వాస్యాత్సాకల్యే" (సి. కౌ. 2112)

అలం :— రూపకము.

క॥ నీ భావశుద్ధియారయ
శోభనచారిత్ర! 1 యేనునువ్వో 2 యతనికిన్
లోభక్రోధములమనః
క్షోభము గావించిబాలిశుండనిపింతున్. **200**

వ్యా :— శోభనచారిత్ర = ఒశుభప్రదమైన నడవడి గలదానా! - ఓసుశీలా! నీభావశుద్ధి = నీయొక్క మనఃపరిశుద్ధిని, అరయన్ = పరీక్షించుటకు, అతనికిన్ = అతనికి, లోభక్రోధములన్= పరద్రవ్యములందత్యాశయుఁ గోపమునను వానిచేత, మనఃక్షోభము = హృదయవ్యాకులత్వము, కావించి = అగునట్లుచేసి, (మనస్సునకుఁ గలఁతకలిగించి) బాలిశుండనిపింతున్ = మూర్ఖుఁడనిలోకులు పలుకునట్లు చేయుదును.

వ్యాక :— ఏనునువ్వో - ఏను+చువ్వో. ఏను - కళ. (ము. కౌ. సంజ్ఞా)

క॥ పతికొట్టినఁబతితిట్టినఁ
బతినిర్దయుఁడగుచు నెట్టిపాటు 1 పఱిచినన్
మతినన్యథాత్వమొందరు
పతిదేవతలతివ! నీకుఁబ్రతియగువారల్. **201**

200 పః- 1 యేనుజువ్వో - అః యేనసువ్వో - ర, ప, గౌ. 2 యతనికిన్- ర, అః యితనికిఁ - గౌ.

201 పః- 1 పఱిచినన్ - గౌ; పఱిఛినఁ - ర, అ.

వ్యా :— అతివ = ఓకాంతా - ఓనుశీలా! పతి = భర్త, కొట్టినన్ = తాడనముచేసినను, పతి = భర్త, తిట్టినన్ = దూషించినను, పతి = భర్త, నిర్దయుఁడగుచున్ = కరుణలేనివాఁడై, ఎట్టి = ఏవిధమయిన, పాటుపఱిచినన్ = బాధపడునట్లుచేసినను, నీకున్ = నీకు, ప్రతియగువారల్ = ముఖ్యముగా సాటియైనవారగు, (ప్రతి = ముఖ్యసదృశః - శబ్దస్తో) పతిదేవతలు = భర్త, దేవతగాఁగలవారు-పతివ్రతలు, మతిన్ = బుద్ధియందు, అన్యథాత్వము = వేఱొకరీతిని, ఒందరు = పొందరు.

పాతివ్రత్యాతిశయనిరూపణకై పతివ్రతలకథలలో వారి భర్తలను క్రూరులుగాఁజిత్రించుట, యర్థవాదము.

వ్యాక :— ప్రతి - అవ్యయమునకు వ్యస్తప్రయోగము. (ము. కౌ. సంధి)

తే॥ నిష్ఠురత్వంబుతొలఁగించి 1 నేఁటినుండి
నీకుననుకూలుఁడయ్యెడు నీవిభుండు
మత్పదద్వయభక్తిసమగ్రులైన
సుతుల 2 నేవురఁగాంచెదూర్జితవిభూతి. 202

వ్యా: — నీ విభుండు = నీయొక్క భర్త, నేఁటినుండి = ఈ దినమునుండి - ఇప్పటినుండి, (ఇటుపైననుట) నిష్ఠురత్వంబు = పారుష్యము, తొలఁగించి = విసర్జించి, నీకున్ = నీకు - నీవిషయమున, అనుకూలుఁడయ్యెడున్ = అనుగుణుఁడగును మత్ = నాయొక్క, పదద్వయ = అడుగుదోయియందు, భక్తిసమగ్రులు =

---

202 పః- 1 నేఁట - ర; నేఁటి - అ. 2 నేగుర - గొ; నేవుర - ర, అ.

భక్తి పరిపూర్ణులు, ఐన = అయినట్టి, సుతులన్ = కుమారులను; ఏవురన్ = ఐదుగురను, ఊర్జిత విభూతిన్ = గొప్పవైభవముతో, కాంచెదు = కనియెదవు.

ఆ॥ వెండిఁబైఁడిఁ 1 ద్రవ్వితండంబుగామేలి
కూడుఁ 2 బాఁడినింటఁగొలఁది 3 మీఱ
నోములెల్లనోఁచి నూఱేండ్లు 4 బ్రదికి నీ
భర్తతోడఁబరమపదముగనుము. 203

వ్యా :— వెండిన్ = రజతమును, పైఁడిన్ = బంగారమును; త్రవ్వితండంబుగాన్ = అపరిమితముకాఁగా, మేలికూడున్ = ఉత్తమ మయిన భోజనమును, పాఁడిన్ = క్షీరసంపదయును, ఇంటన్ = గృహమునందు, కొలఁదిమీఱన్ = పరిమితినతిక్రమింపఁగా (అగణ్యముకాఁగా) నోములెల్లన్ = వ్రతములన్నియును, నోఁచి = నోమి (ఆచరించి - అనుట) నూఱేండ్లు = శతవర్షములు, బ్రదికి = జీవించి, నీభర్తతోడన్ = నీపతితోఁగూడ, పరమపదమున్ = వైకుంఠమును, కనుము = పొందుము.

వెండి = వెన్ = వెల్. వెల్లని (తెల్లని) లోహమని వ్యుత్పత్తి. పైఁడి :- పసిఁడి - పయిఁడి - పైఁడి. పస్ = పచ్. పచ్చని లోహమని వ్యుత్పత్తి.

వ్యాక :— వెండియున్ = వెండిన్; పైఁడియున్ = పైఁడిన్; పాఁడియున్ = పాఁడిన్ - ప్రౌ. శబ్ద 116.

---

203 ప:- 1 త్రవ్వి-ర; ద్రెవ్వి-క; ద్రవ్వి-అ. 2 బాడియిం-డ,ద,బ; బాడినిం - ర, అ, గౌ. 3 మీరి - త; మీర - ర, అ. 4 బ్రతికి-గౌ; బ్రదికి - ర, అ.

ఉ॥ మన్ననచేసినాఁడు 1 మురమర్దనుఁడంచునహంకరిం 2 పకో
కిన్నరకంఠి! యట్లయినఁగీడొదవున్; విను; తొంటికన్నన
స్మన్నిహితాంత 3 రంగవయిసత్య 4 శమార్జవశుద్ధిలక్ష్మికిన్
వన్నియపెట్టుమీ! 5 మహితవర్తనకీర్తులు నిర్వహిం 6 పుచున్.

**204**

వ్యా :— ఓకిన్నరకంఠి = ఓకిన్నరకంఠస్వరము వంటికంఠ స్వరముగలదానా! - ఓసుశీలా! మురమర్దనుఁడు = మురాసురసంహారి-కృష్ణుఁడు, (విఠ్ఠలుఁడనుట) మన్ననచేసినాఁడు = మన్నించినాఁడు, అంచున్ = అని, అహంకరింపకు = గర్వింపకుము. అట్లయినన్ = అవిధముగానయినచో - అవిధముగా గర్వించినచో, కీడు = హాని, ఒదవున్ = కలుగును. విను = ఆకర్ణింపుము. మహిత = గౌర వింపఁబడిన, వర్తనకీర్తులు = నడవడియు, ఖ్యాతియు, నిర్వహింపు చున్ = నెఱవేర్చుచు, తొంటికన్నన్ = మునుపటికంటె, అస్మత్ = నాయందు, నిహిత = ఉంచఁబడిన - అర్పింపఁబడిన, అంతరంగవయి= మనస్సుగలదానవై, సత్య = ఋతముయొక్కయు, శమ = శాంతి యొక్కయు, ఆర్జవ = ఋజుత్వముయొక్కయు. శుద్ధి = పరిశుద్ధి యొక్కయు, లక్ష్మికిన్ = సంపత్తికి, వన్నియపెట్టుమీ = ఉత్కర్ష కలిగింపుమా !

కిన్నరకంఠి — కిన్నరశబ్దమునకు వీణయనియర్థమనియు, వీణవంటి కంఠస్వరముగలదియనికిన్నరకంఠీ శబ్దమునకర్థముగాఁ వ్యా మనియుఁగొందఱందురు. (దీ. పి.) ఇందుకు బాధకములు --

---

204 ప:- 1 మధు - గౌ; ముర - ర, అ. 2 చకో - గౌ; పకో - ర, అ.
3 రంగి - త; రంగ - ర, అ. 4 సమార్జ - ముద్రి [అ]. ర;
శమార్జవ - అ, గౌ. 5 విహిత - త; మహిత - ర, అ.
6 చుచుణ - ర; పుచున్ - అ, గౌ.

(i) కిన్నర - అను అదంతశబ్దము వీణావాచకముగఁగన్పట్టదు. "కిన్నర. నం. వి. అ. స్త్రీ = ఒకజాతివీణె - విల్యమ్సు"-సూ.ని. "చాండాలికౌతుకండోలవీణాచండాలవల్లకీ, కాండవీణాకువీణాచధక్కారీ కిన్నరీతిచ" (వై. ని.) "తతవాదకసమీరహత కిన్నరీరుతుల్, కిన్నరీ రుతులునేకీభవించె - వసు .... ఇట్లు కిన్నరాకిన్నరీశబ్దములేగాని కిన్నరశబ్దము వీణావాచకముకానరాదు.

(ii) కిన్నరాకంఠి, కిన్నరీకంఠి, వీణాకంఠి, వల్లకీకంఠివంటిరూపములులేవు

(iii) కిన్నరకంఠిలోని కిన్నరశబ్దము వీణావాచకమన్న పక్షమున, కిన్నరకంఠమువంటి కంఠముదేనికిఁగలదోయట - అని విగ్రహము చెప్పవలెను. కిన్నరకంఠమనఁగాఁగిన్నర (వీణా) ధ్వనియనియుఁ, గంఠమనఁగాఁగంఠస్వరమనియు నర్థములుచెప్పవలెను. ఒకచోఁగంఠ మనఁగాధ్వనియనియు, వేఱొకచోటఁగంఠస్వరమనియునర్థముచెప్పుట యుక్తముకాదు.

(iv) కంఠశబ్దమునకుఁగంఠస్వరమనునర్థముగలదు. గాని వీణా ధ్వని, ధ్వనియనునర్థములులేవు. వీణాధ్వనియనుటకు వీణాకంఠమనుట వ్యవహారప్రసిద్ధమునుగాదు.

కాఁగాఁగిన్నరకంఠిలోని కిన్నరశబ్దమువీణావాచకముకాదు.

(i) "కిన్నరకంఠి = కిన్నరులకంఠస్వరము వంటి కంఠస్వరము గలది." అని శ్రీవేదము వారి వ్యాఖ్య. (శృ. నై. 6-30 వ్యాఖ్య) ఇదే సూ. ని. లోనికెక్కినది దీనిపై రెండాక్షేపణలుగలవు.

(i) బహుకంఠస్వరములతో నొకకంఠస్వరమును బోల్చుట యుక్తము కాదన్నది మొదటియాక్షేపణ.

సమా :— నిజమే, యిటుఁజెప్పవలసిన విగ్రహమిదికాదు. "కిన్నరస్యేవకంఠోయస్యాస్సాకిన్నరకంఠీ - అనియే, మల్లినాథవ్యాఖ్య (రఘు 8-64)" "సప్తమ్యుపమానాన పూర్వపదస్యోత్తర పదలోపశ్చ" (వార్తి) అను వార్తికముచే నుత్తరపదలోపము. ఈపక్షమున - కిన్నరుని యొక్క కంఠమువంటికంఠముదేనికిఁగలదోయది యనివిగ్రహము. ఈ వార్తికము మహాభాష్యమునఁ బ్రత్యాఖ్యానముచేయఁబడెను. కిన్నర ఇవకంఠోయస్యాస్సాకిన్నరకంఠీ - అని భాష్యమతమున, విగ్రహము. కిన్నరునివంటి కంఠముదేనికిఁగలదోయది కిన్నర శబ్దము కిన్నరకంఠమునకుపలక్షణము.

"ఉష్ట్రావయవతుల్యేషు, ముఖేషూష్ట్రశ్రుతిర్యథా" (వాక్యప)

(ii) పురుషకంఠస్వరముతో స్త్రీ కంఠస్వరమును బోల్పరాదన్నది రెండవయాక్షేపణ.

సమా :— ఇటుస్త్రీకంఠమా? పురుషకంఠమా? యన్నది వివక్షితముకాదు. కిన్నరజాతికంఠస్వరమేయిటు వివక్షితము. మృగదుగ్ధమ్, మృగచపలా, కుక్కుటాండమ్ - వంటి సమాసములలో స్త్రీత్వవివక్షయక్కఱలేదని మహాభాష్యమున, "కుక్కుట్యాదీనామండాదిషు" అను వార్తికముఖండింపఁబడినది "నవా అస్త్రీ పూర్వపదవివక్షితత్వాత్" (మ. భా.) మృగచపలా - అనుచోట, మృగజాతిచాపల్యమే వివక్షితము. కాన, మృగఇవచపలా - అనియే విగ్రహము. అట్లే కిన్నరకంఠియనుచో స్త్రీకంఠస్వరమవివక్షితము.

క॥ తృష్ణారహితులుమత్పద
నిష్ణాతులు నిత్యసత్య। నియతులునగు శ్రీ
వైష్ణవులఁగాంచినమఁగా
విష్ణుపదవలగ్న! గారవించికొలువుమీ. **205**

---

205 ప:- 1 నిరతు - ముద్రి [అ], ర. నియతు - అ.

వ్యా :— విష్ణుపదవలగ్న = ఆకాశమువంటి నడుముగల దానా! (ఓశూన్యమధ్యా = ఓసన్నని నడుముగలదానా! - అనుట) - ఓసుశీలా! (వియద్విష్ణుపదంవాతు పుంస్యాకాశవిహాయసీ - అమ) తృష్ణారహితులున్ = పేరాసలేనివారును, మత్పద = నాయొక్క పాదములయందు - నా పాదార్చనమునందు, నిష్ణాతులున్ = నిపుణులును, సత్యసత్యనియతులున్ = ఎల్లప్పుడు సత్యనియతిగల వారను, అగు = అయిన, శ్రీవైష్ణవులన్ = విష్ణుభక్తులను, కాంచి= కని, ననుఁగాన్ = నన్నుఁగా, గారవించి = మన్నించి, కొలువుమీ = సేవింపుమా!

శ్రీవైష్ణవులు -- విశిష్టాద్వైతమతానుయాయులగు విప్రులన్న యర్థవిశేషము స్ఫురించును. (చూ 1-1)

విష్ణుపదము - "ఆకాశః = పంచభూతాంతర్గత భూతవిశేషః, సతుఃశూన్యః" (శబ్దక)

వ్యాక :— అవలగ్న = వలగ్న. "వష్టివాగురిరల్లోపమ వాప్యోరుపసర్గయోః" (సి. కౌ.)

క॥ అనివరమిచ్చిమహీసుర
వనితన్ మన్నించిభక్తవత్సలుఁడరిగెం
దననెలవునకు, సుధారస
మునఁగుముదినిఁ 1 దేర్చియరుగుపూర్ణేందుఁడనన్. 206

వ్యా :— అని = ఈప్రకారముగా, వరమిచ్చి = వరము నొసఁగి, మహీసురవనితన్ = బ్రాహ్మణకాంతను-సుశీలను, మన్నించి=

---

206 ప:- 1 జేర్చి - అ; దేర్చి – ర.

అనుగ్రహించి, సుధారసమునన్ = అమృతద్రవముచేత, కుముదినిన్ = కలువను, తేర్చి = సంతోషపెట్టి, అరుగు = ఏగిన, పూర్ణేందుఁడనన్ = నిండుచందురుఁడనునట్లు, భక్తవత్సలుఁడు = భక్తులయందు వాత్స ల్యముగలవాఁడు - విఠ్ఠలుఁడు, తన = తనయొక్క, నెలవునకున్ = నివాసస్థానమునకు - పాండురంగక్షేత్రమునకు, అరిగెన్ = ఏగెను.

అలం ;— ఉపమ. (అనన్ - ఉపమావాచకము.)

ఆ॥ అటుసుశీలమగఁడు 1 నరుదెంచెనొకకొన్ని
దివసములకు దొరలఁదిరియునాస
2 రోసి, తనకులంబువాసియువన్నెయుఁ
దలఁచుకొనుచుఁ 3 దెలివిమొలకలెత్త. **207**

వ్యా :— సుశీలమగఁడున్ = సుశీలయొక్క భర్తయు; దొరలన్ = సంపన్నులను, తిరియు = యాచించు, ఆసన్ = ఆశను రోసి = ఏవగించి, తన = తనయొక్క, కులంబు = వంశము యొక్క, వాసియున్ = అధిక్యమును, వన్నెయున్ = ప్రసిద్ధియు, తలఁచుకొనుచున్ = స్మరించుకొనుచు, తెలివి = జ్ఞానము, మొలక లెత్తన్=అంకురింపఁగా, ఒకకొన్నిదివసములకుఁ=కతిపయదినములకు, అటఁ = అస్థలమునుగూర్చి - స్వగ్రామమునుగూర్చి, (స్వగ్రామము నకు - అనుట) అరుదెంచెన్ = వచ్చెను.

వ్యాక :— ఆసరోసి - ఆసవలనరోసి (బా. కారక 9) = ఆసనురోసి (బా. కారక, 21)

---

207 పః- 1 నరుదెంచియొ - ర; నరుదెంచెనొ - అ; గౌ. 2 గోసి - ముద్రి [అ], ర; రోసి - అ, గౌ. 3 దెల్వి - గౌ; దెలివి - ర, అ.

తే॥ అతనిఁదమసొమ్ముచేసిమున్నాఁగియున్న
మోహముఖులైన జ్ఞాతులమూలఁ 1 ద్రోచి
సంహృతాసురులైన నిర్జరులకరణి
మదివివేకాదివర్గమభ్యుదయ 2 మొందె. 208

వ్యా :— అతనిన్ = ఆతనిని - అనుశీలభర్తను, తమ = తమయొక్క, సొమ్ముచేసి = సొత్తుగాఁజేసికొని, మున్ను = పూర్వము ఆఁగియున్న = లోఁబఱిచికొనియున్న, మోహముఖులైన = మోహము మొదలయిన, జ్ఞాతులన్ = సగోత్రులను, (సగోత్రబాంధవజ్ఞాతిబంధు స్వజనాః సమాః - అమ) మూలఁద్రోచి = విసర్జించి, సంహృత = బాగుగానశింపఁజేయఁబడిన, అసురులగు = అసురులుగలవారగు, నిర్జరులకరణిన్ = దేవతలవలె, మదిన్ = మనస్సునందు, వివేకాది వర్గము = వివేకముమొదలుగాఁగల సజాతీయసమూహము, అభ్యుదయ మొందెన్ = వృద్ధిపొందెను.

మోహము - "మోహోధర్మవిమూఢత్వమ్" - "సచాధర్మ బుద్ధౌసత్యామప్యకర్తవ్యేరాగాత్ కర్తవ్యతాభ్రమః" (శబ్దక)

మోహముఖులైన జ్ఞాతులు - కామక్రోధలోభమోహమదమాత్సర్యములనెడునరిషడ్వర్గము.

అలం :— ఉపమ.

క॥ కోపంబునాఁగి, మిక్కిలి
పాపమునకులోఁగి, బుద్ధిపశ్చాత్తాపా

208 ప.- 1 వైచి - క; ప, గౌ; ద్రోచి - ర, అ; మయ్యె - ర [పా], మొందె - ర; అ, గౌ.

టోపశిఖిఁ 1 గ్రాఁగి, కరుణా
ద్వీపవతీలహరిఁదోఁగి, విప్రుఁడుమఱియున్. **209**

వ్యా :— కోపంబున్ = క్రోధమును, అఁగి = నిగ్రహించి. మిక్కిలి పాపమునకున్ = అధికమయిన యఘమునకు, లోఁగి = పరితపించి, బుద్ధి = మతి, పశ్చాత్తాప = అనుతాపము యొక్క, అటోప = సంరంభ మనెడు - అతిశయమనెడు, శిఖిన్ = అగ్నియందు, గ్రాఁగి = తపించి, కరుణా = దయయనెడు, ద్వీపవతీ = నదియొక్క, (స్రోతస్వతీద్వీపవతీ స్రవంతీనిమ్నగాపగా - అమ) లహరిన్ = పెద్దకెరటమునందు, తోఁగి = మునిఁగి, విప్రుఁడు = (అ) బ్రాహ్మణుఁడు, మఱియున్ = వెండియు. (మీఁదిపద్యముతో నన్వయము.)

అలం :— రూపకము; అంత్యానుప్రాసము.

సీ॥ కాలిచవడనిండ్ల కడకేగివనరుచుం
డెడువాఁడువైరాగ్యనిష్ఠుఁడయ్యెఁ
గయ్యాల 1 కచ్చయై కాల్ద్రవ్వుచు సదా
మండువాఁడతి 2 శాంతమహితుఁడయ్యెఁ
గనరయెంగిలిచేతఁగాకి 3 వ్రేయనివాఁడు
సతతాన్నదాన ప్రశస్తుఁడయ్యెఁ
బ్రహ్మకల్పముదాఁక బ్రదుకానఁ 4 గడకట్టు
వాఁడస్థిరముగ విశ్వముఁదలంచెఁ

---

209 ప:- 1 గాంచి - గౌ; గ్రాఁగి - ర, అ.
210 ప:- 1 క్రచ్చ - ముద్రి [అ], ర, గౌ. కచ్చ - అ 2 శాంతి – గౌ; శాంత – ర, అ. 3 వేయని – ముద్రి [అ], ర; వ్రేయని – ర, అ, గౌ. 4 పడగట్టు - ప; గడగట్టు – ర, అ.

తే॥ బాటిగాఁగొనకలపద్మభవునినైన
నీరసము సేయువాఁడు వినీతుఁడయ్యె
నొరులలచ్చికి 5 ముచ్చిరియుడుకువాఁడు
నర్వసముఁడయ్యె విష్ణుప్రసాదమహిమ. 210

వ్యా :— విష్ణుప్రసాదమహిమన్ = కృష్ణునియొక్క (విట్ఠలునియొక్క) యనుగ్రహమహత్త్వముచేత, కాలీచవడన్ = కాళ్లు తుప్పింకించిపోవునట్లు, ఇండ్లకడకున్ = (పరుల) గృహములకుదగ్గఱకు, ఏగి = అరిగి, వనరుచుండెడువాఁడు = దీనాలాపములు పలుకుచుండువాఁడు, వైరాగ్య = విషయవాంఛలు తుచ్ఛములనెడు బుద్ధియందు, (వైరాగ్యమ్ = విషయతుచ్ఛధీః - శబ్దక) విష్ఠుఁడయ్యెన్= నిలుకడగానున్నవాఁడయెను.

కాలీచవడు - జాతీయము. "కాలీచవడనెల్లకడభూమి భూమిఁ గ్రుమ్మటి, యాడు - నృసింహ 5-51.

2) కయ్యాలకచ్చయై = కలహములకుఁగచ్చబిగించినవాఁడయి-కలహశీలుఁడయి కాలుద్రువ్వుచున్ = నిష్కారణముగాఁగయ్యములకు సిద్ధపడుచు, సదా = ఎల్లప్పుడు, మండువాఁడు = మిక్కిలి కోపించువాఁడు, అతిశాంత = మిక్కిలి శమముచేత, మహితుఁడయ్యెన్ = గొప్పవాఁడయ్యెను.

కయ్యాలకచ్చ - కయ్యములకు ముందుఁగచ్చ బిగించికట్టుకొనుటయాచారము. కాన నీపదబంధమేర్పడినది. కచ్చ = కాసె, దట్టీ. కయ్యంపుఁగచ్చలు (పండితా.)

---

5 బచ్చిర్లి - త; జచ్చిల్లి - క; బచ్చెర్లి - ప; బచ్చిర్లి - గొ; ముచ్చిరి - ర, ఆ.

కాలుద్రివ్వు - వృషభాదులు మదాతిరేకముచేఁ గాళ్లతోనేలను ద్రివ్వుటనుబట్టి యేర్పడినపదబంధము.

2) కసరి = విసుగుకొని, ఎంగిలి చేతన్ = ఎంగలి చేతితో, (తినుచున్న యన్నపు మెదుకులంటుకొనియున్న చేతితో) కాకిన్ = వాయసమును, వ్రేయనివాఁడు = అదలింపనివాఁడు - అతిలుబ్ధుఁడు, సతతాన్నదాన = నిరతాన్నదానముచేత, ప్రశస్తుఁడయ్యెన్ = ప్రసిద్ధుఁడయ్యెను.

ఎంగిలిచేతఁగాకి వ్రేయని - ఎంగిలి చేతితోఁగాకినదలించినచోఁ జేతికంటియున్నమెదుకు క్రిందఁబడునని భయపడుననుట, ఇది యతి లుబ్ధత్వమును దెలుపు జాతీయము. "పాతకుఁడు కాననెంగిలిచేతఁగాకి, వ్రేయఁజాలఁడు" (వరాహ 2-146)

4) బ్రహ్మకల్పముదాఁకన్ = బ్రహ్మదినమువఱకు, బ్రతుకాసన్= జీవితాశతో, కడకట్టువాఁడు = పదకములువేయువాఁడు, విశ్వమున్ = జగత్తును, అస్థిరముగన్ = స్థిరముకానిదానినిగా, తలంచెన్=తలపోసెను.

బ్రహ్మకల్పము - 864 కోట్ల మానవ సంవత్సరముల లోక కల్పము. (చూ 4-134 వ్యాఖ్య)

"కడకట్టుట = To Scheme" (బ్రౌ)

అలపద్మభవునినైనన్ = అబ్రహ్మదేవునైనను, పాటిగాఁగొనక= లెక్కపెట్టక, నీరసముసేయువాఁడు = చులుకనచేయువాఁడు, వినీతుఁడయ్యెన్ = వినయముగలవాఁడయ్యెను. ఒరుల = పరులయొక్క, లచ్చికిన్ = సంపదకు, ముచ్చిరి = అసహనపడి, ఉడుకువాఁడు = పరితపించువాఁడు, సర్వసముఁడయ్యెన్ = అందఱియందు సమానుఁడయ్యెను.

ఉ॥ పాళముమీఱుపెద్దపెద 1 పాళములై బలితంపుగాఁగులన్
మూలుగుచున్న ప్రాఁబసిఁడిముంచిధనార్థులకిచ్చు, విష్ణుదే
వాలయ 2 సంప్రతిష్ఠలకునై యొసఁగున్, సతికేలనించునా
నాలఘు 3 ధర్మనిర్మితికిన గ్రకువేంద్రుఁడనుగ్రహంబునన్ 211

వ్యా :— అగ్రికువేంద్రుఁడు = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు, అనుగ్రహంబునన్ = ప్రసన్నతతో, పాళముమీఱు = అవధినతిక్రమించు పెద్దపెదపాళములై = పెద్దపెద్దముద్దలై, బలితంపుఁగాఁగులన్ = లావుపాటివగు పెద్దబానలయందు, మూలుగుచున్న = తన్నుగ్రహింపుఁడని మొఱయిడుచున్న - వ్యర్థముగాఁబడియున్న, ప్రాఁబసిఁడి = చిరకాలమునాఁటి బంగారమును, ముంచి = ఉద్యమించి, ధనార్థుఁ కున్ = ద్రవ్యమునుయాచించువారికి, ఇచ్చున్ = ఒసఁగును. విష్ణుదేవాలయ= విష్ణుదేవునికోవెలలయొక్క, సంప్రతిష్ఠలకునై = చక్కఁగాఁబ్రతిష్ఠాపనలు చేయుటకొఱకై, ఒసఁగున్ = (ధనమును) ఇచ్చును. నానా= బహువిధములయిన, అలఘు = గొప్పవయిన, ధర్మ = పుణ్యకార్యములయొక్క, నిర్మితికిన్ = నిర్మాణములకు - ఆచరణములకు, సతి = సాధ్వియొక్క - భార్యయగు సుశీలయొక్క, కేలన్ = చేతులందు, నించున్ = (ధనమును) ఉంచును.

మూలుగు - "ధనయొక్క చోటు నుంచి పెక్కుదినములయిన యెడల అచ్చోటు ధనపిశాచముచేరి మూలుగునని చెప్పుదురు" (శ ర.) "ధనదేవతమొఱవ్యర్థముగానున్న నన్నుపరిగ్రహింపుఁడని సూచించుచుకూయు" (సూ. ని.)

---

211 ప:- 1 పాళములగ - ప; పాళములై - ర, అ, గౌ. 2 సుప్రతి - ముద్రి (అ), ర; సంప్రతి - అ, గౌ. 3 కర్మ-ముద్రి (అ).ర, ధర్మ - అ, గౌ.

"విత్తము వెక్కసంబుగా మూలుగుచున్నదిప్పుడు"
(జై. భా 1-66) = The money is lying idle" (బొ.)

క॥ అయాలు, 1 మగఁడు, విష్ణుప
రాయణులై పెక్కు గతులవ్రతములు తటితో
జేయుచునుండఁగనట ని
శ్శ్రేయస 2 పదమైన పౌండరీకక్షోణిన్. **212**

వ్యా :— అయాలున్ = అభార్యయు, మగఁడున్ = (అ) భర్తయు-అనుకీలభర్తయు, విష్ణుపరాయణులై = హరియందు మిక్కిలి యాసక్తిగలవారై, పెక్కుగతులన్ = పలురీతులచేత, వ్రతములు = నోములు, తటితోన్ = కాలముతో, (నిర్ణీతకాలమునందనుట) చేయుచునుండఁగన్ = ఆచరించుచుండఁగా, అటన్ = అక్కడ, నిశ్శ్రేయసపదమైన = మోక్షస్థానమయిన, పౌండరీకక్షోణిన్ = పౌండరీకభూమియందు - పౌండరీకక్షేత్రమునందు. (మీఁదిపద్యముతో నన్వయము)

వ్యాక :- అలుమగఁడు విష్ణుపరాయణులు- మహద్వాచకము మహతీవాచకము కర్తలగునపుడు మహద్విశేషణము శేషించును. "విష్ణుపరాయణశ్చ + విష్ణుపరాయణాచ = విష్ణుపరాయణౌ" -అని నిల్చును. "పుమాన్ స్త్రియా (1-2-67) స్త్రియాసహోక్తౌపుమాన్ శిష్యతే" (సి. కౌ. 933) "ధన్యులకానుభద్రకు శతక్రతుపుత్త్రికుద్భవించె - ఆది 8-224; నలదమయంతులిద్దఱు మనః ప్రభవానలదహ్యమానులై" (అరణ్య 2-24)

---

212 ప :- 1 మగలు - ముద్రి [అ], ర; మగఁడు - అ, గౌ. 2 పథ-అ; పద - ముద్రి (అ), ర, గౌ.

మ॥ యమ 1 రాడ్దూతశిఖావతంసము, చిరప్రాణంబు, దూరప్రియా
గమశంసిస్ఫుటకాకలీకలన, 2 మేకప్రక్రియా 3 పాతి వీ
క్షము, శీతర్తుబలీయమొక్కబలిభుగ్రాజంబు 4 రాజిల్లు శ్రీ
రమణాగారపురోధరోత్థచలపత్రస్థూలశాఖాశిఖన్. **213**

వ్యా :— యమరాట్ = యమునియొక్క, (శమనోయమ
రాడ్యమః - అమ) దూత = దూతలయందు - యమదూతలయందు,
శిఖావతంసము = సిగబంతి - శ్రేష్ఠము, చిరప్రాణంబు = చిర
కాలముజీవించునది, (చిరంజీవి) దూర = దవ్వునందున్న, ప్రియ =
ఇష్టులయొక్క, ఆగమశంసి = రాకనుదెలుపునదైన, స్ఫుట = స్పష్ట
మయిన, కాకలీ = మధురమయినసూక్ష్మధ్వనియొక్క, కలనము =
స్వీకరించుటగలది, (దూరమందున్న యిష్టులరాకను స్ఫుటముగా
మధురమధురమగు సూక్ష్మధ్వనితోసూచించునదియనుట) ఏక=ఒక్కటి
యైన, ప్రక్రియా = ప్రకృష్టమయినవ్యాపారముచేత, ఆపాతి = సంభ
వించునదియగు, వీక్షము = చూపుగలది. (ఒంటికంటి చూపుగలది.)
శీతర్తు = చలికాలమునందు, బలీయము = మిక్కిలి బలముగలది.
(చలికాలమున మదించునది - అనుట) అగు, ఒక్కబలిభుగ్రాజంబు=
ఒకానొక వాయసశ్రేష్ఠము, (బలిభుగ్వాయసాఅపి - అమ) శ్రీరమణ=
హరియొక్క, (విట్ఠలునియొక్క-అనుట) అగార = గృహముయొక్క-

---

213 ప:- 1 రుద్భూత - గౌ; రాడ్దూత - ర, అ. 2 శోక - గౌ; మేక - ర, అ. 3 పాతదీ - డ, ద, బ. పాతవీ - ర, గౌ; పాతివీ-అ. 4 రాజిల్లె - త, గౌ; రాజిల్లు - ర, అ,

విట్ఠలదేవాలయముయొక్క. పురః = ముందటిదయిన, ధరా = భూమియందు - ప్రదేశమునందు, ఉత్థ = పుట్టిన - మొలచిన, చలపత్రి = రావిచెట్టుయొక్క, (బోధిద్రుమశ్చలదళః పిప్పలః కుంజరాశనః, అశ్వత్థే -అమ చలదళ = చలపత్ర. చలపత్రః = అశ్వత్థవృక్షః - ఇతిరాజనిర్ఘంటుః - శబ్దక) స్థూల = లావయిన, శాఖా = కొమ్మయొక్క శిఖన్ = అగ్రమునందు, రాజిల్లున్ = ఒప్పును.

యమరాడ్దూతశిఖావతంసము - కాకిపిండభక్షణచేసి ప్రేతాత్మకు సంతృప్తి గలిగి చునుగాన యమదూతలయందుశ్రేష్ఠము. యమసంబధము ండుటచేతనే కాకికి మౌకళియను పేరుగలిగినది "చిరంజీవీచైకదృష్టిర్మౌకళిఃపికవర్ధనః" (అమ) మౌకళిః = మూకలస్యయమస్యాయం మౌకళిః "మూకలః ప్రేతభర్తాస్యాత్ - ఇతి శబ్దార్ణవే" (గురుబాల)

చిరప్రాణంబు - కాకిచిరకాలజీవి, కావుననే చిర(ం)జీవియను పేరుగలిగెను.

దూరప్రియాగమశంసి - కాకికూఁతదూరప్రియాగమ సూచకమనుటకు :

"హులుతాశదేశేనియతంకలిఃస్యాత్
ప్రియాగమాకర్ణనయోషిదాప్తిః
యామ్యేతు వృష్టిర్మహతీచ భీతిః
ప్రియేష్టచేష్టస్యసమాగమః స్యాత్
మహేశ్వరాశావిరుతశ్చకాకః
సదార్యగుర్వాగమనంజయంచ
కుంకుంనినాదః ప్రియసంగమాయ" (వసంతరా) - శబ్దక.

స్ఫుటకాకలీకలనము - "కాకలీతుకవేసూక్ష్మే" (అమ) కలః మధురాస్ఫుటోధ్వనిః, సూక్ష్మేతస్మిన్ కాకలీ (కలమనఁగామధురంబును అస్ఫుటంబునునైనధ్వని. అది సూక్ష్మమైన యెడల కాకలియనంబడును. కుః సూక్ష్మః సచాసౌకలశ్చకాకలీ సూక్ష్మమైనకలధ్వని" (గురుబాల),

కాఁగాఁగలధ్వనియందు రెండులక్షణములుండును. (i) మధురత్వము (ii) అస్ఫుటత్వము. కాకలీధ్వనియందు మూఁడులక్షణములుండును. (i) మధురత్వము (ii) అస్ఫుటత్వము (iii) సూక్ష్మత్వము. స్ఫుటకాకలీధ్వనియనఁగా - (i) స్ఫుటత్వము (కాకలీధ్వనియస్ఫుటము) (ii) మధురత్వము (iii) సూక్ష్మత్వముఁగల ధ్వనియన్నమాట.

కాకికూఁత మధురముగానుండునా? యనఁగా మధురత్వామధురత్వములును సాపేక్షములే. కోకిలకూఁత విరహిణికి శ్రీః ణష్ఫుటభేదకమగును; అట్లే దూరమునందున్న ప్రియాగమ సూచకమగుచోఁగాకికూఁతమధురమగును.

ఏకపక్రియాపాతవీక్షము - కాకియొంటి కంటితోఁజూచును. కావునఁగాకికేకదృష్టియను పేరుగలదు. ఆ కన్నొక్కటే రెండుపక్కలఁ జూచుటకుపయోగపడును. కనుకనే కాకాక్షి (గోళక) న్యాయమను న్యాయభేదమేర్పడినది.

చలపత్రి - రావియాకులు గాలిలేనప్పుడును జలించుచుండును' "ఈయిందు బింబాస్యహే, లాదర్పంబునఁబిప్పలచ్ఛదము గెల్వంగాఁ దలంచెంజుమీ, లేదే --- యేలాభయప్రాదుర్భావమునంజలించునది నిర్వాతప్రదేశంబునన్" (శృ. నై. 3-197)

శా॥ తాతల్ తండ్రులు మామ 1 లల్లుఁసనుముత్తాతల్ 2 మఱందుల్ సహ
శ్రోతల్ భ్రాతలు సేవకుల్ హితులు మిత్రుల్ పుత్రులోలిన్ దివా
భీతాభీతములై తనుంగొలువఁగాఁ 3 బెన్మూఁకలై వాయస
వ్రాత 4 శ్రేష్ఠమ్రాలు 5 రేలువగలున్ 6 బ్రాంతాగమాంతంబులన్.

**214**

వ్యా :— తాతల్ = పితామహులును మాతామహులును, తండ్రులు = కన్నతండ్రియుఁ, బినతండ్రులును, పెదతండ్రులును, మామలు = మాతులును, (తల్లితోఁబుట్టువులును) ముత్తాతల్ = ప్రపితామహులును, మఱందుల్ = స్యాలకులును, (భార్యతోఁబుట్టువులు) సహశ్రోతల్ = తనతోపాటు పెద్దవారలవలన జీవనోపాయాదులను బిల్లకాకులుగానున్నప్పుడు వినినేర్చుకొన్నవారును - చిన్ననాఁటి స్నేహితులును, భ్రాతలు = తోఁబుట్టువులును, సేవకుల్ = అనుజీవులును, హితులు = మేలుకోరువారును, మిత్రుల్ = సఖులును, పుత్రులు = కుమారులును, దివాభీత = గుడ్లగూబలవలన, (దివాభీతః కుంభివేస్యాద లూకేకుముదాకరే - మే. ని.) అభీతములై = భయపడనివై, ఓలిన్ = క్రమముగా, తనున్ = తన్ను, పెన్మూఁకలై = పెద్దగుంపులై, కొలువఁగాన్ = సేవింపఁగా, వాయసవ్రాతశ్రేష్ఠము = కాకసమూహమునందు మిన్నయయినది - ఆకాకరాజము, ప్రాంత = సమీపములందున్న, (చుట్టుపట్టులందున్న) అగమ = వృక్షముల యొక్క, (పలాశీద్రుద్రుమాగమాః - అమ) అంతంబులన్ = అగ్ర

214 పః- 1 లల్లుఁడులు – గ, తః లల్లురును – ర, అ. 2 సహాయుల్-అ, మరందుల్ – క, తః మఱందుల్ - గౌ. 3 బెన్మూఁకయై-ప, గౌ, బెన్మూఁకలై – ర, అ. 4 శ్రేష్ఠము - పః శ్రేష్ఠము- ర. అ, గౌ. 5 రేలుఁబగలున్ - గౌ; రేలుపగలుఁ - ర; రేలువగలుఁ - అ, 6 భ్రాంతా - క, తః బ్రాంతా - ర, అ.

ములయందు, (కొనలయందు) రేలువగలున్ = రాత్రిందివములును, (రాత్రులయందును బవళ్లయందును - అనుట) ద్రాలున్ = వర్తిల్లును.

ముత్తాత - ముత్త+తాత. (ముత్త (క. ముత్తు) = ముసలి, వృద్ధ; వృద్ధుఁడు - సూ. ని.

చ॥ అదియొకనాఁడు విట్ఠలగృహాంగణభూబలిపీఠవర్తులౌ
మెదుకులుమేయఁగన్గొని, యమేయగతింబఱవన్, దదాయత
చ్ఛదభవభూరిమారుతవశంబునన య్యెడ ధూళిపోవన
భ్యుదితములయ్యెదానగుడియూడ్చినఁగల్గునగణ్య పుణ్యముల్.

**215**

వ్యా :— అది = అయ్యది - అకాకి, ఒకనాఁడు = ఒకా నొకదినమునందు, విట్ఠల = పాండురంగవిట్ఠలునియొక్క, గృహ= గేహముయొక్క - పాండురంగాలయముయొక్క, అంగణభూ = ముంగిటి ప్రదేశమునందలి, బలిపీఠ = ఉపహారము (= పూజాసామగ్రి) కొఱకయిన పీఠమునందు. వర్తులౌ = వర్తించునవియగు, (ఉన్నవగు) మెదుకులు = సిక్థకములు, (అన్నకణములు) మేయన్ = భక్షించుటకు, కన్గొని = చూపుపెట్టి, అమేయ = అమితమైన, గతిన్ = గమనముతో (శీఘ్రగమనముతో - అనుట) పఱవన్ = ఎగురఁగా, తత్ = దానియొక్క, ఆయత = విరివియైన. ఛద = ఱెక్కలవలన (గరుత్పక్షచ్ఛదాః - అమ) భవ = పుట్టిన, భూరి = అధికమయిన, మారుతవశంబునన్ = వాయువశమున, అయ్యెడన్ = అచ్చట, ధూళి = దుమ్ము, పోవన్ = పోఁగా, దానన్ = దానిచేత - ఱెక్కల గాలికి దుమ్ముతొలఁగుటచేత, గుడి = ఆలయమును, ఊడ్చినన్ = తుడుచుటచేత; కల్గు = ప్రాప్తించు, అగణ్యపుణ్యముల్ = అమితములయిన సుకృతములు, అభ్యుదితములయ్యెన్ = సంభవించినవయ్యెను.

తిర్యక్కగుకాకి ప్రస్తావనలో విఠ్ఠలశబ్దమువాఁడుట సాభిప్రాయము జ్ఞానశూన్యులను -వ్వయముగా గ్రహించువాఁడని విఠ్ఠలశబ్దనిరుక్తి. చూ. 1-203 వ్యాఖ్య.

వ॥ ఇట్లవితర్కరితోపపన్నంబగు పన్నగశయనసదవ సమ్మార్జన సముదితసుకృతపరి 1 పాకంబునఁగాకంబు నతిలోకంబయ్యెఁ; వినుము. **216**

వ్యా :— ఇట్లు = ఈప్రకారముగా, అవితర్కిత = అనూహితముగా, ఉపపన్నంబు = ప్రాప్తించినది, అగు = అయిన, పన్నగశయన = నాగతల్పునియొక్క - హరియొక్క, సదన = గృహముయొక్క - విఠ్ఠలదేవాలయముయొక్క, సమ్మార్జన = తుడుచుటచేత, సముదిత = సంభవించిన, సుకృత = పుణ్యముయొక్క, పరిపాకంబునన్ = పరిపక్వతచేత, కాకంబున్ = కాకియు; అతిలోకంబయ్యెన్ = లోకోత్తరమయినదియయ్యెను. వినుము = ఆకర్ణింపుము.

## హంస కథ

క॥ కలహంస 1 మ్మొకక్కటియదు
కులహంసముగుడిఁజరించుఁగుసుమాయుధకీ
ర్తిలతాగుచ్ఛముకై వడి
2 జలరుహసంభవమరాళసంకాశగతిన్. **217**

---

216 పః- 1 పాకంబతిలోకంబయ్యె - గౌ: పాకంబునఁగాకంబునతి - ర, అ.

217 పః- 1 మొకటియదుకుల, కులహం - ముద్రి (అ): ర, మొక్కటి-అ; సంబొక్కటి - గౌ. 2 జలసంభవభవమరాళ - క, గౌ; జలరుహసంభవమరాళ - ర, అ.

వ్యా :— కలహంసమ్ము = రాజహంస. ఒక్కటి = ఒకటి, కుసుమాయుధ = పువ్వులు శస్త్రములుగాఁగలవానియొక్క-పుష్పబాణుని యొక్క, (మన్మథునియొక్క) కీర్తిలతా = యశస్సనెడుతీఁగయొక్క, గుచ్ఛముకైవడిన్=గుత్తియోయనునట్లు, జలరుహసంభవ=బ్రహ్మదేవుని యొక్క, మరాళ=హంసతో, (హంసోమరాళనీలాక్షశ్చక్రపక్షసితచ్ఛదః-వైని.) సంకాశ= సమానమయిన, గతిన్= గమనముతో-బ్రహ్మవాహన మగు హంసయొక్క మనమువంటి గమనముతో, యదుకులహంసము= యదువంశశ్రేష్ఠునియొక్క (హంస = శ్రేష్ఠే - శబ్దస్తో) గుడిన్ = ఆలయమునందు- విఠ్ఠలదేవాలయమునందు, చరించున్ = తిరుగును.

కలహంసము - "కలహంసః = రాజహంసః, యథాభట్టిః - "కుందావదాతాః కలహంసమాలాః" (శబ్దక) చూ 4.220 వ్యాఖ్య.

అలం :— ఉత్ప్రేక్ష, లుప్తోపమ.

వ॥ ఇట్లువర్తించివర్తించి. 218

వ్యా :— ఇట్లు = ఈవిధముగా, వర్తించి వర్తించి = తిరిగితిరిగి. (మీఁదిపద్యముతో నన్వయము)

మ॥ కుతుకంబింకకకుంకుమద్రవమిళద్గోరోచనా పంకని
ర్మిత 1 పత్రాంకకళంకితాంబుధికుమారీహారివక్షోరుహా
ద్వితయాస్ఫాలన 2 లాలనోచితపయో విస్ఫారకాసార సం
తతినానీడభవంబు క్రీడనలుపున్ దద్దివ్యధామంబునన్. **219**

వ్యా :— అనీడభవంబు = అపక్షి-అహంస, కుతుకంబు = కుతూహలము, ఇంకక = క్షీణింపక, తద్దివ్యధామంబునన్ = ఆమనో

---

219.ప.- 1 పత్రాంకితశంకితా - క; పత్రాంకకలంకితా - ర, అ.
2 లాలసోచిత - క; లాలనోచిత - ర, అ.

హారమయిన సదనమునందు - అమనోహరమయిన విఠ్ఠలదేవాలయము నందు, కుంకుమద్రవ = ఘుసృణరసముతో. (నీళ్లుకలిపినకుంకుమతో) మిళత్ = కూడుచున్న, గోరోచనాపంక = గోరోజనముయొక్కపలు చని ద్రవ్యముచేత, నిర్మిత = నిర్మింపఁబడిన - రచింపఁబడిన, పత్ర = మకరికాపత్రములయొక్క, అంక = చిహ్నములచేత, కళంకిత = కలిగినమఱకగల, అంబుధికుమారీ = లక్ష్మీదేవియొక్క, హారి = మనోహరమయిన, వక్షోరుహద్వితయ = చనుదోయియొక్క, ఆస్ఫాలన = చఱచుటయొక్క, లాలన = లాలించుటచేత, ఉచిత = పరిచితమయిన. (ఉచిత = పరిచితే - శబ్దస్తో) పయః = నీటిచేత, విస్ఫార = మిక్కిలి విస్తారమయిన, కాసార = సరస్సులయొక్క, సంతతిన్ = సమూహమునందు, క్రీడసలుపున్ = విహరించును.

కుంకుమద్రవము కలిసినపలుచని గోరోజనముతో లిఖించినమకరికాపత్రచిహ్నములుగల లక్ష్మీదేవియొక్క చనుదోయిచఱపులకలవాటుపడిన నీళ్లుగల యాపాండురంగాలయప్రాంతమునందలి సరోవరములలో నారాజహంస విహరించుననుట.

సీ॥ మొనరెండుగాఁగఁ 1 దీర్చినవిద్రుమముద్రుకం
దమునేలుముక్కునఁదడిచితడిచి
2 మొగవిచ్చుపసిఁడి గేదఁగిఱేకుగమిమించు
3 విశ్లథచ్ఛదములు విదిర్చి విదిర్చి
నగుమొగంబులదాననపుఁగొ్రవ్విరుల నవ్వు

---

220 ప:- 1 దర్చిన - త; ద్రెవ్విన - ముద్ర [అ]. ర; దీర్చిన - అ.
2 మొగవిచ్చు - ముద్రి [అ]. మొగివించు - త; మొగివిచ్చు ర, అ. 3 విశదచ్ఛదములను - ముద్రి (అ). విశదచ్ఛదమ్ముల-ర; విశ్లథచ్ఛదములు - అ, గౌ.

4 చిగురాకుటడుగులఁజిమ్మిచిమ్మి
నిద్దంపుఁబండువెన్నెల 5 గుత్తికడకొత్తి
మలయుమైముంపులఁగలఁచికలఁచి

తే॥ శార్ఙ్గిసౌధప్రఘాణకాసారసార
సారసామోదమేదురవారిఁదేలి
వచ్చియాయంచగుడిలోనఁజొచ్చెనొక్క
నాఁడుపవలింటి 6 బీఖెండవేఁడిఁదలఁకి. **220**

వ్యా :— మొన = అగ్రము, రెండుగాఁగన్ = రెండగునట్లుగా, తీర్చిన = ఏర్పఱిచిన, విద్రుమద్రు = పగడపుఁజెట్టుయొక్క, (పలాశీద్రుమ్రమాగవూః - అమ) కందమున్ = దుంపను, ఏలు = శాసించు - సరిపోలు, ముక్కునన్ = చంచువుతో, తడవితడవి = తాఁకితాఁకి - మాటిమాటికి స్పృశించి.

అగ్రమునందు రెండుగాఁజీలిన పగడపుఁజెట్టు దుంపనుబోలు చఁచువుతోమాటిమాటికి స్పృశించియనుట.

2) మొగవిచ్చు = ముఖ (అగ్ర) భాగమున వికాసముగలదగు, పసిఁడిగేదఁగిఱేకు = బంగారువన్నెగలకేతకీ (= మొగలి) దళముల యొక్క, గమిన్ = సమూహమును. మించు = అతిక్రమించు-సరిపోలు, విశ్లథ = వదులయిన, (బిగిసడలిన) ఛదములు = ఱెక్కలు (గరుత్పక్షచ్ఛదాః - అమ) విదిర్చి విదిర్చి = విదిలించివిదిలించి - మాటిమాటికి విదిలించి.

---

4 చిగురాకునడుగుల - ర; చిగురాకున (ట?) డుగుల - అ; జిగురాకుటడుగుల - గౌ. 5 కాంతి - గౌ; గుత్తి - ర, అ. 6 పేరెండ - క, ప, గౌ; బీఖెండ - ర, అ.

అగ్రభాగములందు వికసించిన మొగలిఱేకులనుబోలు (నెట్టని) ఱెక్కలనుమాటిమాటికి విదిల్చియనుట.

మొగవిచ్చు - మొగము + విచ్చు = మొగవిచ్చు. మూఁతులు విచ్చు - అని తిక్కన. "వెడలెఁ గ్రొత్త, తావిమూతులు విచ్చుచెంగలువవిరుల" (విరాట ....)

వ్యాక :— విఁదుచు - విదురు + చు = విదుృచు - బా. ప్రకీర్ణక 20.

3) నగుమొగంబులన్ = నవ్వుముఖములతో - నవ్వుచున్నట్లు కలకలలాడు ముఖభంగిమలతో, దాసనపుఁ గ్రొవ్విరులన్ = జపావృక్షముయొక్క క్రొత్తవయినపువ్వులను (క్రొత్తవయినజపాకుసుమములననుట.) నవ్వు = పరిహసించు - సరిపోలు, చిగురాకుటడుగులన్ = పల్లవములవంటి పాదములతో, చిమ్మిచిమ్మి = (నీళ్లను) చల్లిచల్లి - మాటిమాటికిఁ జల్లి.

నవ్వుచున్నట్లు కలకలలాడు ముఖభంగిమలొప్పఁగా, జపాపుష్పములనబోలు చిగురాకులవంటి పాదములతో నీళ్లను మాటిమాటికిఁజల్లియనుట.

దాసనపుఁబువ్వు - ఇదియెట్టిగానుండును. (ఉ. హ. 2-24; భీమ 2-29; క్రీడా 62)

వ్యాక :— దాసనపుఁగ్రొవ్విరులనవ్వు, చిగురాకుటడుగుల- "ఉపమానానువాదంబున నుపమానాంతరప్రయోగము. (ము. కౌ నమాస)

4) నిద్దంపుఁబండు వెన్నెలగుత్తి = దట్టమయిన నిండువెన్నెలతోనైనగుచ్ఛముమ - పున్నమనాటిచంద్రబింబముమ, కడకొత్తి =

నిరసించి (దూరీకరించి) - సరిపోలి, మలయు = చలించు, మై = శరీరముయొక్క, ముంపులన్ = మునిగించుటలచేత, కలచికలచి = కలతపెట్టి కలతపెట్టి - మాటిమాటికి సంక్షోభింపజేసి.

పున్నమనాటిచంద్రబింబమునుబోలు శరీరమును నీళ్లతోముంచుటలచేత మాటిమాటికి సంక్షోభముకలిగించి - అనుట ("వెన్నెలగుత్తి = చంద్రుడు -- ప్రబంధ 2-16" - సూ. ని.)

రాజహంసముక్కును ఱెక్కలును బాదములునెఱ్ఱగానున్నట్లును, దేహముతెల్లగానున్నట్లును వరుసగాఁబైసీసచరణములయందువర్ణితము.

"రాజహంసాస్తుతేచంచుచరణైర్లోహితైస్సితాః" (అమ) = "ఎఱ్ఱనైన ముక్కుకాళ్లతోఁగూడి తెల్లనైయుండు హంసలు రాజహంసలనంబడును" (గురుబాల) ముక్కును గాళ్ళును మాత్రమేగాక ఱెక్కలు గూడనెఱ్ఱగానుండునని గ్రహింపవలెను. కాదంబహంస "ధూమ్రవర్ణములైన ముక్కుకాళ్ళుఱెక్కలుగలిగినహంస" యనిగురుబాలప్రబోధిక. కావున ముక్కునుగాళ్ళును నేవర్ణముగలవైయుండునో ఱెక్కలవర్ణము నదేయని తెలియనగును.

రెండవపాదమున ఱెక్కలు మొగలితేకులతో నుపమింపఁబడినవి. మొగలితేకువర్ణముపీతము. (పసుపుపచ్చ) ఱెక్కలవర్ణము రక్తము. (ఎఱుపు) పీతరక్తవర్ణముల కైక్యముకవిసమయము.

"పీతరక్తయోః - ఏకత్వేననిబంధనంచకవిసమయః" కావ్యమీ)

శార్ఙ్గి = హరియొక్క - విఠ్ఠలునియొక్క, సౌధప్రఘాణ = రాజగృహపు వాకిటికివెలుపలనున్న నలుచదరపుఁబ్రదేశముయొక్క - విఠ్ఠలదేవాలయప్రాంగణము వెలుపఁలగలనలుచదరపుఁజోటునందున్న, కాసార = సరస్సుయొక్క, సార = శ్రేష్ఠమయిన, సారస =

పద్మములయొక్క, ఆమోద = మిక్కిలి దూరమునకు వ్యాపించు పరిమళముచేత, (విమర్దోత్థే పరిమళో, గంధేజనమనోహరే. ఆమోదస్సోఽతి నిర్హారీ - అమ. సపివజలతి నిర్హారీ అతిదూరగామీచేత్ ఆమోదఇత్యుచ్యతే-గురుబాల.) మేదుర = మిక్కిలితేటయయిన, (సాంద్రస్నిగ్ధస్తుమేదురః-అమ) వారిన్ = నీటియందు, తేలి = ఓలాడి, వచ్చి = అరుదెంచి, ఆయంచ - ఆహంస (ఆరాజహంస) ఒక్కనాఁడు = ఒకదినమున, పవలింటి బీఱెండ = మధ్యాహ్న కాలమునందలి యధికమయిన యాతపముయొక్క, వేఁడిన్ = తీక్ష్ణతచేత; తలఁకి = భయపడి, గుడిలోనన్ = ఆలయముయొక్క యంతర్భాగమునందు (గర్భగుడియందు - అనుట) చొచ్చెన్=ప్రవేశించెను.

వ్యాక :— బీఱు+ఎండ = బీఱెండ. టుగాగమములేదు. (ము. కౌ. సంధి.)

అలం :— ఉపమ, స్వభావోక్తి.

క॥ అది 1 దనదేహంబచ్చుట
2 విదిలించెంబక్షసలిల విప్రుష 3 ములఁబెన్
జొదుగొదవించుచు 4 గాడ్పులు
5 పొదవెట్టురజోవికారములు దూరముగన్ **221**

వ్యా :— అది = అయ్యది - ఆరాజహంస; గాడ్పులు = వాయువులు, పొదవెట్టు = కూడఁబెట్టు (ఒకచోటికిఁజేర్చు) రజో

---

221 పః- 1 తన - ర, అ; దన - గౌ. 2 విదలించన్ - గౌ; విదలింపన్-ముద్రి (అ). ర; విదిలించెఁ - అ. 3 ములచేఁజొదుకొద - ముద్రి (అ) ర, జొదగొద - చ; ములబెంపొదవించుగాడ్పులు-క; ములఁబెఁజొదుఁగొద - అ. 4 గాడ్పులఁబొదవెట్టి - గౌ; గాడ్పులు పొదవెట్టి - ర, అ. పొదవెట్టుకపో వికార - ప; పొదవెట్టురజో వికారములు - ర, అ, గౌ;

వికారములు = ధూళియొక్క వికృతులు, దూరముగన్ = దవ్వగు నట్లుగా, పక్షసలిల = ఱెక్కలనీటియొక్క, విప్రుషములన్ = బిందువులచేత. (పృషంతిబిందు పృషతాః పుమాంసో విప్రుషః స్త్రియామ్-అమ) పెన్ = అధికమయిన, చొదుగు = చెమ్మ, ఒదవించుచున్= కలిగించుచు, అచ్చటన్ = అస్థలమునందు - ఆ విఠ్ఠల దేవాలయపు గర్భాగారమునందు, (గర్భగుడియందు) తన = తనయొక్క, దేహంబు= శరీరమును, విదిలించెన్ = విదిల్చెను. (దులిపెను)

వ్యాక :— పెన్+చొదుగు = పెంజొదుగు.

తే॥ సలిలఖగమునకేతదాచరణమునన
1 కలిగెనాకస్మికంబుగఁగంబుపాణి
గర్భగేహోపలేపనసంస్కారసార
సుకృతపరిపాక నిరపాయశోభనంబు. 222

వ్యా :— సలిల ఖగమునకున్ = జలపక్షికి - ఆ రాజ హంసకు, ఏతత్ = దీనియొక్క, ఆచరణమునన = ఒనర్చుటచేతనే - గాలికిఁజేరిన దుమ్మెగిరిపోవునట్లు తడిఱెక్కలను విదిల్చిచెమ్మకలిగించుట చేతనే, కంబుపాణి = హరియొక్క - విఠ్ఠలునియొక్క, గర్భగేహ = గర్భగృహముయొక్క, (గర్భగుడియొక్క, దేవాలయమున దేవతా విగ్రహము ప్రతిష్ఠితమయియున్న చోటియొక్క) ఉపలేపనసంస్కార = అలుకుటరూపమయిన సంస్కరణముయొక్క (గోముఖంతూపలేపనమ్-త్రి. ని.) సార = శ్రేష్ఠమయిన, సుకృతపరిపాక = పుణ్యపరిపక్వత యొక్క, నిరపాయ = నాశములేని, (అపాయః = వినాశః - శబ్దర) శోభనంబు = శుభము, అకస్మికంబుగన్ = హఠాజ్జాతముగా, (అనుకొనకుండ - అనుట) కలిగెన్ = ప్రాప్తించెను.

గర్భాగారమునలుకుటవలనఁగలుగుపుణ్యముహంసకుఁగలిగెననుట.

---

222 ప :- 1 గలిగె - ర, ఆ; కలిగె - అ.

క॥ శుకమొకటి చంచుజితకిం
శుకమై, హరిహయశరాసనరుచిరవపురం
శుకమై, కుసుమాకరకిం
1 శుకమను పేరెనఁగ నందసుతుగుడిఁ బెరుఁగున్. **223**

వ్యా :— చంచు = ముక్కుచేత, జిత = జయింపఁబడిన, కింశుకమై = మోదుగు (మొగ్గ) గలదై, (పలాశేకింశుకః - అమ) హరిహయ శరాసన = ఇంద్రధనుస్సువంటి, సురుచిర = మిక్కిలి మనోజ్ఞమయిన, వపుః = శరీరముయొక్క, అంశుకమై = కాంతిగలదై, కుసుమాకరకిం శుకమను పేరు = కుసుమాకరకింశుకమనెడు నామము, ఎనఁగన్ = ఒప్పఁగా, నందసుతు = కృష్ణునియొక్క- విఠ్ఠలునియొక్క, గుడిన్ = ఆలయమునందు, శుకము = చిలుక, ఒకటి = ఒక్కటి. పెరుఁగున్ = వర్ధిల్లును.

చిలుకముక్కు, మోదుగుమొగ్గవలె వంకరగా నెఱ్ఱగానుండును. 1-183 వ్యాఖ్య.

అంశు శబ్దము కిరణవాచకము. "కిరణోస్రమయూఖాంశుగభస్తిఘృణిఘృష్ణయః" (అమ) కిరణవాచకములు నాతపవాచకములు. (ప్రకాశోద్యోత ఆతపః - అమ) కాంతివాచకములుగా వాడఁబడును. ఇట 'అంశు' శబ్దము కాంతివాచకముగాఁ బ్రయుక్తము.

---

223 ప:- 1 శుకమానందమున మ్రుద్రి [అ], ర; శుకమను పేరెనఁగ-అ,గౌ.

"కిరణః - రత్నరశ్మ్యోగభస్తి శబ్దపర్యాయోగదర్శనాత్ సామాన్య రశ్మిః తథాచభట్టిః 1-9. "ఊర్ధ్వస్ఫురదర్తి గభస్తిభిర్యో" ఇతిమంజరీ, ఇత్యమరటీకాసార సుందరీ (శబ్దక)

"జ్యోతిర్లతా ప్రతానాతపంబో; కమలజాండక టాహకనక ఘృణియు; హస్తాగ్రదీపగభస్తిచయమొ" (మను 3-17)

హరిహయశరాసనురుచిరవపురంశుకమై - ఇంద్రధనుస్సున నేడు వర్ణములుండును. రామచిలుకయైదు వర్ణములుగలిగియుండును. కావుననే పంచవన్నియ, పంచవన్నియరాచిల్క - అనుపదములు వాడఁబడును. (భీమ 1-111; శివరా 2-26) "రామచిలుక = A species of Parrot, with a blue head; green wings, golden breart, scarlet body and long tail; feathers of a purple colour"(బ్రౌ)

పై వివరణమునుబట్టి రామచిలుక తలశ్యామవర్ణము (Blue) కలిగియుండును. ఱెక్కలు హరితవర్ణము, (ఆకుపచ్చ, green) గలిగి యుండును, ఱొమ్ము పీతవర్ణము (పసుపుపచ్చ yellow) గలిగి యుండును. దేహము మాంజిష్ఠవర్ణము కలిగియుండును. (Scarlet = Bright Red) తోఁక పొడవుగా నుండును, ఱెక్కవెండ్రుకలు ధూమ్ర వర్ణము (నీలలోహితమిశ్రితవర్ణము, Violet) గలిగియుండును.

ఇంద్రధనువు - "ఇంద్రధనుస్ = ఇంద్రస్యధనురివ"

'రవకిరణాబహువర్ణా, వాతేనవిలోడితానభసి

శక్రాయుధ సంస్థానా, దృశ్యంతేతత్తు ఇంద్రధనుః'

— ఇత్యుక్తేనభసివాయుచాలితే శక్రధనురాకారేణపరిణతేరవికిరణే (శబ్దస్తో)"

ఇంద్రధనుసుననేడు రంగులుండును -(1) నీలము indgio= Deepblue) (2) రక్తము (Red) (3) పీతము (Yellow) (4) ధూమ్రము (=నిలలోహితమిశ్రితవర్ణము. Violet) (5) శ్యామవర్ణము (= నీలపీత మిశ్రితవర్ణము, Blue) (6) హరితవర్ణము (Green) (7) గోరోచనావర్ణము(= రక్తపీతమిశ్రితవర్ణము. Orange = నారింజ)

ఇందు నీలగోరోచనా వర్ణములు పోఁగామిగిలినయయిదురంగులు రామచిలుకకుండును. ఇటఁజిత్రవర్ణమ్ వివక్షితముగాని వర్ణసంఖ్య వివక్షితముకాదు.

కింశుకము - వ్యు. (I) కించిత్ అవయవైకదేశః శుకఇవశుక తుండాభ పుష్పత్వాత్ తథాత్వమితిబోధ్యమ్ (శబ్దక)

(ii) క్రియతే కింశుకాదీనా, మేకదేశావధారణాత్ (వాక్యప.)
కింశుకోనపలాశే (పలాశముపై శుకములలేదు?) వంటి వాక్యములలోనేక దేశమును వేఱుచేయఁగాఁగింశుక శబ్దమేర్పడ వచ్చునని భావము.

కుసుమాకరకింశుకము - వసంతర్తువునకుఁగింశుకము(మోదుగు) వంటిదని వ్యుత్పత్తి చెప్పనగును.

వ్యాక ;— శరాన - శర + అస్ + కరణేమజ్ = శర + అన : శరాన - అని సాధింపనగును. శరాసనమనుల్యుట్ ప్రత్యయాంతము ప్రసిద్ధము.

ఛం ;— ద్విప్రాసము.

అలం ;— లుప్తోపమ.

చ॥ అలమిత్రిలోకముల్ గెలుచునత్తఱిఁ 1 దేరువహించు తోడిచి
ల్కలుదగదొట్టిముందటికిలాగ కయుండిన, దానతద్భరం
బెలమివహింప, మెచ్చిమరుఁడిచ్చుమణీమయ మాలికాత్రయిన్
గళమునఁదాల్చుఁజిత్రశుకనాథుఁడురేఖలపేరనిచ్చలున్, **224**

వ్యా :— త్రిలోకముల్ = ముజ్జగములు, అలమి = ఆక్ర మించి, గెలుచు = జయించెడు, అత్తఱిన్ = ఆసమయమునందు, తేరువహించు = రథమును మోయు, తోడిచిల్కలు = సహకీరములు, (తనతోపాటు రథమును వహించు కీరములు) దగ = దప్పి, (దగడప్పి సీర్వట్టుదప్పి దూపయనఁజను పిపాస - ఆం. సం ) తొట్టి = కలిగి, ముందటికిన్ = ముందునకు, లాగకయుండినన్ = సమాకర్షింపక యుండఁగా, తాన = తానే, తత్ = దానియొక్క - ఆరథముయొక్క, భరంబు = భారమును, ఎలమిన్ = ఉత్సాహముతో, వహింపన్ = మోయఁగా, మెచ్చి = ప్రియపడి, మరుఁడు = మన్మథుఁడు; ఇచ్చు = (కానుగా) ఒసఁగిన, మణీమయమాలికాత్రయిన్ = రత్నమయమగుహారములమూఁడింటి సమాహారమును, చిత్ర = పలు వన్నెలుగల (చిత్ర = నానావర్ణే. తద్వతి - శబ్దస్తోమ) శుకనాథుఁడు = చిలుకఱేఁడు, నిచ్చలున్ = ఎల్లప్పుడు, రేఖలపేరన్ = రేఖలవ్యాజమున గళమునన్ = కంఠమునందు, తాల్చున్ = వహించును.

చిలుక మెడమీఁదనున్న మూఁడురేఖలు మన్మథుఁడు మెచ్చి యిచ్చిన రత్నమాలికాత్రయిగా సంభావితము.

వ్యాక :— త్రిలోకములు - కర్మధారయము. త్రయశ్చతే లోకాశ్చత్రిలోకాః. "దిక్సంఖ్యేసంజ్ఞాయామ్" (పాణి) ఇది ద్విగువని భ్రమపడరాదు.

---

224 ప ॥— 1 తేరు - ర, దేరు - అ.

అలం :— సాపహ్నవగమ్యోత్ప్రేక్ష.

క॥ కీరమదియొక్క హరిపరి
చారికచేరిక వసించుఁజదివింపఁగ, మే
పారసియొసఁగ, భవనమా
ర్జారాదులవలనఁదన్ను సంరక్షింపన్. 225

వ్యా :— కీరమది = ఆ చిలుక, చదివింపఁగన్ = చదువఁ జేయుఁగా, మేపు = మేఁత, అరసి = అవశ్యకతను గనిపెట్టి. ఒసఁగన్ = పెట్టుఁగా, భవనమార్జారాదులవలనన్= ఇంటిపిల్లులమున్నగువానివలన తన్నున్ = తన్ను. సంరక్షింపన్ = బాగుగాఁగాపాడఁగా, ఒక్కహరి పరిచారికచేరికన్ = ఒకవిష్ణుదాసురాలియొద్ద, వసించున్ = నివసించును.

క॥ దేవాలయమునఁగొన్ని, ని
జావాసమునందుఁగొన్నియహ[1]ములరుగఁబై
చేవదలకపాటిం[2]చుచుఁ
బూవుంబలెఁబువ్వుఁబోఁడిపులుఁగుంబ్రోచున్. 226

వ్యా :— దేవాలయమునన్ = గుడియందు, కొన్ని = కతిపయము, నిజ = తనదైన, ఆవాసమునందున్ = గృహమునందు, కొన్ని = కతిపయము, అహములు = దినములు, అరుగన్ = గతింపఁగా, పైచేన్ = చేతిపైని, వదలక = విడువక, పాటించుచున్ = వహించుచు, పువ్వుఁబోఁడి = (ఆ) పూఁబోఁడి - ఆహరిదాసి, పూవుంబలెన్ = పుష్పమువలె, పులుఁగున్ = పక్షిని - చిలుకను, ప్రోచున్ = సాకెను.

---

226 పః- 1 ములుఁడగ - ముద్రి [అ]. ర; ములరుగ - అ, గొ.
2 పుచు - గొ; చుచు - ర, అ.

చేతిలోనిపువ్వు (లీలాకమలము) నలఁగకుండుటకు దానిపట్ల మృదువుగాఁబ్రవర్తించునట్లు, చేతిమీఁది చిలుకకు రాయిడికలుగకుండు నట్లు, దానిపట్ల హరిదాసిప్రవర్తించుననుట. లీలాకమలధారణ-విలాస వతులకుఁబరిపాటి. 'హస్తేలీలాకమలమలకేబాలకుందానువిద్ధమ్'(మేఘ)

వ్యాక :— పైచే = చేతియొక్కపై - ఏకదేశిసమానము. మ. భా. మతమున, పైదయినచే - అని విగ్రహము. విణ. పూర్వ పదకర్మధారయము పువ్వుఁబోఁడి — అలరుఁబోఁడీత్యాదులు బహు వ్రీహులు (ము. కౌ. సమాస 29)

మ॥ పసుపార్చుందడియొత్తునెండసెకఁగంపంబాఁగి మైదువ్వుచున్
వసయున్ వెన్నయు 1 మేపుగాఁగనొసఁగున్ వల్లించు శ్రీరామ నా
మసుధామాధురి సాధురీతిఁగుచకుంభస్థాయిగాఁజేయుచున్
బిసపుష్పప్రియ 2 వాసరాగమములన్ బింబోష్ఠిరాచిల్కకున్ **227**

వ్యా ;— బింబోష్ఠి = దొండపండువంటి మోవిగలది-ఆహరిదాసి, రాచిల్కకున్ = రాజకీరమునకు, బిసపుష్ప = తామర పువ్వులకు, (బిసప్రసూనరాజీవ పుష్కరాంభోరుహాణిచ - అమ; బిసప్రసూన = బిసపుష్ప) ప్రియ = ఇష్టమయిన - అనుకూలమయిన, వాసర = దినములయొక్క, ఆగమములన్ = రాకలయందు - శరదృతు దిన ములరాకలయందు, పసుపార్చున్ = పసుపుపూసిజలకమాడించును. ఎండసెకన్ = ఎండయొక్క వేడిమితో, తడి = తేమను, ఒత్తున్ = అద్దును. కంపంబు = (చలిచేఁగలిగిన) వణఁకును, ఆఁగి = నివారించి,

227 ప :- 1 మేపుమేపునొసఁగున్వల్లి - ముద్రి (అ). ర: మేపునున్ నొసఁ గుచుఁజా - త; మేపుగాఁగనొసఁగున్ - గౌ; మేపుదానొసఁగు చుఁజా - అ. 2 వాప - గౌ; వాస - ర, అ.

మైదువ్వుచున్ = ఒడలునిమురుచు, (ఇదివాత్సల్యసూచకము) మేపు గాఁగన్ = మేఁతగా, వసయున్ = వచయనునోషధీ విశేషమును. వెన్నయున్ = నవనీతమును, ఒసఁగున్ = ఇచ్చును. సాధురీతిన్ = ఉచితమయిన పద్ధతిని, కుచకుంభ = కుండలవంటి స్తనములయందు, స్థాయిగాన్ = ఉండుదానినిగా, చేయుచున్ = ఒనర్చుచు, శ్రీరామ నామసుధా మాధురిన్ = శ్రీరామనామామృత మాధుర్యమును, వల్లించున్ = మరుగునట్లుచేయును.

వస — వసపెట్టినపిట్టకు మాటలు బాగుగావచ్చును. "బిట్టు మొరసెదువసత్రాగినట్టు" నీలా 3-29- (సూ. ని.)

బిసపుష్పప్రియవానరములు - శరత్కాలమునఁ బద్మములు ల్లసిల్లును గాన బిసపుష్పప్రియవానరములనుట. "శరత్సమక్ష్యేతివికాశ్య పద్మాన స్వీలయంతీకుముదోత్పలాని - కా. మీ.

వ్యాక :- బింబోష్ఠి - బింబ+ఓష్ఠ+జీష్=బింబోష్ఠి బింబౌష్ఠి "ఓత్వోష్ఠయోస్సమాసేవా" (వా)

తే॥ కనకమణి పంజరం 1 బుననునిచియునిచి
చక్కెరయునుక్కెఅయు 2 సారెఁగుగ్రుక్కిగ్రుక్కి
3 యొఱపుఁబలుకులుపలుకఁ బలికిమాఱుఁగఱపి
కలికిచిలుకలకొలికి గాచిలుకఁ 4 బెనుచు. **228**

వ్యా :- కలికి = మనోజ్ఞురాలగు, చిలుకలకొలికి = చిలుకల

---

228 ప :- 1 బుల - ముద్రి (అ), ర. 2 ఁజాలఁగ; సారె - ర, గౌ. సారెఁ-అ.
3 మెఱపు - గౌ; మెరుపుబలు - చ, క; యొఱపుఁబలుకులు- ర, అ. 4 బెనిచ - క; బెనుచు - ర, అ.

(కన్ను) కొలుకలవంటి (కన్ను) కొలుకులుగలది - అహారిదాసి, (చెలువయెలనాఁగచిలుకలకొలికికలికి--అతివనాస్త్రీసమాఖ్యలు-అం.నం; కొలికి = "ముక్కునంటిన కంటిమూల" అని శ. ర. కాని బసవ పురాణమునుబట్టి కంటియావలితుద అవలితుదకూడ నర్థమగుచున్నది. సూ. ని.) కనకమణిపంజరంబునన్ = బంగారపురత్నపంజరమునందు, ఉనిచియునిచి = ఉంచియుంచి, సారెన్ = మాటికి, చక్కెరయున్= పంచదారయు, ఉక్కెరయున్ = బెల్లమును బిండియుఁగలిపిచేసిన యుక్కెఅయనుపేరుగల భక్ష్యవిశేషమును, క్రుక్కిక్రుక్కి = (నోటిలో) కూరికూరి, ఒఱపుఁబలుకులు = ఇంపయిన మాటలు, పలుమాఱు= పెక్కుసార్లు, కఱపికఱపి = బోధించిబోధించి: రాచిలుకన్ = (అ) రాజకీరమును, పెనుచున్ = పెంచును.

కొలికి = "కంటియావలితుద అవలితుద" (సూ. ని.)

మ॥ కలహంసోపమయానఁజక్రకుచఁ(బేంఖత్ఖంజరీటాక్షిఁగో
కిలసారస్వరబర్హిబర్హచికురన్ రీరప్రియాలాపఁదో
య్యలిఁజాలన్ మరిగెన్శుకంబదిగగీయః పిక్రమఁగామించుచున్
బులుఁగుంబొందుననందిపొందినగతిన్బొత్తొత్తులన్హత్తుచుఁ.

**229**

వ్యా :— కలహంస = రాజహంసతో, (కలహంస- రాజహంసే - శబ్దస్తో) ఉపమ = సమానమయిన, యానఁ = నడకగల దియు-రాజహంసనడకతో సమానమయిన నడకగలదియు, చక్రకుచన్=

229 ప ॥ 1 మహీయః - ముద్రి (అ), గరీయః – ర. ఆ, గౌ. 2 గావించు –ముద్రి (అ) ర, గామించు - అ, గౌ. 3 బొందిననం – త, బొందినవంది - గౌ; బొందుననంది - ర, ఆ. 4 పొత్తెత్తు-త,గౌ, బోతెత్తు – క, బొత్తొత్తు – ర, ఆ.

చక్రవాకములవంటి స్తనములుగలదియు, ప్రేంఖత్ = మిక్కిలి పరిభ్రమించుచున్న, ఖంజరీట = కాటుకపిట్టలవంటి (ఖంజరీటస్తుఖంజనః-అమ) అక్షిన్ = కన్నులుగలదియు, కోకిలసారస్వరన్ = పికముయొక్క శ్రేష్ఠమయిన కంఠస్వరమువంటి కంఠస్వరముగలదియు, బర్హిబర్హ చికురన్ = నెమిలిపింఛమువంటి కేశములుగలదియు, (చికురఃకుంతలోవాలః కచః కేశః శిరోరుహాః - అమ) కీరప్రియాలాపన్ = చిలుకవంటి యింపయిన పలుకులగలదియు - చిలుకపలుకులవంటి యింపయిన పలుకులుగలదియు, అగు; తొయ్యలిన్ = (అకాంతను - ఆహరిదాసిని. గరీయః = గురుతరమయిన, ప్రేమన్ = మక్కువతో, కామించుచున్ = అభిలషించుచు, పలుఁగు బొందునన్ = పక్షియొక్క, పొత్తునందు, అందిపొందిన గతిన్ = కలసిమెలసియున్నట్లు పొత్తొత్తులన్ = చెలిమినిబ్రకటించు నవయవములహత్తుటలతో, (చెలిమికి సూచనగాఁగాలులోనగు నవయవములతో హరిదాసిని జిలుకహత్తుననుట) హత్తుచున్ = కూడుచు, శుకంబది = అచిలుక, చాలన్ = మిక్కిలి, మరిగెన్ = మచ్చికపడెను.

పులుఁగుంబొందునఁనందిపొందినగతిన్-అనుటచే హరిదాసియందుఁ జిలుకపక్షులలక్షణములనరసి కలసిమెలసియుండెననిగమ్యమగును. ఆమె నడకయందుఁగల హంసలను, గుచములయందుఁజక్రవాకములను, గన్నులయందుఁగాటుకపిట్టలను. గంఠస్వరమునందుఁగోకిలలను, గేశములయందు నెమళ్లను, మాటలయందుఁజిలుకలనుజూచి రాచిలుక హరిదాసినిబులుఁగుఁబొందున నందిపొందిన గతిని బొత్తొత్తులహత్తుచు నామెతోనే యుండుటకిష్టపడెననుట.

వ్యాక :— తొయ్యలిన్ - అనువిశేష్యముద్వితీయాంతగగుటచే విశేషణములు ద్వితీయాంతములయ్యెను. (బా. కారక 1-9)

అందిపొందు - అందు+పొందు = అందిపొందు. బాలవ్యా. పక్షమున శబ్దపల్లవము. అథర్వణమతమున ఘటకక్రియ.

తే॥ ఆశుకద్విజరాజునకంతఁ గొంత
కాలమరుగంగ నొకనాఁడు కలిగె బంధ
మోక్షమాకస్మికంబ; నిర్ముక్తి కలిమి
యాశుకద్విజరాజున కద్భుతంబె! 230

వ్యా :— అశుకద్విజరాజునకున్ = ఆపక్షిశ్రేష్ఠమగు కీరమునకు, అంతన్ = ఆసమయమునందు, కొంతకాలము = కొంచెము కాలము, అరుగంగన్ = గతింపగా, ఒకనాఁడు = ఒక దినము, అకస్మికంబు = హఠాత్సంభవముగానే - అనుకొనకుండనే, బంధమోక్షము = చెఱవలనివిముక్తి - పంజరవిముక్తి, కలిగెన్ = సంభవించెను. అశుకద్విజరాజునకున్ = ఆశుకుఁడనెడుపనయన సంస్కారమునందిన బ్రాహ్మణశ్రేష్ఠునకు, (దంతవిప్రాండజా ద్విజాః - అమ) నిర్ముక్తి = మోక్షముయొక్క, కలిమి = ప్రాప్తి, అద్భుతంబె = అబ్బురమా? (అబ్బురము కాదనుట)

ద్విజరాజు - పక్షికండజన్మమొకటి, పిల్లజన్మమొకటి. విప్రునకుఁబుట్టుకతోజన్మించిన బ్రాహ్మణజన్మమొకటి. ఉపనయనసంస్కారానంతరముఁ గలిగిన విప్రజన్మమొకటి.

(i) "మాతురగ్రేఽధిజననం, ద్వితీయం మౌంజిబంధనే"
— ఇతిస్మృతిః (శబ్దస్తో)

(ii) జన్మనా బ్రాహ్మణోజ్ఞేయః, సంస్కారైర్ద్విజ ఉచ్యతే
విద్యయాయాతి విప్రత్వం, త్రిభిః శ్రోత్రియలక్షణమ్"
ఇతి ప్రాయశ్చిత్తవివేకః (శబ్దక)

శుకశబ్దమునకు (i) చిలుక (ii) శుకమహర్షియను నర్థములు. ద్విజశబ్దమునకు (i) పక్షి (ii) ఉపనయనసంస్కారమునందిన బ్రాహ్మణుఁడు - అని యర్థములు,

శుకమునకుఁగలిగినది పంజరబంధమునుండి ముక్తి. శుకనకుఁ గలిగినది దేహవిముక్తి. శుకమహర్షి ప్రకృతిలయమందెను. అనఁగా బ్రహ్మైక్యరూపమోక్షమునందెను.

సీ॥ జనియించెనొక్కో! పచ్చనిమొల్కయనుబుద్ధి
గుఱిచ్చిన పచ్చలకొమరువలన
సమకూరెనొక్కో! దాడిమఫలోద్భవబీజ
మతిపద్మరాగసామగ్రివలనఁ
బొడకట్టెనొక్కో! 1 జంబూఫలంబనుమనో
భ్రమమిందిరానీలవిభ్రమమువలనఁ
దోఁతెంచెనొక్కో! మధూకపుష్పములను
నాసహార్మంజిముత్యములవలన

తే॥ 2 దాదియటువెట్టి 3 పసుపాడఁ 4 దలఁగిచనుఁడు
5 బరణిమూఁకుటు నెలకొన్న బన్న సరముఁ
గఱచికొనిపోయెఁజిల్క పరిగల్భవిటుఁడు
బాలికామానసముఁగొనుపగిదినపుడు. **231**

వ్యా :— గుఱిచ్చిన = కూర్చిన, పచ్చలకొమరువలనన్ = మరకతమణులయొక్క యొప్పిదమువలన, పచ్చనిమొల్క = పచ్చనైన మొలకెత్తినబీజము - అనఁగా, నీటిలోనానఁబెట్టఁగా మొలకెత్తినపచ్చ పెసరగింజ, అను = అనెడు, బుద్ధి = తలఁపు, జనియించెనొక్కో = కలిగెనేమో! (ఒక్కొ - సందేహమును దెలుపును)

---

231 ప :- 1 జంబుఫలంబులను - ర; జంబూఫలంబను - అ, గౌ.
2 దాసి - ర, దాది - అ, గౌ. 3 పస - గౌ; పసు - ర, అ.
4 దలఁచి - గౌ; దలఁగి - ర, అ. 5 భరణి - ర (పా),
బరణి - ర, అ, గౌ.

మొల్క - పెసలు సెనగలులోనగువానిని నీటిలో నానఁబెట్టినచోనవి మొలకెత్తును. ఆమొలకెత్తినబీజము లేయిట మొల్కలనఁబడెను-అట్లుమొలకెత్తిన పెసలను. మొక్కపెసలని, సెనగలను మొక్కసెనగలని (పేరంటములలో నిత్తురు) వ్యవహారము. పచ్చనిమొల్క - అనుటచే మొలకెత్తిన పచ్చపెసలనిగ్రహింపనగును.

2) పద్మరాగసామగ్రివలనన్=పద్మరాగవస్తువులవలన, (సామగ్రీ= ద్రవ్యేచ - శబ్దస్తో, శోణరత్నంలోహితకః పద్మరాగః - అమ) దాడిమ ఫల = దానిమ్మపండువలన, ఉద్భవ = కలిగిన, బీజ = గింజలనెడు మతి = తలఁపునమకూరెనొక్కొ = సంఘటిల్లెనేమో!

సంహాళదేశమునలభించుపద్మరాగముమెఱుగానుండును - సింహళేతుభవేద్రక్తః, పద్మరాగమనుత్తమమ్'' - యుక్తిక. (శబ్దక)

3) ఇంద్రనీల = మహానీలమణులయొక్క, (ఇంద్రనీలం మహానీలమ్ - వై. ని.) విభ్రమమువలనన్ = శోభవలన, (విభ్రమ = శోభాయామ్ - శబ్దస్తో) జంబూఫలంబు = నేరేడుపండు, అను = అనెడు, మనోభ్రమ = చిత్తభ్రాంతి, పొడకట్టెనొక్కొ = రూపుదాల్చెనేమో!

ఇంద్రనీలము - "సింహళస్యాకరోద్భూతా, మహానీలాస్తుతే స్మృతాః" అగస్త్యః (శబ్దక)

4) హుమ్మంజిముత్యములఫలనన్ = హుంతముంజిదేశపుమౌక్తికములవలన, మధూకపుష్పములు = ఇప్పపువ్వులు, (మధూకేతుగుడపుష్పమధుద్రుమౌ - అమ) అను = అనెడు, అప = అభిలాష, తోఁతెంచెనొక్కొ = కలిగెనేమో!

మొదుల్ఫంజి - ఇది పర్షియాసముద్రతీరమునందలి 'ఆర్మోజా' రేవుపట్టణముగా గుర్తింపఁబడినది. (History of Reddy Kingdom)

దాది = పెంపుడుతల్లి, అటువెట్టి = ఆవిధముగా (ఒకచోట) నుంచి, పసుపాడన్ = పసుపుపూసికొని స్నానముచేయుటకు, తలఁగి చనఁ దున్ = (అక్కడనుండి) తొలఁగిపోఁగా. అపుడు = ఆసమయము నందు, చిల్క = (ఆ) కీరము, ప్రగల్భ విటుఁడు = ప్రౌఢుఁడయిన సరసుఁడు. (విటః = కామతంత్రకళాకోవిదః - ఇతి రసమంజరీ - శబ్దర) బాలికా = కన్యయొక్క, మానసమున్ = హృదయమును, కొనుపగిదిన్ = అపహరించియేగునట్లు, బరణిమూఁతుటన = బరణి యొక్క మూఁతయందు, నెలకొన్న = ఉంచియున్న, బన్న సరమున్ = పలురఁగులమణులుగ్రుచ్చినహారమును - మరకతపద్మరాగమహానీల మౌక్తికములుగ్రుచ్చిన హారమును, (సరవిశేషంబులు త్రాగెయు త్రడంబు బన్నసరంబునాబరఁగుచుండు - ఆం. భా.) కఱచికొని = ముక్కుతోఁ బట్టుకొని, పోయెన్ = అరిగెను.

అలం :— సందేహము, ఉపమ.

క॥ 1 బారాదిసొమ్ములుండఁగ
హార 2 మునయకొనుచుఁజనియెనండజము, ప్రియం
3 బారఁగఫలకాముకులగు
వారలుగుణవత్త్వసక్తి వదలవిడుతురే. **232**

వ్యా :— బారాది = బారువకొలఁది - అనేకములయిన, సొమ్ములు = ఆభరణములు, ఉండఁగన్ = ఉండఁగా, అండజము =

---

232 ప :- 1 బారాటి - క, బారాది - ర, అ, గొ. 2 మునే-ముద్రి(అ),ర, మునయ - అ, గొ. 3 బారయు - డ, ద, ఖ, బారసి-అ, గొ బారఁగ - ర; శ. ర.

పక్షి - (అ) చిలుక, హారమునయ = హారము (బన్నసరము) నొక్క దానినే, ప్రియంబారఁగన్ = ఇంపారఁగ, కొనుచుఁజనియెన్ = పట్టుకొనిపోయెను. ఫలకాముకులగువారలు = ప్రయోజనమునపేక్షించువారు, గుణవత్ = మంచిగుణములుఁగలవారియొక్క - అని యర్థము. దారముతోఁగూడుకొన్న దానియొక్క - హారముయొక్క, (రజ్జుస్త్రిమవటీగుణః - అమ) - అనియర్థాంతరము. ప్రసక్తి = ప్రకృష్టమయిన (అధికమయిన) సంబంధమును, వదలన్ = శిథిలమగునట్లు, (సడలునట్లు) విడుతురే = త్యజింతురా? (త్యజింపరనుట) - అని యర్థము. ఫలకాముకులగువారలు = పండ్లనపేక్షించువారు, గుణవత్ = త్రాడుఁతోఁగూడుకొన్న దానియొక్క (త్రాటితోనల్లుటకలదానియొక్క)-చిక్కముయొక్క, ప్రసక్తి = అధికమయిన సంబంధమును, వదలన్ = సడలునట్లు, విడుతురే = త్యజింతురా? (త్యజింపరనుట) అనియర్థాంతరము.

బారాది - "బారాది (బార 2+ అది) అనేకములు'' (సూ. ని.)

వ్యాక ;— హారమునయ - హారమున్+అ = హారమున + అ = హారమునయ. (ము. కౌ. ప్రకీర్ణక)

అలం :— అర్థాంతరన్యాసము, శ్లేష.

క॥ అధవళకిరణముఖికి న
సాధుశుకాచరణమపుడసహ్యంబయ్యెన్
గోధు 1 క్ష్వతిసతికిమనో
బాధకమగుకృష్ణధూర్తబాల్యముఁబోలెన్. **233**

వ్యా ;— అధవళకిరణముఖికిన్ = అ చంద్రాననకు - అనాతిదాసికి, (విధుఃసుధాంశుఃశుభ్రాంశుః - అమ, శుభ్రాంశుఁడు = ధవళ

---

233 ప : 1 క్ష్వ్రతి - ముద్రి (అ), ర, క్ష్వతి - అ.

కిరణుఁడు) అసాధు = ధూర్తమయిన, శుక = చిలుకయొక్క; ఆచరణము = ప్రవర్తన. గోధుక్పతి పతికిన్ = గోపరాజపత్నికి (నంద పత్నికి) - యశోదకు; మనోబాధకమగు = హృదయమునకు వ్యథ గలిగించునదియగు. కృష్ణ = కృష్ణునియొక్క, ధూర్తబాల్యముఁబోలెన్= దుండగపుబాల్యావస్థవలె, అపుడు = ఆసమయమునందు, అసహ్యం బయ్యెన్ = ఓర్వరానిదయ్యెను.

గోధుక్ (హ్) గాందోగ్ధీతి - గో+దుహ్+-క్విప్ = గోదోగ్ధా- ఇతివ్యాకరణమ్. (శబ్దక) = గోవులను పిదుకువాఁడు - గొల్ల.

అలం :- ఉపమ.

మ॥ కటిఁజేలార్ధము 1 గట్టిచిక్కినది 2 వేగంజుట్టిపాలిండ్లమీఁ
దటసంధిం 3 చుచునార్ద్రదేహలతమాద్యద్వర్షధారా 4 వల
త్తటిదాకారముఁజూప, 5 దోఁపికొనుచున్ధమ్మిల్లబంధంబు, ముం
గిటికిన్సుస్తనివచ్చె గోస్తనహారత్క్రి[?]రగ్రహావ్యగ్రయై. **234**

వ్యా :— కటిన్ = మొలయందు, (కటిశ్రోణిః కకుద్మతీ- అమ) చేల = వస్త్రముయొక్క, అర్ధము = సగభాగము, కట్టి = బంధించి, చిక్కినది = శేషించినది (మొలకుఁగట్టుకోఁగామిగిలినది - అనుట) వేగన్ = త్వరతో (ఆదరబాదరగా - అనుట) చుట్టి = (దేహమున) చుట్టుకొని, పాలిండ్లమీఁదటన్ = స్తనములయొక్క పై భాగమునందు, సంధించుచున్ = చెర్చుచు, ఆర్ద్ర = తడిసిన, దేహ

234 ప :- 1 చుట్టి - ముద్రి [అ] గట్టి - ర, అ. 2 మేనం - ముద్రి [అ] -యతిభంగము; వేగం - ర, అ, గౌ; 3 పుచు-గౌ; చుచు - ర, అ. 4 వళ-చ; వల - ర, అ. 5 ద్రోసికొను - డ, ద, బ; దోపి కొను- ర, గౌ; దోఁపికొను - అ.

లత = తీఁగవంటి శరీరము, మాద్యత్ = మదించుచున్న - అతిశ యించుచున్న, వర్షధారా = వానచాలుచేత, వలత్ =కూడుకొనుచున్న తటిత్=మెఱపుయొక్క, ఆకారమున్= అకృతిని, చూపన్=ప్రకటింపఁగా, (తడిసినమేనుఁదీఁగ, వర్ష ధారలచేఁగూడుకొన్న మెఱపుఁదీఁగవలెనున్న దనుట) ధమ్మిల్లబంధంబున్ = జుత్తుముడిని, దోఁపికొనుచున్= కల్పించు కొనుచు, సున్తని = (అ) గుబ్బెత - ఆహరిదాసి, గోస్తన (అ) నలువది పేఁటులముత్యాల పేరును, (హారభేదాయష్టి భేదాద్గుచ్ఛగుచ్ఛార్ధగోస్తనాః - అమ = గోస్తనవత్ నాభేదథోవర్తమానత్వాత్ గోస్తనః - గోస్త నమువలె నాభియొక్క యధోభాగమందుండునది. నలువది సరముల ముత్యాలదండ పేరు - గుఱుబాల) హరత్ = హరించు చున్న - పట్టుకొనిపోవుచున్న, కీర = చిలుకయొక్క, గ్రహ = గ్రహించుటయందు. (పట్టుకొనుటయందు) వ్యగ్రయై = వేగిరపాటు గలదై, ముంగిటికిన్ = వాకిటికి, వచ్చెన్ = అరుదెంచెను.

"తక్కినది వేగంజుట్టి పాలిండ్ల మీఁదట సంధించుచు" - అనునట హరిదాసివేగిరపాటును దెలుపును. ఏలన. "పోకముడివేసికొన్న తర్వాత చీరను కుచ్చెళ్ళుపట్టి చెక్కుకొని దానిపై ఇంకొక చుట్టుతెచ్చియెదమీఁద కప్పుగానంతరించుట స్వభావము." (రా. అ - సాహితి 1963 మార్చి)

అలం :— ఉపమ,

తే॥ వర్షధారా 1 వశేషాన్వవాయ 2 యుక్తి
వాయువశమునఁదెరలు మువ్వన్నెవిల్లు
వేడ్కవెన్నాడు 3 శశివోలెవెలఁదిచాప
లమునసరమాహ 4 రించు 5 కీరముఁదవులుచు. **235**

---

235 ప :- 1 విశేషా - చ, త, గొ: వశేషా - ర, అ. 2 శక్తి - చ: యుక్తి - ర, అ. 3 శచివో - చ; శశివోలె - ర, అ. 4 ర్రించి - ర; రించి-ర; రించు - అ, గొ, 5 శుకము - డ, ద, బ; కీరము - ర, అ.

వ్యా :— వెలఁది = (అ) కాంత - (అ) హారిదాసి, చాపలమునన్ = చంచలత్వముతో, సరము = హారమును, అహరించు = అపహరించు, (ఎత్తుకొనిపోవు - అనుట) కీరమున్ = చిలుకను, తవులుచున్ = వెంబడించుచు, వర్షధారా = వానచాలుయొక్క, అవశేష = మిగిలినదానియొక్క, అన్వవాయ = (జల) సంతతితో, యుక్తిన్ = కూడుకొనుటచేత - వర్షధారలుడిగిపోఁగా మిగిలినజలబిందుసంతతితోఁ గూడుకొనుటచేత, వాయువశమునన్ = గాలికిలోఁబడినదియగుటచేత, గాలియొక్క ప్రేరణచేత, తెరలు = సంచలించు. మువ్వన్నెలవిల్లు = ఇంద్రధనుస్సును, వేడ్కన్ = కుతూహలముతో, వెన్నాడు = వెంబడించు, శశి = చంద్రుని, పోలెన్ = సరిపోలెను.

రామచిలుకను వెంబడించు నాహారిదాసి, వర్షధారలుడిగిపోఁగా మిగిలిన జలబిందుసంతతితోఁగూడుకొని, వాయుప్రేరణమునఁ జలించు నింద్రధనుస్సును గుతూహలముతో వెంబడించు చంద్రునిఁబోలెను.

రామచిలుక పంచవన్నెలుగలది. ఇంద్రధను వేడువర్ణములుగలది. (చూ 4-223)

మువ్వన్నెవిల్లు - నీలము, పసుపుపచ్చయాకుపచ్చయనునవి యింద్రధనుస్సునఁ బ్రధానవర్ణములు. కావున నింద్రధనుస్సును మువ్వన్నెవిల్లని యందురు.

శశివోలె - అనుటచే హారిదాసి ముఖము, శశివలెనున్నదనుట. వెలఁది = వెల్ల (తెల్ల) నిది - అని వ్యుత్పత్తి.

చంద్రుఁడు రాత్రియుండును. ఇంద్రధనువు రాత్రియుండదు. అయినను సంభావన (=ఊహ) గావున విరోధములేదు. "వల్మీకేశస్త్రభయం నిశిసచివవధాయ ధనురైంద్రవమ్- (బృ. సం.) అనుశాస్త్రవచనముచేత, (ఆముక్త 4-89 సంజీ) రాత్రిగూడ నింద్రధనువుండవచ్చుననియు సమాధానము చెప్పవచ్చును.

రామచిలుక వాయుప్రేరణమున సంచలించునింద్రధనుస్సుగాను హరిదాసి యాయుందగ్రిధనుస్సును వెంబడించుశశిగాను సంభావన. ఇంద్రధనుస్సువాయుప్రేరణమున సంచలించును. చూ 223 వ్యాఖ్య.

అలం :— ఉత్ప్రేక్ష.

మ॥ గుహమాతృస్ఫటికాక్షసూత్రముసితేక్షుచ్ఛేదగుచ్ఛ 1 చ్ఛటా
స్పృహఁగైకొన్న 2 శుకంబో!యేమఱుతటిన్ జీరాడుపూవాగెతో
బహిరుడ్డీనతనొడ్డి ల్చురతిరాట్పట్టాశ్వమోనాఁగ, న
మ్మహిళావిభ్రమి కీరమొప్పుముఖసీమాగామిముక్తాళియై. **236**

వ్యా :— సితేక్షు = తెల్లచెఱకుయొక్క, ఛేద =ముక్కల యొక్క, (తెల్లచెఱకు ముక్కలయొక్క) గుచ్ఛ = గుత్తులయొక్క; ఛటా = సమూహమనెడు, స్పృహన్ = ఆశచేత, గుహమాతృ = కుమారస్వామితల్లియొక్క - పార్వతీదేవియొక్క, స్ఫటికాక్ష సూత్రమున్ = స్ఫటికనిర్మితమగు జపమాలను, కైకొన్న = గ్రహించిన, (ముక్కతోఁబట్టుకొన్న - అనుట) శుకంబో = చిలుకయో! (ముంజేతి చిలుకయో) ఏమఱుతటిన్ = పరాకుగానున్న సమయమునందు, జీరాడు = వ్రేలాడు, పూవాగెతోన్ = (నోటికళ్లెమునకుఁదగిలించెడు) పూలపగ్గముతో, బహిః = వెలుపలిదయిన, ఉడ్డీనతన్ = ఊర్ధ్వగమనత్వమునందు--పైకెగురుటయందు, (ప్రడీనోడ్డీనసండీనాన్యేతాః ఖగగతిక్రియాః - అమ; ఊర్ధ్వండయనముడ్డీనమ్ - గురుబాల) ఒడ్డి = పందెము చఱచి, నిల్చు = (పోటీగా) నిలఁబడు, రతిరాట్ = రతిపతియొక్క - మన్మథునియొక్క, పట్టాశ్వమో = పట్టపుగుఱ్ఱమో - పట్టపువాహనమగు చిలుకయో, నాఁగన్ = అనునట్లు, (బహిరంగముగా

236 ప :- 1 చ్ఛవి - గౌ; చ్ఛటా - ర, అ. 2 శచీకబోయెమరుతటి - త' యేమఱుతటిన్ - ర, అ, గౌ.

నేర్పఱిచిన, మీఁదికెగురుపోటీపందెమునందుఁ, బందెముచఱచి పోటీకి నిలఁబడినమన్మథుని వాహనమగు చిలుకయోయనునట్లు) అమ్మహిళా= అవనితయొక్క - అహరిదాసియొక్క, విభ్రమకీరము = విలాసార్థము ధరించుచిలుక, ముఖసీమా = నోటిప్రదేశమును, గామి = పొందినదియగు, ముక్తాళియై = ముత్యాలహారముగలదై!, ఒప్పున్=శ్రోలును.

ముత్యాలహారము తెలుపు. స్ఫటికాక్షమాలికతెలుపు. పూవాగె తెలుపు. పుష్పసామాన్యవర్ణముతెలుపనుట కవిసమయము. "సామాన్య గ్రహణే - పుష్పాణాశౌక్ల్యమేవచ" (కవికల్ప.)

పార్వతీదేవి చేతిలో స్ఫకాక్షమాలయుండును. "వరత్రాసత్రాణ స్ఫటికఘుటికాపుస్తకకరామ్" (సౌందర్య)

అక్షమాల —

"పద్మబీజాదిభిర్మాలా, బహిర్యాగే(శుణుష్వతాః
రుద్రాక్షశంఖపద్మాక్ష, పత్రజీవకమౌక్తికైః
స్ఫాటికైర్మణిరత్నైశ్చ, సువర్ణైర్విద్రుమైస్తథా
రాజితైః కుశమూలైశ్చ, గృహస్థస్యాక్షమాలికా"
(కాళికా) - శబ్దక.

విలాసినులుముంజేతఁజిలుక ధరింతురనుటకు -

"భారతీదేవి ముంజేతిపలుకు చిలుక
సమదగజయాన స్రబహచారిమాకు" (శృ. నై. 2-49)

అలం :— ఉత్ప్రేక్ష.

వ॥ ఈ చందంబునఁ 1 గందర్పస్యందనంబు (1) వినిందితుండన 2 మంద మందప్రచారంబును (2) మలిమ్లుచుండనదుర్గమప్రవేశనిపుణంబును, (3) నవివేకియన 3 శిథిలీకృతస్వపక్షంబును, (4) దనుజగృహీత జనకజయనరామానుసరణసముచితంబునునై, (5) యున్మత్తుపోలికం జంచు 4 చుంబిలలంతికావ్యాజంబునలాలఁగ్రొక్కుచుఁ (6) బుష్పవద్బింబంబువిధంబులశరీరప్రభా 5 దంభంబున నంభోధరంబులచేఁతఁ గప్పంబడుచు, (7) యోగిబాగున విచ్ఛిన్నచరణశృంఖలాచ్ఛలనంబునఁబాశచ్ఛేదంబుసేయుచుఁ (8) బరవధూపయోధరంబుపగిదిఁబట్టరాక, (9) నీతివిదుహృదయంబు 6 గతిదూరదర్శనయోగ్యంబై (10) కరువలి 7 మురువునంబాడమియడంగుచుఁ (11) బరబ్రహ్మంబు చాడ్పున 8 నగోచరంబయ్యెను దదీయమాయావిలసి 9 తంబునెన కంబుననిజప్రతిభాసంబునయాథార్థ్యభూమిక నభిన 10 యించుచు (12) శశాంకశిలాసౌధ విటంకంబులనుంకువ గొన్నతటీశరన్నీరద వశంవదంబగుసునాసీర 11 శరాసనశకలంబనమెలంగుచు (13) నంతరిక్షమహాప్లక్షంబునకు 12 నక్షామ 13 చంచుపుటప్రవాళఖండప్రభా

---

237 వ॥- 1 దర్పక – గౌ॥ (గందర్ప – ర. అ. 2 మందప్ర - గౌ॥ మంద మంద – ర. అ. 3 శిథిల - గౌ॥ శిథిలీ - ర. అ. 4 చుంబిత-గౌ చుంబి - ర. అ. 5 దుర్భరంబున - గౌ॥ దంభంబున - ర, అ. 6 పగిది – గౌ॥ గతి - ర, అ 8 మురువునం - గౌ॥ మురువున- ర, అ. 8 గోచరంబును - త॥ నగోచరంబయ్యెను - ర. అ. 9 తంబునై సకలంబుననిజ - ముద్రి (అ) సకలంబను - ర, బునై సకలంబును - గౌ॥ తంబునెసకంబుననిజ - అ. 10 యింపుచు - గౌ॥ యించుచు – ర, అ. 11 శిలాశకలం – ద॥ దు॥ బ॥ శరాసన–ర, అ, గౌ. 12 క్షామ–గౌ॥ నక్షామ – ర, అ. 13 చంచూ - ర, గౌ॥ చంచు - అ.

14 హిండనంబునన్ 15 దొరలిసఫల 16 విటపలక్ష్మీనావ 17 హింపుచుఁ (14) ప్రమాదవిగళితంబగు నగవిరోధి 18 కొలువుపీవన 19 యచ్చర పచ్చులకడియంబువడువున నిరాలంబన స్థలంబునన్ బలుమఱుఁ 20 జక్రచంక్రమణ 21 చమత్కారంబు సూపుచు, (15) సమీపారామ శ్యామలపలాశపటలగర్భంబునందు 22 ముకుంద విగ్రహంబునందు భక్తిసమగ్రుండగు పురుషశ్రేష్ఠుండునుంబోలె నేర్పుఱుపరాకడిందుముఁ (16) నందందజాతి పులుఁగులు మనుజగంధధురంధరం బగుట జగడంబుసిగిచినన్గినిసి, విస్ఫురితనూరుహదంతురకపో 23 లాంత రంబును, విఘూర్ణనవిక్రుతవీక్షణంబునై 24 క్షణంబుమణివలయవలయి తంబగు 25 రతియువతిముంజేతి 26 రీతింజెలు 27 వడరుమెడ 28 నిగు డించి, మగుడంబడి 29 కాకుప్రకార వికారస్వరంబుగ వానినిరాక రింపుచున్ బఱచు 30 నప్పుఱచుఁజిలుక 31 కలిగినయదివోలె నయ్యు న్నతెన్నాడన్, 32 బెన్నాటకంబై, (17) బోఁటికత్తి 33 యలు

---

14 విన్మండనంబున - గొ; హిండనంబున - ర, అ. 15 దొరలిన పల - చ; దొరలినఫల - గొ; దొరలిసఫల - ర, అ 16 విపుల-గొ విటపి - ర, అ. 17 హించుచు - ర; హింపుచు - అ, త్రి. 18 కొల్వు - గొ. కొలువు - ర, అ. 19 యచ్చరల —ముద్రి(అ) ర,గొ; యచ్చర - అ. 20 చక్ర-ర,అ; ఁజక్ర-గొ. 21 రోచమ-త, చమ - ర, అ. 22 ముకుందు - గొ; ముకుంద-ర, అ. 23 లాం తంబు - క. త. లాంతరంబు — ర, అ 24 దక్షణంబు — గొ; క్షణంబు — ర, అ. 25 రతిపతిముం - చ. త, రతిపతియువతి-గొ. 26 లీలం — గొ; రీతిం — ర, అ. 27 వలదు - గొ; వడరు-ర,అ. 28 నిగిడించి — ర, నిగుడించి - అ. గొ; 29 కాకప్రకారస్వరం బుగా — గొ; కాకుప్రకారవికార - ర. అ. 30 నప్పుఱచు-'గొ' లోలేదు. 31 ఁగరగిన - ఉ. డ, డ, ఱ; కలిగిన - ర, అ, గొ. 32 బెన్నాటి - త. 33 యలుత్తుంగ - ముద్రి (అ) ర; యలుత

తదుత్తుంగ కుచోత్సంగ సంగతకురంగలాంఛన కళావలోకంబున ముసిముసి 34 నగవులెగయ "గోరువంకగాన వచ్చెంగాని కీరంబు దూరంబయ్యెఁగదే" యని గర్భోక్తి వైదర్భిం గూడి యాడుచుం 35 బాడుచుఁ, (18) బంజరంబును జిలుకచాలు తెరయును 36 శారికయును జేరికచేసి 37 యెలయింపనలయించుచు, (19) నడిఱెక్క 38 గ్రిక్కిటించుచు, (20) నొక్కయెడంగాలు వొడిచిముక్కున నక్కంఠహార తరళంబునొక్కుచుఁ (21) జిక్కెంజిక్కె 39 నిక్కడక్కడనక్క! యక్క! యని 40 చేటికానికరంబు 41 పొలసిన 42 సులుగెటింగి, (22) మెఱుంగుమెఱసి తొలంగిన తెఱంగున, డాయవచ్చి 43 నట్టులమాయంబగు మాయ 44 లేటిపాటిఁబోవంబోవ దూరంబగుచునుండు నెండ 45 మావులమాడ్కిఁడివియ 46 వచ్చుటునటించి, మువ్వలోని రాయిపోయగంబున నొక్కింతవట్టువడుట పచరించి, (23) పఱిచుర రయంబునఖచరపురప్రాసాదంబులు 47 మోవంబూఁపున నగసితిరిగి

---

దుత్తుంగ – అ. 34 పుటనెఱయ - డ, ద, బ; నగవులెగయ -ర, అ, గౌ. 35 బాడుచు - 'గౌ' లోలేదు. 35 శారికయును-"ముద్రి లోలేదు" - అ, శారికయునుజే - అ; శారికయునుఁజే - గౌ. 37 నలరింప - క; యెలయింప - ర, అ. 38 గెక్కరిం - త; గ్రిక్కరిం - అ. 39 నిక్కడనిక్కడ - ముద్రి (అ); నిక్కడ క్కడయని - గౌ; నిక్కడక్కడనక్కయక్కయని - అ. 40 చేరికొని – గౌ; చేటికాని - ర, అ. 41 పొలసిన–ర, గౌ; పొలిసిన-అ. 42 పులుగె - ముద్రి (అ), ర, సులుగె - అ. 43 నట్లన-ప,ర; నట్టుల - అ. 44 లేడిపోలిక - గౌ; లేడి - ప, లేటిపోటిఁ - త, లేటిపాటి – ర, అ. 45 మావి - గౌ; మావుల -ర, అ. 46 వచ్చుట డ, ద, బ; వచ్చుట - ర, అ, గౌ. 47 మోపంబూఁపున - గౌ.

48 పెఱతెరువునంబఱతెంచి పాండురంగాయతనంబు 49 మధ్య
రంగంబు 50 సొచ్చియచ్చటనిచ్చందన యిచ్చనుండుదండియంబు
పై 51 ప్రాలె, నంతనచ్చట. **237**

వ్యా :— (1) ఈచందంబునన్ = ఈవిధముగా, కందర్ప = మన్మథునియొక్క, స్యందనంబు = రథము (వాహనము) - చిలుక, వినిందితుండు = గర్హితుఁడు, అనన్ = అనునట్లు, మంద మంద ప్రచారంబును = మెల్లమెల్లనిగమనముగలదియు-అని చిలుక పక్షమున నర్థము. మందమంద = మిక్కిలిమూర్ఖమయిన నడవడిగలిగిన - అని వినిందితుని పక్షముననర్థము.

(2) మలిమ్లుచుండు = చోరుఁడు, అనన్ = అనునట్లు (చోరైకాగారికస్తేన -- పాటచ్చరమలిమ్లుచాః - అమ) దుర్గమ = అరుగశక్యము కాని ప్రదేశములను, ప్రవేశ = చొచ్చుటయందు, నిపుణంబును= నేర్పుగలదియు - అని చిలుకపక్షముననర్థము. దుర్గమ = దుర్గము, (కోట) లను, (దుర్గమః = దుర్గః - శబ్దక) ప్రవేశ = చొచ్చుటయందు, నిపుణంబును = నేర్పుగలిగిన - అనిచోరపక్షముననర్థము.

దుర్గమ - దుర్గశబ్దపర్యాయము, దుర్గమము. తురంగతురంగమ శబ్దములవలె, దుర్గదుర్గమశబ్దములు గ్రాహ్యములు.

దుర్గభేదములు --

"తత్రదుర్గంనృపః కుర్యాత్, షణ్ణామేకతమంబుధః
ధన్వదుర్గంమహీదుర్గం; నరదుర్గంతథైవచ

---

మోవంబూఁపున - ర, అ. 48 పొరందేర్పున - గొ; పెఱతెరువున- ర, పెరతెరువున - అ. 49 మధ్యరంగంబు - 'ప' లో లేదు. 50 సొచ్చి - గొ, చొచ్చి - ర, అ. 51 వ్రాలనిచ్చుట - ముద్రి (అ) ర, వ్రాలెనచ్చట - గొ, వ్రాలెనంతనిచ్చట - అ.

వార్క్షంచైవాంబుదుర్గశ్చ, గిరిదుర్గంచపార్థివ !
సర్వేషాంచైవదుర్గాణాం, గిరిదుర్గంప్రశస్యతే (మత్స్య) - శబ్దక

దుర్గలక్షణము —

"దుర్గంచపరిఖోపేతం, వప్రాట్టాలకసంయుతమ్
శతఘ్నీయంత్రముఖ్యైశ్చ, శతశశ్చసమావృతమ్"
(మత్స్య) - శబ్దక.

(3) అవివేకి = వివేకములేనివాఁడు, అనన్ = అనునట్లు, శిథిలీకృత = వదులుచేయఁబడిన, స్వ = తనదైన, పక్షంబును = ఱెక్కలుగలదియు - అని చిలుకపక్షమునవర్థము. శిథిలీకృత = భగ్నపఱుపఁబడిన, స్వ = తనదైన, పక్షంబును = వర్గముంగలిగిన - అనియవివేకి పక్షమునవర్థము.

(4) దనుజ = దానవునిచేత - రావణాసురునిచేత, గృహీత = గ్రహింపఁబడిన, జనకజ = జానకి - సీత, అనన్ = అనునట్లు, రామా = స్త్రీలయొక్క,(హారిదాసియొక్కయు నామెచెలులయొక్కయు) అనుసరణ = అనుసరించుటచేత, సముచితంబునునసై = మిక్కిలి యోగ్యమయినదియునై అని చిలుక పక్షముననర్థము. రాము = రాముచియొక్క, అనుసరణ = అనుసరించుటచేత, సముచితంబునునై = మిక్కిలి యోగ్యమయిన - అని సీతాపక్షముననర్థము.

దనుజ - కశ్యపమహర్షివలన దనువునందు, గలిగినవారు దనుజులు లేదా దానవులు. రావణుఁడుకైకసీపుత్త్రుఁడుగాని దనువుపుత్త్రుఁడు కాఁడు రావణుని తండ్రి విశ్రవసుఁడు. దైత్యదానవరాక్షసాసుర శబ్దములు వేర్వేఱు వర్గములను దెలుపుపదములు. దేవతా విరోధమను సామాన్యలక్షణమును బురస్కరించుకొని యాభిన్నవర్గములకైక్యము చెప్పుట కవిసమయము. "దైత్యదానవాసురాణామైక్యమ్" (కా. సూ.)

అలం :- శ్లేషోత్థాపితములగునుపమలు.

(5) ఉన్మత్తుపోలికన్ = పిచ్చివానివలె, చంచు = త్రోటియొక్క, (ముక్కుయొక్క) చుంబి = చుంబనముగల - కూడికగల, (ముక్కునందున్న - అనుట) లలంతికా = నాభిపర్యంతము వ్రేలెడుహార విశేషముయొక్క (లంబనంస్యాల్లలంతికా - అమ) వ్యాజంబునన్ = మిషచేత, లాలన్ = లాలాజలమును, గ్రక్కుచున్ = నోటినుండి బహిర్గతముచేయుచు.

శ్లేష్మప్రకోపముగలయున్మత్తునివలెఁ జిలుక,తనముక్కున వ్రేలాడు బన్న సరముయొక్క వ్యాజమునలాలాజలమును గ్రక్కుననుట.

శ్లేష్మప్రకోపముగలయున్మాది లాలాజలమునుఁగ్రక్కును.

"శ్లైష్మికస్యనిదానపూర్వికాం సంప్రాప్తిమాహ —

'ఛర్దిశ్చలాలాచబలంచముక్తే

నఖాదిశౌక్ల్యంచ, కఫాత్మకేస్యాత్'

— ఇతిభావప్రకాశః" (శబ్దః)

(6) పుష్పవద్బింబంబు వడువునన్ = సూర్యచంద్రబింబముల వలె, (ఏకయోక్త్యాపుష్పవంతౌదివాకరనిశాకరౌ - అమ) శరీరప్రభా = దేహకాంతియొక్క - శిరస్సుయొక్కయు జెక్కలయొక్కయుఁ గాంతి యొక్క, దంభంబునన్ = మిషచేత, (వ్యాజందంభోపధయశ్ఛద్మకైతవే - అమ) అంభోధరంబులచేతన్ = మేఘములచేత, కప్పఁబడుచున్ = ఆచ్ఛాదింపఁబడుచు.

సూర్యచంద్రబింబములవలెఁ జిలుకతనతలయొక్కయు జెక్కల యొక్కయుఁగాంతి వ్యాజమునమేఘములచేతనాచ్ఛాదింపఁబడుననుట. రామచిలుకతల, శ్యామవర్ణముగలదై యుండును. జెక్కలు హరితవర్ణము గలవై యుండును. (చూ 4-223 వ్యాఖ్య) మేఘవర్ణమునలుపు. శ్యామ

హరితవర్ణములకుఁగృష్ణవర్ణముతో నైక్యముకవిసమయము. "కృష్ణహరితయోః, కృష్ణశ్యామయోః - ఏకత్వేననిబంధనంచ కవిసమయః" (కావ్యమీ)

అలం :— అపహ్నవానుప్రాణితములగునుపమలు.

యోగిభాగునన్ = యోగివలె, విచ్ఛిన్న = త్రెంచఁబడిన, చరణశృంఖలా = కాలిసంకెలయొక్క, ఛలనంబునన్ = మిషచేత, పాశ = బంధములయొక్క - ప్రాపంచికబంధములయొక్క, ఛేదంబు=త్రెంచుటను, చేయుచున్ = ఒనర్చుచు - అని యోగిపక్షముననర్థము. పాశ = త్రాటియొక్క, ఛేదంబు = త్రెంచుటను, చేయుచున్ = ఒనర్చుచు అని చిలుకపక్షముననర్థము.

అలం :— అపహ్నవశ్లేషానుప్రాణితమగునుపమ.

(8) పరవధూ = పరకాంతయొక్క, (నారీసీమంతినీవధూః - అమ) పయోధరంబుపగిదిన్ = స్తనమువలె, పట్టరాక = పట్టుకొనశక్యముకాక.

(9) నీతివిదు = రాజనీతి శాస్త్రజ్ఞునియొక్క, హృదయంబుగతిన్ = మనస్సువలె, దూరదర్శన = దవ్వునుండి చూచుటకు, యోగ్యంబై = తగినదై - అని చిలుకపక్షముననర్థము. దూరదర్శన = రాఁబోవుకార్యమును ముందుగాఁదెలిసికొనుటకు, యోగ్యంబై = తగినదై - అని నీతివిదునిహృదయపక్షముననర్థము.

(10) కరువలిమురువునన్ = గాలివలె, పొడమి = కనఁబడి, అడంగుచున్ = కనఁబడకుండఁబోవుచు - అని చిలుకపక్షముననర్థము. పొడమి = పుట్టి - ఎక్కువగావీచి, అడంగుచున్ = ఉపశమిల్లుచు - అని గాలిపక్షముననర్థము.

మురువు - సౌందర్యము; సౌందర్యవాచకములివార్థములగును. మువ్వలోపలిజాతి మురువువడయ - శివరా 1-61; తెల్పుమురువున- కాళహ 1-86

(11) పరబ్రహ్మంబుచాడ్పునన్ = పరమాత్మవలె, అగోచరంబ య్యును = కంటికిఁగానరానిదయ్యును - అని చిలుకపక్షమునర్థము. అగోచరంబయ్యును = ప్రత్యక్షజ్ఞానముచే గ్రహింపరానిదయ్యును - అని పరమాత్మపక్షమునర్థము. తదీయ = తత్సంబంధమయిన - ఆపరమాత్మసంబంధమయిన, మాయా = అవిద్యయొక్క, విలసితంబు నెసకంబునన్ = విలసనమువలె, నిజ = తనదైన, ప్రతిభానంబు నన్ = అగపడుటయందు, యాథార్థ్య = వాస్తవికత్వముయొక్క, భూమికన్ = వేషమును, (ప్రాణినాత్యేధికృతాస్తత్ద్వేషస్తుభూమికా- అభి. చిం) అభినయించుచున్ = నటించుచు - వాస్తవముగాఁగన వచ్చినట్లు స్ఫురింపఁజేయుచు - అని చిలుకపక్షమునర్థము. నిజ = తనదైన, ప్రతిభానంబునన్ = స్ఫురించుటయందు. యాథార్థ్య = వాస్తవికత్వముయొక్క - వ్యావహారిక సత్యత్వముయొక్క, భూమి కన్ = వేషమును, అభినయించుచున్ = అని మాయావిలసితపక్ష మునర్థము.

మాయ - పరబ్రహ్మస్వరూపముయొక్క యజ్ఞానము (పర బ్రహ్మస్వరూపము నెఱుఁగకపోవుట) మాయయనఁబడును. మాయ, (= పరబ్రహ్మస్వరూపముయొక్క యజ్ఞానము) ప్రపంచరూపమునఁ బరిణమించుచున్నది. (ప్రపంచముగా భాసిల్లుచున్నదనుట) కానఁబ్ర పంచమునకు మాయ, పరిణామ్యుపాదానకారణమనఁబడును. బ్రహ్మము ప్రపంచమునకు వివర్తోపాదానకారణము. వివర్తమనఁగాఁదనస్వరూప మును విడువకయితరమునుభాసిల్లఁజేయునదియనియర్థము. బ్రహ్మము తన స్వరూపమును విడువకయే మాయమహిమమునఁ బ్రపంచముగా

భాసిల్లుచున్నది, కానఁ బ్రపంచమునకు బ్రహ్మము వివర్తోపాదానకారణ మన్న మాట. దీనిని వివర్తవాదమని యందురు.

రజ్జుసర్పభ్రాంతిదీనికుదాహరణము. చీకటిలో రజ్జువుసర్పముగా భాసిల్లుచున్నట. రజ్జుస్వరూపముయొక్క యజ్ఞానము, (= రజ్జువని తెలియకపోవుట) సర్పరూపమునఁబరిణమించుచున్నది. కాన సర్పము నకు రజ్జువుపరిణామ్యుపాదాన కారణము. రజ్జువు సర్పమునకు వివర్తో పాదానకారణము. ఏలన, రజ్జువుతన స్వరూపమును విడువకయే, రజ్జు స్వరూపముయొక్క యజ్ఞానము మూలమున (రజ్జువని తెలియకపోవుట మూలమున) సర్పముగా భాసిల్లుచున్నది. కాన సర్పమునకు రజ్జువు

అద్వైత సిద్ధికలిగినప్పుడు బ్రహ్మమేసత్యము. జగత్తు మిథ్య. అంతవఱకు జగత్తు వ్యావహారిక సత్యము. ఇది పారమార్థికసత్యముకాదు వివర్తోపాదానకారణమన్న మాట.

అలం :— శ్లేషోత్థాపితములగునుపమలు.

(12) శశాంకశిలాసౌధ = చంద్రకాంతమణిమయములగు రాజ గృహముల యొక్క, (సౌధోఽస్త్రీరాజసదనమ్ - అమ) విటంకింబులన్= పావురపుగూండ్లను - ముంజూరులను, (కపోతపాలికాయాంతు విటం కంపున్నపుంసకమ్ - అమ) ఉంకువగొన్నతటిన్ = స్థిరమయిన సంచారస్థానము లుగా స్వీకరించినసమయమునందు - ముంజూరులందు సంచరించుచున్నప్పుడు, శరన్నీరద = శరత్కాలమేఘమునకు, వశం వదంబగు= అధీనమయినదగు,సునాసీరశరాసన=ఇంద్రధనుస్సుయొక్క (వృద్ధశ్రవాఃసునాసీరః,ధనుశ్చాపౌధన్వశరాసనకోదండకార్ముకమ్-అమ) శకలంబనన్=ముక్కయనునట్లు(ముక్కవలె)మెలంగుచున్=సంచరించుచు

చంద్రకాంతమణియములగు రాజసదనముల ముంజూరులయందుఁ దిరుగునప్పుడు, రామచిలుక, శరత్కాలమేఘములకడ సంచలించునింద్ర ధనుస్సువలెనున్నదనుట.

అలం :— ఉపమ.

(13) అంతరిక్ష = ఆకాశమనెడు, మహాప్లక్షంబునకున్ = గొప్పజువ్విచెట్టునకు, (ప్లక్షసంజ్ఞ నివ్వటిలు జువ్వి యనఁగలుజువ్వియనఁ గఁగూటుపర్కటియగును - అం. బా) అక్షామ = సన్నముకాని -లావు పాటిదయిన, చంచుపుట ప్రవాళఖండ = పగడపుఁదునుకవంటిముక్కు పుటములయొక్క, ప్రభా = కాంతియొక్క, హిండనంబునన్ = వ్యాప్తిచేత, దొరలి = కూడుకొని, సఫల = పండుతోఁగూడుకొనిన, విటపలక్ష్మిన్ = శాఖయొక్కశోభను, ఆవహింపుచున్ = ఆపాదించుచు.

ఆకాశమను జువ్విచెట్టున కెఱ్ఱనిముక్కుపుటలకాంతిచేఁజిలుక, పండుతోఁగూడుకొన్న కొమ్మయొక్క శోభను సంపాదించుననుట. చిలుకయొక్క పచ్చని ఱెక్కలకాంతి, యాకాశమనుజువ్విచెట్టునకు, జువ్వికొమ్మశోభను, జిలుక ముక్కుయొక్కయెఱ్ఱని కాంతి, యా యాకాశమను జువ్విచెట్టుకొమ్మకు, జువ్విపండుశోభను, సంపాదించు నని, తాత్పర్యము.

అలం :— రూపకము.

(14) ప్రమాద = ఏమఱుపాటుచేత, విగళితంబగు = జాఱి నదగు, (జాఱిపడినదగు - అనుట) నగవిరోధి = ఇంద్రునియొక్క, కొలువువీవనయచ్చర = ఆస్థానమునందు (ఇంద్రునకు) వింజామరము వీచుటకు నియుక్తురాలయిన యప్సరసయొక్క, పచ్చలకడియంబు వడువునన్ = మరకతమణిమయమగు కంకణమోయనునట్లు, నిరాలంబనస్థలంబునన్ = ఆధారములేనిచోట - ఆకాశమునందు, పలుమఱున్= పెక్కుమాఱులు, చక్రచంక్రమణ = వలయాకారముగాఁబరిభ్రమించెడు చమత్కారంబు = నేర్పును, చూపుచున్ = ప్రకటించుచు.

ఇంద్రసభయందు, (సుధర్మయందు) మహేంద్రునకు వింజా మరవీచుటకు నియుక్తురాలయిన యప్సరసయొక్క మరకతమణిమయ మగు కంకణముపాటుపాటున జాఱిపడినదోయనునట్లు చిలుక యాకా రముగాఁ బరిభ్రమించెననుట.

అలం :- ఉత్ప్రేక్ష.

(15) ముకుంద విగ్రహంబునందున్ = శ్రీకృష్ణప్రతిమయందు భక్తిసమగ్రుండగు = భక్తిచేఁబరిపూర్ణుఁడగు, పురుషశ్రేష్ఠుండునుం బోలెన్ = మనుజవరేణ్యునివలె, సమీప = దగ్గఱదయిన, ఆరామ = ఉపవనములయొక్క, శ్యామల = చామనచాయగల, పలాశ = ఆకుల యొక్క, (పత్రింపలాశంఛదనమ్ - అమ) పటల = సమూహము యొక్క, గర్భంబునందున్ = లోపలిభాగమునందు, వీక్షఁబుపరాక = వీక్షింపశక్యముకాక, డిందుచున్ = లీనమగుచు, ధాన్యమగ్నుఁడగుట యని భక్తునివిషయముసను గనఁబడకుండనణఁగుటయని శుకపక్షము ననునర్థముగమ్యము.

శ్రీ కృష్ణవిగ్రహమునందు లీనుఁడయిన భక్తునివలెఁ, దోఁటల లోని యాకుల లోపలఁజిలుకవీనమగుచుండెననుట.

అలం ;— ఉపమ.

పలాశవర్ణము హరితము, (ఆకుపచ్చ) అదియిట శ్యామలవర్ణము గాఁబేర్కొనఁబడెను. కృష్ణవిగ్రహవర్ణమునలుపు. హరిత శ్యామకృష్ణ వర్ణములకైక్యము కవిసమయము.

"కృష్ణనీలయోః, కృష్ణహరితయోః, కృష్ణశ్యామయోః -- ఏక త్వేననిబంధనంచకవిసమయః" (కా. సూ.)

(16) తరదంద — మాటిమాటికి, జాతిపల్లుఁగులు = స్వజాతి

పక్షులు - చిలుకలు, మనుజగంధధురంధరంబగుటకున్ = మనుష్య సంసర్గజనితమగు వాసనను వహించునదియయినందులకు, జగడంబు దిగిచినన్ = కలహమునకులాగఁగా, కినిసి = కోపించి, విస్మృమర = తిక్కించు స్వభావముగల, (విస్మృత్వరోవిస్మృమరః ప్రసారీచవిసారిణీ- అమ) తనూరుహ = వెండ్రుకలచేత, దంతుర = మిట్టపల్లమయిన, (దంతురస్తూన్నతరదేతథోన్నతానతేత్రిషు - మే. ని.) కపోల = చెక్కిలియొక్క, అంతరంబును = మధ్యభాగముగలదియు, విఘూర్ణన = విశేషముగాఁద్రిప్పుటచేత, వికృత = మార్పుచెందిన, వీక్షణంబునై = కన్నులుగలదియునై, క్షణంబు - క్షణకాలము - కొలఁదిసేపు, మణివలయ = రత్నకంకణములచే, వలయితంబగు = చుట్టుకొనఁబడినదగు, రతియువతి =(మన్మథపత్నియగు) రతికాంతయొక్క, ముంజేతిరీతిన్ = ప్రకోష్ఠమువలె (మణికట్టువఱకుఁగలమోచేతి క్రిందిభాగమువలె) చెలువడరు = సొబగుమీఱు, మెడన్ = కంఠమును, నిగుడించి = చాచి, మగుడంబడి = తిరుగఁబడి, కాకుప్రకార = కాకువనెడు ధ్వని భేదముయొక్క - కోపాదిభావవ్యంజకమగు ధ్వనిభేదముయొక్క, (కాకుఃస్త్రియాం వికారోయశ్శోకభీత్యాదిభిర్ధ్వనేః - అమ; భిన్నకంఠధ్వనిర్ధీరః కాకురిత్యభిధీయతే - సా. ద.) వికార = పరిణామమయిన, స్వరంబుగన్ = కంఠస్వరముకలుగునట్లుగా, వానిన్ = వానిని - అన్యజాతిపక్షులను, (జగడమునకుఁదిగిచిన చిలుకలను) నిరాకరింపుచున్ = తిరస్కరించుచు, పఱచు = ఎగురు, అప్పఱచు చిలుకకున్ = అతిరుగుఁబోతుకీరమునకు, అలిగినదియవోలెన్ = కోపించినదానివలె, అయ్యన్ను = అమదవతి - అహారిదాసి, వెన్నాడన్ = వెంబడింపఁగా, పెన్నాటకంబై = పెద్దప్రదర్శనయై.

**అలం :— ఉపమ.**

(17) బోఁటికత్తియలు = చెలికత్తెలు, తత్ = దానియొక్క- అహారిదాసియొక్క, ఉత్తుంగ = ఉన్నతమయిన, కుచ = స్తనముల

యొక్క, ఉత్సంగ = పైభాగమునందు, సంగత = కూడుకొనిన, కురంగలాంఛనకళా = చందురుకూనలనెడు స్తనములందుంచు నఖక్షత భేదముయొక్క (చూ 1-186 వ్యాఖ్య) అవలోకనంబునన్= చూచుట చేత, ముసిముసినగవులు = ముసిముసినవ్వులు, ఎగయన్ = కలుగఁగా, గోరువంక = శారిక (శారికాఖ్యగోరింకగోర్వంకగొరవంకగోరంక గోరువంకయనంగమీఁదుచుండు - ఆం. భా) కానవచ్చెంగాని = కనఁబడినదిగాని - అని పైపైయర్థము గోరువంక = స్తనముమీఁది నఖక్షతవిశేషము, (కరరుహక్షతములు మెఱయుచుంకు, గోరువంకలు చందురుకూనలఁగ - అం. భా) కానవచ్చెంగాని - కనఁబడినదిగాని- అని చమత్కారగర్భితమగునర్థము. కీరంబు = చిలుక, దూరంబయ్యెఁగదా = దవ్వయినదిగదా! అని = ఈప్రకారముగా, గర్భోక్తి = లోపలఁజమత్కారముగలమాటలయొక్క, వైదర్భిన్ = వాక్యవక్రత్వముకలుగుటచేత, (వైదర్భంవాక్యవక్రత్వే - మే ని) కూడియాడుచున్ = కలసిమెలసిక్రీడించుచు, పాడుచున్ = గానముచేయుచు.

హరివాసిస్తనముమీఁదఁగల నఖక్షతమునుజూచి, స్తనముమీఁది నఖక్షతముకనఁబడినదన్నచమత్కారార్థము గర్భితమైయుండునట్లు, గోరువంకఁగనఁబడినది గాని చిలుకకానరాలేదని వాక్యవక్రతగలమాటలను బలుకుచుఁజెలికత్తెలు కలసిమెలసియాటపాటలునిర్వర్తించుచుండిరనుట.

(18) పంజరంబును = పక్షిగూడును, చిలుకచాలు తెరయును = కీరములవరుసచిత్రించిన తెరదీమును, (దీము = పశుపక్ష్యాలనువశము చేసికొనుటకై యేర్పఱిచిన పశుపక్ష్యాదికము; వానిప్రతిరూపము) శారికయును = గోరువంకయును, చేరికచేసి = దగ్గరగాఁబెట్టి, ఎలయింపన్ = లోఁబఱుచుకొనఁబోఁగా, అలయించుచున్ = అయాసపెట్టుచు.

(19) నడితెక్కన్ = పక్షమధ్యభాగమును, క్రిక్కిఱించుచున్ = ఎడములేకుండఁజేయుచు - ముడుఁచుచు.

(20) ఒక్కయెడన్ = ఒక్కచోట, కాలువొడిచి = కాలూఁది, (నిలఁబడి) ముక్కునన్ = చంచువుతో, అక్కంఠహార = అమెడలో వేసికొను (బన్న) సరముయొక్క, తరళంబున్ = నాయకమణిని, కంఠమాలనడుమనుండుమణిని, (తరళోహారమధ్యగః - అమ) నొక్కుచున్ = అదుముచు.

(21) అక్కయక్క = అక్కా! అక్కా! ఇక్కడక్కడన్ = ఇచ్చట నచ్చట, చిక్కెంజిక్కెన్ = నిలిచెనిలిచె; అని = ఈప్రకారముగా, చేటికానికరంబు = దాసీసమూహము, పొలసినన్ = సమీపింపఁగా, సులుగు = జాడ (వారిరాకను - అనుట) ఎఱింగి = గుర్తించి,

(22) మెఱుంగుమెఱసి = మెఱపుమెఱసి, తొలంగినతెఱఁగునన్ = తిరోహితమయినవిధమున, డాయవచ్చినట్టులన్ = సమీపించినట్లుగాఁ దోఁచి, మాయంబగు = అదృశ్యమగు, మాయలేటిపాటిన్ = మాయ లేడివలెను, పోవంబోవన్ = పోఁగాఁబోఁగా, దూరంబగుచునుండు = దవ్వగానగుచుండు, ఎండమావులమాడ్కిన్ = మృగతృష్ణలవలెను, తివియ వచ్చుట = ప్రాపింపవచ్చుటను, నటించి = లేకున్ననున్నట్లు కనఁబఱచి, మువ్వలోని రాయిసోయగంబునన్ = మొనయందుమూఁడు సందులగలపెద్దగజ్జెలలోనిలోహపుఱాయివలె, ఒక్కింత = కొంచెము, పట్టువడుట = చేపడుట, పచరించి = కనుపట్టఁజేసి.

పోయగము - ఇవార్థకము. మువ్వలోపలిఱాతిమురువువడయ శివరా 1-61

మృగతృష్ణ - "నిర్జలదేశస్థం సూర్యకిరణం దూరతో వీక్ష్యమృగైర్జలభ్రాంత్యాతృష్ణార్తైః సద్భిఃబంభ్రమ్యతేనచజలం లభ్యతేఇతి, గ్రీష్మే మరుదేశేసికతాదౌ పతితరవికిరణేషు జలభ్రాంతిరితి చప్రసిద్ధమ్" (శబ్దస్తో)

అలం :— మాలోపమ.

(23) ప్రిమరరయంబునన్ = అధికమయిన వేగముతో, ఖచర పుర = దేవతానగరముయొక్క - అమరావతియొక్క, ప్రాసాదంబులు= రాజగృహములు, సౌధములు. (ప్రాసాదో దేవభూభుజామ్ - అమ) మోవన్ = స్పృశించునట్లు, పూఁపునన్ = పూనికతో, ఎగసి = ఎగిరి తిరిగి = మరలి, పెఱతెరువునన్ = వేఱుమార్గమున, పఱతెంచి = ఎగిరివచ్చి, పాండురంగాయతన = పాండురంగాలయముయొక్క, మధ్యరంగంబుసొచ్చి= నడిమిప్రదేశమునందుఁబ్రవేశించి, అచ్చటన్ = అక్కడ, నిచ్చన్ = నిచ్చలును - ప్రతిదినమును, తన = తనయొక్క, ఇచ్చనుండు = ఇష్టానుసారముగా వర్తించు, దండియంబుపైన్ = వస్త్రము లెండవేయుటలోనగువానికై యడ్డముగాఁగట్టిన కఱ్ఱమీఁద, వ్రాలెన్ = (క్రిందికి) దిగివచ్చినిలిచెను. అంతన్ = అనమమునందు, అచ్చటన్= అస్థలమునందు - హరిదాసియు నామెచెలికత్తెలును జిలుకను వెంబడించి వచ్చుచోట. (మీఁదిపద్యముతో నన్వయము.)

సీ॥ మదఘూర్ణ దురునంకుమదమాలీమసకుచ
ద్వీపమహోద్ధతిఁగౌనుఁ 1 డీఁగనులియ
ఘనసారపుండ్రకగ్లౌబింబనికటఘు
ర్మహి 2 మూర్తి మోముఁదామరచలింప
నాసికానూత్న గంధఫలియూరుపుఁదావి
నధరదంతపదమత్తాళివిఠియఁ
గింకిణీక్వణన 3 శంకితగర్జితసత్రస్త
కాంచిచంచల 4 నడయంచజడియ

238 ప :- 1 డీఁగె - గౌ; డీగ - ర; డీఁగ - అ. 2 మాప్తి - ముద్రి(అ).ర మార్తి - ర, అ. 3 గర్జితపత్రసస్త్రత - గౌ. [యతిభంగము] శంకిత గర్జితత్రస్త - ర, అ. 4 గతి - ముద్రి (అ); ర, నడ - అ, గౌ.

తే॥ బంధనిర్ముక్త శుకసక్త భావయగుచు
నలపరాశరసుతుచంద మధిగమించు
మించుననఁబోఁడిచందంబు మేలుకనిన
వాఁడుతలపోయుకలలోనివార్తయయ్యె. **238**

వ్యా :— మద = గర్వముచేత - ఉబ్బుచేత, ఘూర్ణత్ = ఘూర్ణిల్లుచున్న, ఉరు = గొప్పదయిన, సంకుమద = జవ్వాజిచేత, (చనుజవాదిజవాజి జవ్వాదిజవ్వాజియనఁగసంకుమదాఖ్య - ఆం. భా.) మలీమస = నల్లనివయిన, (మలీమసః = కృష్ణవర్ణః) కుచద్వీప = స్తనములనెడియేనుఁగులయొక్క, మహోద్ధతిన్ = గొప్పయౌద్ధత్యముచేత, కౌనుఁదీఁగ = నడుమనెడులత, నలియన్ = అల్లలనాఁడగా, (చలింపఁగా)

అలం :— రూపకము.

(2) ఘనసారపుంద్రక = కర్పూరతిలకమనెడు, (అథకర్పూర మస్త్రియాం, ఘనసారశ్చంద్రసంజ్ఞః - అమ, పుండ్రే = చిత్రకే - శబ్దస్తో) గ్లౌబింబ = చంద్రబింబముయొక్క, నికట = సామీప్యముగల, ఘర్మ = చెమటయనెడు, హిమ = మంచుయొక్క, అర్తిన్ = పీడచేత, మోముఁదామర = ముఖమనెడు పద్మము, చలింపన్ = కదలఁగా.

చంద్రపద్మవిరోధము కవిసమయప్రసిద్ధము. "సారసకైరవంబులకుఁజంద్రదినేంద్రవిరోధము" (వసు 3-129)

అలం :— రూపకము.

(3) నాసిక = ముక్కనెడు, నూత్న = క్రొత్తదయిన, గంధఫలి = సంపెఁగమొగ్గయొక్క, (చంపకో హేమపుష్పకః, ఏతస్యకలికా

గంధఫలీస్యాత్ - అమ) ఊరుపుఁదావిన్ = నిశ్వాసమనెడు సుగంధముచేత, అధర = మోవియందలి, దంతపద = పలుగుఱుతనెడు-దంతక్షతమనెడు, (చిహ్నాంలక్ష్మచలక్షణమ్ -- పదమ్ - అమ) మత్త = మదించిన, అళి = తుమ్మెద, విరియన్ = చెదరఁగా.

తుమ్మెదకు సంపంగికి విరోధము కవిసమయము. ("నానానూన వితానవాసనలనానందించుసారంగమే, లానన్నొల్లదటుంచుగంధఫలి"- వసు 2-47.

దంతక్షతవర్ణము నలుపు - చూ. 3-10 వ్యాఖ్య.

అలం :— రూపకము.

(4) కింకిణీ = మువ్వలయొక్క, క్వణన = ధ్వనిచేత, (నిక్వాణో నిక్వణః క్వాణః, క్వణః క్వణనమిత్యపి - అమ) శంకిత = అనుమానింపఁబడిన, గర్జిత = ఉఱుముగల, త్రస్త = జాఱిన, కాంచి = ఒంటిపేఁటమొలనూలనెడు, చంచలన్ = మెఱపుచేత, నడ = నడకయనెడు, అంచ = హంస, జడియన్ = భయపడఁగా.

మేఘహంస విరోధముకవిసమయము.

(i) నవజలధరరవభయచలితకలహంసకుల - కాదం

(ii) రాయంచలగుండెబెదరు -- పృథుజలధరారవమెనఁగెన్- హరి. పూ. 6 అ - 107

అలం :— రూపకము.

బంధ = బంధనమువలన, నిర్ముక్త = విముక్తినందిన, శుక= చిలుకయందు, సక్త = లగ్నమయిన, భావయగుచున్ = హృదయముగలదియగుచు - అని చిలుకపక్షమునసర్థము. బంధ = సంసార సంబంధమువలన, నిర్ముక్త = విముక్తినందిన, శుక = (పుత్రుఁడగు)

శుకునియందు, సక్త = ఆసక్తినొందిన, భావముగలవాఁడగు - అని వ్యాసమహర్షి పక్షమునకర్థము. అల = ప్రసిద్ధుఁడయిన, పరాశరసుతు = పరాశరనందనునియొక్క - వ్యాసమహర్షియొక్క, (కృష్ణద్వైపాయనుని యొక్క - అనుట) చందము = విధమును, అధిగమించు = పొందు, మించు = తళతళమను కాంతిగలదియగు, ననఁబోఁడి = (అ) పువ్వు వంటియొప్పిదముగలదానియొక్క - ఆహరిదాసియొక్క, చందంబు = విధము, మేలుకనినవాఁడు = నిద్రనుండి మెలకువనొందినవాఁడు, తల పోయు = స్మరించు (జ్ఞప్తితెచ్చుకొను) కలలోనివార్త = స్వప్న మధ్యమునందలి వృత్తాంతము, అయ్యెన్ = అయెను, (కలలోఁగన్న వస్తువుమెలకువరాఁగానే పొందరానిదయినట్లు హరిదాసిచిలుకను బొంద లేకపోయెననుట)

అలం :— శ్లేషానుప్రాణితమగు నుపమ.

తే॥ కక్కసపువంకగోరులఁద్రొక్కిత్రొక్కి
కలుకుముక్కుననందంద ¹ కలచికలచి
పూసయొకటియుఁబోఁగునఁబొంటనీక
చెలిపెముత్యాలపేరు విచ్చికపుఁబులుఁగు. 239

వ్యా :— కక్కసపువంకగోరులన్ = వాఁడియయిన వంకర గోళ్లతో, త్రొక్కిత్రొక్కి = అదిమియదిమి - వాఁడియైన, కాలివంకర గోళ్లతోనదిమియదిమి, కలుకుముక్కునన్ = పదనయిన కోటితో; అందంద = మాటిమాటికి, కలచికలచి = కొటికికొటికి, పూస యొకటియున్ = పచ్ఛిద్ర (= రంధ్రముపొడిచిన) మణియొకటి

---

239 ప :- 1 నఱకినఱకి - క; గౌ; నఱికినఱికి - క; నరకినరకి —. చ; లగులచికలచి - ర; కలచికలచి - ఆ.

యయినను, (మానికమురతనమనంగమణిచెలంగు, నదియనచ్ఛిద్రమైనఁ బూసనఁదనర్చు - ఆం. భా) పోఁగునన్ = తంతువునందు, పొందనీక = నిలువనీయక, విచ్చికపుఁబులుఁగు = (అ) తుంటరిపక్షి - అచిలుక, ముత్యాలపేరున్ = ముక్తాహారమును, చెటిపెన్ = చెడఁగొట్టెను.

క॥ బహువిధరచనోజ్జ్వలమగు
మహిళామణిమణిసరంబుమణులన్నియున
య్యహి 1 శయను సదనశరధికి
నహీనరత్నాకరత్వమను సంధించెన్. **240**

వ్యా :— బహువిధ = పలురకములయిన, రచన = నిర్మాణములచే, ఉజ్జ్వలము = ప్రకాశించునది. అగు = అయిన, మహిళామణి = (అ) శ్రేష్ఠురాలయిన కాంతయొక్క - అహరిదాసియొక్క, మణిసరంబుమణులన్నియున్ = రత్నహారపురత్నములెల్లను, అయ్యహిశయను = అవిష్ణుమూర్తియొక్క - అసర్పము (అదిశేషుఁడు) శయ్యగాఁగలవానియొక్క - అహరియొక్క. (విఠ్ఠలునియొక్క - అనుట) సదన = గృహమనెడు - పాండురంగాలయమనెడు, శరధికిన్ = సముద్రమునకు, అహీన = అనల్పమగు, రత్నాకరత్వమున్ = రత్నాకరధర్మమును, అనుసంధించెన్ = సంధానించెను.

అలం :— రూపకము.

క॥ శుకమునకొదవెనయత్న
ప్రకటితమణిరంగవల్లిపరికల్పన కో
రకితసుకృతాన్నకృతి, దా
నకిమెచ్చెన్ బౌండరీక 1 నిలయుఁడునాత్మన్. **241**

---

240 ప :- 1 శయనో - గ్రా - శయును - ర, అ.

241 ప :- 1 నిలయుండాత్మన్ - ముద్రి [అ] త్రా నిలయుఁడునాత్మన - అ.

వ్యా :— శుకమునకున్ = చిలుకకు, అయత్న ప్రకటిత= అప్రయత్నముగాఁబ్రకటింపఁబడిన, మణిరంగవల్లి = రత్నాలముగ్గు యొక్క, పరికల్పన = రచనముచేత, కోరకిత = మొగ్గదొడిగిన, సుకృత = పుణ్యముయొక్క, అనుకృతి = సదృశీకరణము, ఒదవెన్ = ప్రాప్తించెను, (పాండురంగాలయమున ముగ్గుపెట్టినచోఁబ్రాప్తించు పుణ్యముతో సమానమయిన పుణ్యము ప్రాప్తించెననుట) పాండురంగ నిలయుఁడున్ = పాండురంగక్షేత్రవాసియు-పాండురంగవిఠ్ఠలుఁడును దానికిన్ = దానికి - అప్రయత్నముగా రత్నాలముగ్గును సంఘటించి నందులకు, ఆత్మన్ = మనస్సునందు. (ఆత్మాపుంసిస్వభావేపిప్రయత్న మనసోరపి - మే. ని.) మెచ్చెన్ = ప్రీతినందెను.

## సర్పముకథ

క॥ గిరికానుషక్తబుద్ధిను
పరిచరునింబోలునొక్కపన్నగమొకనాఁ
డురవడినెచ్చటనుండియొ
మురమర్దను దివ్యభవనమునకేతెంచెన్. 242

వ్యా :— గిరికా = గిరికాదేవియందు, అనుషక్త = లగ్న మయిన, బుద్ధిన్ = మతిచేత - అనివసురాజపక్షముననర్థము. గిరికా= చిట్టెలుకయందు, అనుషక్త = లగ్నమయిన, బుద్ధిన్ = మతిచేత- అని సర్పపక్షముననర్థము. (గిరికాబాలమూషికా- అమ) ఉపరిచరునిన్= ఉపరిచరవసువును, పోలు = సరిపోలు, ఒక్కపన్నగము = ఒకానొక పాము, ఒకనాఁడు = ఒకానొకదినమునందు, ఎచ్చటనుండియొ =

ఎక్కడనుండియో, ఉరవడిన్ = మిక్కిలివేగముతో, మురమర్దను = కృష్ణునియొక్క - విఠ్ఠలునియొక్క, దివ్యభవనమునకున్ = మనోజ్ఞమయిన సదనమునకు - పాండురంగాలయమునకు, ఏతెంచెన్ = అరుదెంచెను.

కోలాహలపర్వతరాజునకు శుక్తిమతీనదీకాంతయందు జన్మించిన కూఁతురు, గిరికాదేవి. చేదిదేశాధీశుఁడు, నింద్రదత్తవిమానయానముచే నుపరిచరుఁడుగాఁగీర్తితుఁడునగు వసురాజునకీమె భార్య. ఇట, రామకృష్ణుఁడు, వసుచరిత్రనే నిర్దేశించియుండునని మీఁది పద్యమునందలి యాముక్తమాల్యదా ప్రసంగమువలనఁజెప్పుటయుక్తము.

ఉపరిచరుఁడు - నామైకదేశేనామగ్రహణమ్మను న్యాయమున నుపరిచరవసువునుపరిచరుఁడనియువసువనియువ్యవహారము. (చూ 2-15 వ్యాఖ్య)

అలం ;— శ్లేషానుప్రాణితమగునుపమ.

వ॥ ఆసమయంబున. 243

వ్యా ;— ఆసమయంబునన్ = అకాలమునందు - అప్పుడు. (మీఁదిపద్యముతో నన్వయము)

క॥ 1 యమదండచండమగు భుజ
గమునకువెఱచెఱచి యాఖుకన్యకకమలా
రమణాంఘ్రిఁజేరెగురుభీ
తమతికినాముక్తమాల్యదకునెనయగుచున్, 244

---

244 ప౦- 1 యమదండమ్మును చండమ్ముభుజ - త; యమదండచండమగు భుజ - ర, అ;

వ్యా ;— ఆఖుకన్యక = ఎలుకపిల్ల. (ఉందురుర్మూషికోప్యాఖుః-అమ) యమదండచండమగు = యమునికాలదండమువలెఁదీవ్రమగు, భుజగమునకున్ = పామునకు, వెఱచఱచి = భయపడి, గురు = తండ్రివలన, భీత = భయపడిన, మతికిన్ = బుద్ధిగలదియగు, ఆముక్తమాల్యదకున్ = (తనచేత) ధరింపఁబడిన పూదండను (రంగనాథునకు) సమర్పించినదానికి - గోదాదేవికి, ఎనయగుచున్ = సాటియగుచు, కమలారమణ = లక్ష్మీపతియొక్క - విట్ఠలునియొక్క, అంఘ్రిన్ = పాదమును, చేరెన్ = ఆశ్రయించెను.

ఆముక్తమాల్యద - ఈమెనఱవమున 'శూడికొడుత్తనాచ్చియార్' అని యందురు. ఈమె విష్ణుచిత్తుని పెంపుడుకూఁతురు. తానుధరించిన పూదండలను రంగనాథస్వామికి సమర్పించుటచే నీపేరుగలిగెను. ఈమెను గోదాదేవియనియు, 'ఆండాళ్' అనియునందురు.

కృష్ణరాయలయాముక్తమాల్యదనిట రామకృష్ణుఁడు నిర్దేశించి యుండుననఁదగును.

అలం :— ఉపమ.

క॥ హరిపదపీఠ 1 స్థలిఁగల
సరియనుజిట్టెలుకదాఁగె, 2 సంవర్తహతిన్
దెరలిమృకండుసూద్భవుఁడా
తురతన్ దజ్జఠరపేటిఁ 3 దూఱిన భాతిన్. **245**

వ్యా :— చిట్టెలుక = బాలమూషికము, హరి = కృష్ణునియొక్క - విట్ఠలునియొక్క, పదపీఠస్థలిన్ = పాదపీఠప్రదేశమునందు,

245 ప :- 1 స్థితిగల - ముద్రి (అ), ర; స్థలిఁగల — అ. 2 సంహర్త-క; సంవర్త - ర, అ. 3 దూరిన -, ర, దూఱిన - అ.

కల = ఉన్న; సరియను = దంతములసందునందు, సంవర్త = ప్రళయముయొక్క, హతిన్ = ఘాతముచేత - ఉపద్రవముచేత, తెరలి = కలఁతచెంది, మృకండూద్భవుఁడు = మృకండు (మహర్షి) వలని యుద్భవము (=జన్మము) గలవాఁడు - మార్కండేయుఁడు, ఆతురతన్ = ఉత్కంఠతతో, తల్ = ఆహరియొక్క, జఠరపేటిన్ = పెట్టెవంటి గర్భమునందు తూఁటిన భాతిన్ = ప్రవేశించినట్లు, డాఁగెన్= మఱుఁగుపడెను.

మార్కండేయుఁడు చిరంజీవిగావునఁ బ్రళయకాలమునందును జీవించియుండును.

అలం ;— ఉపమ.

ఆ॥ వీడిపడినగాజు వెదకంగ వెదకంగఁ
బద్మరాగమొదవు పగిదినహికి
దొరకె నెలుక 1 దూఁటితొలఁగినతటి రమా
కమనచరణకైతకప్రసవము. 246

వ్యా ;--- వీడిపడిన = జాఱిపడిన, గాజున్ = కాచముతోఁ జేసిన హస్తవలయమును, వెదకంగవెదకంగన్ = అన్వేషింపఁగా నన్వేషింపఁగా, పద్మరాగము = కెంపు, ఒదవుపగిదిన్ = లభించినట్లు, అహికిన్ = సర్పమునకు, ఎలుక = మూషికము, దూఁటి = దుమికి, తొలఁగిన తటిన్ = అపసరిల్లిన సమయమున, రమాకమన = లక్ష్మీమనోహరుని యొక్క - హరియొక్క (విష్ణునియొక్క - అనుట) చరణ = పాదములయొక్క - పాదములపైనున్న, కైతక = మొగలికి (కేతకికి) సంబంధించిన, ప్రసవము = పుష్పము - మొగలిపువ్వు. దొరలెన్ = లభించెను.

---

246 ప. 1 దూఁటి-ముద్రి (అ), ర. మాటి - గొ, దూఁటి - అ.

కేతకీవర్ణము పసుపు, కెంపువర్ణమెఱుపు. పీతరక్తములకైక్యము కవిసమయము. "పీతరక్తయోః - ఏకత్వేన నిబంధనంచకవిసమయః (కా. మీ.)

అలం ;— ఉపమ.

చ॥ చరణసరోరుహ 1 ప్రభవశైవలినీ 2 విలసద్బిసాంకురా
హరణమనీషఁజేరిన బిసాశనశాబమొనాఁగఁబొల్చుసా
గరశయపూజనాచరణకైతకకోరకమున్ భజించెమ
త్కరవరకంకణంబు, మిహికాఘృణిరాహువుగప్పునొప్పనన్.

**247**

వ్యా ;— మత్ = నాయొక్క, కర = చేతియొక్క; వర = శ్రేష్ఠమయిన, కంకణంబు = కడియము - సర్పము, (వక్త శివుఁడు. శివునిచేతికడియము, సర్పము) చరణసరోరుహ = (విట్ఠలునియొక్క) పద్మమువంటి పాదమువలన, ప్రభవ = జనించిన, శైవలినీ = నది యందు - గంగానదియందు, (విష్ణుపాదమువలన గంగజనించెను. విష్ణువునకు విట్ఠలునకునభేదము.) విలసత్ = ఒప్పుచున్న; బిస = తామరతూఁటియొక్క, అంకుర = మొలకయొక్క, అహరణ = గ్రహింప వలెననెడు (భక్షింపవలెననుడు-అనుట) మనీషన్=బుద్ధిచేత-తలంపుచేత చేరిన = సమీపించిన, బిసాశన = తామరతూఁడులాహారముగాఁగల దానియొక్క - హంసయొక్క, శాబమొ = పిల్లయో! నాఁగన్ = అనునట్లు, పొల్చు = ఒప్పు, సాగరశయ = సముద్రమునందు శయనించువానియొక్క - హరియొక్క, (విట్ఠలునియొక్క - అనుట)

---

247 ప :- 1 ప్రసవ - ముద్రి [అ], ర; ప్రభవ - అ, 2 నివస - ముద్రి [అ], ర, విలస - అ. 3 కైవడిన్ - త; నొప్పునన్ - ర, అ.

పూజనా = అర్చనకుసంబంధించిన, చరణకైతక = పాదమునందున్న మొగలికిసంబంధించిన, కోరకమున్ =మొగ్గను - విట్ఠలునిపాదపూజకు యుక్తమయిన మొగలిమొగ్గను, మిహికాఘృణిన్ = హిమాంశుని-చంద్రుని, (అవశ్యాయస్తు నీహారస్తుషారస్తుహినంహిమం, ప్రాలేయం మిహికాచ - అమ) రాహువు = విధుంతుదుఁడు, (తమస్తురాహుః స్వర్భానుస్సైంహికేయోవిధుంతుదః - అమ) కప్పు = ఆచ్ఛాదించు, ఒప్పునన్ = విధమున, భజించెన్ = సేవించెను.

విట్ఠలుని పాదములనుండి జనించినగంగానదియందున్న (విట్ఠలునకు విష్ణువునకు నభేదము) తామరతూఁటినిభక్షింపఁగోరి సమీపించిన హంసపిల్లయోయనున ట్లొప్పువిట్ఠలు నిపాదపూజకుపయుక్తమయిన మొగలిమొగ్గను, జంద్రుని గప్పురాహువువలె సర్పము సేవించెననుట.

246 పద్యమునఁగేతకీపుష్పము, నీ 247 పద్యమునఁ గేతకీకోరకము పేర్కొనఁబడుటచేనగమువిచ్చిన మొగలిమొగ్గయుద్దిష్టమనిగ్రహింపనగును

గంగవిష్ణుపాదోద్భవయనుట ఖగోళసత్యము. చూ 4-82 వ్యాఖ్య.

రాహువు చంద్రుని గబళించుటయనుపురాణోక్తి ఖగోళదృశ్యమునకుఁబ్రతీక. భూచ్ఛాయయే రాహువు. కావుననే రాహువునకుఁద మన్సని పేరు.

అలం ;— ఉత్ప్రేక్ష; ఉపమ.

తే॥ మధురమదిరారసామోదమైత్రినలరు
పొలఁతినెమ్మోముపలపానుభోగి 1 వోలె
హరిపదాబ్జమధూళిమయుంబుఁగ్రోలె
జాతిగేదంగితావిభుజంగభర్త. 248

---

248 పః 1 (బోలె-ర; వోలె- అ; గొ. 2 మధ్యుందు = వ్య ఘుద్యుంబు - ర,అ.

వ్యా :— మధుర = తీయనయిన, మదిరారస = మద్య ద్రవముయొక్క, ఆమోద = సుగంధముయొక్క, మైత్రిన్ = చెలిమి చేత, అలరు = ఒప్పు, పొలఁతి = కాంతయొక్క, నెమ్మోము = ప్రశస్తమయిన ముఖముయొక్క, వలపు = గంధమును, అను = ఆఘ్రాణించు, భోగివోలెన్ = భోగవంతునివలె, భుజంగభర్త = సర్పరాజు, హరి = కృష్ణునియొక్క - విట్ఠలునియొక్క, పదాబ్జ = పాదములనెడు పద్మములయొక్క, మధూళిమయంబున్ = మకరంద ప్రాచుర్యముగలదయిన, జాతిగేదంగి = స్వజాతిశ్రేష్ఠమయిన (మంచి జాతికిఁజెందిన) మొగలిపువ్వుయొక్క, తావిన్ = సుగంధమును, క్రోలెన్ = ఆఘ్రాణించెను.

మధూళి — చూ 1-49.

అలం :— ఉపమ,

క॥ అలరునలరుచిరమత్కుం
డలముపయిన్నిలిపె 1 నవ్యనఖరపదము 2 లై
యలరునిజకంటకక్షత
విలసన 3 మునువిటునిమేనవేశ్యయుఁబోలెన్. **249**

వ్యా :— అలరున్ = పుష్పమును - మొగలిపువ్వును, అల, రుచిర = అమనోహరమయిన, మత్ = నాయొక్క, (శివునియొక్క, శివుఁడు - వక్త) కుండలముపైన్ = కుండలమనెడు కర్ణభూషణము మీఁద - సర్పముమీఁద, విటునిమేనన్ = ఉపపతియొక్క శరీరము నందు, వేశ్యయుఁబోలెన్ = వెలకాంతవలె, నవ్య = క్రొత్తయిన,

---

249 ప :- 1 నవ్య - ఢ, ధ, బ; నత్య - త; నవ్య - ర, అ. 2 పైనలరు -ఢ, ధ, బ. 3 మును-ఢ, ధ, బ; మున - గొ; ముల-ర, అ.

నఖర = గోళ్లయొక్క, (నఖోఽస్త్రీనఖరోఽస్త్రియామ్-అమ) పదములై = స్థానములై, అలరు = ఒప్పు - నఖస్థానీయములయియొప్పు, నిజ = తనవైన, కంటక = ముండ్లయొక్క, క్షత = గంటులయొక్క, విలసనమును = విలాసమును, నిలిపెన్ = నెలకొల్పెను,

విటుని శరీరమున వెలయాలు నఖక్షతములుంచునట్లు మొగలి పువ్వును దననఖస్థానీయములయిన ముండ్లయొక్క గంటుల విలాసమును సర్పముపైనెలకొనఁజేసెను. (పాముమొగలి పూఁదావినిమూర్కొను నపుడామొగలిపువ్వుయొక్క ముండ్లుపామునకు గ్రుచ్చుకొని గంటు లేర్పడెననుట.)

అలం :— ఉపమ; యమకము.

సీ॥ సరసిజాకల్యాణ సమయార్ద్రవాతులక్ష్మిఁ
గలిగించుఁబడనఖాగ్రమునఁదవిలి
తళుకొత్తు మిన్నేటితెలినీటితెమలున
ముదురు చెందొవచాలుమొలవఁబెట్టు
సీమంతసీమాంతసిందూరరుచిఁజేయు
మొక్కిలేవని చతుశ్శ్రుతి సతులకుఁ
బీఠరూపంబునఁ 1 బెట్టువెట్టిన శేష
ఫణరత్న 2 ఘృణులకుఁబాగ్రిఁకువెట్టుఁ

తే॥ గైటభాంతకపూజనాకైతకప్రి
సవనవామోదపారణాసౌఖ్యముదిత
భుజగరాజస్ఫటాభోగభూరిమణి స
మాజరాజత్ప్రభాపుంజమంజిమములు. 250

250 ప:- 1 (బెట్టినశేషుని - ముద్రి [అ]ఁ బెట్టువెట్టిన - ర, బెట్టిపెట్టిన-అ.
2 మణులకు - అ, ఘృణులకు - క, గౌ.

వ్యా :— కైటభాంతక = కైటభవినాశకునియొక్క -హరి యొక్క, (విఠ్ఠలునియొక్క - అనుట) పూజనా = అర్చనకు సంబంధించిన, కైతక = మొగలికి సంబంధించిన, ప్రసవ = పుష్పము యొక్క -మొగలిపువ్వుయొక్క, నవ = క్రొత్తదయిన, ఆమోద = సుగంధముయొక్క, పారణా = ఉపవాసానంతర భోజనముయొక్క- బాగుగానాఘ్రాణించుటయొక్క, సౌఖ్య = సుఖముచేత - విఠ్ఠలుని బూజించిన మొగలిపూవుయొక్క సుగంధమునుబాగుగా నాఘ్రాణించుట వలనఁగలిగిన సుఖముచేత, ముదిత = సంతుష్టినందిన, భుజగరాజ = సర్పశ్రేష్ఠముయొక్క, స్ఫటా = పడగలయొక్క, (స్ఫటాయాంతుఫణ ద్వయోః - అమ) ఆభోగ = వైశాల్యమునందలి భూరి = గొప్పద యిన, మణిసమాజ = రత్నసమూహములయొక్క, రాజత్ = ప్రకాశించుచున్న, ప్రభాపుంజ = కాంతిసమూహములయొక్క, మంజిమములు = మనోజ్ఞతలు (సర్పరాజముయొక్క పడగలమీఁది మణి కాంతులనుట)—

(1) పదనఖాగ్రమునన్ = (విఠ్ఠలుని) కాలిగోటి కొనయందు, తవిలి = లగ్నమయి, సరసిజా = అబ్ధిజయొక్క - లక్ష్మీదేవియొక్క కళ్యాణసమయ = వివాహకాలమునందు, అర్హ = యోగ్యమయిన, జతులక్ష్మిన్ = లక్కయొక్కశోభను - లాక్షారసశోభను (లాక్షారాక్షా జతుక్లీబే - అమ) కలిగించున్ = కలుగఁజేయును.

సరసిజా - సరస్ = జలము. "సరోఽప్సుచ" - వై. ని. సరస్+ వ్రీహ్యాదిభ్యశ్చ = సరస్ + ఇనిః సరసిన్ = సముద్రము. ఇది 'సర స్వత్' శబ్దపర్యాయము, 'సరసిన్' సరస్వాన్సాగ రోర్ణవః (అమ) = సరోసితేతితూ కేచేతి రుద్రః, తద్యోగాత్సరస్వాన్ (గురుబాల)

(2) తళుకొత్తు = ఝిక్కిలిప్రకాశించు, మిన్నేటి=ఆకాశనదియొక్క (గంగానదియొక్క) తెలిసేటి = తెల్లనినీటియొక్క, తెమ్మలునన్ =

ప్రవాహమునందు, ముదురు = లేఁతతనమువీడి పరిణతినందిన, కెందొవ = ఎఱ్ఱకలువలయొక్క, చాలు = వరుసను, మొలవఁబెట్టున్= మొలచునట్లుచేయును.

గంగానది విష్ణుపాదోద్భవయనుట ఖగోళదృశ్యమునకుఁబత్రిక. చూ. 4-82 వ్యాఖ్య.

గంగానదీజలము తెలుపనుట కవిసమయము. "స్వర్గంగేభరదా భ్రికమ్, శేషాహిః శర్కరాదుగ్ధంధదధిగంగాసుధాజలమ్" (కవికల్ప)

నదియందుఁబద్మోత్పలము లుండుననుట కవిసమయము.

"తత్రిసామాన్యస్యాసతోనిబంధనమ్, తథా - నదీషుపద్మోత్ప లాదీని" (కావ్యమీ)

(3) మొక్కి = నమస్కరించి, వలేస = ఉత్తీతులుకాని, చతు శ్రుతి = నాలుగువేదములనెడు, సతులకున్ = సాధ్వులకు - వేద కాంతలకు, సీమంతసీమ = పాపటప్రదేశముయొక్క, (కేశేషువర్త్మ సీమంతః - అభి. చిం.) అంత =అగ్రమునందు, సిందూర = చెంది రముయొక్క, రుచిన్ = కాంతిని, చేయున్ = కలిగించును.

స్త్రీలు శిరోజములయందు సిందూరాదులను బూసికొనుట పూర్వాచారము.

(i) సీమంతపదముననఁజిగురొత్తునప్పుడు
రమణీయసిందూరరజముసొబగు (కాశీ 7-76)

(ii) కురులలోఁగదియంగఁగ్రొత్తపుప్పొడిఁదెచ్చి
మేదించివించెను మెలఁతయొకతె (యయాతి 5-101)

(4) పీఠరూపంబునన్ = ఆసనరూపమున, పెట్టెవెట్టిన = పెట్టె వలెఁజుట్టుకొనిన, శేష = ఆదిశేషునియొక్క, ఫణరత్నఘృణులకున్ =

పడగలయందలి మణులకాంతులకు, పాల్కుపెట్టున్ = పోషణము నిచ్చును - వృద్ధికలిగించును.

మణిసమాజ - "మాణిక్యభూషాసమాజంబుగలిగియు, నెట్టని గురివెందలేటికనరు" (కాళహ 3-6)

అలం :— ఉల్లేఖము.

క॥ 1 వ్యాపించితిమిరహారమై
దీపించునిజోత్తమాంగదివ్యమణిరుచిన్
దీపావళిహారికిచ్చుచు
నాపుణ్యఫలానుభవము నయ్యహిగనియెన్. **251**

వ్యా :— వ్యాపించి = వ్యాప్తిచెంది, తిమిరహారమై = చీకటిని హరించునదై, దీపించు = ప్రకాశించు, నిజ = తనవయిన, ఉత్తమాంగ = శిరస్సులయందలి, దివ్య = మనోహరములయిన, మణి = రత్నములయొక్క, రుచిన్ = కాంతిచేత, హారికిన్ = కృష్ణునకు - విట్టలునకు, దీప = దివ్వెలయొక్క, అవళిన్ = పంక్తిని, ఇచ్చుచున్ = ఒసఁగుచు, ఆపుణ్యఫల = అసుకృతఫలముయొక్క, అనుభవమున్ = అనుభవించుటను, అయ్యహి = ఆపాము, కనియెన్ = పొందెను.

---

251 ప :- 1 వ్యాపించు - డ, ద, ఋ; వ్యాపించి - ర, అ ఈపద్యము 'గా' ప్రతిలోలేదు.

క॥ అతటినొకకందువన
వ్వాతాశనశయనుకేళివనవసుమతినుం
డేతెంచెన్ సరఘానం
ఘాతము, తమపెరకుఁ 1 గడువిఘాతంబగుటన్. **252**

వ్యా :— అతటిన్ = ఆసమయమునందు, అవ్వాతాశన శయను = ఆసర్పము (ఆదిశేషుఁడు) శయ్యగాఁగలవానియొక్క- హరియొక్క, (విఠ్ఠలునియొక్క) కేళివనవసుమతిన్ = ఉద్యానవనప్రదేశమునందు, ఒకకందువన్ = ఒకచోట, ఉండి = నివసించి, సరఘా= తేనెటీఁగలయొక్క, (సరఘామధుమక్షికా - అమ) సంఘాతము = సమూహము, తమ = తమయొక్క, పెరకున్ = తేనెపట్టునకు, కడున్ = మిక్కిలి, విఘాతంబగుటన్ = ఉపద్రవము కలుగుటచేత, ఏతెంచెన్ = (బయలు) వెడలెన్.

వ్యాక :— ఉండి+ఏతెంచెన్ = ఉండేతెంచెన్-ప్రా. సంధి. 2

క॥ కాయద్యుతిజిడ్డుకొనఁగ
నాయీఁగలమొత్తమాశ్రితాఖిలదిశమై
యాయెడఁదైల 1 తటాక
న్యాయంబొనరించెజలధరాధ్వంబునకున్. **253**

---

252 ప ౹- 1 గడ్డలి - అ; గడు. వి - ర, గౌ.

253 ప ౹- 1 కటాహ - ప, ర, తటాక — అ; గౌ.

వ్యా :— ఆయీఁగలమొత్తము = ఆ (మధు) మక్షికల సమూహము, కాయద్యుతి = శరీరకాంతి, జిడ్డుకొనఁగన్ = జిడ్డు గలదికాఁగా, ఆశ్రిత = ఆశ్రయింపఁబడిన, అఖిల = సమస్తమాయిన దిశమై = దిక్కులుగలదియయి, (అన్నిదికులకు వ్యాపించినదయి - అనుట) అయ్యెడన్ = ఆసమయమునందు, జలధర = మేఘముల యొక్క, అధ్వంబునకున్ = మార్గమునకు - ఆకాశమార్గమునకు, తైలతటాకన్యాయంబు = కొలఁది పరిమాణముగలదయ్యు నూనె, చెఱువు నీటియందుఁబడి చాలదూరము వ్యాపించుననెడు యుక్తిమూలక దృష్టాంతవిశేషమును, ఒనరించెన్ = ప్రకటించెను.

స్వల్పపరిమాణముగల తేనెటీఁగలాకాశమార్గమున వ్యాపించుట తైలతటాకన్యాయమను యుక్తిమూలక దృష్టాంతమునకుఁ దార్కాణ మయ్యెనట.

వ్యు :- ఈఁగలు - ఈన్ + కల్ = ఈంగల్ = ఈంగలు = ఈఁగలు = ఈఁగ + లు - అనురీతిని 'ఈఁగ' శబ్దపరిణామమూహ్యము. ఇందు 'కల్' అనునదిబహువచన ప్రత్యయము. కవర్ణమనుచితవిభాగ మునకు గుఱియైనది. (ఆం. భా. వి,)

శా। ఆమందోద్భవబీజషండరుచి సయ్యాటించుచున్ మక్షికా
స్తోమంబాతతపక్షగుచ్ఛమగుచున్ దోఁతేర్చఁగా, శ్మశ్రులం
బై 1 ఖిన్నొప్పఁ 2 దదంగవంగతి, మధువ్యామోహముంజేయుఁదో
ర్దోమర్త్యాళికిఁదద్విహారకలితప్రస్కంధవీరుచ్ఛిఖల్. 254

వ్యా :— మక్షికా = ఈఁగలయొక్క (తేనెటీఁగలయొక్క-

254 ప :- 1 మిన్నొప్పు - మిద్రి (అ), ర; మిన్నొప్ప - అ. 2 వదంగ-గౌ; దదంగ — ర, అ.

అనుట) స్తోమంబు = సమూహము, అమంద = అముదపుఁజెట్టువలన, (ఏరండే - అమండస్తరుణోంబుకః - వై. ని.) ఉద్భవ = జనించిన, బీజషండ = విత్తనముల సమూహముయొక్క, రుచిన్ = కాంతిని, పర్యాటించుచున్ = పరిహసించుచు (సరిపోలుచు) ఆతత = విస్తృతమయిన, పక్ష = ఱెక్కలయొక్క, గుచ్ఛమగుచున్ = సమూహము గలదియగుచు, (గుచ్ఛః = సమూహః - సర్వ. సం.) తోఁతేరఁగాన్= రాఁగా, తత్ = వానియొక్క - అతేనెటీఁగలయొక్క, అంగ = ఒడళ్లయొక్క, సంగతిన్ = సంసర్గముచేత, మిన్ను = ఆకాశము, శ్మశ్రులంబై = గడ్డములు మీసములుగలదానివలెనై, ఒప్పన్ = ప్రకాశింపఁగా, తోడ్తోన్ = వెంబడిని, మర్త్య = మనుష్యులయొక్క, ఆళికిన్ = శ్రేణికి - సమూహమునకు, తద్ = వానియొక్క - అతేనెటీఁగలయొక్క, విహార=విహారముచేత, కలిత = కూడుకొనిన, దు్రు= వృక్షములయొక్క,(పలాశీదు్రుద్రుమాగమాః-అమ) స్కంధ =బోదెలయొక్క-చెట్టుబోదెలయొక్క, వీరుధ్ = కొమ్మలయొక్క, (వీరుధము= కొమ్మ, చిగురుఁగొమ్మ - సూ. ని.) శిఖల్ = కొనలు, మధువ్యామోహమున్ = తేనెయందలి యధికమోహమును, చేయున్ = కలిగించును.

అముదపు గింజలకాంతిని సరిపోలుచు, ఱెక్కలుచాఁచుకొని, తేనెటీఁగలసమూహమురాఁగా, వాని దేహసంసర్గముచేత నాకాశము గడ్డములు మీసములుగలవానివలె నొప్పఁగాఁదేనెటీఁగల విహారముతోఁ గూడుకొనిన చెట్టుబోదెలయెక్క కొమ్మల కొనలు మనుష్యులకు (చూపఱులకనుట) తేనెపైనధిక మోహముకలిగించును.

అలం ;— ఉపమ.

క॥ అమధుమక్షికలటఁజని
దామోదరమందిరాగ్రతలగతనిర్మా

ల్యామోద 1 మేదురమధు
ప్రేమాకులబుద్ధిమైఁజరింపఁగనంతన్. **255**

వ్యా :— ఆమధుమక్షికలు = ఆతేనెటీఁగలు, అటఁజని = ఆప్రదేశమున ముందునకుపోఁగి; దామోదర = హరియొక్క-విట్ఠలుని యొక్క, మందిర = గృహముయొక్క - పాండురంగాలయముయొక్క అగ్రతల = చివరిప్రదేశమును, గత = పొందిన, నిర్మాల్య = దేవతా నివేదనానంతరముతీసివేసిన ద్రవ్యముయొక్క-విట్ఠలునకు నివేదించితీసి వేసిన పూదండయొక్క, ఆమోద = సుగంధముయొక్క, మేదుర = దట్టమయిన, మధు = తేనెయందలి, ప్రేమ = మక్కువచేత; ఆకుల = వ్యాప్తమయిన, బుద్ధిమైన్ = మతిచేత, చరింపఁగన్ = పరిభ్రమింపఁగా, అంతన్ = ఆసమయమునందు, (మీఁదిపద్యముతో నన్వయము.)

నిర్మాల్యము —

"అర్వాక్ విసర్జనాద్ద్రవ్యం, నైవేద్యం సర్వముచ్యతే
విసర్జితేజగన్నాథే, నిర్మాల్యం భవతిక్షణాత్"
— ఇతి గరుడపురాణమ్.

"తన్యస్థాపనం క్షేపణంచయథా, "ఐశాన్యాం మండలం కృత్వా నిర్మాల్యశేషందద్యాత్తిదీ, వైష్ణవేతు ఓం విష్వక్సేనాయనమః" (శబ్దక)

క॥ అందునొక సరఘుగ్రోలెము
కుంద 1 పదార్ఘ్యాంబుబిందు గుంభితసుమనో
మందమకరందశీకర
ముం 2 దీర్థముస్వార్థమును సమున్నతి 3 నొలయన్. **256**

---

255 ప :- 1 మధురమేధా - క, మేదురమధు - ర, అ

256 ప :- 1 స్వర్గాగంబు - చ; పదార్ఘ్యాంబు - ర, అ. 2 తీర్థస్వార్థముల్ - ముద్రి (అ), ర; ధీర్థము స్వార్థమును - అ, గౌ. 3 వేలయన్ - ముద్రి (అ), ర; నొలయన్ - అ, గౌ.

వ్యా :— అందున్ = వానియందు - ఆతేనెటీఁగలయందు, ఒకసరఘ = ఒకానొక తేనెటీఁగ, తీర్థముస్వార్థమును = తీర్థస్వార్థములు రెండును - ఇహపరసౌఖ్యములు రెండును. సమున్నతిన్ = అధిక్యముతో, ఒలయన్ = ప్రాప్తింపఁగా, ముకుంద = హరియొక్క, విట్ఠలునియొక్క, పద = పాదములయొక్క, అర్ఘ్య = పూజకొఱకయిన, అంబుబిందు = జలకణములతో, గుంభిత = కూర్పఁబడిన. సుమనః = పువ్వులయొక్క. (సుమనసఃపుష్పం ప్రసూనం కుసుమం సుమమ్ - అమ) అమంద = అధికయిన. మకరంద = పూఁదేనెయొక్క, శీకరమున్ = బిందువును, క్రోలెన్ = పానముచేసెను.

తీర్థముస్వార్థము -- ఇహపర సౌఖ్యములురెండును గలుగుననుటను దెలుపుజాతీయము. తీర్థము = దేవునిపాదోదకము. స్వార్థము= స్వప్రయోజనము. ఆహారముగా నుపయోగపడునుగాన నిహలోకసుఖప్రాప్తి. తీర్థపానముపుణ్యహేతువుగానఁబరలోకసుఖప్రాప్తి.

పాఠ :— గుంభిత = గుంఫిత - చూ 1-21 వ్యాఖ్య.

క॥ కలిగెమధు 1 మక్షికమునకుఁ
2 దలఁపనితలఁపస్మదాదిధార్యము, గంగా
జలవలమానము. యదుకుల
తిలకాంఘ్రిసరోజదివ్యతీర్థముగోలన్. **257**

వ్యా :— మధుమక్షికమునకున్ = తేనెటీఁగకు, తలఁపనితలఁపు = అనుకొనకుండఁగా, అస్మదాదిధార్యము = నేనుమొదలగువారిచేత ధరింపఁదగినదియు. (శివాదిధార్యమనుట. శివుఁడు - వక్త)

---

257 ప :- 1 మక్షరఘమునకుఁ - చ. మాశకమునకుఁ - క, త, గొ. మక్షికముసకు - ర, ఆ. 2 తలవని - చ. తలచని - గ; తలఁపని - ర, ఆ; దలఁచినా - గొ.

గంగాజల = (విష్ణుపాదోద్భవయగు) ఆకాశగంగానదియొక్క నీటితో, వలమానము = చలించునదియు, (పాదోదకతీర్థము, హరిపాదమున జనించియంతర్లీనముగా నున్న గంగానది నీటితోఁగలిసిచలించుననుట. విఠ్ఠలునకు విష్ణునకునభేదము.) అగు, యదుకులతిలక = యదువంశ శ్రేష్ఠునియొక్క, అంఘ్రిసరోజ = పద్మములవంటి పాదములయొక్క దివ్య = ఇంపయిన, తీర్థము = పవిత్రజలమును, క్రోలన్ = పానము చేయుట, కలిగెన్ = సంభవించెను.

వ్యాక :— మధుమక్షికము - "సరఘామధుమక్షికా" - (అమ) 'మక్షికా' శబ్దమును గంధరాదులలోఁజేర్పఁగా మక్షికము, మక్షికయనురూపద్వయము సిద్ధించును (బా. తత్సమ 66)

ఆ॥ దానసంభవించెఁదేనియయీఁగకు
సోమపానరతుల సుకృతఫలము
భాగ్యమొదవెనేనిప్రాపించుఁదనుదాన
పుణ్యలక్ష్మి నిధియుఁబోలెఁబురుషు. **258**

వ్యా :— దానన్ = దానిచేత - విఠ్ఠలపాదతీర్థపానముచేత, తేనియయీఁగకున్ = మధుమక్షికమునకు, సోమపానరతుల =సోమ రసమునుగ్రోలుటయందుఁ బ్రీతిగలవారియొక్క - సోమయాజుల యొక్క, సుకృతఫలము = పుణ్యఫలము, సంభవించెన్ = కలిగెను. భాగ్యము = అదృష్టము, ఒదవెనేని = ప్రాప్తించినచో,పుణ్యలక్ష్మి = సుకృతసంపద, పురుషున్ = మనుజుని, నిధియుఁబోలెన్ = పాతఱ వలె, తనుదాన = తనకుఁదానే - స్వయముగానే, ప్రాపించున్ = ఒదవును

పురుషునకప్రయత్నముగానేదోత్రవ్వుచుండఁగాఁబెన్నిధి లభించి నట్లుపుణ్యలక్ష్మియదృష్టవంతునకప్రయత్నముగా లభించుననుట.

సోమరసము - సోమలతనుండి తిసినరసము.

సోమలత - సోమరసమును దీయుటకుపయోగించు తీఁగలను సోమలతలనియందురు. ఇవి యిరువది నాలుగు విధములు.

"అంశుమాన్ ముంజువాంశ్చైవ, చంద్రిమారజతప్రిభః
దూర్వాసోమఃకనీయాంశ్చ, శ్వేతాక్షః కనకప్రిభః
ప్రితానవాన్ తాలవృంతః, కరవీరాంశవానపి
స్వయంప్రభోమహాసోమో, యశ్చాపి గరుడాహ్వతః
గాయత్ర్యస్త్రైష్టుభః పాంక్తో, జాగతశ్శాంకరస్తథా
అగ్నిష్టోమోరైవతశ్చ, యథోక్త ఇతిసంజ్ఞితః
గాయత్ర్యాత్రిపదాయుక్తో, యశ్చోడుపతిరుచ్యతే
ఏతేసోమాస్సమాఖ్యాతా, వేదోక్తైర్నామభిశ్శుభైః" (సుశ్రు)

సోమలతలన్నియుఁబదునేనుపత్రిములుగలిగియుండును. వీనికి శుక్లపక్షమునఁజంద్రకళలతోపాటుగనొక్కొక్కయాకు పుట్టుచుండును. పౌర్ణమినాఁటికిఁబదునేను పత్రిములగును. కృష్ణపక్షమున నొక్కొక్కయాకురాలిపోవును. అమావాస్యనాఁడు తుదియాకురాలిపోయి తీఁగ మాత్రమేయుండును.

"సర్వేషామేవసోమానాం, పత్రాణిదశపంచచ
తానిశుక్లేచకృష్ణేచ, జాయంతేనిపతంతిచ
ఏకైకంజాయతేపత్రిం, సోమస్యాహరస్తథా
శుక్లస్యపౌర్ణమాంస్యాంతు, భవేత్పంచదశచ్ఛదః
శీర్యతేపత్రమేకైకం, దివసేదివసేపునః
కృష్ణపక్షక్షయేచాపిలతాభవతి కేవలా" (సుశ్రు) - శబ్దక.

సోమలతహిమవత్పర్వతపృష్ఠమునఁగల ముంజవత్పర్వతము నందును సింధునదీప్రాంతాదులయందును బుట్టును.

(i) "గిరిమక్షయందధౌ, సోమస్యేవమౌజేవతస్య భక్షః" "ముంజవత్పర్వతేజాతోమౌజవతః తస్యత్రతవ్యోత్తమః సోమోజాయతే" (ఋగ్వే - సాయన)

(ii) "సింధుమాతరా" (ఋగ్వే)

(iii) "కాశ్మీరోసరోదివ్యం, నామ్నాక్షుద్రికమానసః
గాయత్రిస్త్రైష్టుభః పాంక్తః, జాగతశ్శాంకరస్తథా
అత్రిసంత్యపతేచాపి, సోమసోమనమప్రిభా''(సుశ్రు)-ధ్రువ

సోమరసమును హోమముచేయుటవలన వర్షములుకురియును. "ఆహుతిర్దివోవృష్టించ్యావయతి'' (తైత్తి సంహిత) - ధ్రువ.

సోమసేవన విధినుండియేనేఁటి కాయకల్పచికిత్స రూపొందఁబడి నట్లు సుశ్రుతమువలనఁ దెలియనగును.

సోమయాగఫలము —

"బ్రహ్మహత్యాపరిశమనం, సోమయాగఫలంమునే
త్రైవార్షికమిదంయాగం, సర్వపాపప్రణాశనమ్" (బ్రిహ్మవై)

అలం :— అర్థాంతరన్యాసము.

సీ॥ జనియించెనేసాధ్విజాతిస్మరత్వనం
పదకల్మినిజకులాభరణమగుచు

వర్తించెనేపతివ్రత 1 తాటిమీఁదటి
తపమైన 2 మనువునఁదాల్చి 3 మిగిలి
నెలకొల్పెనే యపాంసులమానసమునందుఁ
బరమవైష్ణవధర్మపాటవంబు
మెప్పించెనేనతి యప్పౌండరీకతీ
ర్థవిభునిష్టాన్న వితీర్ణనమున

తే॥ నానుశీలకునక్కౌశహంస 4 చిత్ర
శుకభుజంగమసరఘులు సురథసులభ
సుముఖసువ్రతసుకృతినామములు వరుసఁ
దాల్చిజనియించె, శుక్తిముత్యాలువోలె. 259

వ్యా :— ఏసాధ్వి = ఏపతివ్రత, (సతీసాధ్వీపతివ్రతా - అమ) జాతిస్మరత్వ = పూర్వజన్మవృత్తాంత స్మృతిత్వముయొక్క, సంపదకల్మిన్ = సంపత్తికలిగియుండుటచేత; నిజ = స్వకీయమయిన కుల = వంశమునకు, అభరణమచున్ = అలంకారమగుచు, జనియించెన్ = పుట్టెనో !

"జాతిస్మర - త్రి. జాతింపూర్వజన్మస్మరతి. స్మృ+అచ్ = అతీతజన్మవృత్తాంతస్మృతియుక్తే జనే (శబ్దస్తో)

విట్టలుఁడు మశీలకుఁబ్రత్యక్షమైపూర్వజన్మవృత్తాంతమును దెలిపియుండుటచే నామెకుఁదనపూర్వజన్మవృత్తాంతముతెలిసినది. ఇట జాతిస్మరత్వమనఁగాఁబూర్వజన్మస్మృతితో జన్మించుటకాదు.

వ్యాక ;— జనియించెన్ = జనియించెనో. ఓ - అధ్యాహార్యము. (పౌ. వ్యాక 13)

---

259 ప :- 1 దాడి - క; తాటి - ర, అ 2 తనువున -ముద్రి [అ], ర; మానవు - గొ; మనువున - అ. 3 యుంచి - గ; మిగిలి- ర, అ,గొ తీర్థ - గ; - చిత్ర - ర, అ;

(2) ఏపతివ్రత = ఏసాధ్వి, తాటిమీఁదటితపమైన - తాళవృక్షముపైఁగూర్చుండిచేయుతపస్సువంటిదయిన (అతిదుష్కరమయిన-అనుట) మనువునన్ = కాపురమునందు, తాల్మిమిగిలి = ఓర్పుమీటి, వర్తించెన్ = ప్రవర్తించెనో! (ఓ - అధ్యాహార్యము)

పతివ్రతాలక్షణము —

"ఆర్తార్తేముదితాహృష్టే, ప్రోషితేమలినా కృశా

మృతేమ్రియేతయాపత్యౌ, సాస్త్రీజ్ఞేయాపతివ్రతా"

— ఇతిశుద్ధితత్వమ్ (శబ్దక)

(3) ఏయపాంసుల = ఏపతివ్రత, పరమ = ఉత్కృష్టమయిన, వైష్ణవధర్మ = విష్ణుభక్తికి సంబంధించినయాచారముయొక్క, (ధర్మః పుణ్యయమన్యాయస్వభావాచారసోమపాః - అమ) పాటవంబున్ = దక్షతను, మానసమునందున్ = మనస్సునందు, నెలకొల్పెన్ = పాదుకొల్పెనో, (ఓ - అధ్యాహార్యము)

(4) ఏసతి = ఏసాధ్వి, ఇష్ట = ప్రియములయిన, అన్న = ఆహారములయొక్క, వితీర్ణనమునన్ = వితరణములచేత - వడ్డించుటలచేత, పౌండరీకతీర్థవిభున్ = పౌండరీకక్షేత్రాధిపతిని - పాండురంగవిట్ఠలుని, మెప్పించెన్ = సంతుష్టునిజేసెనో (ఓ - అధ్యాహార్యము.)

అనుశీలకున్ = అనుశీలయనునామెకు, అక్కాక, హంస, చిత్రశుక, భుజంగము, సరఘులు = ఆకాకి, యంచ, పంచవన్నెలచిలుక, పాము, తేనెటీఁగయనునవి, సురథ సులభ సుముఖ సువ్రతసుకృతి నామములు = సురథుఁడు, సులభుఁడు, సుముఖుఁడు, సువ్రతుఁడు, సుకృతియనుపేరులు, వరుసన్ = క్రమముగా, తాల్చి = వహించి, శుక్తిన్ = ముత్తెపుఁజిప్పయందు, ముత్యాలువోలెన్ = మౌక్తికముల వలె, జనియించెన్ = పుట్టెను.

అలం ;— ఉదాత్తము, యథాసంఖ్యము, ఉపమ.

ఉ॥ *కేసరిశాబశోభి 1 గుహాకీర్తియు, భానుమ 2 దంశువిస్ఫుర
ద్వాసరలక్ష్మివైభవము, వారిధి 3 రత్నసమగ్రవేలయు
ల్లాసముఁదాల్చియొప్పెమహిళాతిలకంబు పతిప్రసాదవి
న్యాసముచేతఁజేకుఱిననందను లేవురునందమందఁగన్. **260**

వ్యా ;— మహిళాతిలకంబు = వనితాశ్రేష్ఠము - అనుశీల' పతి = భర్తయొక్క, ప్రసాదవిన్యాసముచేతన్ = అనుగ్రహప్రాప్తి చేత, చేకుఱిన = కలిగిన, నందనులు = కుమారులు, ఏవురున్ = ఐదుగురును, అందమందఁగన్ = సొబగొందఁగా, కేసరిశాబ = సింహపుఁబిల్లలచేత, శోభియగు = శోభించునదియగు, గుహా = బిలముయొక్క, కీర్తియున్ = వాసియు, భానుమత్ = సూర్యుని యొక్క, (భానుమాన్ = సూర్యః - ఇతిశబ్దరత్నావళీ - శబ్దక.) అంశు = కిరణములచేత, విస్ఫురత్ = ప్రకాశించుచున్న, వాసర లక్ష్మి = దినశోభయొక్క, వైభవమున్ = సంపత్తియు, వారిధి రత్న = సముద్రమణులచేత, (సముద్రమునందలి మణులచేత.) సమగ్ర = నిండిన; వేల = సముద్రపుటొడ్డుయొక్క, (అబ్ధ్యంబు వికృతౌవేలా కాలమర్యాదయోరపి - అమ) ఉల్లాసమున్ = ప్రకాశ మును, దాల్చి = వహించి, ఒప్పెన్ = శోభిల్లెను.

అలం ;— పదార్థవృత్తినిదర్శన.

క॥ గోమునఁబెరుఁగుచుముయ్యా
డై మెలఁగుచుగర్భవైష్ణవాగ్రేసరులౌ
నాముద్దుఁగొమరులంగని
కామినిదీపించె 1 దొండగాచిన 2 భంగిన్. **261**

---

260 ప :- 1 గృహా - గౌ; గృ (గు) హ-అ. 2 దంశ-గౌ. దంశు - ర, అ·
3 లగ్న-ముద్రి (అ), లక్ష్మి - గౌ; రత్న - అ. *ఈపద్యముగ-ద
లలో 265 వదిగా నున్నది. 'అ' చ-లోనీపద్యములేదు.-ర.

261 ప :- 1 దోఁడఁగా-డ, ధ, ఖ; ఁదొండ - అ; దొండ - ర; దోడగాచిన-గౌ.
2జాతికి ... ధ, ఖ, గౌ; భఙ్గిన్ - ర, అ.

వ్యా :— గోమునన్ = గారాబముతో, పెరుగుచున్ = ఎదుగుచు (వర్ధిల్లుచు) ముయ్యేడై = మూడవ యీడుగలవారై - కౌమారము, పౌగండము, కైశోరము, యౌవనమునను వయోభేద ములలో మూడవదయిన కైశోరవయస్సుగలవారై. (కైశోరము = 11-15 సంవత్సరములమధ్యప్రాయము.) మెలఁగుచున్ = వర్తించుచు, గర్భవైష్ణవాగ్రేసరులౌ = ఆగర్భవిష్ణుభక్తాగ్రగణ్యులగు, అముద్దుఁ గొమరులన్ = అముద్దుబిడ్డలను, కని = ప్రసవించి, కామిని = (అ) కాంత - అనుశీల, దొండగాచినభంగిన్ = దొండపాదుకాయలు కాచినట్లు, దీపించెన్ = ఒప్పెను.

దొండపాదు సంతతిపరంపరావృద్ధినిదెలుపును -

సకలదిశలకుశాఖోపశాఖలగుచుఁ

బాదలిఫలియించుదొండయుఁబోలెఁబ్రబలి

యాత్మసంతతిపుత్త్రపౌత్త్రాదిబహుప

రంపరలనొప్పవెలసెభర్తయునుదాను" (ప్రభావ 1-16)

ముయ్యేడు - మూఁడవయీఁడు. (1) కౌమారము = 5వ సంవత్సము నిండువఱకు. (2) పౌగండము = 6వ, సంవత్సరము మొదలు 10వ, సంవత్సరము నిండువఱకు. (3) కైశోరము = 11వ సంవత్సరము మొదలు 15వ, సంవత్సరమువఱకు. (4) యౌవనము = 16వ. సంవత్సరము మొదలుకొని 70వ సంవత్సరమువఱకు. (5) వార్ధక్యము = 71వ సంవత్సరమునుండి 90వ, సంవత్సరము నిండువఱకు, (6) వార్షియసము = 91వ సంవత్సరమునుండి.

"కౌమారంపంచమాబ్దాంతం

పౌగండందశమావధి

కైశోరమాపంచదశాత్

యౌవనంచతతఃపరమ్"
"ఇతి ప్రాయశ్చిత్తతత్త్వధృతవచనమ్"
"అషోడశాద్బవేద్బాల, స్తరుణస్తత ఉచ్యతే
వృద్ధఃస్యాత్ సప్తతేరూర్ధ్వం, వర్షీయాన్ నవతేఃపరమ్"
—"ఇతిస్మృతిః" (శబ్ద)

వ్యా ;— ముయ్యేడు - మూడు + అవ + ఈడు. (ము. కౌ. సమాస)

అలం ;— ఉపమ.

క॥ భూలేఖకులులకేయే
కాలంబుననెట్టియెట్టికర్మమొనర్పం
బోలుందత్తత్కృత్యము
లోలిం బితృకృతము 1 లయిగుణోన్నతిం బెనుపన్. **262**

వ్యా భూలేఖకులులకున్ = బ్రాహ్మణజాతియందు జన్మించిన వారికి, (దివిషదోలేఖాఅదితిఅనందనాః - అమ) ఏయేకాలంబునన్ = ఏయేసమయమునందు - ఏయేవయస్సులయందు, ఎట్టియెట్టికర్మము = ఎటువంటి యెటువంటి (గృహ్యాసూత్రోక్త) కర్మము, ఒనర్పన్ = చేయుట, పోలున్ = తగునో, తత్తత్కృత్యములు = ఆయాపనులు - ఆయాకర్మములు, ఓలిన్ = వరుసగా, పితృ = తండ్రిచేత, కృతములై = చేయంబడినవై, గుణ = సద్గుణములయొక్క, ఉన్నతిన్= ఔన్నత్యమును, పెనుపన్ = వర్థిల్లజేయంగా, (మీందిపద్యముతో నన్వయము.)

---

262 ప ॥ 1లై - గో; అయి - ర, త.

సుశీలపుత్రులకు జరిపినషోడశకర్మాంతర్గతకర్మలు-జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, వివాహము, గర్భాధానములోనగునవి.

షోడశకర్మలు - "గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యకర్మము" - సూ ని.

"ప్రసవేజాతకర్మచ, అహన్యేకాదశేనామ, షష్ఠేన్నప్రాశనమ్, మాసిమాడాకార్యాయథాకృతమ్ - ఇతిమలమాసతత్త్వమ్"

గర్భాష్టమేష్టమేవాబ్దే, బ్రాహ్మణస్యోపనాయనమ్
రాజ్ఞామేకాదాశేమైకే, విశామేకేయథాకులమ్
బ్రహ్మవర్చసకామస్య, కార్యంవిప్రస్యపంచమే

"బ్రాహ్మణస్యగర్భావధి షోడశవర్షపర్యంతమ్, తత్రగర్భాష్టమవర్షోముఖ్యః, క్షత్రియస్యద్వావింశతివర్షపర్యంతమ్, తత్రైకాదశవర్షోముఖ్యః, వైశ్యస్యచతుర్వింశతి వర్షపర్యంతమ్, తత్రద్వాదశవర్షోముఖ్యః ఇతిస్మృతిః సైకే = ద్వాదశే" (శబ్దక)

శా॥ శాణోత్తేజితరత్న 1 లక్ష్మ,గురుశిక్షావత్కిశోరాకృతిన్,
రేణుక్షాళనశాలిమూర్తికలభశ్రీ, దోహదోద్యన్నవ
క్షోణీజప్రభ, ముక్తకంచుకఫణిస్ఫూర్తిన్, సుధీబాంధవ
శ్రేణిపీడనకారణోజ్జ్వలకళోత్సేకాఢ్యుతైరేపురున్. 263

---

263 ప :- 1 పంక్తి - త్ర లక్ష్మ - ర, అ.

వ్యా :— ఏవురున్ = ఐదుగురును - సుశీలతనయులైదు గురును, శాణ = సానచేత, ఉత్తేజిత = సానపెట్టఁబడిన, (ఉత్తేజనా= తీక్ష్ణీకరణమ్ - శబ్దక) రత్న = మణులయొక్క, లక్ష్మీన్ = శోభ చేతను, గురుశిక్షావత్ = ఉపాధ్యాయులయొక్క బోధనగల, కిశోర పదునొకండువత్సరములు మొదలు పదునైదువత్సరములవయస్సుగల బాలురయొక్క, (కిశోరః = కైశోరావస్థయుక్తే - పౌగండందశమావధిః, కైశోరమాపంచదశాత్ - చూ 4-261 వ్యాఖ్య) ఆకృతిన్ = ఆకారము చేతను, రేణుక్షాళనశాలి = ధూళియొక్క కడుగుటచేతఁబ్రకాశించునది యగు, మూర్తి = శరీరముగల, (మూర్తిస్తనుతనూః - అమ) కలభ= ఏనుఁగుగున్నయొక్క, (కలభః కరిశాబకః - అమ) శ్రీన్ = శోభ చేతను, దోహద = అకాలమునఁ బుష్పములుపూయించునుత్తమస్త్రీల పాదతాడనాది క్రియలచేత, ఉత్యత్ = ఉద్యమించుచున్న - ఒప్పు చున్న, నవ = క్రొత్తదయిన, క్షోణీజ = వృక్షముయొక్క, ప్రభన్ = కాంతిచేతను - శోభచేతను, ముక్త = విడువఁబడిన (ఊడ్వఁబడిన) కంచుక = కుబుసముగల, (సమౌకంచుక నిర్మోకౌ - అమ) ఫణి = సర్పముయొక్క, స్ఫూర్తిన్ = ప్రకాశముచేతను, సుధీ = పండితుల యొక్కయు, (విద్వాన్ విపశ్చిద్దోషజ్ఞ స్సంతుధీః కోవిదోబుధః - అమ) బాంధవ = చుట్టములయొక్కయు, శ్రేణీ = పంక్తికి, (సమూహా మునకనుట) ప్రీణనకారణ = ప్రీతికలిగించుటకు హేతువయిన, ఉజ్జ్వల = ప్రకాశించునదియగు. కళా = కళలయొక్క - చతుష్షష్టి కళలయొక్క, ఉత్సేక = అతిశయముచేత, అధ్యులు = సంపన్నులు, ఐరి = అయిరి.

తరుదోహదములు —

"అశోకశ్చరణాహత్యా, వకుళోముఖశీధునా
ఆలింగనాత్కురవక, స్తిలకోవీక్షణేనచ.

కరస్పర్శేనమాకందో, ముఖరాగేణచంపకః
సల్లాపతఃకర్ణికార, స్సిందువారోముఖానిలత్
గీత్యాప్రియాళుర్నితరాం, నమేఁఽర్వాసితేనచ" (వృక్ష)
కళలు - చూ ౪-౩ వ్యాఖ్య.

చ॥ ఒకఁడు నిరూఢకృష్ణరుచి. యొక్కఁడు నిర్మలమానసప్రియుం
డొకఁడుప్రయత్నయోగ్యఫలుఁ,డొక్కఁడనాదృతబంధకంచుకుం
డొకఁడురసానుకూలమతియుక్తుఁడునై, విలసిల్లి 1 రింతి 2 పు
త్రికు 3 లిలనెట్టివారలకుఁదప్పునెతొల్లిటిజన్మవాసనల్. **264**

వ్యా :— ఒకఁడు = ఒక్కఁడు - ఒకకుమారుఁడు, నిరూఢ = మిక్కిలి ప్రసిద్ధమయిన, కృష్ణరుచి = శ్రీకృష్ణసంబంధమయిన ప్రీతి గలవాఁడును, (కృష్ణభక్తి కలవాఁడనుట) - అని సుశీలపెద్దకుమారుని పక్షముననర్థము, ఒకఁడు = ఒక్కఁడు, నిరూఢ = ప్రసిద్ధమయిన, కృష్ణరుచి = నల్లనికాంతి గలవాఁడును - అని కాకిపక్షముననర్థము. (సుశీలపెద్దకొడుకు పూర్వజన్మమునఁగాకి) ఒక్కఁడు = ఒక్కఁడు - ఒకకుమారుఁడు, నిర్మల = స్వచ్ఛమయిన, మానస = మనస్సుచేత, ప్రియుండు = మనోహరమయినవాఁడును - అని సుశీలరెండవకుమారుని పక్షముననర్థము. ఒకఁడు = ఒక్కఁడు, నిర్మల = స్వచ్ఛమయిన, సరోవరమునందు, ప్రియుండు = ప్రీతిగలవాఁడును - అని హంసపక్షమున, నర్థము. (సుశీలరెండవకొడుకు పూర్వజన్మమునహంస) ఒకఁడు = ఒక్కఁడు - ఒక కుమారుఁడు, ప్రయత్న = ప్రవృత్తిరూపమగు కార్యానుకూలయత్నమునకు, యోగ్య = తగిన, ఫలుండు = ప్రయోజనముగలవాఁడును - అని సుశీలమూఁడవకుమారుని పక్షముననర్థము.

---

264 ప :- 1 రంత - ండ, ధ, బ; రింతి - ర, అ, గౌ 2 పుత్రి - ర; పుత్రి-అ,-గౌ, 3 లిట - ఢ, ధ, బ, లిల -ర, అ, గౌ.

ఒకఁడు = ఒక్కఁడు, ప్రయత్న = జీవనకారణమగు కార్యాను కూలయత్నమునకు, యోగ్య = తగిన, ఫలుండు = పండ్లుగల వాఁడును - అని చిలుకపక్షమునన్నర్థము. (సుశీలమూఁడవకొడుకుపూర్వ జన్మమునఁ జిలుక.) ఒక్కఁడు = ఒకఁడు - ఒక కుమారుఁడు. అనా దృత = ఆదరింపఁబడని, బంధకంచుకుండు = కవచమువంటి సంసారబంధముగలవాఁడును (కంచుకో వారవాణోऽస్త్రీ - అమ) అని సుశీల నాలవకుమారుని పక్షమునన్నర్థము. ఒక్కఁడు = ఒకఁడు, అనాదృత = ఆదరింపఁబడని, బంధకంచుకుండు = ప్రతిబంధమగు కుబుసముగలవాఁడును (సమౌకంచుకనిర్మోకౌ - అమ) - అని పాము పక్షమునన్నర్థము. (సుశీలనాలవకొడుకుపూర్వజన్మమునఁబాము) ఒకఁడు= ఒక్కఁడు -ఒకకుమారుఁడు, రస = పరబ్రహ్మస్వరూపమునకు, (రసో వై సః - శ్రుతి.) అనుకూల = అనుగుణమయిన, మతి = బుద్ధితో, యుక్తుఁడున్ = కూడుకొన్నవాఁడును, ఐ = అయి - అని సుశీల యైదవకుమారుని పక్షమునన్నర్థము. ఒకఁడు = ఒకఁడు, రస = మక రందమునకు, (పుష్పస్యమధుని - శబ్దస్తో) అనుకూల = అనుగుణ మయిన, మతి = బుద్ధితో; యుక్తుఁడున్ = కూడుకొన్నవాఁడును. ఐ = అయి - అని తేనెటీఁగపక్షమునన్నర్థము. (సుశీలయైదవకొడుకు పూర్వజన్మమునఁదేనెటీఁగ) ఇంతి = కాంతయొక్క - సుశీలయొక్క, పుత్రికులు = కుమారులు, విలసిల్లిరి = ఒప్పిరి. ఇలన్=భూమియందు, ఎట్టివారలకున్ = ఎటువంటివారికయినను, తొల్లిటిజన్మవాసనల్=పూర్వ జన్మసంస్కారములు, తప్పను = తొలఁగునా? (తొలఁగవనుట.)

మానససరోవరము, కైలాసపర్వతమునఁగలదు. అందు రాజహంస లుండును. "కంపితంమానసంచైవరాజహంసనిషేవితమ్" (హరి) శబ్దక.

ప్రయత్నము - "ప్రయత్న = కార్యానుకూలేయత్నభేదే - ప్రవృత్తిశ్చనివృత్తిశ్చతథా జీవనకారణమితిన్యాయోక్తేత్రివిధయత్నే, సచాత్మగుణఇతివైశేషికాదయః, బుద్ధిధర్మఇతిసాంఖ్యాదయః" (శబ్దస్తో)

అలం :— శ్లేష; అర్థాంతరన్యాసము.

ఉ॥ లౌకిక వైదికాచరణలాలసులై, హరిభక్తినుత్తమ
శ్లోకులు 1 వీరనంగఁదగి, సూనృతలక్ష్మికిఁబట్టుఁగొమ్మలై
యేకడసర్వభూతదయయేతమసొమ్ముగ, దీనమానస
వ్యాకులతాపనోదన ధనాఢ్యులనన్ విలసిల్లిరేవురున్. **265**

వ్యా :— ఏవురున్ = అయిదుగురును - సుశీలకుమారులైదుగురును, లౌకిక = లోకసంబంధమయినట్టియు, వైదిక = వేద సంబంధమయినట్టియు, ఆచరణ = వర్తనలయందు, లాలసులై = అధికమయినయిచ్ఛగలవారయి, వీరు = వీరలు, హరిభక్తిన్ = విష్ణుభక్తియందు, ఉత్తమశ్లోకులు = ఉత్తమమయిన యశస్సుగలవారు, (పద్యేయశసిచశ్లోకః - అమ) అనంగన్ = అనునట్లు, తగి = ఒప్పి (వెలసెఁదనరెఁదగె -- వనంగనొప్పెనన్మాటగాఁజెప్పఁబడును - ఆం. భా.) సూనృతలక్ష్మికిన్ = ప్రియమునుసత్యమునగు వాక్యసంపదకు, (సూనృతంప్రియేసత్యే-అమ) పట్టుఁగొమ్మలై = ఆశ్రయమయినవారయి ఏకడన్ = ఏసమయమునందును, సర్వభూతదయయే = సమస్త ప్రాణులయందలి కరుణయే, (భూతంప్రాణ్యతీతే - అమ) తమ = తమయొక్క, సొమ్ముగన్ = అభరణముగా, దీన = దరిద్రులయొక్క (దీనోదరిద్రోదుర్గతోకపిసః - అమ) మానసవ్యాకులతా = మనః క్షోభము యొక్క, అపనోదన = పోఁగొట్టుటయనెడు, ధన = సొమ్ము చేత, అఢ్యులు = సంపన్నులు, అనన్ = అనునట్లు, విలసిల్లిరి = ఒప్పిరి.

అలం :— ఉదాత్తము

క॥ అత్తొలుకొలమలరులసర
మెత్తినక్రియఁబాలు 1 పొంగునెస, వికసితమౌ
నెత్తమ్మికొలని 2 చెలువునఁ
దత్తత్సౌభాగ్యములనుదాత్తంబయ్యెన్. **266**

---

265 ప :- 1 వీరనందగిరి - ముద్రి, ర; వీరనంగఁదగి అ. గౌ.

266 ప :- 1 పొంగునిన - ప; పొంగునిను - క; పొంగునిస - త; పొంగునెన - ర; పొంగునెస

వ్యా :— అత్తొలుకొలము = అప్రథమకులము - అబ్రాహ్మణ వంశము, అలరులసరము = పూలదండను, ఎత్తినక్రియన్ = ధరించిన విధమునను, పాలు = క్షీరము, పొంగు = ఉల్బణమయ్యెడు, ఎసన్ = విధమునను, వికసితమౌ = వికసించినదియగు, నెత్తమ్మి = ప్రశస్తములయిన పద్మములుగల, కొలనిచెలువునన్ = సరోవరమువిధమునను, తత్తత్ = అయా, సౌభాగ్యములన్ = సుభగత్వములచేత, ఉదాత్తంబయ్యెన్ = గొప్పదయ్యెను.

క్రియ - తెనుఁగుననివార్థకము. చెలువు - సౌందర్యవాచకములివార్థకములగును. నవ్వునాలుగండాలచేటు - అనివాడుక.

వ్యాక :— వికసితమౌనెత్తమ్మికొలను - ఏకదేశాన్వయము. (ప్రౌ. సమాస 3)

అలం :— మాలోపమ.

తే॥ అఖిలకల్యాణగుణశీలయానుశీల
పెట్టెఁజేమీఁదుగానెల్లచుట్టములకు
భర్తతోఁగూడ ముత్తాటిపండుదినియె
నెత్తె 1 మున్మన్మగుఱ్ఱలనెందఱేని. 267

వ్యా :— అఖిల = సమస్తమయిన, కళ్యాణగుణ = శుభకరములయిన సద్గుణములు, శీల = స్వభావముగాఁగలదియగు, (శీలం వృత్తస్వభావయోః - వై. సి.) అనుశీల = అనుశీలాదేవి, ఎల్లచుట్టములకున్ = సర్వబంధువులకు, చేమీఁదుగాన్ = (తన) చేతిమీఁదుగా (తనచేతితో - అనుట) పెట్టెన్ = భోజనాదుల నొసఁగెను. భర్తతోఁగూడ = పతితోసహితముగా, ముత్తాటి పండుఁదినియెన్ = చిరకాలము

267 ప :- 1 మునిమన్మ - ర; మున్మన్మ - అ, గౌ.

జీవించెను. మున్మన్మగుజ్జులన్ = కుజ్జులయినమునిమనుమలను, (ప్రపౌత్రులను, మనుమలకొడుకులను మనుమరాండ్రకొడుకులను.) ఎంద ఱేని = ఎందఱనో (ఎంతోమందిని - చాలమందిని) ఎత్తెన్=పడసెను.

ముత్తాటిపండుదిను = బహుకాలముజీవించుటను దెలుపుజాతీయము.

ముత్తాడు = "తానునాటినతాటిటెంకనుండి మొలచినతాటిటెంక నుండి పుట్టిపెరిఁగిన తాళవృక్షము" (సూ. ని.) - అనుట విచార్యము. మూఁడవతరమున, నన౯గా, మనుమనితరముననాటినతాటిటెంకనుండి పుట్టినతాటిచెట్టు - అని యర్థము. చేయుటయుక్తము. తాటిటెంకనాటిన పదేండ్లకుఁదాటిచెట్టుఫలించును.

వ్యాక ;— ముత్తాడు = మూఁడవ + తరముననాటినతాటి టెంకనుండి పుట్టిన + తాడు - మధ్యమపదలోపిసమాసము, అవగాగమ లోపము (ము. కౌ. సమాస) ముని+మన్మ = మున్మన్మ - ము. కౌ. ప్రకీర్ణక.

మున్మన్మగుజ్జులు = కుజ్జులయినమున్మన్మలు - విశేష్యపూర్వపద కర్మధారయము - ప్రౌ. సమాస 16

ఉ॥ అనలినాయతాక్షి ప్రసవాపగమంబునఁబండఁబాఱుచున్
బ్రాణ 1 విభూపలాలనముప్రాఁకుడుఁగొయ్యగనిల్చి, మన్మసం
తానమొనర్చుపోడిజరద్దైన్యము 2 నాఁగ, నతీతవర్షను
ద్యాన 3 తలౌషధింబ్రవహదంబునమీప 4 నిరూఢఁబోలదే! **268**

---

268 ప ;- 1 విభూషజాలన - త; విభూపతాలన - ర, అ. 2 గాఁగ ర(పా) నాఁగ - ర, అ, గౌ. 3 తరౌషధివ్రవ - ద, ధ, బ; లతౌషధిప్రయ, ర; తలౌషధిఁబ్ర - గౌ, తలౌషధింబ్ర - అ. నిరూఢి-ముద్రి [అ]. ర; నిరూఢ - అ, గౌ. 5 జాలదే - ర (పా); బోలదే - ర, అ.

వ్యా :— అనలినాయతాక్షి - అపద్మములవంటి విశాలముల యిననేత్రములుగలది - అసుశీల, ప్రసవ = కానుపులయొక్క, అపగ మంబునన్ = తొలఁగుటచేత - కాన్పుఉడుగుకుచేత, పండఁబాఱుచున్= ముదియుట కున్ముఖురాలగుచు - అని సుశీలపక్షముననర్థము. ప్రసవ = పువ్వులయొక్క, అపగమంబునన్ = తొలఁగుటచేత, (పూవులుపూయు దశదాఁటుటచేత) పండఁబాఱుచున్ = పండుటకున్ముఖమగుచు - అని యౌషధమునకుపయోగించు లతపక్షముననర్థము. (ప్రాణవిభు = ప్రాణే శ్వరునియొక్క, (భర్తయొక్క - అనుట) ఉపలాలనము= బుజ్జగింపు, ప్రాఁకుడుఁగొయ్యగన్ = తీఁగప్రాఁకుటకుఁబ్రక్కనిలువఁబెట్టు, కఱ్ఱగా (ఉపఘ్నముగా) నిల్చి = నిశ్చింతముగానుండి, అతీతవర్షన్ = అతి క్రమించిన సంవత్సరములయందు, మన్మసంతానము = మనుమల సంతతి, ఒనర్చు = చేయు, పోఁది = పోషణము, జరద్దైన్యమున్= ముసలితనపు దీనత్వమును, అఁగన్ = నివారింపఁగా - అని సుశీల పక్షముననర్థము. అతీతవర్షన్ = అతిక్రమించిన వానలయందు - అని యౌషధమునకుపయోగించు లతపక్షముననర్థము ప్రవహాత్ = ప్రవ హించుచున్న, అంబు = నీటియొక్క, సమీప = నికటమునందు, నిరూఢన్ = బాగుగామొలచినదగు, ఉద్యానతల = క్రీడావనప్రదేశము నందలి, ఓషధిన్ = ఔషధమునకుపయోగించు లతను, (లతాదిజాతయః ఓషధ్యః -గురుబాల) పోలదే = (అసుశీల) సరిపోలదా? సరిపోలుననుట.

క॥ సకలాగమజ్ఞయగు వి
ప్రకులాంగనయొక్కనాఁడు 1 పల్కు నిజకుమా
రకులఁగని, మునుమదాలస
శుకతుల్యులఁగూర్మియాత్మజులఁబల్కుక్రియన్. 269

---

269 ప. - 1 పలుకు - ర, అ; పల్కు - గౌ.

వ్యా :— సకల = సమస్తములయిన, ఆగమజ్ఞ = ఆగమములవైష్ణవాగమముల) నెఱిఁగినది, అగు = అయిన, విప్రకులాంగన = బ్రాహ్మణకులమునకుఁ జెందినస్త్రీ - అనుశీల, ఒక్కనాఁడు = ఒక దినము, నిజకుమారకులన్ = స్వకీయతనయులను, కని = చూచి, మును = పూర్వము, మదాలస = (కువలయాశ్వునిభార్యయగు) మదాలస, శుకతుల్యులన్ = శుకమహర్షితోసమానులయిన, కూర్మి యాత్మజులన్ = ప్రియకుమారులనుగూర్చి, పల్కక్రియన్ = వచించునట్లు, పల్కన్ = వచించెను.

మదాలస - ఈమె కువలయాశ్వుఁడను రాజుభార్య. విక్రాంత సుబాహుశత్రుమర్దనులీమె పుత్రులు. ఈమెపుత్రులకుఁజేసిన హితబోధ మార్కండేయపురాణమునఁగలదు.

శుకుఁడు - వ్యాసునకు శివుని వరప్రభావమువలన ఘృతాచీ దర్శనముచే రేతస్ఖలనమై యది యరణియందుఁబడి శుక్రమథనమువలన శుకుఁడుదయించెను. శుక్రశబ్దమునరేఫలోపముచే శుకశబ్దమేర్పడెను. అరణిమమంథబ్రహ్మర్షి, స్తస్యాంజజ్ఞే శుకోనృపః శుక్రేనిర్మథ్యమానేస, శుకోజజ్ఞే మహాతపాః" (శాంతి)

ఆగమములు వైష్ణవాగమములనియు శైవాగమములనియు రెండు విధములు. ఇటు వైష్ణవాగమముల ద్దిష్టములు.

"పంచకంపంచ రాత్రాణాం, కృష్ణమాహాత్మ్యపూరకమ్
వాశిష్ఠంనారదీయశ్చ, కాపిలంగౌతమీయకమ్
పరంసనత్కుమారీయం, పంచరాత్రంచపంచకమ్" (బ్రహ్మవై)

ఆగమనిర్వచనము —

"ఆగతంపంచవక్త్రాత్తు, గతంచగిరిజాననే
మతంచవాసుదేవస్య, తస్మాదాగమముచ్యతే" (తంత్ర)-శబ్దక

(అగతంశివవక్త్రభోగ్య, గతంచగిరిజాశుభ్రితా -శబ్దస్తో -పాఠము)
చూ. 1-52 వ్యాఖ్య.

మ॥ అనుభూతాఖిలభోగ, పోషితసమస్తార్యన్, గృతానేకకాం
చనముఖ్యోచితదాన, 1 దృష్టిగతయుష్మత్ క్షేమ, జీవ 2 త్పతిన్,
జనతామాన్య, నశీతివృద్ధ, నను, నీసంసారదుర్వారబం
ధననిర్బంధమ నందుఁబాపుటకుయత్నంబింకఁజేయందగున్.

**270**

వ్యా :— అనుభూత = అనుభవింపఁబడిన. అఖిల = సమస్తములయిన, భోగన్ = సుఖములుగలదియు, పోషిత = పోషింపఁబడిన, సమస్తార్యన్ = ఎల్లపూజ్యులుగలదియు, కృత =చేయఁబడిన, అనేక= పెక్కులయిన. కాంచనముఖ్య = బంగారముమొదలయిన, ఉచిత = యోగ్యములయిన, దానన్ = త్యాగములుగలదియు, (సువర్ణదానాది మహాదానములు చేసినదియు - అనుట) దృష్టిగత = చూపుచేతఁ దెలియఁబడిన, (స్వయముగాఁ దెలిసికొనిన - అనుట) యుష్మత్ = మీయొక్క, క్షేమన్ = కుశలముగలదియు, (కుశలంక్షేమమస్త్రి యామ్ - అమ) జీవత్ = జీవించుచున్న, పతిన్ = భర్తగలదియు, (పతివత్నిజీవత్పతిః - అభి చిం.) జనతా = జనసమూహముచేత, మాన్యన్ = పూజింపఁదగినదియు, అశీతివృద్ధన్ = ఎనుబదేండ్లముదుసలిదియు (షష్టిస్సప్తత్యశీతిశ్చనవతిశ్చదశోత్తరాః, క్రమేణాథపరే ణాథపరేవశగుణోత్తరాః - వై ని.) అగు, ననున్ = నన్ను, ఈసంసార బంధన = ఈభవబంధముయొక్క, నిర్బంధమునందున్ = అధికమయిన ప్రతిబంధకమునందుండి, పాపుటకున్ = తొలఁగఁజేయుటకు, (తప్పించు

---

270 ప - 1 వృష్టి - గౌ; దృష్టి - ర, అ. 2 త్కృతిన్ - ర (పా) త్పతిః - అ, గౌ.

టకు) ఇంకన్ = ఇటుపైని, యత్నంబు = ప్రయత్నము, చేయం దగున్ = చేయుటయుక్తమగును.

వ్యాక ,— ననున్ -- అను విశేష్యముద్వితీయాంతమున నుండుటచే విశేషణములు ద్వితీయాంతములయ్యెను. (బా. కారక 19)

క॥ 1 సభవజ్జనకంబుగఁజని
ప్రభవజ్జగదండషండపరిపూర్ణతనున్
శుభదాయిఁబౌండరీక
ప్రభునారాధించికాంతుఁబరమపదంబున్. **271**

వ్యా ;— సభవజ్జనకంబుగన్ = మాతండ్రితోఁగూడ, చని = అరిగి, ప్రభవత్ = ప్రభవించుచున్న (పుట్టుచున్న) జగదండ = అండములవంటి భువనములయొక్క, షండ = సమూహముచేత, పరిపూర్ణ = నిండిన, తనున్ = శరీరముగలవాఁడును, శుభదాయిన్ = శుభముల నిచ్చువాఁడును, అగు, పౌండరీకప్రభున్ = పాండురంగ క్షేత్రాధిపతిని - పాండురంగ విట్ఠలుని, ఆరాధించి = పూజించి, పరమ పదంబున్ = ఉత్కృష్టస్థానమును - వైకుంఠమును, కాంతున్ = ప్రాపింతును.

క॥ ఒకబుద్ధివినుండొండొ
డక, సకలాగమమతంబుడక్కఁదెలిసిమా
ళకుటిలమతినెఱిఁగింతు, జ
నకసనకశుకాదులెఱిఁగిన తెరువుఁదెలియన్. **272**

---

271 ప :- 1 శుభ – గౌ; సభ - ర, అ.

272 ప :- 1 "చ, త ప్రతులలో సనకశుకాదులెఱిఁగినతెరువుల్" అని కలవు. నెరిగిం – సనక – అని 'చ' లో క్రిమిదష్టపాఠము. దానినిబట్టి నెఱిఁగించెదనిఁకజనక సనకశుకాదు లెఱిఁగిన తెరువుల్ - అని సరళమైన మూలపాఠమునూహింపఁదగియున్నది." – అ.

వ్యా :— ఒండాడక = మాఱుపలుకక (ఎదురు చెప్పక) ఒకబుద్ధిన్ = ఒకతలంపును, వినుండు = ఆలకింపుఁడు, సకల = సమస్తములయిన, ఆగమ = ఆగమములయొక్క, మతంబున్ = ఆశయమును, దక్కఁదెలిసి = అధీనమగునట్లుతెలిసికొని - సాధికార ముగాఁదెలిసికొని, మీకున్ = మీకు, అకుటిలమతిన్= ఋజుబుద్ధితో, జనకసనకశుకాదులు = జనకుఁడు, సనకుఁడు, శుకుఁడుమొదలగువారు, ఎఱిఁగిన = తెలిసికొనిన, తెఱవున్ = మార్గమును, తెలియన్ = స్పష్టపడునట్లు, ఎఱిఁగింతున్ = తెలుపుదును.

ఆగమములు - చూ 4-269 వ్యాఖ్య.

సీ॥ అమితభోగాయతనము దేహమనుసత్ప
ముగ్రికృత్యము లేల యుడిగి యుండు?
ధాతుమయంబుగాత్రిమనుధాత్రీధరం
బదియేలరాగంబునవఱ్ఱదో యు?
నిచితనానాగుణ ప్రిచురమీతనువను
1 పటమేల 2 చిఱుఁగక పదిలమొందు?
మూర్తిపరంపరాయుతమంగమను వార్ధి
యెడజీవనభ్రాంతియేలయుడుగు?

ఆ॥ నార్జవంబుచాలదతి కఠినాశయ
3 మెపుడుమైలవిడువ 4 దెందుఁజివుకుఁ
5 బడికిడొక్క, దీనిఁబాటింపరెప్పాటు
లక్షయేనియునుముముక్షుజనులు 273

273 ప :- 1 ఫల - డ, ద, బ; పట - ర, అ. గౌ. 2 చినుఁగ - చ, గౌ; చిరుఁగ - ర, అ. 3 'ంబెపుడు" — గౌ; మెపుడు - ర, అ. 4 దెండుఁజివుకుఁ-డ.ద,బ; దెందుఁజిపుకు-ర; దెందుఁజివున-చ,త; దెందుజివ్వుక - క; దెందుజీవు - గౌ; దెందుఁ (దేదు?) - అ. 5 పదిరిడొక్కటిని-క; బటికి - అ; పడికి — చ, త, గౌ.

వ్యా :— అమిత = కొలదిలేని, భోగ=సుఖమనెడు పడగకు, (భోగస్సుఖేస్త్ర్యాదిభృతావహేశ్చఫణకాయయోః - అమ) ఆయతనము= స్థానమగు - ఆశ్రయమగు, దేహము = శరీరము, అను = అనెడు, సర్పము = పాము, ఉగ్ర = భయంకరములగు, కృత్యములు = పనులను, ఏల = ఎందులకు, ఉడిగియుండున్=విసర్జించియుండును? (విసర్జింపదనుట)

(2) ధాతుమయంబు=(శరీరధారకవస్తువులగు) రసాదిధాతువులనెడు (శిలావికారములగు) గైరికాదిధాతువులమయమయిన, గాత్రము = శరీరము, అను = అనెడు, ధాత్రీధరంబు = పర్వతము, రాగంబున్= అనురక్తియనెడు నెఱ్ఱదనమును. (రాగోనురక్తౌమాత్సర్యేక్లేశాదౌరోహితాదిషు - విశ్వ) అదియేల = అదియెందులకు, అవలఁదోయున్ = బయటికి విసర్జించును? (విసర్జింపదనుట)

ధాతువులు - ధాతుః = శరీరధారకవస్తూని, తద్యథా — కఫః, వాతః, పిత్తమ్.

"శరీరదూషణాద్దోషా, మలినీకరణాన్మలాః
ధారణాద్ధాతవస్తేస్యు, ర్వాతపిత్తకఫాస్త్రయః'' —ఇతివైద్యకమ్.
"రసాసృఙ్మాంసమేదోస్థి, మజ్జశుక్రాణిధాతవః
సప్తదూష్యాఃమలామూత్ర,శకృత్స్వేదాదయోఽపిచ-ఇతివాగ్భటీ

"ధాతుశబ్దోనాత్రశుక్రార్తవే అప్యుచ్ఛేతే --- నఏతేశరీరధారణాద్ధాతవ ఇత్యుచ్యంతే" -- ఇతిసుశ్రుతే (శబ్దక)

ధాతుః - అశ్మవికృతిః, సాతుగైరికమనః శిలాదిః (శబ్దక)

(3) నిచిత = నిర్మింపఁబడిన, నానా = అనేకములయిన, గుణ= గుణములనెడు దారములచేత,(మౌర్వ్యాంద్రవ్యాశ్రితేసత్త్వశుక్లసంధ్యా

దికేగుణః - అమ; గుణ = రజ్జుమాత్రే - శబ్దస్తో) ప్రచురము = అధికమయినదియగు, ఈతనువు = ఈశరీరము, అను = అనెడు, పటము = వస్త్రము, చిరుఁగక = శిథిలముకాక, ఏల = ఎందులకు, పదిలమొందున్ = స్థిరముగానుండును. (స్థిరముగానుండదనుట)

(4) ఊర్మి = మూసలితనములోనగు నూర్ములనెడు కెరటముల యొక్క, పరంపరా = ఎడతెగని వరుసతో, యుతము = కూడు కొన్నదియగు, అంగము = శరీరము, అను = అనెడు, వార్ధి = సముద్రముయొక్క, ఎడన్ = విషయమునందు, జీవన = బ్రతుకు తెరువనెడు నీటియొక్క (ఆజీవోజీవికావార్తావృత్తిర్వర్తన జీవనే; అపఃస్త్రీ.. జీవనంభువనం వనమ్ - అమ) భ్రాంతి = భ్రమయనెడుభ్రమణము, ఏల = ఎందులకు, ఉడుగున్ = విడుచును? (విడువదనుట)

ఊర్ములు —

శోకమోహౌజరామృత్యూ, క్షుత్పిపాసాషడూర్మయః

—ఇతి శ్రీభాగవతటీకా

బుభుక్షాచపిపాసాచ, ప్రాణస్యమనసః స్మృతౌ

శోకమోహౌశరీరస్య. జరామృత్యూషడూర్మయః" (శబ్దక)

ఆర్జవంబుచాలదు = ఋజుత్వము (తిన్నఁదనము) చాలదు. వార్ధక్యాదులచే వంగిపోవునని దేహముపక్షమునసర్థము. చుట్టుచుట్టు కొనునని సర్పముపక్షమునసర్థము. (1పా)

అతికఠినాశయము = మిక్కిలి దృఢములగు వాతపిత్తాదులగు నాశయములుగలది - అని దేహముపక్షముననర్థము. అతికఠినాశయము = మిక్కిలిగట్టివయిునస్థానములుగలది-అని పర్వతముపక్షముననర్థము (2పా)

ఎపుడున్ = ఎల్లప్పుడు, మైల = మాలిన్యము, విడువదు = వదలదు - అని దేహముపక్షమునను వస్త్రముపక్షముననునర్థము మఱికి పట్టుటదేహమునకు వస్త్రమునకు సమానము (3 పా)

"తలమాసిననొలుమాసిన, వలువలు మాసినను" - సుమతీ.

ఎందున్ = ఎప్పుడయినను, చివుకున్ = జీర్ణమగును (శుష్కించును) - అని దేహముపక్షముననర్థము. ఎందున్ = ఎప్పుడయినను, చివుకున్ = సంక్షోభించును, (చలించును) - అని సముద్రపక్షముననర్థము. (4 పా)

దీనిన్, పడికిఁడొక్కన్ = ఈమృతినొందుటగల బొందిని (శరీరమును) ఎప్పాటన్ = ఏవిధముగానయినను, ముముక్షుజనులు = మోక్షముపై నిచ్ఛగలమానవులు, లక్షయేనియున్ = లక్షమాటలుచెప్పినను, పాటింపరు = లెక్కపెట్టరు.

వ్యాక :- పడికి - నిఘంటువులలోఁగానరాదు. "పడు = మృతినొందు, చచ్చు" - సూ. ని. ఈ 'పడు' ధాతువును "కోర్వ్యాదులలోఁ" (బా. కృదంత 16) జేర్చిన, పడు + ఇకి = పడికి - అను రూపము సిద్ధించును.

అలం :— శ్లిష్టపరంపరిత రూపకము, యథాసంఖ్యము.

ఉ॥ మాయయుజీవుఁడున్ 1 బెరసిమైత్రి 2 యొకానొకఁడాఁ3చరించున్
బాయకయాఁడుఁబాటుమగపాటువడన్, వివిధత్వమొందిపల్
4 పాయలఁబాంచభౌతికపుఁబైరుదయించితలిర్పమోడుగా
మేయుజరామయవ్యసనమృత్యునియుక్తకడంగరీయముల్ 274

---

274 ప ;- 1 గలసి - ర (పా), బెరసి - ర, అ. గౌ. 2 యొకా - చ; యొకా - ర, అ. 3 రింపుచుఁ - గౌ; రించుచుఁ - ర, అ. 4 చాయల - ముద్రి (అ), ర; గౌ. (యతిభగంము) పాయల-అ.

వ్యా :— మాయయున్= అవిద్యయు, జీవుఁడున్= జీవాత్మయు, బెరసి = కూడుకొని, ఒకానొకఁడు మైత్రి = ఒకానొక చెలిమి, ఆచరించుచున్ = చేయుచు, పాయక = ఎడతెగక, (అవిచ్ఛిన్నముగా - అనుట) అంగుఁబాటు మగపాటువడన్ = స్త్రీయొక్క యొక్క యవస్థయుఁబురుషునియొక్క యవస్థయుఁబొందఁగా, వివిధత్వము = నానాత్వము. ఒంది = పొంది, పల్పాయలన్ = పెక్కు విభాగములుగా, (పెక్కురకములుగా) పాంచభౌతికపుఁబైరు = పంచభూతవికారమగుదేహమనెడు సస్యము, ఉదయించి = కలిగి, తలిర్పన్ = ఒప్పఁగా, జరా = ముసలితనయు, ఆమయ = రోగము, వ్యసన = ఆపదలు, (వ్యసనంవిపదిభ్రంశేదోషేకామజకోపజే - అమ) మృత్యు = మరణముననెడు, నియుక్త = నియోగింపఁబడిన - పాంచభౌతికపుఁబైరును భక్షించుటకు నియోగింపఁబడిన, కడంగరీయముల్ = పొల్లు కసవుమేయుటకర్హములయినవి - గోమహిషాదులు, మోదుగాన్ = ప్రమోదగునట్లుగా, మేయున్ = భక్షించును.

మాయాజీవులకలయికచే స్త్రీ పురుషరూపములలోఁబంచభూతాత్మకమగు దేహమనెడు సస్యముజనించి వృద్ధిచెందఁగా, దానిని భక్షించుటకు నియుక్తమయిన ముసలితనము రోగమునాపదమరణమనెడు గోమహిషాదికముమోదుగాఁజేయును.

కడంగరీయముల్ - నీవారపాకాదికడంగరీయైః (రఘు 5-9)= "కడంగరంబుసం అర్హంతీతికడంగరీయాః, 'కడంగరదక్షిణాచ్ఛద' ఇతి చ్ఛప్రత్యయః. 'కడంగరోబుసంక్లీబేధాన్యేత్వచితుషః పుమాన్' నిత్య మరః తైర్గోమహిషాదిభిః" (మల్లినా)

మాయయుజీవుడున్‌బెరసి - ఇది సాంఖ్య దర్శనానుసారియగు వివరణము, చూ 4-278 వ్యాఖ్య.

"హరియోగమాయామహత్త్వంబునంబాంచ
భౌతికదేహసంబంధుఁడగుమ" (భాగ 2 స్కం - 223)

జీవుఁడు -"ప్రాణదేహాదిభృద్దేహీ, సజీవః పరికీర్తితః" (బ్రహ్మవై)
పంచభూతములు - పృథివ్యప్తేజోవాయ్వాకాశములు.

**అలం :—** రూపకము.

**శా॥** అంతర్వాణికుశేశయద్యుమణిఁబద్మాక్షున్ మదిన్నిల్పి, దు
ర్దాంతానంతభవాంధకూపతరణప్రౌఢిన్దృఢస్థేమఁబా
టింతుర్ పెద్దలుతద్దనమ్మి, సుయిదాఁటేవానికింజింత 1 యా
కంతైనంగడమేనియుంగడమగాదా! యంచు 2 నూహింపుచున్.

**275**

వ్యా :— పెద్దలు = విజ్ఞులు, తద్దనమ్మి = మిక్కిలి విశ్వసించి, అంతర్వాణి = శాస్త్రవేత్తలకెను, (అంతర్వాణిస్తుశాస్త్రకృత్ - అమ) కుశేశయ = పద్మములకు, (కమలంశతపత్రంకుశేశయమ్ - అమ) ద్యుమణిన్ = సూర్యుఁడగు, (ద్యుమణిస్తరణిః - అమ) పద్మాక్షున్ = హరిని, మదిన్ = మనస్సునందు, నిల్పి = ప్రతిష్ఠించి, నుయి దాఁటేవానికిన్ = కూపమునుదూఁకువానికి, చింతయాకంతైనన్ = చింతాకుపరిమాణమయినను - అల్పపరిమాణమయినను, కడమేనియున్= కొలతయైనచో, కడమకాదా = కొఁతకదా ! (నుయ్యిదాఁటువానికి దూకుటలోఁగొలఁదిపాటి పరిమాణము తక్కువయినను నతఁడు కూపమునఁగూలునుగదా! యనుట) అంచున్ = అని, ఊహింపుచున్ = సంభావించుచు, దుర్దాంత = నిగ్రహింపరాని, అనంత = అంతులేని,

---

275 ప :- 1 యావంతే - చః తః యాకంతైన - ర, అ. 2 నూహించు చున్ - ర. నూహింపుచుణ - అ, గొ.

భవ = సంసారమనెడు, అంధకూప = పాడునూతియొక్క, (అంధకూపః కర్కారాంధుకః - అమ) తరణప్రౌఢిన్ = దాఁటునుద్యోగము నందు (అభియోగోద్యమౌప్రౌఢిరుద్యోగః - అభి. చిం.) దృఢస్థేమన్ = అతిశయమయిన స్థైర్యమును, పాటింతుర్ = అవలంబింతురు.

వ్యాక ;— పాటింతురు + పెద్దలు = పాటింతుర్పెద్దలు -బా. ప్రకీర్ణక 16 ఊహించు + చున్ = ఊహింపుచున్ - ప్రౌ. క్రియా 17

"నుయిదాఁటేవానికింజింతయాఁకంతైనం
గడమైనచోఁగడమకాదా" — లోకోక్తి.
"లోకోక్తినాంభవేద్యోగోయదిస్యా
చ్ఛ్రుతిరంజనమ్" (వికృ; ము. కౌ. ప్రకీర్ణక)

క॥ తలముచ్చుట్టులు దిరిగినఁ
దలపోయఁగనోరిలోనిదయకడియన్న
ట్లిలనే 1 తిరుగులు దిరిగినఁ
గలుగదుగతి విష్ణుసేవఁ 2 గాకించుకయున్. **276**

వ్యా ;— తలన్ = శిరస్సును, ముచ్చుట్టులు = మూఁడు తడవలు, తిరిగినన్ = చుట్టివచ్చినను, తలపోయన్ = ఆలోచింపఁగా, కడి = ఆహారము, నోరిలోనిదయ = నోటిలోపలిదే (నోటిలోపల నుంచినదే - అనుట) అన్నట్లు = అన్నవిధముగా, ఇలన్ = భూమి యందు, ఏతిరుగులు దిరిగినన్ = ఎట్టిపర్యటనలు చేసినను, విష్ణుసేవన్ = హరిభజనచేత, కాక = కాకుండ, గతి = మార్గము - మోక్షమార్గము, ఇంచుకయున్ = కొంచెమయినను, కలుగదు = ప్రాప్తింపదు.

---

276 ప ;- 1 తెఱఁగుల-ముద్రి (అ) ర, గౌ; తిరుగులు - అ. 2 గావింపక యున్ - ముద్రి (అ), గాకించుకయుఁకా - అ.

వ్యాక :— నోరిలోనిది + అ + అ = నోరిలోనిదయ.
(ము. కౌ. ప్రకీర్ణక)

మూఁడు + చుట్టులు = ముచ్చుట్టులు - బా సమాస 17

అలం ;— లోకోక్తి.

మ॥ పురుషశ్రేష్ఠులుగొందఱాత్మచరితంబుల్ జ్ఞానవైరాగ్యభా
స్వరముల్ గావిహరిం 1 చుచున్ గురుకృపాసంపన్నులై సాధనాం
తరమంత్రాంతర 2 దేవతాంతరములం 3 దక్కించి, క్షీరోదక
స్ఫురణంబొప్ప, ముకుందలీనతనులై 4 పొందర్పునర్జన్మముల్ **277**

వ్యా :— కొందఱు = కొంతమంది, పురుషశ్రేష్ఠులు = మానవోత్తములు, ఆత్మ = తమయొక్క, చరితంబుల్ = నడవడికలు, జ్ఞాన = మోక్షసాధనమగు బుద్ధిచేతను, (మోక్షేధీర్ జ్ఞానమ్ - అమ) వైరాగ్య = విరక్తిచేతను, భాస్వరముల్ = ప్రకాశించునవి. కాన్ = అగునట్లు, విహరించుచున్ = సంచరించుచు, గురు = దీక్షాగురువుల యొక్క, (మతదీక్షనిచ్చు గురువులయొక్క - అనుట) కృపా = దయ చేత, సంపన్నులై = ఆఢ్యులయి, సాధనాంతర = వేఱుసాధనములను, మంత్రాంతర=వేఱుమంత్రములను. దేవతాంతరములన్ = వేఱుదేవత లను, తక్కించి = విసర్జించి, క్షీరోదకస్ఫురణంబు = పాలయొక్కయు నీళ్లయొక్కయు స్ఫూర్తి, ఒప్పన్ = ఒప్పిదముకాఁగా, ముకుంద = హరియందు, లీన = ఐక్యమొందిన, తనులై = శరీరములుగలవారయి- జీవాత్మలుగలవారయి, పునర్జన్మముల్ = మరల జననమొందుటలు, పొందర్ = ప్రాపింపరు.

---

277 ప :- 1 పుచుఁ - గౌ; చుచుఁ - ర, అ. 2 దైవ - ర, గౌ; దేవ- అ. 3 దర్కించి - ముద్రి (అ), ర; దక్కించి - అ; గౌ. 4 పొందున్ పున - త, పొందఁ - గ, పొందర్పున - ర, అ, గౌ.

క్షీరోదకస్ఫురణం బొప్పముఃసందలీనతనులై — అనుటచే నిట సాయుజ్యరూపమోక్షము సూచితము. చూ 1-99 వ్యాఖ్య.

వ్యాక :— పొందరు+పునర్జన్మముల్ = పొందఱ్పునర్జన్మ ముల్ - బా. ప్రకీర్ణక 16.

సీ॥ విష 1 యాంకురముగిల్లి వేయనివారికి
నినుపకచ్చడమున కెలతదవ్వ?
2 తెగలోనికసటుగడుగనివారికినిద్రి
షవణంబునకు నెన్ని 3 చాళ్లపట్టు?
చింతలన్నియు బ్రమోడుసేయనివారికి
బోడయౌదలలకు 4 నేడయేడ?
5 యేనేనుతత్త్వంబులెఱుఁగనివారికి
నెఱుకకునేయూరికేది 6 తెరువు?

ఆ॥ తమమొగంబుఁజూడు! తముఁజూడుమేనుఁగు
మీఁదనున్నవానిమేరమీఱ
నున్నమడుగఁజూచుచున్నారు, హరిభక్తి
గమ్యధామకాంక్షఁగర్మపరులు. 278

వ్యా :— విషయ = ఇంద్రియార్థమనెడు, అంకురమున్= మొలకను, గిల్లి వేయనివారికిన్ = గోటితోఁద్రుంచివేయనివారికి, (నిర్గు

278 ప :- 1 యాంతముగ్గిలి - త; యాంతరముగిల్లి — గౌ, యాంకురము- ర, అ. 2 తెగగొని - ముద్రి (అ), ర; లోనికసటు — అ, గౌ. 3 చాళ్ళపెట్టు - చ, త; చాళ్లపట్టూ - ర; చాళ్ళపట్టు - అ. 4 నేద కేడ — ముద్రి (అ); ర; నేడయేడ — అ, గౌ. 5 యేనుతత్త్వం బులునెఱు — ముద్రి (అ), ర; యేనేనుతత్త్వంబులెఱు — అ. 6 దెరువు — గౌ; తెరువు - ర, అ.

లింపనివారికి - అనుట) ఇనుపకచ్చడమునకున్ = ఇనుపగోచికిని, ఎంత దూరము ? (చాలదూరమనుట)

మునులినుపకచ్చడములుధరింతురనుటకు - "ఇనుపకచ్చడాల్ గట్టుకొనుమునిముచ్చులెల్ల" (మను 2-73)

(2) తెగన్ = నిశ్శేషముగా, లోనికసటు = లోపలిమాలిన్యమును - మనస్సులోపలిమాలిన్యమును, కడుగనివారికిని = ప్రక్షాళనముచేయనివారికిని, త్రిషవణంబునకున్ = త్రికాలస్నానములసమాహారమునకు, (ప్రాతర్మధ్యాహ్న సాయం స్నానములసమాహారమునకనుట) ఎన్నిచాళ్లపట్టు=ఎన్నివరుసలయెడము? (ఎంతోయెడమనుట)

త్రిషవణము - "త్రీణిసవనానియత్ర, కాలేవాషత్వమ్, త్రికాలే సమాహారద్విగుః, త్రైకాలికేస్నానత్రయేచ, వాగ్యతిస్త్రి (ష) సవనం చరేదితిస్మృతిః" (శబ్దస్తో)

అంతశ్శుద్ధిలేని బాహ్యశుద్ధివ్యర్థమనుట, (చూ. కాశీ 3-74)

(3) చింతలన్నియున్ = విచారములనన్నింటిని, మోడుసేయనివారికిన్ = శుష్కింపఁజేయనివారికిని, బోడయౌదలలకున్ = బోడియైన తలయొక్క ముందటిభాగములకు, (ఔదలముందలయని శిరోగ్రమూమిాఅు - ఆం. భా) ఏడయేడ = ఎక్కడెక్కడ? (ఏమియు సంబంధములేదనుట.)

శ్రోత్రియులు, తలముందటిభాగమును, ముండనముచేయించుకొనుటయాచారము.

"యజ్ఞదత్తుండర్ధముండితతలంబైన మూర్ధంబున నీర్కావిదోవతినటి ముటిఁజుట్టుకొని" కాశీ 4-102)

వ్యాక ;— ౙొదల = తలయొక్క ముందటిభాగము - ఏక దేశిసమాసము. 'ౙ' శబ్దమునకు వ్యస్తప్రయోగములేదు గావున నిది నిత్యసమాసము. విశేషణపూర్వకర్మధారయమని మహాభాష్యమతము.

(4) ఏనేనుత్త్వంబులు = ఇరువదియయిదు తత్త్వములు, (అవ్యక్తాది పంచవింశతితత్త్వములనుట) ఎఱుఁగనివారికిన్ = తెలియనివారికిని, ఎఱుకకున్ = జ్ఞానమునకును, ఏయూరికేదితెరువు = ఏయూరికేత్రోవ (ఏమియు సంబంధము లేదనుట)

ఏయూరికేదితెరువు - ఏసంబంధమును లేదనుటను దెలుపు జాతీయము. ఏయూరికేత్రోవ - ఉ. హ. 5-159

ఇరువదియైదుతత్త్వములు - ఇవి సాంఖ్యదర్శన నిరూపితములు. (1) మూలప్రకృతి. (2) మహత్తత్త్వము. [బుద్ధి] (3) అహంకారము (4-8) పంచతన్మాత్రలు. (9-13) జ్ఞానేంద్రియపంచకము. (14-18) కర్మేంద్రియపంచకము (19) మనస్సు (20-24) పంచభూతములు. (25) పురుషుఁడు. (చూ 2-8 వ్యాఖ)

ఈయిరువదియైదుతత్త్వములు మూఁడుగా విభజింపఁబడెను.

(1) అవ్యక్తము = మాయ. దీనిని బ్రధానమనియునందురు. ఇది సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతి. (2) పురుషుఁడు - జ్ఞానరూపుఁడు. అపరిణామి. (3) వ్యక్తము. ఇది యవ్యక్త [మాయా] పురుషుల సంయోగమువలన జగద్రూపమునఁగనఁబడును. (మాయయు జీవుఁడున్ బెరసి - 4-274)

పురుషుఁడు - చేతనము తక్కిన యిరువది నాలుగుతత్త్వములు' నచేతనములు (షడ్డ)

వ్యాక ;— ఏనేను = ఏనేనుల [ఐదైదుల] నసూహారము- సమాహారద్విగువు.

కర్మపరులు = యజ్ఞాదికర్మలయందుఁ బ్రీతిగలవారు, హరిభక్తి = విష్ణుభజనముచేత, గమ్య = పొందఁదగిన, ధామ = ఉనికియొక్క, కాంక్షన్ = అపేక్షచేత, (విష్ణుభక్తిచేఁ బ్రాప్యమగుమోక్షమునందలియపేక్ష చేత-అనుట) ఏనుంగుమీఁదనున్నవానిమేరమీఱినున్నమడుగఁ జూచుచున్నారు = అందనివస్తువునందుకొనుటకువ్యర్థప్రయత్నముచేయుచున్నారు. తమమొగంబుఁజూడు తముఁజూడుము = వారివాలకమెట్లున్నదో చూడుము

వేదవిహితకర్మానుష్ఠానమువలన స్వర్గముప్రాప్తించును. ("స్వర్గకామోయజేత") మోక్షాపేక్షగలవారుహరి భక్తినాశ్రయింపక కర్మానుష్ఠానపరులగుట యేనుఁగు మీఁదనున్న వానిని మేరమీఱినున్నమడుగఁ జూచుటవంటిది.

ఏనుంగుమీఁదనున్న వాని సున్నమడుగఁజూచుట -- అనునది యందనిమ్రానిపండ్లకట్టులుసాఁచుటవంటి జాతీయము. తమమొగంబుఁ జూడుతముఁజూడుమన్నది తిరస్కారమును దెలుపుజాతీయము.

సీ॥ పరదారపరధనాహరణవై ముఖ్యంబు
 వశవర్తిఁగావించువారుదక్కఁ
బరగుణపరమాణు [1] పర్వతీకరణంబు
 వ్రతముగాఁబాటించువారుదక్కఁ
*బరుఁడైనఁగొడుకైన మరియాదచెడసమ
 త్వమునశిక్షయొనర్చువారు దక్కఁ
బరమసంపదలనాపద్వేళసత్యంబు
 వదలకభాషించువారుదక్క

279 ప ;- 1 పర్వత - డ, ధ, బ; పర్వతీ - ర, అ.

తే॥ దూరమగు కోర్కిఁ గోరనివారు దక్కఁ
గ్రూరకర్మంబు లుడివోవువారు దక్కఁ
బూరుషార్థపరతఁ గ్రాలువారు దక్కఁ
దక్కువారెల్ల భవవహ్నిఁ 2 దిక్కువారు. **279**

వ్యా :— పరదార = అన్యులభార్యలయొక్కయు, పరధన = అన్యులద్రవ్యములయొక్కయు, ఆహరణంబు = అపహరించుటయందు; వైముఖ్యంబున్ = విముఖత్వమును, వశవర్తిఁగావించువారు = (తమ) అధీనమయిన దానినిగాఁజేయువారు. తక్కన్ = తప్ప, పరగుణ = అన్యులసద్గుణములనెడు, పరమాణు = పీలువులను, పర్వతీకరణంబు = కొండలుగాఁజేయుట, వ్రతముగాన్ = నియమముగా, పాటించువారు = ఆచరించువారు, తక్కన్ = తప్ప, (పరగుణపరమాణువులను బర్వతీకరించుట సజ్జన లక్షణమని సుభాషితము) పరుఁడైనన్ = అన్యుఁడయినను, కొడుకైనన్ = కుమారుఁడయినను, మరియాద చెడన్ = కట్టుఁబాటునుల్లంఘింపఁగా, సమత్వమునన్ = సమానత్వముతో - సమదృష్టితో, శిక్షయొనర్చువారు = దండించువారు, తక్కన్ = తప్ప, పరమసంపదలన్ = ఉత్కృష్టములయిన సంపత్తులయందును, (అధికసంపన్నులైయున్నప్పుడును - అనుట) ఆపద్వేళన్ = విపత్కాలమునందును, సత్యంబున్ = ఋతమును, వదలక = విడువక, భాషించువారు = పలుకువారు, తక్కన్ = తప్ప, దూరమగు కోర్కెన్ = దవ్వయినవాంఛను - మితిమీఱిన వాంఛను, కోరనివారు= వాంఛింపనివారు, తక్కన్ = తప్ప, క్రూరకర్మంబులు = ఘాతుక కృత్యములు, ఉడివోవువారు = మాననివారు, తక్కన్ = తప్ప, తక్కువారెల్లన్ = తక్కినవారెల్లరు, భవవహ్నిన్ = సంసారమనునగ్నియందు, తిక్కువారు = చిక్కువారు (బాధపడువారు)

2 దక్కు-ము(ద్రి(అ), ర్య (తక్కు-గో; తనుతు - ప; (వగ్గు - అ,

క॥ పలువేల్పులబడినడవక
యిలువేలుపుగా భజింపుఁడీ మీారలు, 1 పి
చ్ఛిలశిక్యగదధిరసగం
ధిలకేశున్ బౌండరీకతీర్థాధీశున్. **280**

వ్యా :— పలువేల్పులబడిన్ = పెక్కుమంది దేవతలవెంబ డిని, నడవక = పోవక, (పెక్కుమంది దేవతలనాశ్రయింపక-అనుట) మీారలు = మీారు, పిచ్ఛిల = పేరుకొన్నదియు (మీాఁగడకట్టినదియు) శిక్యగ = ఉట్టిని బొందినదియు, ఉట్టియందున్నదియు - అనుట) అగు, దధిరస = పెరుఁగుయొక్క సారముచేత, గంధిల = సుగంధము గలదియగు, కేశున్ = తలవెంట్రుకలు గలవాఁడగు, పౌండరీకతీర్థా ధీశున్ = పౌండరీకక్షేత్రాధిపతిని - పాండురంగవిఠ్ఠలుని, ఇలువేలుపు గాన్ = గృహదైవతముగా, భజింపుఁడీ = సేవింపుఁడీ.।

తలపైఁబెట్టుకొన్న యుట్టిలోని మీాఁగడపెరుఁగుపడి, కేశములు సుగంధిలములయినవనుట.

పలువేల్పులు— "పలువేల్పులనుగొల్వఁబాపంబుగాదె" (బసవ)

ఉ॥ మస్తకిరీటహాటకసమంచితకుంభయుతంబు, పీవరో
1 రస్తటరత్న 2 దీపరుచిరంబు, రమా 3 సమసాలభంజికా
శస్తమునైనశార్ఙ్గితను సౌధమునెక్కి సుఖించు బుద్ధికిన్
నిస్తులభక్తిగౌరవమునిచ్చెనయైచననిచ్చమీాఁదికిన్. **281**

వ్యా ;— మస్తకిరీట = శిరస్సునందలి మకుటమనెడు (మస్తమ్ = మస్తకమితిద్విరూపకోషః - శబ్దక; మస్తఏవమాస్తకః -

---

280 ప :- 1 విఠ్ఠలు - ముద్రి (అ), ర; పిచ్ఛిల - అ, గౌ.
281 ప :- 1 రస్తటి - డ, ద, బ; రస్తట - ర, అ, గౌ. 2 దీప్తి - ముద్రి (అ), ర; దీప - అ, గౌ. 3 సదు - గ; సమ - ర, అ, గౌ.

గురుబాల) హాటక = బంగారముచేత, సమంచిత = ఒప్పిదమయిన, కుంభ=కలశముతో,యుతంబు=కూడుకొన్నదియు, పీవర = స్థూలమైన ఉరస్తట = వక్షః ప్రదేశముసందలి, రత్న = మణియనెడు - కౌస్తుభ మణియనెడు, దీప = దీపికచేత, రుచిరంబు = ప్రకాశించునదియు, రమా = లక్ష్మియనెడు, అసమ = సాటిలేని, సాలభంజికా = బొమ్మ చేత, (పాంచాలికాతుపస్త్రాదిపుత్రికాసాలభంజికా - అమ) శస్త్రమున్= శ్రేష్ఠమయినదియు, ఐన = అయినట్టి, శార్ఙ్గి = హరియొక్క, తను= శరీరమనెడు, సౌధమున్ = రాజగృహమును, (సౌధొస్త్రీరాజసదనమ్- అమ) ఎక్కి = అధిరోహించి, సుఖించు = సుఖపడు, బుద్ధికిన్ = మతికి, నిస్తుల = సాటిలేని, భక్తిగౌరవము = భక్తియొక్క యాధిక్యము, (భక్త్యతిశయము) నిచ్చెనయై = నిశ్రేణికయై, మీఁదికిన్ = పైకి - హరియొక్కతనువనెడు సౌధముపైకి, చననిచ్చున్ =పోనిచ్చును.

లక్ష్మీవిగ్రహాదులు సౌధములపైనుండెడి వనుటకు నోరుఁగంటి ప్రతాపరుద్రుని సౌధముమీఁది గజలక్ష్మీ విగ్రహము నిదర్శనము. (పద్య. బసవ)

అలం ;— రూపకము

క॥ మీఁరును గృహస్థధర్మము
మేరకుఁదలమీఁటిచనక, మిత్రామాత్యో
దారహితదారదారక
వారకములతోడఁదీర్ఘ 1 వాసపగులరై. **282**

వ్యా ;— మీఁరును = మీఁరుకూడ, గృహస్థధర్మము = గృహమేధిధర్మముయొక్క, మేరకున్ = హద్దునకు, తలమీఁటిచనక = అతిక్రమించిప్రవర్తింపక, మిత్రామాత్య = స్నేహితులగు మంత్రుల

---

282 ప ;- 1 వాసనపరులై - త, గొ; వాసపరులలై – అ.

యొక్కయు, ఉదారహిత = గొప్పశ్రేయోభిలాషుల యొక్కయు, దార = భార్యలయొక్కయు. దారక = పుత్రులయొక్కయు, (తన యోదారకః సుతః - అభి. చిం) వారకములతోన్ = సమూహములతో, తీర్థవాసపరులరై = పుణ్యక్షేత్రనివాసమునందుఁ బ్రీతిగలవారయి, (మీఁదిపద్యముతో నన్వయము.)

గృహస్థబ్రాహ్మణధర్మము —

చతుర్థమాయుషోభాగ, ముషిత్వాద్యంగురౌద్విజః
ద్వితీయమాయుషోభాగం, కృతదారోగృహేవసేత్
ఋతామృతాంజీవేత్తు, మృతేనప్రమృతేనవా
సత్యానృతాభ్యామపివా, నశ్వవృత్త్యాకదాచన,
ఋతముంఛశిలంజ్ఞేయమమృతంస్యాదయాచితమ్
మృతంతుయాచితంభైక్షం, ప్రమృతంకర్షణంస్మృతమ్
సత్యానృతంతువాణిజ్యం, తేనచైవాపిజీవ్యతే
సేవాశ్వవృత్తిరాఖ్యాతా, తస్మాత్తాం పరివర్జయేత్ (మ. స్మృ)

గృహస్థులు పంచమహాయజ్ఞములనాచరింపవలెను.

“పంచసూనాగృహస్థస్య, చుల్లీపేషణ్యుపస్కరః
కండనీచోదకుంభశ్చ, బధ్యతేయాస్తువాహయన్
తాసాంక్రమేణసర్వాసాం, నిష్కృత్యర్థంమహాత్మభిః
పంచక్లుప్తామహాయజ్ఞాః, ప్రత్యహంగృహమేధినామ్
అధ్యాపనంబ్రహ్మయజ్ఞః, పితృయజ్ఞస్తుతర్పణమ్
హోమోదైవీబలిర్భౌతో, నృయజ్ఞోతిథిపూజనమ్” (మ. స్మృ.)

క॥ కోమలతులసీపల్లవ
దామాంచిత 1 వత్సలక్ష్మధాముఁబయోద
శ్యాముఁబదద్వయనతసు
త్రాముఁన్మన పౌండరీకధాముఁగొలువుఁడీ. **283**

**వ్యా** :— కోమల = మృదువయిన, తులసీపల్లవ = తులసి దళములయొక్క (పల్లవము = ఆకు, పత్త్రము - సూ. ని.) దామ = మాలచేత (తుఁ సితావళముచేత - అనుట) అంచిత = ఒప్పిదమయిన, వత్సలక్ష్మ = ఱొమ్మునందలిమచ్చకు - శ్రీవత్సమనెడు ఱొమ్మునిఁది పుట్టుమచ్చకు, ధామున్ = స్థానమయినవాఁడును, పయోదశ్యామున్= మేఘమువలెనల్లనివాఁడును, పదద్వయ = అడుగుదోయికి, నత = నమస్కరించువాఁడగు, సుత్రామున్ = ఇంద్రుఁడుగలవాఁడును, అగు, మన = మనయొక్క, పౌండరీకధామున్ = పౌండరీకక్షేత్రము నివాసస్థానముగాఁగలవానిని - పాండురంగవిఠ్ఠలుని, కొలువుఁడీ = సేవింపుఁడీ!

పయోదశ్యాము--శ్యామకృష్ణవర్ణములకైక్యము కవిసమయము. "కృష్ణశ్యామయోః -- ఏకత్వేననిబంధనంచకవిసమయః" (కావ్యమీ) మేఘసామాన్యవర్ణము నలుపనుట కవిసమయము.

"సామాన్యగ్రహణేవారి, ముచాంకృష్ణత్వమేవహి
రక్తత్వమేవరత్నానాం, పుష్పాణాంశౌక్ల్యమేవచ" (కవికల్ప)

**వ్యాక** :— పయోదశ్యాముఁడు - ఉపమానపూర్వపదకర్మ ధారయము. (ఉపమానానిసామాన్యవచనైః - పాణి)

---

283 ప :- 1 వకలక్ష్మ - గ; వత్సలక్ష్మ - ఆ; వత్మలక్ష - గొ; ర.

క॥ అనుచుండనర్కనిభమగు
అనిమిషయానంబుఁదెచ్చి హరిపార్శ్వచరుల్
గొనిచనిరి సభర్తృకముగ
ఘనశీలను శీలవిష్ణుగాథాలోలన్. **284**

వ్యా :— అనుచుండన్ = అనిపలుకుచుండఁగా, హరిపార్శ్వ చరుల్ = విష్ణుమూర్తిపారిషదలు, అర్కనిభమగు = సూర్యునితో సమానమగు, అనిమిషయానంబున్ = దేవయానమును, (విమానమును) తెచ్చి = తీసికొనివచ్చి, ఘనశీలన్ = గొప్పసుస్వభావముగలదియు, విష్ణుగాథా = విష్ణుకథలయందు, లోలన్ = మిక్కిలియాసక్తిగలది యునగు, సుశీలన్ = సుశీలను, సభర్తృకముగన్ = భర్తతోఁగూడ, కొనిచనిరి = తీసికొనిపోయిరి.

తే॥ అవునవనీసురుండువాయసమునంచ
రాజకీరంబుఁబాముసరఘయు 1 గ్రద్ద
ముక్తికేగిన కథవినుభక్తతతికిఁ
బర్వతాగ్రశిలాబ్జసంభవముభవము. **285**

వ్యా :— అవున్ = గోవును, అవనీసురుండున్ = భూదేవుఁడును, (బ్రాహ్మణుఁడును) వాయసమున్ = కాకియు, అంచ = హంసయును, రాజకీరంబున్ = రాచిలుకయు, పామున్ = సర్పమును, సరఘయున్ = తేనెటీఁగయు, ముక్తికిన్ = మోక్షమునకు, గ్రద్దన్ = శీఘ్రముగా (బహుజన్మపరంపరలక్క అలేకుండ- అనుట) ఏగినకథన్ = అరిగినచరిత్రను, విను = ఆలకించు, భక్తతతికిన్ = భక్తులసమూహమునకు, భవము = పుట్టుక, (పునర్జన్మ - అనుట) పర్వతాగ్ర =

285 ప :- 1 నిట్లు - ర, అ. గ్రద్ధ - గొ;

కొండకోనయుండలి, శిల = ఱాతియందు, అబ్జ = జలజముయొక్క (పద్మముయొక్క) సంభవము = పుట్టుకవంటిది. పునర్జన్మలేదనుట.

వ్యాక :— గ్రిద్దన = గ్రద్దన్. (మూ. కౌ. సంజ్ఞా) గ్రిద్ద శబ్దమునల్లాదులలోనిది.

ఇది చక్కశబ్దము, వంటిది. గ్రిద్దన్ + ముక్తికిన్ = గ్రద్ద ముక్తికిన్. బా. సంధి 18

వ॥ అనివెండియునిందుధరుండు శతానందనందునితోనిట్లనియె. 286

వ్యా :— అనివెండియున్ = అనిమఱియు, ఇందుధరుండు = నెలతాల్పు (శివుఁడు) శతానందనందనునితోన్ = బ్రహ్మసుతుఁతో - నారదునితో, (శతానందశ్శతధృతిః - వై ని.) ఇట్లు=ఈప్రకారముగా, అనియెన్ = పలికెను.

## విద్యాధరుఁక నిధ

సీ॥ నీలమో! కాలాభ్రజాలమో! బాలశై
వాలమో! యీసిద్ధవతునికాంతి
కెంపులో! పవడంపుగుంపులో! యీరెండ
సొంపులో! యీమేటిజోగిజడలు
హారమో! । హారినీహారమో! భూరిక
ర్పూరమో! యీయూఁడపురుషునగవు
మెఱపులోవజ్రంపుటాఱపులో! శశిరేఖ
తఱపులో! యీవటూత్తమునికోఱ

తే॥ లనఁగశార్ఙ్గికి నాదిక్కునందునిలిచి
ప్రేతభూతనిశాచరపీడలడఁచి
క్షేత్రరక్షణదక్షుఁడై క్షేత్రపాలుఁ
డుండువిభునాజ్ఞతలమోచియోమునీంద్ర! 287

వ్యా ;— ఓమునీంద్ర = ఓమౌనిశ్రేష్ఠా - ఓనారదా! ఈ సిద్ధవరునికాంతి = ఈసిద్ధశ్రేష్ఠునియొక్క (దేహ) ద్యుతి, నీలమో = నీలమణియో! కాల = నల్లనయిన, అభ్ర = మేఘములయొక్క, జాలమో = సమూహమో! బాలశైవాలమో = లేఁతనాఁచో! (జలనీలీతుశైవాలమ్ - అమ)

(2) ఈమేటిజోగి = ఈశ్రేష్ఠుఁడయినయోగియొక్క, జడలు = జటలు, కెంపులో = పద్మరాగమణులో! (పద్మరాగాభిధపరఁగుఁగెంపన- అం, ఖా) పవడంపుగుంపులో = ప్రవాళసమూహములో! ఈరెండ = బాలాతపముయొక్క (లేయెండయొక్క) సొంపులో = పెంపులో! (సమృద్ధులో!)

(3) ఈ ఆదిపురుషు = ఈమొదటి యధికారియొక్క, (కార్యనియుక్తునియొక్క, పురుషుఁడు = అధికృతుఁడు, నియుక్తుఁడు - సూని) నగవు = నవ్వు, హారమో = ముత్యాలసరమో! హారి = మనోహరమయిన, నీహారమో = హిమమో! (భూరి = అధికమయిన, కర్పూరమో = కప్పురమో!

నవ్వుతెల్లగానుండుననుట కవిసమయము. చూ 1-50 వ్యాఖ్య)

(4) ఈవటూత్తముని = ఈయుత్తముఁడగు బ్రహ్మచారియొక్క, కోఱలు= దంష్ట్రలు, మెఱపులో = తటిత్తులో! వజ్రంపుటొఱపులో = మగఱాలశోభలో! శశిరేఖ = నెలవంకయొక్క, తఱపులో = పిల్లలో (లేఁతనెలవంకలో! అనుట)

అనఁగన్ = అనిపలుకునట్లుగా, శార్జ్గికన్ = హరికి - విట్ఠలునకు, నాదిక్కునందున్ = నాయొక్క దెసయందు - ఈశాన్యమునందు, (వక్త శివుఁడు. శివుఁడీశానదిక్కున కధిపతి) నిలిచి = ప్రతిష్ఠితుఁడయి, క్షేత్ర పాలుఁడు = కాలభైరవుఁడు, విభునాజ్ఞన్ = స్వామియాదేశమును - విట్ఠలునియాదేశమును, తలమోచి = శిరసావహించి, ప్రేత = ప్రేత ములనెడుపిశాచభేదములయొక్కయు (ప్రేతో భూతాంతరే-అమ) భూత = భూతములనెడు పిశాచభేదములయొక్కయు, (యుక్తే క్ష్మాదావృతే భూతం ప్రాణ్యతీతే సమేత్రిషు - అమ = ప్రాణిశబ్దేన పిశాచవయోవివక్షితాః - గురుబాల; సచాధోముఖోర్ధ్వముఖాదిః. పిశాచభేదోరుద్రానుచరోబాల గ్రహః-ఇత్యమరభరతౌ - శబ్దక) నిశాచర = రాక్షసులయొక్క, రాక్షసః కౌణపః-రాత్రించరోరాత్రిచరఃకర్బురోఽకపాత్మజః-అమ) రాత్రించర = నిశాచర) పీడలు = బాధలు అడఁచి = పోఁగొట్టి, క్షేత్రరక్షణ = (పౌండరీక) క్షేత్రమును సంరక్షించుటయందు, దక్షుఁడై = సమర్థుఁడయి, ఉండున్ = నివసించును.

క్షేత్రపాలుఁడు — భైరవుఁడు.

"త్వంభైరవంసమాగమ్య, పుణ్యక్షేత్రాణిపాలయ
క్షేత్రపాలఇతి శ్రీమాన్, త్రిషులోకేషువిశ్రుతః" (స్కాం)

అష్టభైరవులు —

"అదౌమహాభైరవంచ, సంహారభైరవంతథా!
అసితాంగభైరవంచ, రురుంభైరవమేవచ
తతః కాలంభైరవంచ, క్రోధభైరవమేవచ
తామ్రచూడంచంద్రచూడం. అంతేచభైరవద్వయమ్"

—ఇతి బ్రహ్మవైవర్తే ప్రకృతి ఖండే — తామ్రచూడ చంద్రచూడయోః స్థానేక్షేత్రపాలభైరవరుద్రభైరవౌజ్ఞేయౌ - ఇతి తత్త్రైవగణపతిఖండే — శబ్దక.

పౌండరీక క్షేత్రపాలకుఁడు కాలభైరవుఁడు - చూ 4-292.

అలం ;— సందేహము.

క॥ శిక్యావచూడు నాజ్ఞా
వాక్యార్థము సేయుభోగివలయు ప్రభావా
ధిక్యంబుమీఱియేరికి
శక్యమెతత్ క్షేత్రమునఁబ్రచారమొనర్పన్. **288**

వ్యా ;— శిక్యావచూడు = (చవిది) చిక్కము తలయగ్ర భాగమునఁగలవానియొక్క-విట్ఠలునియొక్క, ఆజ్ఞావాక్యార్థము సేయు= అనతిచ్చినమాటయొక్కయర్థము నెఱవేఱునట్లుచేయు, భోగివలయు = సర్పముకంకణముగాఁగలవానియొక్క-కాలభైరవునియొక్క, ప్రభావ-మహిమయొక్క, అధిక్యంబున్ = అతిశయమును, మీఱి = అతిక్రమించి, తత్ క్షేత్రమునన్ = ఆక్షేత్రమునందు-అపౌండరీకమునందు ప్రచారమొనర్పన్ = సంచరించుట, ఏరికిన్ = ఎవరికయినను, శక్యమె = సాధ్యమా ? (సాధ్యముకాదనుట)

చ॥ చెడుగల, విష్ణుభక్తి నిరసించుదురాత్ముల, మోక్షలక్ష్మిచే
పడుటకుఁగాని హీనులఁబ్రభావతిరస్కృతలోకపాలుఁడా
బుడిబుడి 1 తాల్పుడందునొకపూఁటయునుండఁగనీకత్రోఁచిపో
2 నడుచుఁగలంచుడెందముల, నారటపెట్టుమహోగ్రమూర్తియై
**289**

వ్యా ;— చెడుగులన్ = ధూర్తులను, (చెడుగుగావరి — బేరజమనధూర్తుపేరువెలయు - అం భా) విష్ణుభక్తిన్ = హరిభక్తిని

---

289 ప :- 1 తాల్పుఁడు - ర, అ. 2 నడచు - ప, ర, నడుచు - అ.

నిరసించు = తిరస్కరించు, దురాత్ములన్ = చెడ్డస్వభావముగలవారిని, మోక్షలక్ష్మి = ముక్తిసంపద, చేపడుటకుఁగాని = ప్రాపింపరాని, హీనులన్ = అధములను, ప్రభావ = (తన) మహిమచేత, తిరస్కృత= తిరస్కరింపఁబడిన, లోకపాలుఁడు = దిక్పతులుగలవాఁడగు, అబుడి బుడితాల్పుడు = అబాలచంద్రుని ధరించినవాఁడు - ఆకాలభైరవుఁడు అందున్ = అచ్చట - అపౌండరీకమున, ఒకపూఁటయున్ = ఒక దినార్ధమయినను, ఉండఁగనీక = నివసింపనీయక, త్రోచి = గెంటి, పోనడుచున్ = వెళ్లఁగొట్టును, డెందములన్ = మనస్సులను, కలఁచున్ = క్షోభపెట్టును; మహోగ్రమూర్తియై = గొప్పభయంకరాకారముగలవాఁడయి, అరటుపెట్టున్ = బాధపెట్టును.

లోకపాలురు —

"ఇంద్రోవహ్నిః పితృపతి, ర్నైరృతిర్వరుణోనిలః
ధనదశ్శంకరశ్చైవ, లోకపాలాః పురాతనాః" (అగ్ని)

పాఠ ;— బుడిబుడితాల్పుఁడు — ఈపాఠముసరికాదు, తాల్పుఁడు - అనుపుంలిగతుల్యరూపముండదు. నెలతాల్పు - ఇత్యాది. బుడిబుడితాల్పుడు - అనునది వాకతాల్పుడు - అనుదానివంటి ప్రయోగము. చూ 1-199 వ్యాఖ్య)

బుడిబుడిశబ్దమునకుఁ బ్రయోగాంతరము మృగ్యము.

వ్యాక :— తాల్పుడు = తాల్చుట. తాలుచు+డు = తాలుపుడు (బా. కృదంత 20) = తాల్పుడు. బుడిబుడితాల్పుడు = బుడిబుడిని+తాల్పుడు - ద్వితీయాతత్పురుషము. చూ. 5.138 వ్యాఖ్య.

అరటుపెట్టు - అరటుము+పెట్టు. పెట్టుధాతువును బద్ధ్యాదులలోఁ బఠింపనగును. (బా. సంధి 46)

ఉ॥ పువ్వున బూఁత 1 పుట్టమును భూషయుదివ్యములై చెలంగ లే
జవ్వనులర్థిఁగొల్వనొకచక్కని ఖేచరుఁడొక్కనాఁడు, ము
న్నవ్వనమాలిహాటకమయావసథోపరి వీథిఁద్రిమ్మరున్
గ్రొవ్వెసఁగన్విమానరుచికోకనదప్రియరోచి 2 నేఁచఁగన్. **290**

వ్యా :— పువ్వును = పుష్పములును, పూఁత = లేపనములును. పుట్టమును = వస్త్రములును, భూషయున్ = ఆభరణములును, దివ్యములై = దివియందుఁబుట్టినవై (దివ్యం -- వల్గాదివిభవేతిత్రిషు) చెలంగన్ = ఒప్పఁగా, లేజవ్వనులు = నవయువతులు, అర్థిన్ = ప్రీతితో, కొల్వన్ = సేవింపఁగా, ఒకచక్కని ఖేచరుఁడు = ఒకానొక యందమయిన విద్యాధరుఁడు, (విద్యాధరస్తుద్యుచరాః - ఖేచరాస్సత్యయౌవనాః వై. ని) మున్ = పూర్వకాలము, ఒక్కనాఁడు = ఒక దినము, క్రొవ్వెసఁగన్ = మదమతిశయింపఁగా, విమాన = దేవ యానముయొక్క, రుచి = కాంతి, కోకనదప్రియ = కైందమ్మి విందుయొక్క - సూర్యునియొక్క, (రక్తసరోరుహేరక్తోత్పలం కోకనదమ్ - అమ) రోచిన్ = ప్రకాశమును, ఏచఁగఁన్ = బాధింపగా, (తిరస్కరింపఁగా - సరిపోలఁగా) అవ్వనమాలి = ఆహరియొక్క - అవిట్ఠలునియొక్క, హాటకమయ = బంగారుమయమయిన, అవసథ= సదనముయొక్క - పాండురంగాలయముయొక్క, ఉపరివీథిన్ = పై వీథియందు - పైభాగమునందు. త్రిమ్మరున్ = సంచరించును.

పువ్వునుబూఁతపుట్టమును - జాత్యేకవచనములు.

వ్యాక :— పూఁత = పూఁతయును, సముచ్చయమధ్యాహార్యము -- ప్రౌ వ్యాక 13

---

290 ప :- 1 పట్టమును - గొ; పుట్టమును - ర, అ. 2 నెచ్చఁగఁ - ర; నెం. (నే?) చఁగన్ — అ; నేఁచఁగఁ - గొ.

ఉ॥ ఏధితయౌవ 1 నాంధమతి నెద్దియుమీఁదెఱుఁగంగలేక వి
ద్యాధరుఁడాతఁడాత్మరుచి 2 నాకసమున్ గనకప్రసూనరా
జీధరణాభిరామముగజేయుచుఁదిమ్మర, క్షేత్రపాలుఁడు
త్రోధరసోగ్రమూర్తియయి కోయనియార్చెనభంబుఁజూచుచున్·

**291**

వ్యా :— విద్యాధరుఁడాతఁడు = ఆఖేచరుఁడు, ఏధిత = వృద్ధిపొందిన. యౌవన = జవ్వనముచేత, అంధ = గ్రుడ్డిదయిన - వివేకముమాలిన, మతిన్ = బుద్ధితో, ఎద్దియున్ = ఏదియును, మీఁదు= రాఁబోవుపరిణామమును, ఎఱుంగలేక = తెలియఁజాలక, ఆత్మరుచిన్ = తనయొక్క కాంతిచేత, ఆకసమున్ = ఆకాశమును, కనకప్రసూన రాజీ = బంగారుపువ్వుల సమూహముయొక్క, ధరణ = ధారణము చేత, అభిరామముగన్ = రమ్యమయినదిగా, చేయుచున్=ఒనర్చుచు, తిమ్మరన్ = సంచరింపఁగా, క్షేత్రపాలుఁడు = కాలభైరవుఁడు, ఉత్క్రోధరస=అధికమయినకోపరసముచేత, ఉగ్ర =భయంకరమయిన, మూర్తియయి = ఆకృతిగలవాఁడయి, నభంబున్ = ఆకాశమును, చూచుచున్ = విలోకించుచు, కోయనియార్చెన్ = కోయనియ అచెను

కో—ధ్వన్యనుకరణము.

సీ॥ కనువిచ్చిచూచుటగాక 1 దిగ్గనలేచె
2 సమనమాధిస్థిమితముని కులము

---

291 ప :- 1 నోత్థ - ముద్రి (అ), ర; నాంధ - అ. 2 కాకస – ప, నాకస - ర, అ.

292 ప ;- 1 దిగ్గున - ముద్రి (అ), ర; దిగ్గన - అ. 2 నమితసమాధిస్థిర- ద, ద, ఋ; నమితసమాధిస్థిత - ర; సమసమాధిస్థిమిత - అ, గొ.

గుఱ్ఱముల 3 బొదువుమక్కవలు దక్కుటగాక
4 పాదలాడెడెజెట్లపైబులుగుమూఁక
పులుమేయు 5 గమకంబుకొలఁగుట గాకవి
హ్వానబుద్ధియైదాఁటెహరిణకులము
పఱజగెలఁగర్ణరంధ్రములు మూయుటగాక
పవిశంకనరనుతి ప్రవణమయ్యెఁ

తే॥ బద్మనాభగృహోపరిభాగసంచ
రిష్ణుఖేచరదర్శనోద్రిక్తహృదయ
కాలభైరవభైరవోద్వేలకంఠ
కుహరనిష్ఠ్యూతరోషనిర్ఘోష 6 విహృతి. **292**

వ్యా :— పద్మనాభ = హరియొక్క - విఠ్ఠలునియొక్క- గృహ = సదనముయొక్క-పాండురంగాలయముయొక్క, ఉపరిభాగ= ఊర్ధ్వప్రదేశమునందు, సంచరిష్ణు = తిరుగుస్వభావముగల - తిరుగు నట్టి ఖేచర = విద్యాధరునియొక్క, దర్శన = చూచుటచేత, ఉద్రిక్త= ఉద్రేకముపొందిన హృదయ = మనస్సుగలవాఁడగు, కాలభైరవ = కాలభైరవునియొక్క, భైరవ = భయంకరమయిన, ఉద్వేల = మిక్కుట మయిన, కంఠకుహర = గళవివరమువలన (నుండి) నిష్ఠ్యూత = చిమ్మఁబడిన - వెలువరింపఁబడిన, రోషనిర్ఘోష = క్రోధమువలనఁగలిగిన మహాధ్వనియొక్క, విహృతిన్ = ప్రసారముచేత —

---

3 బొడముమంకువ - గ; బొదువ – గౌ; బొదువు - ర, అ.
4 పాదవాడె - క, త; పాదలాడె - ర, అ. 5 తమకంబు-ముద్ర (అ), ర; గమకంబు - అ. 6 విహృతి - ముద్ర (అ) ర, గౌ. వికృతి – అ.

(1) సమ = చక్కనయిన, (సమాస్త్రీవత్సరేసాధుసర్వతుల్యేషు వాచ్యవత్ - వై ని) సమాధి = నిరంతరధ్యానమునందు, స్తిమిత = అచంచలమయిన, మునికులము = మౌనులసజాతీయసమూహము, (సజాతీయైః కులమ్ - అమ) కనవిచ్చిచూచుటకాక = నేత్రములను దెఱచిచూచుటయేకాకుండ, దిగ్గనలేచెన్ = తటాలునలేచెను.

(2) గ్రుడ్డులన్ = అండములను, పొదువు = పొదిగెడు, మక్కువలు = ప్రీతులు; తక్కుటగాక = విడుచుటయేకాకుండ, పులుఁగుమూఁక = పక్షులసమూహము, శాఖ్లపైన్ = వృక్షములమీఁద, పొదలాడెన్ = కలఁగియాడెను (అటునిటుచెదరిసంచరించెను.)

(3) పులు = గడ్డిని, మేయు = మేసెడు, గమకంబు = యత్నము, తొలఁగుటగాక = మానుటయేకాకుండ, హరిణ = లేళ్లయొక్క, కులము = సజాతీయసమూహము, విహ్వలబుద్ధియై = కలఁతచెందినమతిగలదై, దాఁటెన్ = లంఘనములుచేసెను, (గెంతెను)

(4) ప్రజ = జనము, కేలన్ = చేతితో, కర్ణరంధ్రములు = చెవికంతలను, మూయుటగాక = మూఁతపెట్టుటయేకాకుండ, పవిశంకన్ = పిడుగనెడు నపోహచేత, నర = అర్జునునియొక్క, నుతి = స్తుతియందు, (అర్జునునిపదిపేళ్లు జపించుటయందు - అనుట) ప్రవణమయ్యెన్ = ఆసక్తమయ్యెను.

పిడుగులు పడునను శంకకలుగునప్పుడర్జునుని పేళ్లుపదింటిని జపించుటయాచారము —

"ప్రేలిపడందొడగెంజతుర్దిశా

తటములమందుచుంబిడుగుతండముకాంచి పురీజనంబుహ్వా

త్ఫుటములు జల్లనన్ మఘవపుత్త్రుని పేళ్లుపదిన్ జపింపఁగన్

(హర 2-22)

ఉ॥ మానినికోపమిట్లుమదిమల్లడిగొల్పఁగ, మింటికిన్ మహా
1 శ్యేనముపోలె బిట్టెగసి, యెక్కుడు 2 నిక్కనముగ్రవిగ్రహుం
డై నెఱి 3 తగ్గనగ్గగనయాయివిమానముఁద్రొక్కిభగ్నముం
గా4 నొనరింపుడున్ దివిదశగాయకనాయకుఁడిర్విఁ 5 గూలుడున్ **293**

వ్యా :— మానిని = వితువని, కోపము = కినుక, ఇట్లు= ఈప్రకారముగా, మదిన్ = మనస్సును, మల్లడిగొల్పఁగన్ = పరితపింపఁజేయఁగా, మహాశ్యేనముపోలెన్ = గొప్పడేగయేయనునట్లు, (శశాదనః పత్త్రిశ్యేనః - అమ) మింటికిన్ = ఆకాశమునకు, బిట్టు = వేగముగా, ఎగసి = ఎగిరి, ఎక్కుడు = అధికమయిన, నిక్కనన్ = ఔన్నత్యముతో, ఉగ్రవిగ్రహుండై = భయంకరమయిన యాకారముగలవాఁడై, నెఱితగ్గన్ = సొగసు చెడునట్లు, అగ్గగనయాయి = ఆఖేచరునియొక్క, విమానమున్ = దేవయానమును, త్రొక్కి = కాలితో నదిమి, భగ్నముగాన్ = పగిలినదిగా, ఒనరింపుడున్ = చేయఁగానే, త్రిదశగాయకనాయకుఁడు = ఆదేవతాగాయకముఖ్యుడు - ఆఖేచరుఁడు, ఉర్విన్ = భూమియందు; కూలుడున్ = పతనముకాఁగానే. (మీఁది పద్యముతో నన్వయము)

త్రిదశగాయకనాయకుఁడు-గంధర్వకిన్నరులు త్రిదశగాయకులు. విద్యాధరులు త్రిదశగాయకులుకారు. ఈవర్గములకైక్యము దైత్యదానవాసురరాక్షసశబ్దములయైక్యమువంటిదననగును.

అలం ;— ఉపమ

---

293 ప :- 1 శ్యేనము - ముద్రి [అ], ర; శ్యేనమ - అ, గౌ. 2 నుక్కన-ముద్రి - (అ). ర, నిక్కన - అ, 3 తగ్గ - ముద్రి (అ), ర, ద్రగ్గ – అ, డిగ్గ - గౌ. 4 నొనరించుచుఁ – డ, ద, బ. నొనరింపుడుఁ – ర, అ, గౌ, 5 గూలినఁ – ర, గూలుడుఁ-అ,గౌ.

ఉ॥ కోలుమసంగి 1 మ్రొగ్గిబలుగోఱలుదీటుచుగ్రుడ్లు దిప్పుచున్
క్ష్వేళ 2 లొనర్చుచున్ మొగముజేవురు ముద్దవిధంబునన్ మహా
భీలముగాఁగవ్యాళవిభుఁబెన్బులుఁగీడ్చిన మాడ్కినీడ్చెన
బ్బాలిశుఁగాలభైరవుఁడు పైకుబుసంబొక3 పోరువెత్తఁగన్ 294

వ్యా :— కోలుమసంగి = మిక్కిలి విజృంభించి, మ్రొగ్గి= ముందునకువంగి, బలుగోఱలు = వాఁడియైనదంష్ట్రిలను, దీటుచున్= రాపిడిచేయుచు, గ్రుడ్లు = కనీనికలు, (కంటిగ్రుడ్లు) త్రిప్పుచున్ = తిరుగుడుపడజేయుచు, క్ష్వేళలు = సింహనాదములు. (క్ష్వేడాతు సింహనాదః స్యాత్ - అమ. పా క్ష్వేళా - గురుబాల) ఒనర్చుచున్ = చేయుచు, మొగము = ముఖము, జేవురుముద్దవిధంబునన్ = గైరిక పిండమువలె, (గైరికంబుజేగురుఅంచన విఁసిల్లు-ఆం. బా) మహాభీలము గాఁగన్ = గొప్పభయంకరమయినదికాఁగా. పెన్బులుఁగు = గరు త్మంతుఁడు, వ్యాళవిభున్ = సర్పరాజును, ఈడిచ్చిమాడ్కిన్ = ఈగిచి నట్లు, అబ్బాలిశున్ = అమూర్ఖుని, (బాలిశశ్చశిశౌమూర్ఖే - మే ని) కాలభైరవుఁడు = క్షేత్రపాలుఁడు, పైకుబుసంబు = (దేహము) మీఁదికంచుకము, ఒకపోరువ = ఒకపొర, ఎత్తఁగన్ = ఊడఁగా, ఈడ్చెన్ = తిగిచెను - అని కాలభైరవుని పక్షమున, నర్థము పైకుబు సంబు = దేహముమీఁది కంచుకము, ఒకపోరువ = కొంతపొర, ఎత్తఁగన్ = ఊడఁగా - అని గరుత్మంతుని పక్షమున, నర్థము.

గరుత్మంతుఁడు సర్పరాజు మేనిపొరయూడ నీడ్చినట్లు, కాలభైర వుఁడు విద్యాధరుని మేనికుబుసముపొరయూడనీడ్చెననుట.

---

294 ప :- 1 ప్రోఁగి - ముద్రి (అ). ర, గొ; ప్రొగ్గి - అ. 2 లొనర్చుచున్ - గొ; లొనర్చుచున్ - ర, 3 పోరులె - త. పోఁవె - ర, అ. పోరువె - గొ,

293, 294 పద్యములు రెండును గలిపియన్వయము. కానదీనిని యుగ్మకమనియందురు. "ద్వాభ్యాంతుయుగ్మకమ్ - సా. ద. కుళక మని సామాన్యవ్యవహారము.

అలం :— శ్లేషానుప్రాణితమగునుపమ.

క॥ ఈ 1 వడువునఁబులి దొడికిన
యావు 2 నసిగనుసురు 3 పోకకాసన్నుండౌ
నావిద్యాధరుఁ భైరవ
దేవావృతుఁగాంచివాసు దేవుఁడు 4 వలుకున్. **295**

వ్యా :— ఈవడువునన్ = ఈవిధముగా, పులి = వ్యాఘ్రము తొడికిన = పట్టుకొనిన, అవుసనిగన్ = గోవువలె, ఉసురుపోకకున్ = ప్రాణనిర్గమనమునకు, ఆసన్నుండౌ = దగ్గఱపడినవాఁడగు, భైరవ దేవ = కాలభైరవస్వామిచేత, ఆవృతున్ = పొదువఁబడినవాఁడగు, అవిద్యాధరున్ = అఖేచరుని, కాంచి = చూచి, వాసుదేవుఁడు = పరమాత్ముఁడు - విట్ఠలుఁడు, పలుకున్ = (ఇట్లు) వచించెను.

వాసుదేవశబ్దనిరుక్తి — 2-85 వ్యాఖ్య.

శా॥ నాగాకల్ప! 1 యొహో! పురే! నిలు, విమాన 2 భ్రష్టుఁడైనేలపై
నీగంధర్వుఁడుకూలిదర్పముడిపోయెన్, జంపఁగాఁ 3 గాదు, గా
ఢాగఃకర్ముఁడేనియున్ 4 జడుపువాఁడైయుండ, నర్థిన్ మహా
భాగుల్ చంపమినీవెఱుం 5 గుదువ, కోపంబాఁపుమీపట్టునన్. **296**

---

295 ప :- 1 విధము - గ, వడువున - ర. అ. గౌ. 2 పసి - ర, అ. 3 వోవ కాస - డ, ద, బ, వోక - ర, పోక - అ. 4 పల్కున్ - ర, అ; వలుకుణ - గౌ.

296 ప :- 1 యహెూ—డ, ద, బ; యొహెూ - ర. అ, గౌ. 2 శ్రేష్ఠుఁడై-క; భ్రష్టుఁడై - ర, అ. 3 రాదు - ర; గాఢు- అ. గౌ. 3 జదువు-త; జడుపు - ర, అ. 4 గుదువు - ముద్రి (అ) ర; గుదువ - అ;

వ్యా :— నాగ = సర్పములు, అకల్ప = అలంకారములు గాఁగలవాఁడా! ("ఆకల్పః = మండనమ్ - ఇతి హేమచంద్రః"-శబ్దక) ఒహో! =ఓహో! పురే = బాపురే! (అయ్యో!) నిలు = ఆఁగుము. విమాన = దేవయానములవలన (నుండి) భ్రష్టుఁడై = చ్యుతుఁడై నేలపైన్ = భూమిమీఁద, ఈగంధర్వుఁడు = ఈ ఖేచరుఁడు, (గంధర్వ విద్యాధరులకిటనైక్యము, చూ. 4-301 ప.) కూలి = పడి, దర్పము = గర్వమును, ఉడివోయెన్ = ఉడిగిపోయెను (వదలెను) గాఢ = అధిక మయిన, అగః కర్మఠుఁడేనియున్ = అపరాధకృత్యములుచేయుటయందు దెగువగలవాఁడయినను, (పాపాపరాధయోరాగః, కర్మశూరస్తుకర్మఠః-అమ) జడుపువాఁడైయుండన్ = భయముగలవాఁడయియుండఁగా, చంపఁగాగాదు = వధింపదగదు. అర్థిన్ = ప్రీతితో, మహాభాగుల్ = కీర్తిశాలులు, చంపమి = (భయపడినవారిని) వధింపకపోవుట, నీవు = ఈవు, ఎఱుంగుదువ = నిశ్చయముగా నెఱుఁగుదువు ఈపట్టునన్ = ఈవిషయమున. కోపంబు = కినుకను, అఁగు = నిగ్రహింపుము.

క॥ అని శ్రీపతియానతియి
చ్చిన 1 మందల విడిచెనతని సిద్ధవిభుఁడు వాఁ
డునుగులగులలై లావగ
లినమై 2 విదిలించుకొనుచు లేచెఁగిదుకుచున్. **267**

వ్యా :— అని = ఈప్రకారముగా, శ్రీపతి = లక్ష్మీ కాంతుఁడు - విట్ఠలుఁడు, అనతియిచ్చినన్ = ఆజ్ఞాపింపఁగా, సిద్ధ విభుఁడు = సిద్ధనాయకుఁడు - కాలభైరవుఁడు, అతనిన్ = వానిని మందలవిడిచెన్ = జీవముతోవదలెను వాఁడును = అతఁడును - అఖేచరుఁడును; గులగులలై = నడఁగినదయి; లావు = బలము;

---

297 ప :- 1 ముందల - ర, త; మందల — అ. 2 విదలించు - ర, విదలించు - అ.

అగలిన = క్షీణించిన, మైన్ = శరీరమును; విదిలించుకొంచున్ = దులుపుకొనుచు, జాడించుకొనుచు) కిదుకుచున్ = మూలుగుచు, లేచెన్ = ఉత్థితుఁడయ్యెను.

ఉ॥ వేచి యతండుగాంచెఁగదళీమృదులోరుయుగున్, హసన్ముఖున్
మేచకమేఘమూర్తి, దినమిత్రసమానసమరత్నభూషితున్
లోచనధిక్కృతాంబుజదళున్, శతకోటి సుధాకరాగ్నిరు
గ్వీచిపరంపరోపమనవీనతనుప్రభు, యాదవప్రభున్. **298**

వ్యా ;— వేచి = ఉత్థితుఁడయి, అతండు = అతఁడు - అవిద్యాధరుఁడు, కదళీ = అరఁటివలె - అరఁటిబోదెవలె, మృదుల = కోమలమయిన, ఊరుయుగున్ = తొడలజంటగలవాఁడును, హసత్ = నవ్వుచున్న, ముఖున్ = మోముగలవాఁడును. మేచక = నల్లనయిన, (కృష్ణేనీలాసితశ్యామకాలశ్యామలమేచకాః - అమ) మేఘ = జలదము వంటి, మూర్తిన్ = దేహముగలవాఁడును. దినమిత్ర = సూర్యునితో, సమ = సమానమయిన, అసమ = సాటిలేని, రత్న = మణితో- కౌస్తుభమణితో, భూషితున్ = అలంకృతుఁడును, లోచన = కన్నుల చేత, ధిక్కృత = ధిక్కరింపఁబడిన, అంబుజదళున్ = తామరఱేకులు గలవాఁడును. శతకోటి = నూఱుకోట్ల. సుధాకర = చంద్రుల యొక్కయు, అగ్ని = అనలములయొక్కయు; రుగ్వీచి = అగ్ని = కాంతితరంగములయొక్క, పరంపరా = ఎడతెగని. రుసలతో, ఉపమ = సాటియయిన, నవీన = క్రొత్తదయిన, తనుప్రభున్ = దేహప్రభ (కాంతి) గలవాఁడును, అగు, యాదవప్రభున్ = యాదవరాజును. (కృష్ణుని) - విత్తులుని, కాంచెన్ = చూచెను.

వ॥ ఇట్లుసచ్చిదానందకందంబగు నచ్చిందంబుతాల్పు ననల్పాద్భుత రస 1 నిర్మగ్నుండై కనుంగొనుచు నవతీర్ణగర్వ విద్యాధరుండై యవ్విద్యాధరుండిట్లని వితర్కించు. **299**

వ్యా :— ఇట్లు = ఈప్రకారముగా, సచ్చిదానంద = సత్తకుజ్ఞానమునకు నానందమునకు, కందంబగు = మూలమగు, అచ్చిందంబుతాల్పున్ = అశంఖధారిని, (ఆపాంచజన్యశంఖమును ధరించువానిని - అనుట) - అవిష్ణువుని, అనల్ప = అధికమయిన, అద్భుతరస = ఆశ్చర్యరసమునందు, నిర్మగ్నుండై = మునిఁగినవాఁడయి కనుంగొనుచున్ = చూచుచు. అవతీర్ణ = దిగిపోయిన - నశించిన; గర్వ = దర్పమునెడు; విద్యా = విద్యను; ధరుండై = తాల్చిన వాఁడయి: అవ్విద్యాధరుండు = అఖేచరుఁడు; ఇట్లు = ఈప్రకార ముగా; వితర్కించున్ = ఊహించును.

వ్యాక :— సచ్చిదానంద --- త్రిపదకర్మధారయము "సంశ్చాసౌచిచ్చాసౌతానందశ్చ" (ముగ్ధ)

శా॥ ఈపుంగ్రామణియెవ్వఁడొక్కొ! హరి 1 యట్లింపొందె; సందేహమే లా? పద్మాక్షుఁడెయంచులోఁదెలిసి, యోలక్ష్మీశ! 2 యేఁద్వన్నివా సో 3 పర్యభ్రచరద్విమానగుఁడనై యుండింది 4 యిట్టొక్కయు త్ర్యోపోద్రగుఁడుగూల్పఁ 5 గొవ్వటిగికన్గొంటిన్ సురేశునన్ నినున్. **300**

---

299 ప :- 1 నిమగ్నుండై - ర (పా) నిర్మగ్నుండై - ర. అ, గౌ.

300 ప :- 1 యేయిట్లుండె – ద; యిట్లొప్పొందె - డ. ర; యు (య?) ట్లింపొందె - అ. ఇట్లైపొందె - గౌ. 2 యెందుస్విదానోపర్యభమ చంద్విమాన – త; యుద్య - గౌ; యేఁద్వన్నివా - ర, అ. 3 పర్యా-గౌ. పర్య - ర, అ. 4 యిట్లొప్ప - గౌ; యిట్టొక్క-ర.అ. 5 గొవ్వటియు - గ; గ్రొవ్వటిగి - ర, అ.

టీ. వ్యా:— ఈపుంగాగ్రమణి = ఈపురుషాగ్రణి, ఎవ్వఁడొక్కో = ఎవఁడయియుండునో! (ఒకో - ఊహానుదెల్పును.) హరియట్లు = విష్ణువువలె (విట్ఠలునివలె - అనుట) ఇంపొందెన్ = ఒప్పును, (విట్ఠలుని వలెనున్నాఁడనుట) సందేహ మేలా = సంశయమెందులకు, పద్మాక్షుఁడె = విష్ణువే - విట్ఠలుఁడే, అంచున్ = అని, లోన్ = లోపల - మనస్సులోపల, తెలిసి = గ్రహించి, ఓలక్ష్మీశ = ఓరమాపతీ - ఓవిట్ఠలా. ఏన్ = నేను, త్వత్ = నీయొక్క, నివాస = గృహమ్ముయొక్క - నీదేవాలయముయొక్క, ఉపరి = పైభాగమునందలి, అభ్ర = ఆకాశమునందు, చరత్ = చరించుచున్న, విమానగుఁడనై = దేవయానము నుబొందినవాఁడనయి, ఉండిండి = ఆకస్మికముగా, ఇప్పుడు = ఇప్పుడు, ఒక్క = ఒకానొక, ఉత్కోప = అధికమయిన కినుకచేత, ఉదగ్రుఁడు = భయంకరమైనవాఁడు, కూల్పన్ = పడఁగొట్టఁగా, కొవ్వఁటిగి = మదముతగ్గి, సురేశున్ = దేవతాధీశుఁడవు, నినున్ = నిన్ను, కన్గొంటిన్ = దర్శించితిని.

క. 1 నిర్మదులకుఁదోఁచిన క్రియ
ధుర్మదులకుఁదోఁపవీవెదుటననుచు మనో
2 మర్మరదార్తిఁబడిమనుజ
ధర్మభటుఁడుతత్పదద్వితయ 3 కృతనతియై. **301**

వ్యా:— నిర్మదులకున్ = గర్వములేనివారికి, తోఁచిన క్రియన్ = ప్రత్యక్షమగునట్లు, దుర్మదులకున్ = దుష్టమయిన గర్వముగలవారికి, (మదో — గర్వేహర్షేభదానయోః - మే ని.) ఈవు = నీవు, ఎదుటన్ =

301 ప :- నిర్మలుగ-గ; నిర్మదుల - ర,అ. 2 మర్మరవాపిఁ-ర,ముద్రి(అ) మర్మరథాప్తి — అ; మర్మారదాప్తి (ర్తి?) - అ. 3 మానసుఁడై - గ; కృతనతియై — గొ; కృతమతియై ర, అ.

పురోభాగమునందు, తోఁపవు = ప్రత్యక్షము కావు. అనుచున్ = అని, మనః = హృదయమునందు; ముర్మురత్ = ముర్మురమువలె (=ఊక నిప్పువలె) నాచరించుచున్న (తుషానలః కుకూలః స్యాత్, ముర్మురః త్రి ని) ఆర్తిన్ = మనోవ్యథయందు, పడి = చిక్కుకొని, మనుజ ధర్మ = కుబేరునియొక్క, (మనుష్యధర్మాధనదో, రాజరాజో ధనాధిపః- అమ; మనుష్య = మనుజ) భటుఁడు = సేవకుఁడు - విద్యాధరుఁడు (కుబేరుని భటులుకిన్నరులు. ఇటఁగిన్నర విద్యాధరులకైక్యము.) తత్పదద్వితయ = అతనియొక్క (విట్టలునియొక్క - అనుట) పాద ద్వయమునందు, కృత = చేయఁబడిన, నతియై = నమస్కారము గలవాఁడయి.

విద్యాధరకిన్నరగంధర్వులు వేర్వేఱు వర్గములు

"విద్యాధరోఽప్సరోయక్ష, రక్షోగంధర్వకిన్నరాః

పిశాచోగుహ్యకస్సిద్ధో, భూతోఽమీదేవయోనయః (అమ)

విద్యాధరుని (290, 295 ప) ద్విదశగాయకనాయకుఁడుగాను. (293 ప) గంధర్వుఁడుగాను (296 ప) మనుజధర్మభటునిగాను, (301 ప) నిర్దేశించుటయౌపచారికము.

స్రగ్ధర - పాపోఽహంపాపకర్మాహంపాపాత్మాపాపసంభవః, బాలిశోఽహం, సుధీదు
ష్ప్రాపోఽహం, దుష్టకష్టప్రకృతిరహ, మహంపామరాత్మాఽస్మినానా
రూపద్రోహాపచారార్భుదనిహితధియం కోఽధినంమామవత్వ
ట్భీభపాదాసక్తియుక్తం శివకరయినుచున్ జిష్ణుఁగృష్ణున్నుతించెన్
302

302 ప - 1 కోప - ర, గౌ; కో [కూ?] ప - అ.

వ్యా :— అహమ్ = నేను, పాపః = పాపిని, అహమ్ = నేను, పాపకూప = అఘమ్మనెడు నూతియందు, ప్రవణమతిః = అసక్తమయిన బుద్ధిగలవాఁడను, అహమ్ = నేను, బాలిశః = అజ్ఞుఁడను, (అజ్ఞేమూఢయథాజాత, మూర్ఖవైధేయబాలిశాః-అమ) అహమ్ = నేను, సుధీ = పండితులచేత, [సుధీః కోవిదోబుధః - అమ] దుష్ప్రాపః = పొందరానివాఁడను, అహమ్ = నేను. దుష్టకష్టప్రకృతిః = చెడ్డదియు, బాధించునదియునగు, స్వభావముగలవాఁడను, అహమ్ = నేను, పామరాత్మ = నీచాత్ముఁడనై, అస్మి = ఉన్నాను. శివకర = శుభము కలిగించువాఁడా ! నానారూప = పలురకములయిన, ద్రోహ = అనిష్ట చింతనములయొక్కయు, అపచార = అపరాధములయొక్కయు, అర్బుద = పదికోట్లసంఖ్యయందు - అసంఖ్యాకములయందు. నిహిత= ఉంచఁబడిన, ధియమ్ = బుద్ధిగలవాఁడును, క్రోధినమ్ = కోపము గలవాఁడును, త్వద్ = నీయొక్క, శ్రీపాద = శ్రీచరణములయందలి, అసక్తియుక్తమ్ = తత్పరత్వముతోఁగూడుకొన్నవాఁడునగు, మామ్= నన్ను, అవ = కాపాడుము అనుచున్ = అని, జిష్ణున్ = జయశీలుఁడగు, కృష్ణున్ = హరిని - విట్ఠలుని, నుతించెన్= కొనియాడెను.

అర్బుదము —

"ఏకందశశతంచైవ; సహస్రమయుతంతథా
లక్షంచనియుతంచైవ, కోటిరర్బుదమేవచ
బృందః ఖర్వోనిఖర్వశ్చ; శంఖపద్మౌచసాగరః
అంత్యంమధ్యపరార్ధంచ, దశవృద్ధ్యాయథాక్రమమ్" (బహ్మాండ

ఛం :- స్రగ్ధరగణములు :- మ - ర - భ - న - య - య - య
యతి :- 1-8-15 యతని యతిపాటింపఁబడెను.

వ॥ అని మఱియును. 303

వ్యా :— అని మఱియును = అని వెండియును. (మీఁది పద్యముతో నన్వయము)

చ॥ యదుకులనాథ! యిప్పుడితఁడాగ్రహావృత్తినొనర్చునిగ్రహం
1 బిదియునను గ్రహంబయగు. నింద్రియరాజికి 2 బంటుఁజేయుశ్రీ
మదము 3 నణంచినీయడుగుమానిసిగాననుఁజేసెఁగాన; సం
పదగలగర్వినిర్మ్మముని మాడ్కినినుంగని కొల్వఁజాలునే! **304**

వ్యా ;— యదుకులనాథ = యదువంశాధిపతీ! (ఓహరీ)-
ఓవిట్ఠలా! ఇంద్రియరాజికిన్ = ఇంద్రియముల వరుసకు, బంటుఁజేయు =
దాసునిగానొనర్చు; శ్రీమదమున్ = ధనగర్వమును; అణంచి = అడఁచి,
నీయడుగుమానిసిగాన్ = నీయొక్క పాదదాసునిగా, చేసెఁగాన =
ఒనర్చెను గావున. ఇప్పుడు = ఇపుడు, ఇతఁడు = ఈతఁడు (క్షేత్ర
పాలకుఁడనుట) ఆగ్రహవృత్తిన్ = కోపప్రవృత్తితో, ఒనర్చు = చేసిన,
నిగ్రహంబిదియున్ = ఈనిరోధము (అభ్యుపపత్తిరనుగ్రహః, నిగ్రహస్త
ద్విరుద్ధః స్యాత్ - అమ) అనుగ్రహంబయగున్ = దయతలఁచుటయే
యగును, సంపదగలగర్వి = సంపత్తిగలమదించినవాఁడు, నిర్మ్మముని
మాడ్కిన్ = మమకారములేనివానివలె, నినున్ = నిన్ను, కని =
దర్శించి, కొల్వఁజాలునే = సేవింపఁగలుగునా?

క॥ మూఢుఁడననుఁబోవ్రుమహా
1 వ్రీడకుఁ గొరకనా 2 మతివెలయుత! దయా
3 గాధ! త్వదాజ్ఞవిమానా
రూఢుఁడనై జగములందిరుగువాఁడహరీ! **305**

---

304 ప :- 1 బిదియయను — గౌ, బిదియునను — ర, అ. 2 బట్టు-గ.త;
బంటుఁజేయు - గౌ; బంటుసేయు — ర, అ. 3 నడంచి - గౌ,
నణంచి — ర; అ.

305 ప :- 1 వ్రీడకు-ర (పా) వ్రీడకు - ర, అ, గౌ. 2 మతినివెలయు-గౌ;
మతివెలయుత — ర, అ. 3 గాధత్వాజ్ఞ - ముద్రి [అ], ర; గాధ
త్వదాజ్ఞ — క; త్వదాజ్ఞా - త; గాధ! త్వదాజ్ఞ - అ.

వ్యా :— మూఢుఁడన్ = అజ్ఞుఁడను, (అజ్ఞేమూఢ - అమ) ననున్ = నన్ను, ప్రోవు = కాపాడుము. మహత్ = గొప్పవారి యొక్క, రీఢకున్ = అవమానమునకు, రీఢావమాననా౽వజ్ఞావహేళనమ్ - అమ) ఇకఁన్ = ఇటుపైని, చొరక = సిద్ధపడక, నామతి = నాయొక్క బుద్ధి, వెలయుతన్ = ఒప్పుగాక! హరీ = ఓవిష్ణువా! దయా = కరుణచేత, గాఢ = అధికుఁడా! త్వత్ = నీ యొక్క, అజ్ఞన్ = ఆదేశముచేత, విమానారూఢుఁడనై = దేవయానమునెక్కినవాఁడనయిన, జగములన్ = లోకములయందు, తిరుగు వాఁడన్ = సంచరించువాఁడను.

వ్యాక :— మహద్రీఢ - ఇది షష్ఠీసమానముగావునమహత్ శబ్దతకారమునకు 'అ' కారమాదేశముకాలేదు. కర్మధారయమయినచో మహారీఢ - అని యగును.

చ॥ సురసదనంబునందయిన, క్షోణితలంబున 1 యందునైన; భీ
కరనిరయంబునందయినఁ గర్మవశంబుననుండునామదిన్
బొరయును 2 గాత! గాతరసముద్ధరణోచితకార్యధుర్య! త్వ
చ్చరణసరోరుహద్వితయసంతతసంస్మరణానుషంగముల్ 306

వ్యా :— కాతర = భీతులయొక్క, సముద్ధరణ = ఉద్ధరించుటయందు, ఉచిత = యోగ్యములయిన, కార్య = కృత్యములను, ధుర్య = వహించువాఁడా! సురసదనంబునందయినన్=దేవతానిలయమునందయినను- స్వర్గమునందయినను, క్షోణితలంబునయందునైనన్ = భూతలమునందయినను, భీకర = భయంకరమయిన,

---

306 ప :- 1 నెందు - క, గౌ, యందు - ర, అ. 2 గాతరాతుర - గౌ, గాతఁగాతర - ర, అ.

నిరయంబునందైనన్ = నరకమునందయినను, (నరకో నిరయః - అమ) కర్మవశంబునన్ = కర్మాధీనతచేత, ఉండు = వర్తిల్లెడు, నామదిన్ = నాయొక్క మనస్సునందు, త్వత్ = నీయొక్క, చరణ సరోరుహద్వితయ = పద్మములవంటి యడుగుదోయియొక్క. సంతత= నిరంతరమయిన, సంస్మరణ = జప్తికిఁదెచ్చుకొనెడు, అనుషంగముల్= సంబంధములు, పొరయునుగాతన్ = చెందుఁగాక !

క॥ అవివలగొని యాయదునం
దనునిరుపమదివ్యరూపదర్శనమున, లోఁ
దనియుచుఁజొక్కుచు మ్రొక్కుచుఁ
జనియెన్ విద్యాధరుండు శతధృతితనయా ! 307

వ్యా :— అవివలగొని = అనిప్రదక్షిణించి, ఆయదునందను= ఆయదువంశీయులకానందము గలిగించువానియొక్క, (ఆకృష్ణుని) - అవిట్టలునియొక్క, నిరుపమ = సాటిలేని, దివ్యరూపదర్శనమునన్= మనోజ్ఞాకారమును విలోకించుటచేత, లోన్ = లోపల - మనస్సులోపల తనియుచున్ = సంతుష్టినందుచు, చొక్కుచున్ = పరవశించుచు, మ్రొక్కుచున్ = నమస్కరించుచు, శతధృతితనయా = ఓబ్రహ్మనందనా! - ఓనారదా! విద్యాధరుండు = ఖేచరుఁడు, చనియెన్ = అరిగెను.

యదునందనుఁడు — యదూన్ యదువంశసంభూతాన్ నందయతీతి, యదునందనః.

క॥ మధుమథనునాజ్ఞనేవం
విధమహిమఁ 1 దనర్చు క్షేత్రి విభుభైరవదే
వుధరాధోభువనస్వ
ర్గధామనుతుఁగాంచి పిదపఁగనఁదగుఁగృష్ణున్. 308

---

308 ప ౹- 1 దలిర్చు – గొ, దనర్చు - ర, ఆ.

వ్యా ;— మధుమథను = మధువనురాక్షసుని వధించినవాని యొక్క (హరియొక్క) - విట్ఠలునియొక్క, అజ్ఞన్ = ఆదేశముచేత, ఏవంవిధ = ఇటువంటి, మహిమన్ = గొప్పతనముచేత, తనర్చు = అతిశయించు, ధరా = భూమి, అధోభువన = పాతాళము (అధోభువన పాతాళబలిసద్మరసాతలమ్ - అమ) స్వర్గ = నాకము, ధామ = నిలయములుగాఁగలవారిచేత - భూపాతాళనాకలోకవాసులచేత; (త్రిలోకవాసులచేత - అనుట) నుత = కొనియాడఁబడిన, క్షేత్రవిభున్ = క్షేత్రపాలకుఁడగు, భైరవదేవున్ = కాలభైరవస్వామిని, కాంచి = దర్శించి, పిదపన్ = పిమ్మట; కృష్ణున్ = విట్ఠలుని; కనఁదగున్ = దర్శింపఁదగును.

## ఆశ్వాసాంతము

శా॥ సాహిత్యాపరకాళిదాస! హరిపూజాగౌరవవ్యాస! గం
గాహల్లోహలవాగ్విలాస! రిపువర్గత్రాసకృత్త్రాస! కాం
తాహర్షావహదృగ్విలాస! శ్రుతిపద్యాయోజితాభ్యాస! హే
మాహార్యోపమధైర్యధుర్యపదవిన్యాసా! విధేయారసా! 309

వ్యా ;— సాహిత్య = కావ్యవాఙ్మయమునందు, అపరకాళిదాస = అర్వాచీనకాళిదాసుఁడా! (అపరః -- తథార్వాచీనే -మేని) హరిపూజా గౌరవ = విష్ణువుయొక్క యర్చనాగరిమయందు. వ్యాస= బాదరాయణుఁడా! గంగా = భాగీరథీనదియొక్క, హల్లోహల = ప్రవహాధ్వనివంటి, వాగ్విలాస = మాటలసొంపుగలవాఁడా!

రిపువర్గ = శతృవులసజాతీయ సమూహమును, త్రాసకృత్ = భయ పెట్టునదియగు: పాస = ఈ(టెగలవాఁడా! కాంతా = స్త్రీలకు, హర్ష = సంతోషమును, ఆహావ = కలిగించెడు, దృక్ = చూపుల యొక్క; విలాస = ప్రకాశముగలవాఁడా! శ్రుతిపద్యా = వేద మార్గమునందు. (సరణిః పద్ధతిః పద్యా - అమ) ఆయోజిత = కూర్పఁ బడిన, అభ్యాస = అలవాటుగలవాఁడా! హేమాహార్య = బంగారు కొండతో - మేరుపర్వతముతో (అహార్యధరపర్వతాః - అమ) ఉపమ = సాటియయిన, ధైర్య = ధీరత్వమును, ధుర్య = వహించునట్టి, పద = పాదములయొక్క; విన్యాసా = నిక్షేపించుటగలవాఁడా! విధేయ = వినయవంతులయిన, ఔరసా = ఔరసపుత్రులుగలవాఁడా!

సాహిత్యము — చూ 1-77 వ్యాఖ్య.

కాళిదాసుకాలము — కాళిదాసు, తానురచించిన, జ్యోతిర్విదా భరణమనుగ్రంథములో; రఘువంశాదికావ్యత్రయమును రచించియు న్నట్లు చెప్పుకొనెను.

"శ్రీవిక్రమార్కనృపసంసది మాన్యబుద్ధి
స్తైస్స్యహంసన్నృపసభాకిలకాళిదాసః
కావ్యత్రయంసుమతికృద్రఘువంశపూర్వం
శ్రీకాళిదాస కవితోహితతోబభూవ" (జ్యోతిర్వి)

జ్యోతిర్విదాభరణ రచనాకాలమిట్లు గ్రంథస్థము చేయఁబడెను.

"వర్షేసింధురదర్శనాంబరగుణైర్యాంతేకలేస్సమ్మితే
మాసేమాధవసంజ్ఞికేచవిహితో గ్రంథక్రియోపక్రమః"
"ఊర్జేగ్రంథసమాప్తిః"

సింధురములు = 8 దర్శనములు = 6. అంబరము = 0. గుణములు = 3, "అంకానాంవామతోగతిః" అనున్యాయమున సి

యంకెలనెడమనుండి, కుడికివేయఁగా - 3068, అగును. "కలేః" అనుటచే నిదికలియుగసంఖ్య కావునఁ గలిశకము 3068 జ్యోతిర్విదాభరణరచనాకాలము. వైశాఖమాసములో మొదలుపెట్టి కార్తిక (ఊర్జే) మాసమునందు గ్రంథపరిపూర్తి జరిగెననుట స్పష్టము. ఇప్పటికి - అనఁగా, హూణ 1988 నాఁటికిఁగలిలోఁ గడచిన సంవత్సరములు - 5088. కానఁగాళిదాసు, 5088 - 3068 = 2020 సంవత్సరముల క్రితము జ్యోతిర్విదాభరణమును రచించెను. దీని నుండి యిప్పటికిఁ (1988 నాఁటికి) గడచిన హూణ సంవత్సరములు 987 తీసివేయఁగా, 2020 - 1987 = హూ. పూ. 33; కాళిదాసు జ్యోతిర్విదాభరణ రచనా కాలము.

భవిష్యపురాణమున నగ్నివంశపురాజుల చరిత్రలోఁబ్రమరవంశమునకుఁ జెందిన విక్రమార్క శాలివాహనులచరిత్రగలదు.

"పూర్ణే త్రింశచ్ఛతేవర్షే కలౌప్రాప్తే" (భవిష్య)

అని విక్రమార్కుని జననము కలిశకము 3000 సంవత్సరమని చెప్పఁబడెను. కలిశకము 3000 = హూ. పూ 101. విక్రమార్కుని పట్టాభిషేకము, కలిశకము : 3020 = హూ. పూ. 81 (101 - 20) విక్రమశకస్థాపన చైత్రశుద్ధపాడ్యమిని, గురువు ధనూరాశిలోను దక్కిన గ్రహములు మేషరాశిలో నుండఁగా, కలిశకము 3044లో, జరిగెను. కలి 3044 = హూ. పూ. 57. ఇతని పరిపాలనకాలము నూఱు సంవత్సరములు. "శతవర్షంకృతంరాజ్యమ్" (భవిష్య) విక్రమాదిత్యుఁడన్నది పితృదత్తనామమేగాని బిరుదముకాదు. "విక్రమాదిత్యనామానం పితా కృత్వాముమోదహ" (భవిష్య)

కాఁగా; విక్రమార్కుని కాలము—కలిశకము. 3020 - 3120 = హూ. పూ. 81 - 19. కాళిదాసుకాలము-కలిశకము 3000 - 3100=

హూ.పూ. 101 - 1 మధ్య కావ్యత్రయరచన-కలిశకము 3020-3068= హూ,పూ. 81-33. జ్యోతిర్విదాభరణరచన - కలిశకము 3068 = హూ. పూ 33, నాటకత్రియరచన - కలిశకము 3068 - 3100 = హూ.పూ. 33-1. మధ్య అనఁగాఁ గాళిదాసు కాలము హూ పూ. ప్రథమశతాబ్ది యనుట స్పష్టము.

**హల్లోహల :—** సంస్కృతనిఘంటువులలోఁ గానరాదు ప్రయోగాంతరములు - "పరిమళలహరీ; హల్లోహల" (మను 2-6) హల్లోహలకలితయగుచు" (భాగ 10 స్కం పూ. 793)

శ. ర. అనుబంధమునుండి - "హల్లోహలోల్లోలమై" (అచలా)

"కృపార్ఘులజ్ఝరీకల్లోలానుక్షణహల్లోహలని జవీక్షణ" (ద్విరేఫ 4 ఆ. హల్లోహలైర్మగ్నైస్సన్నైః - టీక) వాక్కల్లోలహల్లోహలా (దశా) - శ ర. అ.

ఔరసుఁడు - ద్వాదశవిధపుత్రులలో నొకఁడు. సవర్ణయయినధర్మపత్నియందుఁ దనవలనఁగలిగి పుత్రుఁడు.

"స్వేక్షేత్రేసంస్కృతాయాంతు, స్వయముత్పాదయేద్ధియమ్
తమౌరసంవిజానీయాత్. పుత్రం ప్రథమకల్పితమ్. (మ. స్మృ)

ద్వాదశవిధపుత్రులు —

"ఔరసఃక్షేత్రజశ్చైవ, దత్తః కృత్రిమఏవచ
గూఢోత్పన్నోపవిద్ధశ్చ, దాయాదాబాంధవాశ్చషట్.
కానీనశ్చసహోఢశ్చ, క్రీతః పౌనర్భవస్తథా
స్వయందత్తశ్చశౌద్రశ్చ, షడదాయాదబాంధవాః"

(మ. స్మృ) — శబ్దర.

**అలరు :—** అంతఃపురము.

క॥ షడ్దర్శనపారగ! కవి
రాడ్దత్తానుగ్రహాభి 1 రమ్య! 2 మదాంధ
ద్విడ్దంతిసింహా! మహిత
త్విడ్దశశతకిరణ ! హృదయధృతహరిచరణా! **310**

వ్యా :— షడ్దర్శన = అధ్యాత్మజ్ఞానోపదేశకములగు శాస్త్ర భేదములాటింటియొక్క, పార = అవలియొడ్డును, గ = పొందిన వాఁడా! కవిరాట్ = కవిరాజులకొఱకు, దత్త = ఈయఁబడిన, అనుగ్రహ = అనిష్టనివారణపూర్వకమగునిష్టసాధనముచేత, (అనుగ్రహః= అనిష్టనివారణపూర్వకేష్టసాధనమ్ - శబ్దక) అభిరమ్య = మనోహర మయినవాఁడా! మదాంధ = గర్వముచేతఁగన్నుగానని, ద్విట్ = శత్రువులనెడు, దంతి = ఏనుఁగులకు, సింహా = మృగేంద్రుఁడా! మహిత = గొప్పదయిన, త్విట్ = కాంతియందు; దశశతకిరణ = సహస్రకిరణుఁడా! (సూర్యుఁడా - అనుట) హృదయ = మనస్సుచేత ధృత = ధరింపఁబడిన, హరిచరణా = విష్ణుమూర్తియొక్క పాదములుగలవాఁడా!

షడ్దర్శనములు - చూ 1 - 77 వ్యాఖ్య.

అలం :— రూపకము, అంత్యానుప్రాసము

మాలిని :— వినయనయసముద్రా! 1 విస్తృతోల్లాసముద్రా!
జననుతగుణజాలా! శత్రురాణ్మీనజాలా !
2 ధనధనదసమానా! ధన్యధీభాసమానా !
ఘనవపురినరాగా! కావ్యదత్తానురాగా! **311**

---

310 ప :- 1 రామ-గౌ; రమ్య-ర, అ. 2 సుధాంధ - డ.ద,బ; మదాంధ-ర,అ
311 ప :- 1 విశ్వతో - డ, ద, బ: విస్తృతో - ర, అ. 2 ధనద - డ, ద. బ: గౌ: ధనధ - ర, అ.

వ్యా :— వినయ = అడఁకువకు, నయ = నీతికి, సముద్రా = జలధియయినవాఁడా! - ఆశ్రమయినవాఁడా! విస్తృత = విరివియైన, ఉల్లాస = సంతోషముయొక్క, ముద్రా = చిహ్నములుగలవాఁడా! జన = ప్రజలచేత, నుత = కొనియాడఁబడిన, గుణజాలా = సద్గుణ సమూహములుగలవాఁడా! శత్రురాట్ = వైరిరాజులనెడు, మీన = చేఁపలకు, జాలా = వలయయినవాఁడా! (జాలంసమూహ ఆనాయో గవాక్షక్షారకావపి - అమ) ధన = సంపదయందు, ధనద = కుబేరునితో, సమానా = తుల్యుఁడా! ధన్య = చరితార్థమయిన, ధీ = బుద్ధిచేత, భాసమానా = ప్రకాశించుచున్నవాఁడా! ఘన = గొప్పదయిన, వపుః = శరీరమునందు, (గాత్రంవపుః సంహాననం శరీరమ్-అమ) ఇనరాగా = సూర్యునిరంగువంటి రంగుగలవాఁడా! కావ్య = కృతులకొఱకు, దత్త = ఈయఁబడిన, అనురాగా = అనురక్తిగలవాఁడా!

అలం :— అంత్యానుప్రాసము, రూపకము.

ఛం ;— మాలినికిగణములు ;- న - న - మ - య- య
యతి 1 - 9.

గద్యము :— ఇది శ్రీమత్పరమపదనాథనిరవధికకృపాపరిపాక పరిచిత సరసకవితానాథరామకృష్ణకవినాథప్రణీతంబైనపాండురంగమహాత్మ్యంబను పరమభాగవత చరిత్రంబునందుఁ జతుర్థాశ్వాసము.

వ్యాక :— చూ ప్రథమాశ్వాసాంతగద్యవ్యాఖ్య

# చేర్పులు - మార్పులు

17 ప :- పద్మినీ శబ్దము సాభిప్రాయము. పద్మిని = పద్మము, స్త్రీ విశేషము. "పద్మినీ స్త్రీ విశేషేస్యాత్సరస్యామంబుజేపిచ" (విశ్వకోశము) పద్మము, సూర్యకిరణస్పర్శచేనుల్లసిల్లుననుట కవిసమయము.

పద్మిని (పద్మ + ఇని.) = పద్మగంధము, దీనికిఁగలదు. (పద్మగంధము - లక్షణార్థము) పద్మినీజాతి స్త్రీ శరీరము, పద్మగంధమువంటి గంధమును గలిగియుండును. "పద్మినీ పద్మగంధా" (రతిమంజరి)

తాపము = (1) వేఁడిమి (2) సంసారతాపము.

అలం :- శ్లేష.

73 ప :- హంక్షంబులు - ఉపలబ్ధపాఠము. "హం - క్ష" వర్ణములని యర్థము. హక్షంబులు - సాధుపాఠమనఁదగును. "హక్షా భ్యామ్" - శ్రీతత్వచింతామణి. హావర్ణక్షవర్ణములు - అని యర్థము.

వ్యాక :- హక్ష = హక్షంబులు. "క్వచిద్రూపంమునాపిచ" - విక్ళ; ము. కౌ.

148 ప :- లక్ష్మి = లక్ష్మివంటిది - పుణ్యస్త్రీ. పుణ్యస్త్రీ వాచకములకు ముందు, లక్ష్మీసమానురాలనివ్రాయు శిష్టాచారముగలదు.

230 ప :- అలం :- శ్లేష.

263 ప :- దోహదము = అకాలమునఁబుష్పాదులనుత్పాదించు ధూప ధూమాదివస్తువులచేత - అనియుఁబక్షాంతరముగాఁజెప్పనగును చూ. 2-12 వ్యాఖ్య.

268 ప :- అలం ;- శ్లేషరూపకానుప్రాణితమగు, నుపమ.

296 ప :- మహాభాగుల్ = ఆజన్మాంతము నిష్కళంకులు, ననుపమకీర్తులు, నగువారు.

"ఆరభ్యోత్పత్తిమామృత్యోః, కళంకోయస్యనోభవేత్
స్యాచ్చైవానుపమాకీర్తి, ర్మహాభాగఃస ఉచ్యతే"

-- అభిజ్ఞానశాకుంతలము 5 - 10 "కాలే" వివరణ.

## కొన్ని ముఖ్యములగు తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 8 | 24 | హాసిస్వః | + (వాచన్ప) |
| 52 | 7 | నుపమింతురు | నుపమించుట. |
| | 21 | కృత్య | నృత్య |
| 60 | 20 | జేడి | జీడి |
| 66 | 9 | గడవెత్తు | గడలెత్తు |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది. |
|---|---|---|---|
| 83 | 6 | అందున్ | అందన్ |
| 109 | 16 | గానసుర | గాన నసుర |
| 123 | 8 | త్వత్ | + పరిభావాధామాని - అమ |
| 162 | 7 | మర్త్య | + పాతాళలోకవాసులయొక్క |
| | | | కామిత = కోరికలను, కల్ప |
| | 14 | అంగీకరింపఁబడిన | అంగీకృత = అంగీకరింపఁబడిన |
| 168 | 1 | పాపములకు | పామములకు |
| 182 | 14 | అతిభూతి | అనుభూతి |
| 200 | 7 | వియ్యంబగు | లియ్యంబగు 201-9 పంక్తి |
| 215 | 24 | చలిది వడ్డింపక | చలిదితోపాటు, కోరినవెల్ల |
| | | తప్పదనియు | వడ్డింపక తప్పదనియు |
| 232 | 18 | ఇఞ్ | నఞ్ |
| 227 | 16 | చెఱఁగు | చెఱకు |
| 261 | 10 | ముఖేఘా | ముఖేషూ |
| 310 | 9 | రజ్జువు | + 12వ, పంక్తి. |
| 312 | 22 | శా. సూ. | శా. మా. |
| 345 | 20 | కళోత్ప్రేకాధ్యుత్తై | కళోత్సేకాధ్యులై |
| 347 | 18 | సరోవరమునందు | మానస = మానససరోవరము |
| | | | నందు |
| 370 | 6 | శస్త్రము | శస్త్రము |
| 387 | 4,8 | వేచి | లేచి |